# నన్నయ భారతి

[వ్యాస సంకలనం]

## ద్వితీయ సంపుటం

గౌరవ సంపాదకులు

ఆచార్య పేర్వారం జగన్నాథం

సంపాదకులు

బేతవోలు రామబ్రహ్మం

డా॥ గొల్లకోట సూర్య భాస్కరరావు




ప్రచురణ

తెలుగు విశ్వవిద్యాలయం

లలితకళాక్షేత్రం, పబ్లిక్ గార్డెన్స్, హైదరాబాదు - 500 004.

తెలుగు విశ్వవిద్యాలయం. ప్ర. సంఖ్య. 142

ప్రథమ ముద్రణ : 1994



ప్రతులు : 1000

వెల : 35-00

ప్రతులకు :
రిజిస్ట్రార్
తెలుగు విశ్వవిద్యాలయం
పబ్లిక్ గార్డెన్స్, నాంపల్లి,
హైదరాబాదు – 4

ముద్రణ :
మహేశ్వరి ప్రింటింగ్ అండ్ బైండింగ్ వర్క్స్
సీతంపేట, రాజమండ్రి - 533 104

ఆచార్య పేర్వారం జగన్నాథం
వైస్-ఛాన్సలర్

లలిత కళాక్షేత్రం
పబ్లిక్ గార్డెన్స్
హైదరాబాదు - 4

# ముందు మాట

తెలుగు భారతం ఆంధ్రుల అదృష్టంగా అవతరించింది. కవిత్రయం దాన్ని తెనిగించి తెలుగువారికెంతో మహోపకారం చేసింది. తెలుగు సాహిత్య చరిత్రలో అది ఆదికావ్యంగా నిలిచింది. ఆంధ్ర మహాభారతం కొన్ని సందర్భాల్లో మూలానికి వన్నె చేకూర్చింది. మహాకావ్య మర్యాదలను పాటించి రస సముచితంగా విరచింపబడింది. అందుకే అది తెలుగు ప్రజల జీవన సర్వస్వంగా ప్రజాజీవితాన్ని పెనవేసుకున్నది. సంస్కృత భారతానికి అనువాదమే అయినా తెలుగు భారతంలో తెలుగు ప్రజల మనోభావాలూ, జీవనతత్త్వమూ, ఆలోచన విధానమూ, మానవ మనస్తత్వ చిత్రణమూ జరిగింది. అందుకే దాని అధ్యయనం అనివార్యమవుతున్నది. అన్ని కోణాల నుండి, అన్ని దృక్పథాలనుండి ఆంధ్ర మహాభారతాన్ని అనుశీలించడం అవసరమవుతున్నది.

తెలుగు భారతం గురించి ఎందరో పండితులు, పరిశోధకులు విమర్శకులు ఆయా సందర్భాల్లో ఎంతో విలువైన వ్యాసాలను ప్రకటించినారు. అవి అందరికి అందుబాటులో లేకుండా వున్నాయి. కనుక వాటిని క్రోడీకరించి ఒకచోట కూర్చి ప్రచురిస్తే తెలుగు పాఠకులకూ, సారస్వతాభిమానులకూ ఉపయోగంగా ఉంటుందని భావించినాము. ఆ ప్రయత్నంలో భాగంగా ముందు నన్నయ గురించీ నన్నయ రచించిన భారతభాగం గురించి విశదించిన వ్యాసాలను

ప్రకటించాలని నిర్ణయించినాము. వాటిని ఒక క్రమబద్ధంగా పరిష్కరించాలని కూడ సంకల్పించినాము. అట్లా అవతారికకు సంబంధించినవి, కవితారీతులకు సంబంధించినవి, అనువాద విధానానికి సంబంధించిన వ్యాసాలను మొదటి సంపుటంలో ఎంపికచేసి ప్రచురించినాము. ఇప్పుడీ రెండవసంపుటంలో పలువురు ప్రముఖ పండితులు భారతంలోని ఉపాఖ్యానాలగురించీ, తులనాత్మక అధ్యయనం గురించీ వివిధ సందర్భాల్లో రచించిన వ్యాసాలను సంకలితంచేసి ప్రచురిస్తున్నాము. భాష-ఛందస్సు - ఇతరాలకు సంబంధించిన మరికొన్ని వ్యాసాలతో మూడవ సంపుటం వెలువరించదలిచినాము.

ఇట్లాగే తిక్కన గురించీ, ఎర్రన గురించీ ఇదే పద్ధతిలో త్వరలోనే వ్యాస సంకలనాలను వెలువరించాలని మా యోచన. అంతేకాక ఆంధ్ర సాహిత్యంలో యుగకర్తలూ, సాహిత్యగతిని మార్చిన ప్రవర్తకులూ అయిన మహాకవుల గురించి కూడ ముందు ముందు విలువైన వ్యాస సంపుటాలను ప్రకటించాలన్నది మా ప్రణాళిక. త్వరలో ఒకటొకటిగా వాటిని తెలుగు పాఠకులకూ, సాహిత్యాభిమానులకూ అందిస్తామని మనవి చేస్తున్నాను. ఈ సంపుటాల గురించి సాహిత్యాభిమానులూ, పాఠకులూ ఏమైనా సూచనలు చేస్తే వాటిని సాదరంగా పరిశీలిస్తాం. అందుకు ఆహ్వానిస్తున్నాం. ఈ సంపుటాన్ని సంకలితం చేసిన సంపాదకులు ఆచార్య బేతవోలు రామబ్రహ్మంగారినీ, డా॥ గొల్లకోట సూర్యభాస్కరరావుగారినీ అభినందిస్తున్నాను. వ్యాఖ్యాస్రవంతి కార్యక్రమంలో భాగంగా ఇటీవల కొన్ని ప్రసిద్ధ కావ్యాలకు వ్యాఖ్యానాలు రచింపచేసి ప్రచురించినాము.

ఈ సందర్భంలో మరో విషయాన్ని కూడ మనవి చేస్తున్నాను. తెలుగు సాహిత్యంలో అలభ్య అముద్రిత గ్రంథ ప్రచురణకు కూడ పూనుకున్నాం. ఆ వరుసలో కందుకూరివారి సరస్వతీ నారద విలాపం, కట్టమంచివారి ముసలమ్మ మరణం, అక్కిరాజు ఉమాకాంత పండితుల నేటికాలపు కవిత్వం అనే గ్రంథాలను ప్రచురించి త్వరలో వెలువరించనున్నాము. అంతేకాక వేటపాలెంవంటి ప్రాచీన గ్రంథాలయాల్లో భద్రపరచబడి పాఠకులకు అలభ్యంగా ఉన్న విలువైన సాహిత్య గ్రంథాలను ముందుగా జిరాక్సు తీయించి అటు పిదప ప్రాధాన్యాన్ని బట్టి క్రమంగా ప్రచురించాలని సంకల్పించినాము. మా ఈ ప్రయత్నాలను ప్రజలు, సాహిత్యాభిమానులు ఆదరిస్తారని ఆశిస్తున్నాను.

శ్రీముఖ మకర సంక్రాంతి,
**14—1—1994.**

పేర్వారం జగన్నాథం
ఉపాధ్యక్షులు
తెలుగు విశ్వవిద్యాలయం

# సంపాదకీయం

యుగకర్తలైన మహాకవులమీదా, మన సాహిత్యాన్ని ప్రభావితం చేసిన ఉద్యమాలమీదా వివిధ ప్రక్రియలమీదా తెలుగులో ఇంతవరకూ వెలువడిన విలువైన వ్యాసాలనన్నింటినీ ఒక చోటికి సేకరించి సంపుటాలుగా సాహితీ ప్రియులకు అందించాలనే సంకల్పంతో "విమర్శన, పరిశోధన - సమీక్షకృత ప్రచురణ" అనే ప్రాజక్టును తెలుగు విశ్వవిద్యాలయ సాహిత్య పీఠం చేపట్టింది. ఇందులో భాగంగా తొలి ప్రయత్నంగా ఆదికవి నన్నయ మీద వెలువడుతున్న వ్యాస సంకలనంలో ద్వితీయ సంపుటం ఇది.

ఒక కవి మీద వెలువడిన వ్యాసాల సంకలనం కాబట్టి ఇందులో వ్యాసాలను కాలక్రమాన్ని బట్టి కాకుండా విషయపరంగా వింగడించి పొందుపరిచాము. అవతారిక, కవితారీతులు, అనువాదవిధానం అనే అంశాలకు చెందిన వ్యాసాలు ప్రథమ సంపుటంలో చోటుచేసుకున్నాయి. ఉపాఖ్యానాలు,తులనాత్మకాలకు సంబంధించిన వ్యాసాలు ఈ సంపుటంలో వచ్చాయి. భాష-ఛందస్సు-ఇతరాలకు చెందిన వ్యాసాలు అనంతరం సంపుటంలో వెలువడతాయి.

మొత్తం ఈ వ్యాసాలను రెండు సంపుటాలుగా ప్రచురించాలనీ వ్యాసాల ఆకరాలు రెండవసంపుటం చివర పొందుపరచాలనీ మొదట్లో సంకల్పించాము. కానీ కొన్ని అనివార్య కారణాలవల్ల వీటిని మూడు సంపుటాలుగా ప్రచురించవలసివచ్చింది. అందుచేత మొదటి సంపుటంలోని వ్యాసాల ఆకరాలు ఈ రెండవ సంపుటం చివరనే జతపరిచి అందిస్తున్నాము. ఈ రెండవ సంపుటంలో చేరిన వ్యాసాల ఆకరాలను ఇందులోనే వ్యాసాంతంలో ఇచ్చాము.

పాత పత్రికలలో వెలువడిన అమూల్యమైన వ్యాసాలు చాలా మటుకు నేటి పాఠకులకూ పరిశోధకులకూ అందడంలేదు. ఆ లోటు తీరిస్తే అవగాహనల పరిధులు విస్తరిస్తాయనీ, పరిశోధనలస్థాయి పెరుగుతుందనీ విశ్వాసం. ఈ ప్రాజక్టుకు ఇదే పరమ ప్రయోజనం.

అయితే ఈ నన్నయభారతి సర్వసమగ్రంఅని మేము ఏకోశానా అనుకోవడంలేదు. మా దృష్టికిరాని వ్యాసాలు విలువైనవి చాలా ఉండి ఉండవచ్చు. విపులాచ పృథ్వీ. మన్నించండి. మీ దృష్టికి వచ్చినవి సూచించండి. ద్వితీయ ముద్రణకు ఇది నోచుకుంటే అప్పటికి మరి కొంత సమగ్రతను సంతరించగలుగుతాం. సహకరించమని సాహితీ పరులను సవినయంగా అభ్యర్థిస్తున్నాను.

ఇటువంటి వ్యాస సంకలనాలు (నన్నయమీద) చిన్న చిన్నవి కొన్ని ఇప్పటికే ప్రచురితమయ్యాయి. అవి విస్తృతంగా దొరకుతున్నాయి. అందుచేత ఆ వ్యాసాలను ఈ సంకలనంలోకి చేర్చలేదు. అలాగే సంస్కృతాంగ్లాలలో వెలువడిన వ్యాసాలనుకూడా మినహాయించాము. వీటినీ, ఇంకా ప్రత్యేక విమర్శ గ్రంథాలుగా, ముద్రితాముద్రిత సిద్ధాంత నిబంధనలుగా నన్నయ భారతభాగం మీద జరిగిన కృషినంతటినీ క్రోడీకరించి బిబ్లియోగ్రఫీగా అనంతర సంపుటానికి చివర పొందుపరుస్తున్నాము.

వ్యాస రచయితలలో నూటికి ఎన్భై మంది నుంచి ప్రచురణానుమతి పొందగలిగాం. వారందరి సౌహార్దానికీ కృతజ్ఞతలు. కొంతమంది చిరునామాలు తెలియలేదు. కొంతమందికి వారసులు తెలియరాలేదు. వారంతా మా పరిమితులనూ మా శ్రమనూ మా నిజాయితీని గమనించి పెద్దమనసుతో మన్నిస్తారని ఆశిస్తున్నాను.

వ్యాసాలు సేకరించడం మొదలుకొని ప్రూఫులు దిద్దటంవరకూ అన్నింటా శతశాతమూ శ్రమపడిన సహవ్రతుడు డా॥ జి. యస్. భాస్కరరావుగారిని మనసారా అభినందిస్తున్నాను. మంచి పరిశోధకుడుగా రాటు తేలాడని ఆనందిస్తున్నాను.

గ్రాంథిక-వ్యావహారిక భాషోద్యమం మీద ఇటువంటి వ్యాస సంకలనం మరొకటి తయారై సిద్ధంగా ఉంది. అదికూడా త్వరలోనే పాఠకలోకానికి అందుతుంది.

మహిమున్ వాగనుశాసనుండు సృజియింపన్ - అన్నట్టు ఈ ప్రాజెక్టును ఆదిలో ఆశీర్వదించిన తె. వి. వి. ప్రథమోపాధ్యక్షులు ఆచార్య తూమాటి దోణప్పగారికీ, ఆమోదించి కొనసాగించిన ద్వితీయోపాధ్యక్షులు ఆచార్య సి. నారాయణరెడ్డిగారికీ, "ప్రస్తుతించి" పరిపోషిస్తున్న ప్రస్తుతోపాధ్యక్షులు ఆచార్య పేర్వారం జగన్నాథం గారికి కృతజ్ఞతా పూర్వకంగా నమస్కరిస్తున్నాము.

ఈ కృషిలో సర్వాత్మనా సహకరించిన సాహిత్యపీఠ సహవ్రతులకూ, వివిధ గ్రంథాలయాధిపతులకూ, ఆచార్య ఎస్. శివరామమూర్తిగారికీ, ఆచార్య బి. రామకృష్ణారెడ్డిగారికీ, డా॥ టి. వెంకటరెడ్డిగారికీ(ఇప్పటి రిజిస్ట్రారు)వి. రామసుబ్బారెడ్డిగారికీ(ప్రచురణ విభాగం) కృతజ్ఞతలు. సాధ్యమైనంత తక్కువ ముద్రారాక్షసాలతో ముద్రించి ఇచ్చిన మహేశ్వరీ ప్రింటింగ్ ప్రెస్ వారికి ధన్యవాదాలు.

బోమ్మూరు
శ్రీముఖ-రథసప్తమి

బేతవోలు రామబ్రహ్మం
17-2-94

# విషయసూచిక

## ఉపాఖ్యానములు

## తులనాత్మకములు

# ఉదంకుని కథ

— శ్రీ ముదికొండ వీరభద్రశాస్త్రి

ఉదంకునికథ ఆంధ్రమహాభారతమున రెండుచోట్ల వివరింపబడి యున్నది. నన్నయభట్టారక కృతమైన ఆదిపర్వము ప్రథమాశ్వాస మందొకచోట, తిక్కన విరచితమైన అశ్వమేధపర్వము తృతీయాశ్వాసమునం దింకొకచోట.

అశ్వమేధ పర్వమున దీనిప్రసక్తి యిట్టిది :

భారతయుద్ధానంతరము ధర్మజాదులకడ ననుజ్ఞగైకొని కృష్ణుడు ద్వారక కేగుచుండెను. ఆ "మార్గంబు కెలనం జేరువ" నున్నది యుదంకాశ్రమము. కృష్ణుడచ్చటి కేగెను.

"నీవు పక్షపాతము లేనివాడవుకదా! పాండవులకును, కౌరవులకును సంధిచేసి, బంధుభావమును దృఢముచేసి, రాజులందఱకును సుఖస్థితి కల్పించితివా?" అని యుదంకుడు యేమియు నెఱుగని వానివలె ప్రశ్నించెను.

అందలి వ్యంగ్యము నెఱుగని వానివలె అమాయకత్వము నటించుచు, కృష్ణుడు బదులు చెప్పెను. "నేను చెప్పవలసినదేమో కౌరవులకు నయభయముల జెప్పిచూచితిని. నేనేకాదు. భీష్మద్రోణాదులును జెప్పిరి. మునులు జెప్పిరి. వారు మాయందఱి మాటలను పెడచెవిని పెట్టి యుద్ధముచేసి సబంధు పరిజనముగా మరణము పొందిరి. కాలనియతి యట్లున్నది. ఎవరేమి చేయగలరు?"

ఈ మాటలు వినుసరి కతనికి మిక్కిలి కోపము వచ్చెను. "నీవు సమర్థుడవయ్యును కౌరవ పాండవులకు సంధి కుదర్పకపోతివి. ఈ పాపమంతయు నీదే. నిన్ను క్షమింపరాదు. ఘోరముగా శపింతు" నని మండిపడెను.

కృష్ణుడు కొంచెము శాంతించుమనదని మునికి చెప్పెను. "మునివి. నీకు కోపముండుట తగునటయ్యా! నేనే పరతత్త్వమను. అధార్మి

కులం బొలియఁజేయును. ధార్మికులను రక్షించును. అట్టివాఁడనయ్యు అధర్మపరులగు ధార్తరాష్ట్రులను అత్యంత ధార్మికులగు ధర్మనందనాదులతో గలుపుటకు ఎన్నో పాట్లు పడితిని. చివరకు కౌరవులు తమ దురాత్మత్వమున కాహుతియైనారు.'' అని వివరించెను.

ఉదంకుడు నొచ్చుకొనెను. "ఇదంతయు నేను ఎఱుగనిదికాదు. కాని దురాగ్రహపుగర్వము నన్ను కప్పివేసినది. నా యందు నీకు దయగలిగెనేని అనుపమానమైన నీయాకృతి చూపుము'' అని వేడెను. కృష్ణుడును విశ్వరూప సందర్శనము చేయించెను.

ఈ కథ నింతవరకును విన్న జనమేజయుడు "మునీంద్రా! ఉపేంద్రుని శపించుటకు నుత్సహించిన యుదంకుడు ఏమి విధంబు తపంబున నమ్మహానుభావంబు వడసె నెఱింగింపవే" యని వైశంపాయనుని కోరెను. "ఆతని గురుభక్తి కతన జొప్పడియెనత్తెఱగు పెంపు; అది తెలియవిను'' మని యతడు చెప్పెను.

## 2

పైన వివరించిన వృత్తాంతము సన్నయభారతములో లేదు. ఉదంకుని గురుభక్తికి సంబంధించిన కథ మాత్రమే యున్నది. అశ్వ ధ పర్వమందలి కథాంశములకు దీనికిని కొంత భేదమున్నది.

అశ్వమేధ పర్వమందలి, కథ ఇట్లున్నది.

ఉదంకుడు గౌతముని శిష్యుడు. నియతిగా శుశ్రూష చేయుచుండెను. గౌతముడు శిష్యులందఱకును వివిధ వరములిచ్చి పంపివేసెను. కాని ఉదంకుని గురించి తలంపనేలేదు. ఉదంకుడట్లే పరిచర్యలు చేయుచుండెను. ఒకనాడతడు బరువైన వంటకట్టియ మోపు మెడ పడిపోవునట్లు మోసి తెచ్చి పడవైచెను. దానితోపాటు ఆతని తల వెంద్రుక యొకటి తెగి క్రిందపడెను. అది తెల్లగా నెఱసియున్నది. ఉదంకుడు తన వయసు మళ్ళుటనెఱిగి మిక్కిలి దుఃఖించెను. గౌతముడాతని నోదార్చి, యౌవనమునిచ్చి, తన కుమార్తె నిచ్చి వివాహము చేసెను.

గురుదక్షిణ యిత్తునని ఉదంకుడు సిద్ధపడెను. గురువు వలదనెను. అంతట నతడు గురుపత్నియగు నహల్య కడకేగి "మీకు

వలయు పదార్థము నానతియిండు, తెత్తు" నని చెప్పెను. ఆమె 'మిత్రసహుడు' అనువాని భార్యకుండలములు తెమ్మని పని చెప్పెను. ఉదంకు డంగీకరించి పోయెను.

గౌతము డుదంకుని నెందునగానక భార్యను ప్రశ్నించెను. ఆమె చెప్పినదివిని మునియిట్లనెను. "ఆ రాజు శాపమువలన నర మాంసభక్షకుడైనాడు. ఈ విషయ ముదంకు డెఱుగడు" అహల్య చాల భయపడెను. గౌతము డామెకు ధైర్యము చెప్పెను.

ఉదంకుడేగి ఒక శూన్యాటవిలో ఉగ్రరూపముననున్న రాజును దర్శించెను. రాజతనిని భక్షించుటకు పూనుకొనెను. ఉదంకుడు గురుకార్యము ముగిసిన వెనుక ఆహారమయ్యెదని వాగ్దానము చేసెను. మిత్రసహుడేమి కావలయునని యడిగెను. అతడు వచ్చినపని చెప్పెను. రాజు తన భార్యయున్న చోటు చూపి, ఆనవాలుగా నొక వాక్యము చెప్పెను. రాజు భార్య 'మదయంతి' కుండలములిచ్చి సురలు, గంధర్వులు, ఉరగులు వాని నపేక్షింతురని హెచ్చరించెను. ఉదంకుడు మరలివచ్చి మిత్రసహుని గాంచెను. అతని దురితమును బోగొట్టెను.

గౌతమాశ్రమమునకు తిరిగివచ్చుచు ఉదంకుడు ఆకటి బాధకు తాళలేక కుండలములతోనున్న యజినమును ఒక చెట్టు కొమ్మకు తగిల్చి, తాను చెట్టెక్కి ఫలములు కోసికొనుచుండెను. ఇంతలో నది గాలికి క్రిందపడగా నొక సర్పమువచ్చి దానిని పుచ్చికొని పుట్టలో దూరి మాయమయ్యెను. ఉదంకుడందుకు సహింపక ఒక పుల్లతో భూమిని త్రవ్వనారంభించెను. ఇంద్రు డొక బ్రాహ్మణరూపముధరించి యతనికడకు వచ్చి "పాతాళమిచ్చుటకు సహస్రయోజనముల దూర మున నున్నది. కుండలములను దీసికొని పోయినవాడు ఐరావతుని సుతుడు. ఇట్లు త్రవ్వినంత మాత్రమున పాతాళమున కెట్లుపోగలవు?" అని నిరుత్సాహపరుప ప్రయత్నించెను. కాని అతడు పట్టువిడువలేదు. ఇంద్రు డాకాష్ఠమునకు వజ్రాయుధ శక్తిని సంక్రమింపజేసెను.

ఉదంకుడట్లు త్రవ్వి పాతాళమున కేగెను. అచ్చట నతని కొక అశ్వము కనిపించెను. "నేనగ్నిని. నా అపానమున నూదుము. నీకు కార్యసంసిద్ధియగును." అని ఆ హయము చెప్పెను. అతడట్లేచేయగా, పాతాళమం దగ్ని ప్రజ్వరిల్లెను. సర్పరాజులు భీతులై యతనికి కుండలములర్పించిరి. ఉదంకు డగ్నికి వందనమాచరించి, పాతాళము వెలువడివచ్చి యహల్యకు కుండలము లర్పించెను.

నన్నయభట్టు లోకజ్ఞుడు, మితవచనుడు. అతని ఇట్టి వ్యక్తిత్వము అతని కవిత్వమునందును ప్రతిబింబించినది. భారత రచనయం దతడు రెండు లక్షణములను పాటించెను. అవి అక్షరరమ్యత, ప్రసన్న కథాకలితార్థయుక్తి అనునట్టివి. ఇందు మొదటిది శబ్దములు, పద్యముల శయ్యకు సంబంధించినది. రెండవది అర్థమునకు సంబంధించినది.

# 3

నన్నయ భారతమునం దనేకములగు నుపాఖ్యానములున్నవి. ఒక్కొక్కటియు నొక్కొక్క మణిపూస. ఈ ఉపాఖ్యానములం దతడు తీర్చిన పాత్రలు మిగుల రమణీయముగ నుండును.

ఉదంకోపాఖ్యానమునందలి పాత్రలలో ఉదంకుడు, పౌష్యుడు ముఖ్యుడు. ఉదంకుని గురించి ముందే ఇట్లు చెప్పబడినది. ఇతడు బ్రహ్మసన్నిభుడు, మహా తపస్వి, అనాతంకమతి. ఇతని గురువు పైలుడు. పైలుని గురించిన విశేషము లెచ్చట నిందు చెప్పలేదు. కాని పైలుని మహత్త్వము ఇందు సూచింపబడినది. ఈ ఉదంకుని గొప్పతనమును జెప్పుచో నాతని పైల శిష్యత్వమునొక విశేషముగా చెప్పబడినది. ఇది చాలును.

ఈ ఉదంకుడు అణిమాదికాష్ట గుణములతోడ జ్ఞానమువడసెను. అణిమాదులు సిద్ధులు. దీనివలన అణుత్వము, మహత్త్వము, నిర్విఘ్న సంచారశక్తి, ఇష్ట ప్రాప్తి మొదలగునవి గలుగును. మొదటి రెండు పద్యములవలన నుదంకుని శక్తి సామర్థ్యములు తెలియుచున్నవి.

గురు పత్నీ నియోగమున నుదంకుడు కుండలములను ప్రతిగ్రహించుటకై పౌష్యుని కడకేగెను. రాజును దీవించి గృహీత

సత్కారుండై తన వచ్చినపని చెప్పెను. పౌష్యుడు "ఇట్టి మహాత్మునికీగాంచితి, కృతార్థుడనైతి"నని మనంబున సంతసిల్లెను. మహాత్ముడని పౌష్యుడెట్లు గ్రహించెను ? ఉదంకుడు మితముగా మాటాడెను. ఆ మాటలోనే అతడు మహాత్ముడనుట వ్యక్తమగుచున్నది.

ఉదంకుడర్థి, రాజు దాత "ఇచ్చుట - పుచ్చుకొనుట. ఒకటి యుచ్చైశ్శ్రవము. రెండవది చెవులు వ్రేలాడుచున్న గాడిద. అడుగవలసి వచ్చువఱకు, చేసాచవలసి వచ్చువరకు, జగత్ప్రసిద్ధుడయిన ప్రభువు వామనుడైపోయినాడు" కాని ఉదంకుడు తానర్థియైనందులకు లజ్జించలేదు. కారణము తాను గుర్వర్థ మర్థియగుట. అందుచేత తాను 'కడగి' వచ్చెను. ఆ పూనిక సఫలమ్ముకాగ దేవి కుండలములిమ్మని కోరెను పౌష్యుడు మానవేశుడు, దండితారాతి కాని "కడగి వచ్చితి"నన్న ఉదంకుని మాటలలో నతనిపూనికని గ్రహించెను. అతడెట్లయినను కుండలములను సాధించక మానడు.

కుండలములకొఱ కుదంకుని అంతఃపురమునకు పంపెను. అచ్చట పౌష్యుని మహాదేవి యతనికి కానరాదు. పౌష్యుడు "ఇట్టి మహాత్మునికీగాంచితిఁ గృతార్థుండనయితి" నని మనంబున సంతసిల్లుట చేత నుదంకుని కతని భావము తెలియలేదు. ఇతడు పొమ్ము తెచ్చుకొమ్మనుట, ఆమె కనిపించకపోవుటచే నతనికి పౌష్యుని మాటలపైన కొంచె మవిశ్వాసమే కలిగినది. కాని బయటపడక లౌక్యముగ వ్యవహరించెను. "నీదేవి నెందునుగానక యిటవచ్చితి నీవయకుండలంబులు తెప్పించి యిమ్మ"నెను.

పౌష్యుడాశ్చర్య పడెను. "భావినుత! నీవు త్రిభువన పావనుడవు. అశుచివని యెట్లు పల్కుదును! నా దేవి పరమ పతివ్రత కావున అశుచులకు కానరాదు." అని చెప్పెను. ఈ చెప్పుటయందలి విశేష మంతయు "అనవద్య" అను సంబోధనమున నున్నది. "ఆమె కానరాలేదు గావున నీవు అశుచివే యనుటకు సందేహములేదు. కాని నీవు అనవద్యుడవు అనగా దోషరహితుడవు. నీ తప్పు కానిదాని

వలన నీవు అశుచివై యుండి యుండవచ్చును.'' అను అనునయ మిందున్నది.

పౌష్యుని భార్యవద్ద కుండలములు ప్రతిగ్రహించిపోవుచు నుదంకుడు పౌష్యుని ప్రార్థనముపయి నాతని యాతిథ్యము స్వీకరించెను. అత డిడినయన్నము కేశదుష్టముకాగా రోసి, కరంబలిగి అంధుడవు కమ్మని శపించెను. అంతవఱకు వచ్చిన తరువాత రాజును ఊరుకొన లేదు. అనపత్యుడవు కమ్మని ప్రతిశాపం బిచ్చెను. ఉదంకుడు ''నే ననపత్యుండ గానోప దీనిం గ్రమ్మరింపుము'' అని వేడెను. అందులకు పౌష్యుడిడిన సమాధానమిది.

"నిండుమనంబు నవ్యనవనీత సమానము పల్కు దారుణా
ఖండల శస్త్రతుల్యము జగన్నుత విప్రులయందు నిక్క మీ
రెండును రాజులందు విపరీతము గావున విప్రుడోపు నో
పండతి శాంతుడయ్యు నరపాలుడు శాపము గ్రమ్మరింపగన్''

ఈ సమాధానమును గూర్చి ఎంతయైనను వ్యాఖ్యానము సేయవచ్చును. విప్రుని మనస్సు నవనీతముగా నుండవలెను. అను హెచ్చరిక, ఉదంకు డట్లుండక కోపచిత్తుడయి శపించెనను ఎత్తిపొడుపు పల్కు దారుణాఖండల శస్త్రతుల్యమయ్యును మనస్సు మెత్తనిది కనుక కనీసము నా ప్రార్థన మాలించి శాపమోక్షణ మనుగ్రహించుట తగునను వేడికోలు, రాజులందు ఈ రెండును విపరీతములగుటచే తాను శాపము క్రమ్మరింపలేనని చెప్పికొనుట ఇన్ని యున్నవి.

శాపము క్రమ్మఱించుకొను సామర్థ్యము రాజులకు లేదు. విప్రునకే యున్నవని ఎదుటివానికి ఆధిక్యము నిచ్చి యుబ్బవేసి తనకు కావలయు పని చేయించుకొను రాజనీతి ఈ మాటలలో గోచరించు చున్నది. ఇందు విప్రులగురించి యతడు చెప్పినది కొంతవరకు నిజమేయని యుదంకుడే రుజువుచేసెను. "అతిశాంతుడయ్యు నరపా లుడు క్రమ్మఱించగలడని తాత్పర్యము. ఉదంకుడు నవ్యనవనీత సమానమయిన మనస్సు కలవాడు కావుననే కరగిపోయి, రాజున కిచ్చిన శాపము క్రమ్మఱించెను.

పొష్యుడన్నట్లు రాజు మనస్సు దారుణాఖండల శస్త్రతుల్య మైనదే, కనుకనే అతని మనస్సు కరుగలేదు. ఉదంకుడు 'అనపత్యోఽ డగానోపస'ని ఇంత బ్రతిమిలాడినను, నా వలన కాదని శాపము నుప సంహరించుకొనకయే తప్పించుకొన్నాడు.

కుండలములతో పాటు శాపమునుగూడ సంపాదించుకొని ఉదం కుడు బయటపడినాడు. పోవుచుండగా ఎదుర జలాశయము కనిపించెను. వెంటనే కుండలములు క్రిందబెట్టి యాచమనము సేయబోయెను. తక్షకుడు నగ్న వేషధరుడై రానేవచ్చెను. కుండలము లెత్తుకొని పోయెను. ఉదంకుడు వెంటబడి పట్టుకొనెను. పట్టుకొనగానే తక్షకుడు దిగంబర వేషము విడిచెను. మణికుండలములు విడువలేదు. నిజరూప ముతో జారిపోయెను. ఎవడైనను పాము వలె జారిపోవుట సహజము. అతడిచ్చట పామైజారిపోయెను. ఉదంకుడు వెంటతగిలి ఉరగలోక మునకరిగెను. నాగపతుల స్తుతించెను.

ఈ స్తుతియందొక క్రమమున్నది. మొదటనతడు అనంతు డును, దుష్కృతాంతకుడు నయిన శేషుని ప్రార్థించెను. శేషుడు బరువు బాధ్యతలు తెలిసినవాడు.

పిదప వాసుకుని వేడెను. శేషు డహిపతి. తక్షకునకు సహజముగ నతనిపై గౌరవముండవలెను. వాసుకి ఉరగుల కింకను సన్నిహితుడు. వారిని అమరాదుల బాధలు పొందకుండగ రక్షించెను. కనుక నతని పలుకుబడి యుండితీరును. పైగా వాసుకి సామాన్యుడు కాడు. సురా సురు లెవ్వరికి మ్రొక్కెదరో యట్టి శివునకు అలంకారమైనవాడు.

అప్పటికిని పని కాలేదు. ఐరావతుడు మున్నగు ఫణి రాజులను ప్రసన్నులుకండని స్తుతించెను. వీరు లేచినది మొదలు దేవమనుష్య లోకముల తిరుగువారు.

చివరకు అట్లుకాదని తక్షకునే హెచ్చరించెను. అతడు తన కపకారము చేసినను శూరుడు, పరాక్రమవంతుడు. ఉదంకుడు శత్రు వునందలి గొప్ప గుణములను గురుతించినవాడు.

ఈ మాటలతో పనికాలేదు. కాని తనకు సాక్షాత్కరించిన తేజస్వి సహాయమున ఉదంకుడు పన్నగులను సాధించి కుండలములను సంపాదించెను. అతని హయమునెక్కి గురు గృహము చేరేను. కుండలములు గురుపత్నికి సమర్పించెను. ఆమె సంతసించినది కాని ఉదంకుని కార్యమెట్లు సఫలమయ్యెనో తెలియుటకు ప్రయత్నించనే లేదు.

కాని గురువట్లుకాదు. "అత్యాయత విమల తపో మహిమము కలవాడవు. ఈ యున్న పౌష్యుని ప్రోలికి పోయి వచ్చుటకు ఇన్ని దినములేల పసలితివి?" అని విచారించెను

ఉదంకుడు జరిగిన వృత్తాంతము చెప్పెను. కాని తన తొందరపాటు స్వభావమును, తాను రాజునకు శాపమిచ్చి ప్రతిశాపమును పొందిన వృత్తాంతమును మఱుగుపఱచెను.

గురువు ఉదంకుని దీవించి నిజేచ్ఛనుండఁ బనిచెను. ఉదంకుడు అనేక కాలము తపస్సుచేసేను. కాని తక్షకుడు చేసిన యపకారమునకు ప్రతీకారము చేయవలయునన్న భావము మాత్రము పోలేదు. ఒక్క నాడతడు జనమేజయుని పాలికిఁ బోయెను. తనకు తక్షకుడు చేసిన యపకారమునకు చిలవలు పలవలుచేర్చి అతిశయోక్తులలో చెప్పెను. ఆమాటలలో నతని తీవ్రస్వభావము, ఎదుటివారి మనసు కనిపెట్టి, వారికి నచ్చచెప్పి యొప్పింపగల నేర్పు స్పష్టమగుచున్నది.

"మితహిత సత్యవాక్య! భూజనవంద్య!" యని రాజును పొగడెను. తాను గురు, దేవకార్యములు చేయుచుండగా, ఎఱిగి, వంచనోన్నతమతియై కుటిలస్వభావముతో నపకారము చేసినట్లు తక్షకుని చిత్రించెను. ఆ పిదప జనమేజయుని తండ్రి పరీక్షితుని పొగడీ, యతనిని తక్షకుడు కాటువేసి చంపిన వృత్తాంతము గుర్తు తెచ్చెను. తక్షకునిపై జనమేజయునకు కోపమువచ్చుట కింక నాక్షేపణ మేమున్నది? కాని ఉదంకుని కోపమొక్క తక్షకుని మీదనే

కాదు. తాను మొక్కినను వరమీయని నాగపతు లందఱిమీదను. కనుక సర్పయాగమున తక్షకాది కాకోదర సంహతిని భస్మముచేయుమని యుపదేశించెను. ఆనాడు తక్షకుడు ఏకవిప్ర సంబోధనముచేత పరీక్షితుని కలచెను. ఈనాడు సర్పయాగము అనేక భూసురాపాదితము అని అండచూపెను.

పాపము జనమేజయుడింత దురంతఘోర మొనర్చుటకు వెను దీసెనేమో? "ప్రల్లదుడైన యొక్కకులపాంసను చేసినదాన తత్కులం బెల్లను దూషితంబగుట యేమియపూర్వమ"ని పూర్వము జరిగిన కౌరవవధను సూచించు యుక్తి చూపినాడు. ఈ యాగము విప్రసన్నిధిని చేయుమనెను. పాపములకెల్ల భైరవులు వారున్నారన్నట్లు ధైర్యము గొలిపెను. ఇట్లుదంకుడు జనమేజయునకు సర్పయాగబుద్ధి పుట్టించెను.

నన్నయభట్టారకుడు రచించిన ఉదంకోపాఖ్యానము నందలి విశేషములిందు దిఙ్మాత్రముగ ప్రదర్శింపబడినవి. "సారమతిం గవీంద్రులు"లో సారసిచూచిన ఇంక నెన్ని విశేషములు బయల్పడునో?

ఆంధ్ర క్రైస్తవ కళాశాల వార్షిక సంచిక, 1955-56

— (౦) —

# ఉదంకుని కథ నన్నయగారి ఋషిత్వాత్మ

— శ్రీ రాజలక్ష్మీ నరసింహారావు

మహాభారతము నందలి ఋషుల కథలు, రాజుల కథలు, రాజర్షుల కథలు, మఱియు నితరములయిన కాని యుపాఖ్యానములు తద్భారత కథా పరమార్థమున కుపష్టంభకములు. ఋషుల కథలలో ఉదంకుని కథ, పరాశరుని కథ, రురుని కథ యిట్టివి. మఱికొన్ని కథలు ప్రధాన కథతో (కౌరవ పాండవ) ముడివడి యున్నవి. వ్యాస భగవానుఁడు ఋషి యగుటచేత ఆయా కథల కంతటి వైశిష్ట్యము కల్గినది. ఋషి వంటి నన్నయ్యయు ఆయా ఋషుల కథల కంతటి వైశిష్ట్యమును గల్గించెను. భారతము నందలి ఋషుల కథ లసంఖ్యాకములు ఒకదానితో నొకటి పోలిక లేని యట్లుండును. వారి యాత్మ యెంత స్వచ్ఛమును బ్రసన్నమునయి యుండునో, వారి కథలు, వారి జీవిత విధానము, వారి చేష్టలు పరస్పర భిన్నములై కన్పట్టును.

పరాశరుని కథ యున్నది. అతఁడు మహా తపశ్శాలి. కామ క్రోధాదు లెంతయు నాయనకు సరిపడవు. అతఁడొకసారి తీర్థయాత్రకు వెళ్ళెను. మధ్యలోఁ దారసిల్లిన సత్యవతియను దాశరాజు కూఁతును వ్యామోహ పరవశుఁడై కామించి, యామెను వశపరచుకొని యామె యందొక పుత్రునిఁ గన్నాఁడు. అతఁడు ఋషికదా! ఇది యేమి పని? అతడు చేసిన యీ పని వలన ఆయన తపస్సు నశింపవలదా? నశింప లేదు. అతని ఋషిత్వము పోలేదు. పైగాఁ బరాశరుఁడు చేసిన యీ కాముక ప్రవృత్తి వలన వ్యాస భగవానుఁడ వతరించెను. ఋషుల కథ లిట్లుండును. ఆ ఋషుల యాత్మలక్షణమును మరల ఋషియే యావిష్కరింపఁ గలఁడు. వ్యాసుఁడట్లు చేసెను. ఋషి వంటి నన్నయ్యయు నట్లే చేసెను.

ఉదంకుని కథ యున్నది. ఉదంకుఁడు ఋషి. పైలునిశిష్యుఁడు పైలుఁడు వ్యాస మహర్షికి శిష్యుఁడు. ఇది ఋషి పరంపర.

"గురుపత్నీ నియోగంబున" బౌష్యుఁడను రాజు దేవి కుండలంబులను గొనితెచ్చి యిచ్చుటకుఁబోఁగా, మార్గమధ్యమున తక్షకుడను సర్పరాజు ఉదంకుని వంచించెను. వంచితుఁడైన యుదంకుఁడు సర్పజాతి యంతటిపైఁ గక్ష సాధించెను. ఉదంకుఁడు ఋషి. కోప తాపము లుండకూడదని వాఁడు. ఆయనకుఁ గోపము వచ్చుటేమి? కక్ష సాధించుట యేమి? ఉదంకుఁడు చేయుచున్న యీ కోపపుఁ బనులను గురువు, ఋషియగు పైలుఁడు హర్షించుట యేమి? మన్నించుటయేమి? ఇంత చేసియు వారిదయిన ఋషిత్వమునకు భంగము రాకుండుట యేమి? ఇతర కార్యముల నెన్నింటిని జేసినను ఋషిత్వమును స్థాపించు నొక రహస్యమగు లక్షణము ఉదంకుని యందున్నది. ఐతిహాసిక దృష్టితో వ్యాసుల వారుదంకుని కథను వ్రాసిరి. రస ప్రధానమగు దృష్టితో నన్నయ్యగా రుదంకుని కథను వ్రాసిరి. ఈ భేదము కథా కథనము నందున్నదే గాని యుదంకుని కథా సూక్ష్మాంశ వివరణ యందు వ్యాసునకు నన్నయ్యకు భేదము లేదు.

కం॥ "పంక జభవ సన్నిభుఁడఘ
పంక క్షాళన మహాతపస్సవిలుఁడనా
తంక మతి పైల శిష్యుఁడు
దంకుండను ముని వరుండు తద్దయుభక్తిన్"

కం॥ గురు కులము నందు గురులకుఁ
బరిచర్యలొనర్చి తానపరిమిత నిష్ఠా
పరుఁడై జ్ఞానము వడసెను
గురుదయ నణిమాదికాష్ట గుణములతోడన్"

(ఆది పర్వము)

ఉదంకుని కథ యంతయు నీరెండు పద్యముల మీఁద నిర్మితమై యున్నది. ఉదంకుని గుణములన్నియు నీరెండు పద్యములయందు నిక్షిప్తమైనవి. ఈ పద్యములందుఁగల విశేషణములన్నియు నన్నయ్యగారి యుపజ్ఞా మూలకములే. ఉదంకుని కథలో అత్యంతాశ్చర్యకః

సంఘటనలు జరుగును. "కథా కథన దక్షుడగు నన్నయ్య యీరెండు పద్యములను గథా ప్రారంభమున వ్రాసెను.

నన్నయ్యగారి భారతమునకు వ్యాస భారతము మాతృక యగుటచేత సుదంకుని కథ సంస్కృత భారతమున గూడ నుండును. వ్యాసుడు చెప్పిన కథా విషయములను నన్నయ్య తెలిగింపనిచో, వ్యాసుని భారతముచదివి ఆయా విషయములను దెలియవచ్చును. ఇది ఇట్లుంచి వ్యాసుడు చెప్పని విషయములను నన్నయ్యగారు చెప్పదురు. అప్పుడేమన వలయును ? "లోనారసి మేలన" వలయును "ప్రసన్న కథా కలితార్థ యుక్తి" యని యే గుణవిశేషమును నన్నయ్య చెప్పెనో దానిని గ్రహింపవలయును.

గురుకులము నందు ఉదంకుడను శిష్యుడొకడు గలడని మాత్రము వ్యాసుని కథనము.

"అథోదంకః శుశ్రూషుర్గురు నియోగ మనుతిష్ఠమానో గురుకులే వసతిస్మ" పౌష్యపర్వకథ. ఇంతకు మించి యుదంకుని గూర్చిన వివరములు తెలియవు. పయి రెండు పద్యములు నన్నయ్యగారి స్వోపజ్ఞకము లగుటచేత అవి కథకెట్లు పకరించునో విచారింపవలయును.

"పంకజభవ సన్నిభుడు" ఇది యుదంకుని గూర్చిన తొలి విశేషణము. బ్రహ్మదేవునితో సమానుడని యర్థము. బ్రహ్మ యను నర్థము బోధించు శబ్దము లనేకములున్నవి. బ్రహ్మ, ధాత, పరమేష్ఠి ప్రభృతి శబ్దములుండగా — పంకజ భవ మనియే నన్నయ్య ప్రయోగించెను. పంక మనగా "పంచతి సంపర్కా ద్విస్తార మాపద్యతే" సంబంధము వలన విస్తరించునదని యర్థము- బురద యని యర్థము. ఈపంక శబ్దమునకును, తరువాత ప్రయోగింపబడిన — "పంక" పంక (ప్రక్షాళన) శబ్దమునకును సంబంధమున్నది. "అఘ పంక క్షాళన మహాతపస్సలిలుడు" ఇది రెండవ విశేషణము. పాప మనెడి బురదను కడుగుటకు గొప్పదయిన తపస్సనెడి జలము గలవాడని యర్థము. "అనాతంకవతి" యన్నది మూడవ విశేషణము.

శంక జంకు లేని బుద్ధి గలవాఁడని యర్థము మన్యతే అనయా ఇతి మతిః. ఈ విశేషణము లిట్లుండఁగా నుదంకుఁడు "మునివరుండు" అనిచివరకుఁ జెప్పఁబడెను. అతఁడు గురులకుఁ బరిచర్యలొనర్చి జ్ఞానము వడసెను. గురుసేవ చేసి జ్ఞానము పొందెనని వ్యాస భారతమున నున్నది.

"జ్ఞానము వడసెను గురుదయ నణిమాదికాష్ట గుణముల తోడన్." అణిమాది కాష్ట గు ణ ము ల తో జ్ఞానము పొందెనని నన్నయ్యగారి కల్పనము. ఈ గుణము లుదంకునియందు లేకున్నచోఁ గథయే లేదు. కథా కథన శిల్పములేదు. అణిమ యనఁగా మిక్కిలి సూక్ష్మమయిన రూపము. "ఐశ్వర్యము" నందు అణిమ యొక భాగము. లౌకికమయిన యీ విద్యను మహర్షియగు నుదంకుఁడు నేర్చుకొన్నాఁడు. ఏ విద్య యెప్పటి కవసరమో !

పంకజభవ సన్నిభుఁడు అని చెప్పఁబడిన యుదంకుఁడు, అఘ పంకక్షాళన తపస్సలిలుఁడనఁ బడెను. అతఁడు పాపము చేయునా? ఆ పాపము యొక్క స్వరూప మెట్టిది ? శంకయు, జంకును విడిచి యుదంకుఁడు చేయు సాహసకృత్యములేవి ? పాపము చేయుట, దానిని బోగొట్టుకొనుట, సాహస కృత్యములు చేయుట, యనునవి యుదం కుని లక్షణములయినచో అతనిని "ముని వరుండు" అని నన్నయ్య యేల చెప్పెను ? మహా కవులయు, మహా ఋషులయు జీవితములు మనో వాగ్వ్యాపారములు అంతర్బహిర్భిన్న ప్రకృతికములై యుండును స్వచ్ఛత, ప్రసన్నత కలిగియుండును. ఉదంకుఁడు పాపము చేసినను, సాహసములు చేసినను వానితయిన ముని లక్షణము నశింపదు. అది యెట్లు ?

"అయ్యుదంకుండు గురుహిత కార్యధురంధరుండై గురు పత్ని నియోగంబున బౌష్యుండను రాజు దేవి కుండలంబులం బ్రతి గ్రహించి తేరంబూని వనంబులో నొక్కరుండ చనువాఁడు నెదుర నొక్క మహో క్షంబు నెక్కి చనుదెంచువాని నొక్క దివ్య పురుషుంగని వాని పన్పిన వృషభగోమయ భక్షణంబు సేసి..."

ఉదంకుని విద్యాభ్యాసము పూర్తియైనది. గురుదక్షిణ యీయవలయును. గురు దక్షిణ యిచ్చుటకై యతఁడు గురువును సమీపించెను. గురువు తన భార్య నడుగ మనియెను. వ్యాసుఁడు చెప్పిన యీ భావమును నన్నయ కొలఁది మార్పుతో వ్రాసెను. "గురుపత్నీ నియోగంబున గురుహిత కార్యధురంధరుండై" యనునది నన్నయ్య తెలుఁగు సేఁత. ఉదంకునకు గురు, గురుపత్నుల విషయమున అభేద ప్రతిపత్తి యని నన్నయ్య రచన వలన తెలియును. గురుపత్నీ నియోగము చేయుట గురువు చెప్పిన పని చేయుటయే నని యిందలి యభిప్రాయము. ఉదంకుండు "వనంబులో నొక్కరుండ చనువాఁడు". ఒక్కరుండ యనుమాట నిర్జనము, మృగాకీర్ణమునగు అరణ్యములో ఏకాకిగా, సాహసిగా బోఁగల ధైర్యము కలవాఁడన్న యుదంకుని శీలమునకు వ్యంజకము. "అనాతంకమతి" యని ముందు చెప్పఁబడినవిశేషణమునకు "ఒక్కరుండచనువాఁడ"నునదినిదర్శనము. సాహసవంతుడగు నుదంకుఁ డొంటరిగా పోవుచుండఁగా ఎదుట "ఒక్క దివ్యపురుషుఁడు" వృషభ గోమయమును పన్నెను. ఉదంకుఁడు దివ్యపురుషుని జూచెను. వాని పన్నిన వృషభ గోమయమును భక్షించెను. ఇక్కడ కూడా నుదంకుని యనాతంకమతి స్ఫుటమగుచున్నది. ఆ వచ్చిన దివ్యపురుషుఁడు ఉదంకుని పరీక్షింపఁ దలచెను. ఈ విషయములను నన్నయ్యగారు వాచ్యము చేయలేదు. ఉదంకుఁడు 'వాని (దివ్యపురుషుని) పన్నిన వృషభ గోమయమును భక్షించెను." దివ్యపురుషుఁడు ఉదంకునిచేత పాపము చేయింపఁ దలచెను. తలఁచెనని మనకెట్లు తెలియును?

ఆ దివ్యపురుషుఁడు గోమయమును పన్నెను. వలపన్నుట, మాయలు పన్నుట- యిట్టి సందర్భములలో వాడబడిన "పన్ను" అనుక్రియ తత్ కర్తృ మనోగత దుష్టభావ వ్యంజకముగా నుండును. ఇట్టి క్రియను ప్రయోగించి యీ దివ్యపురుషుని కౌటిల్యమును పాఠకుని యూహకు నన్నయ్యగారు అందించిరి. పన్ను అనఁగా యుక్తిగాఁ

గల్పించుట యని యర్థము. ఈ పన్నగడను ఉదంకుఁడవలీలగా జయించెను. అతఁడా గోమయమును "భక్షించెను." గోమయమును భక్షించుట యేమి ? ఉదంకుఁడు చేసిన పనికి దివ్యపురుషుఁ డను గ్రహించి వెళ్ళిపోయెను. గోమయమను తినుమని దివ్యపురుషుఁ డుదంకుని గోరలేదు. ఉదంకుఁడే సాహసము చేసెను. ఇది నన్నయ్య గారి కథనము. ఉదంకుని చేత గోమయము తినిపించుటకై దివ్యపురు షుఁడెంతయుఁ బ్రయత్నించెనని వ్యాసుని కథనము. "ఓయీ, నీ గురువు కూడ పూర్వమీ గోమయమును భక్షించెను. నీవేల విచా రింతువు." అని దివ్యపురుషుండు ఉదంకునితోఁ బలికెనని వ్యాసుని కథనము. "మా విచారయస్వ, ఉపాధ్యాయే నాపి తే భక్షితం పూర్వమితి" దివ్యపురుషుని యుపదేశమున ప్రబోధితుఁడై యుదం కుఁడు గోమయము భక్షించెనని తాత్పర్యము.

దివ్యపురుషుని కుటిలత్వమును వ్యాసుఁడు వాచ్యము చేయఁగా నన్నయ్య వ్యంగ్యము చేసెను.

వృషభ గోమయ మనునది యొక చమత్కారమగు సమాసము. గోమయ మనఁగా ఆవుపేడ. వృషభ గోమయమనఁగా నేమి ? మొత్తము సమాసమునకుఁ బేడ యనియే యర్థము. అప్పుడు గోమయ శబ్దమునకు పేడ యని చెప్పవలయును. ఇట్టి సమాసగత వైలక్షణ్యము నన్నయ్యగారి రచనలో నాలుగయిదు సందర్భములయందుఁ గాన వచ్చుచున్నది. నా మిగిలిన వ్యాసములందు వానిని గూర్చి వ్రాయు దును. వృషభ గోమయ భక్షణ సందర్భమున వ్యాసుని రచనము వేఱుగా నున్నది. దివ్యపురుషుఁడు పెట్టిన గోమయమును భక్షించు టయా మానుటయా యను విషయమును ఉదంకుఁ డాలోచించు చుండఁగా దివ్యపురుషుఁడు వాని కిట్లు పలికెను. వాని మాటలు విని యుదంకుఁడా గోమయము భక్షించెను. ఉదంకుఁడు తనంత తానే గోమయము భక్షించినాఁడని నన్నయ్య వ్రాసెను. స్వభావ సిద్ధముగా నుదంకుఁడొకరికి లొంగువాఁడు కాడని యందుఁ దెలియదగు నుదంకుని

లక్షణము. మఱియు నుదంకుని సాహసప్రవృత్తికి నివి తార్కాణము. ఈ సాహసమే యనంతర కథా గమనమునకు ప్రాముఖ్యమును దెచ్చినది.

యింతవరకు నడచిన విమర్శలో 'లోనారసి' చెప్పిన "ప్రసన్న కథా కలితార్థ యుక్తి" గాని ఋషిపాత్ర యొక్క యా విష్కరణముగాని యేమియులేదు. ఇచ్చటనుండి చూడవలయును.

దివ్యపురుషుఁడాశీర్వదింపఁగా ఉదంకుఁడు పౌష్యుఁడను రాజు వద్దకు వెళ్ళెను. పౌష్యాభిముఖుఁడై యుదంకుఁడిట్లనియెను.

"ఏను గుర్వర్థ మర్థినై మానవేశ
కడఁగి వచ్చితి నిపుడు నీకడకు వేడ్క
దండితారాతి! నీ దేవి కుండలమ్ము
లిమ్ము నాపూన్కి యిది సఫలమ్ము గాగ."

ఉదంకుఁడు రాజును జూచి మానవేశ, దండితారాతి అని సంబోధించినాఁడు. పౌష్యుఁడు రాజు గావున మానవేశ యని సంబోధించినాడనవచ్చును. శత్రువులను దండించువాఁడా యని సంబోధించుట కిచ్చట నేమి సందర్భమున్నది? నిజముగా నివి రాజును గూర్చిన సంబోధనలు గావు. ఉదంకుని జీవగతమగు స్వ భా వ మీ సంబోధనల యందున్నది. మానవేశుఁడనఁగా అధిపత్యము నెఱపు వాఁడు. ఇతరులకు లోఁబడి యుండనివాఁడు. దండితారాతి యనఁగా ఇతరుఁడెవఁడేని తన్నవమానించినచో, వారిని శిక్షించిగాని వదలని వాఁడు. తనలో నిగూఢముగా నున్న లక్షణమునే యుదంకుఁడు సంబోధనాత్మకముగా బహిర్గతము చేసెను.

ఉదంకుని ప్రార్థనను మన్నించి పౌష్యుఁడుదంకునితో నిట్లన్నాఁడు

"అయ్యా! మదీయ ధర్మపత్ని యకుండలంబులు తొడుగ నవసరంబై యున్నయది. మద్వచనంబున వాని నిప్పించుకొమ్మనిన నుదంకుం డంతఃపురంబునకుం జని పౌష్యమహాదేవిం గానక క్రమ్మఱి పౌష్యుపాలికి వచ్చి, నీ దేవి నెందునుం గాన నీవ యకుండలంబులు

దెప్పించి యున్నా." ఈ వచనమున కథ చాలా దూరము పోయి చాల విషయములను చెప్పినది. ఉదంకునికి పౌష్యుని భార్య కనబడలేదు. కుండలములు లభింపలేదు. కుండలములను పౌష్యునిరాణి యెల్ల వేళల యందు ధరింపదు. ఆ కుండల ధారణకొక నిర్ణీతకాలమున్నది. అవి అసాధారణ కుండలములు. వానిని దాల్చుటకొక పవిత్రత యుండ వలయును. వాని ధారణము వలన నొక మహత్తర ప్రయోజన మున్నది. అంతప్రాశస్త్యముఁ గల యీ కుండలముల మాహాత్మ్యము లోకమునఁ బలువురకుఁ దెలిసియే యున్నది. వానిపైఁ బెక్కుమంది మోజుపడి యున్నారు. వారిలో పైలుని భార్య యొకతె. మఱి యొకఁడున్నాఁడు. వాఁడు తక్షకుడు. ఈ తక్షకుఁడా కుండలముల నపహరింప తలఁచి నాఁడని రాజెఱుఁగును. పౌష్యుని రాణి యీ కుండలములను భద్రముగా దాచియుంచినది. ఉదంకుఁడు యోగ్యుఁడు మరియు బ్రాహ్మణుఁడు. వానికా కుండలముల నీయవచ్చును. తానై కబురంపినచో రాణి యీ కుండలములను తప్పక యుదంకున కిచ్చు నని పౌష్యుఁడెఱుఁగును.

"మదీయ ధర్మపత్ని యక్కుండలంబులు తొడుగ నవసరంబై" యున్నదని రాజన్నాఁడు. ఈ వాక్యమున "తొడుగు, అవసరము" అను రెండుమాటలు ముఖ్యమయినవి. తొడుగు అనఁగా ధరించుట, ఆభరణము అని రెండర్థములు. కుండలములను ఆభరణములుగ ధరించుట యని యర్థము. తొడుగు అనునది తెలుఁగు మాట. అవసర మనునది సంస్కృతము. సంస్కృతమున అవసరమను మాట కర్థము వేఱు. అవసరమనఁగా సమయమని యాభాషలో దాని కర్థము. ఈ సంస్కృత పదమునే స్వీకరించి, తెలుఁగు వారు, అవసరమను ఆ మాటకు అత్యంత ముఖ్యమను నర్థములో వాడుదురు. సంస్కృత మున దిక్కు అనఁగా దిశ యని యర్థము. తెలుఁగులో రక్షణ యను నర్థముకూడ గలదు. ఈ విషయమట్లుంచి – తన భార్య యీ కుండ లములను "తొడుగ నవసరంబై" యున్నదని రాజు పలుకుటలో

రెండర్థములున్నవి. ఆ కుండలములను తన భార్య ధరించు సమయ మయ్యెనని యొక యర్థము, తన భార్యకా కుండలములు మిక్కిలి ముఖ్యమయినవని యొక యర్థము పుట్టుచున్నది. సరే, రాజు మాట విని ఉదంకుఁడు పౌష్యుని రాణి వాసమునకు వెళ్లెను. "పౌష్య మహా దేవిం గానక క్రమ్మఱి పౌష్యు పాలికిం జని నీదేవి నెందునుం గాన నీవ యక్కుండలంబులు దెచ్చియిమ్ము" అని చెప్పెను.

గురుదక్షిణ చెల్లించుటకు గురువును సమీపింపఁగా తన భార్య నడుగుమని గురువు ఉదంకునితోఁ జెప్పెను. కుండలముల నిమ్మని యుదంకుఁడు కోరగా, తన భార్యను అడుగుమని రాజు చెప్పెను. ఇచ్చట నొక చమత్కారమున్నది. "కుండవత్ వృత్త త్వాత్ కుండలమ్" కుండవలె గుండ్రముగా నుండు కర్ణభూషలను కుండలము లందురు. వీనిని స్త్రీ పురుషులందఱు ధరించుదురు. కుండల శబ్ద సారూప్యముఁ గల కుండలి యను వేఱొక శబ్దమున్నది. ఈ రెండు శబ్దములును ఏకధాతు నిష్పన్నములు. కుండలములను అపహరింపఁ దలచిన కుండలి యొకఁడు తక్షకుఁడున్నాఁడు. రాజు చెప్పినట్లుగా ఉదంకుఁడు దేవియుండు రాణి వాసమునకు వెళ్ళెను. ఆమె యంతః పురమున లేదు. దేవి యంతఃపురమున నేల లేదు? రాజు అసత్యము పలికెనా? ఉదంకునకు కుండలముల నీయరాదన్న ఉద్దేశముతో రాణి వానికి తప్పడలేదా? రాణి నుండి కుండలముల దెచ్చి రాజే తనకేల యీయలేదు? కుండలము లిచ్చుట రాజున కిష్టము కాదా? ఇట్టి యాలోచనలు ఉదంకునకుఁ గలిగెను. అంతఃపురమున రాణి లేకుం డుటయే యిందుకు, గారణము. అతఁడ నాతంకమతి. అంతః పుర మంతయును గాలించెను. రాణి యుండు ననుకొన్న ప్రాంతముల నన్నింటిని వెదకెను. తన భార్య యంతఃపురములో నుండునని రాజు చెప్పగా ఉదంకుఁ డామెను- "ఎందునుం" గానక తిరిగి రాజు వద్దకు వచ్చెను. రాణి యా కుండలములను ధరించి యే తోఁటకో వెళ్ళి యుండవచ్చునని రాజనఁ గలఁడని యుదంకుఁడు తానే అన్ని ప్రాంత ములు చూచెను. ఆమె ఎక్కడను గానరా లేదు.

ఉదంకునకు రాజుపై అనుమానము. రాజునకు ఉదంకునిపై అనుమానము. తన దేవి యంతఃపురము విడిచి వెళ్ళదని రాజునకు దెలియును. తన రాణి మహిమలు రాజునకుఁదెలియును. తన భార్య యుదంకున కేల కన్పడలేదు. ఇది రాజు సంప్రశ్నము. రాజునూహాలు రాజువి. ఉదంకుఁడు గడుసరి. "ఓయీ రాజా, నీ భార్య యచ్చట లేదు; నేను వెదకితిని. నీవు కుండలములు దెచ్చియిమ్ము" అన్నాఁడు. కుండలముల నిచ్చునో, యీయడో, యీబాధ్యత రాజుపై నున్నది. ఇవుడు మాట్లాడవలసినది పౌష్యుఁడే. తన దేవి యుదంకునికి గాన రాని కారణమును పౌష్యుఁడు చెప్పెనా ? అది యుదంకున కవమానము. తన రాణి పవిత్రురాలని, యశుచులకుఁ గానరాదని పౌష్యుఁడు చెప్పినచో తన రాణి గొప్పతనము తెల్లమగుట యట్లుంచి యుదంకుఁడు అపవిత్రుఁడని యశుచి యనియుఁ జెప్పకయే చెప్పిన ట్లగును. మరి పౌష్యుఁడే విషయమును దాఁచినచో ఉదంకుఁడు రాజు నపార్థము చేసికొనును. శపించును. రాజునకు సంకటస్థితి యేర్పడినది. విషయమేమో తెలియవలయును. ఉదంకుఁడు కోపగింపరాదు. ఇది యెట్లు ? లోకజ్ఞుఁడు కదా, నన్నయ్యగారు,

కం॥ "భూ వినుత! నిన్ను ద్రిభువన
పావను నశుచివని యెట్లు పలుకఁగ నగున
ద్దేవి పవిత్ర పతివ్రత
కావున నశుచులకు గాన కాదనవదా !"

పౌష్యుఁడు దంకునితో నిట్లనెను.

పద్యమంతయు నుదంకుని గూర్చి ప్రశంసయే. "భూ వినుత, త్రిభువన పావన, అనవద్యా, నీవు మూఁడు లోకములలో పవిత్రుడవు. నిన్న పవిత్రుఁడిని యెట్లందును. నా భార్య పతివ్రత. అశుచులకుఁ గానరాదు. నీవు అనవద్యుఁడవు." అశుచివని నిన్ననలేను గాని నా భార్య యశుచులకు, గానరాదు. అని రాజన్నాఁడు. ఇది సంభాషణ లోని చాతుర్యము. గడుసుతనము. పొగడ్తయున్నది; నిందయున్నది.

అశుచివని నిన్నెట్లన గలను. అని రాజు పలుకుటలో నుదంకుఁడ శుచియేనన్న యర్థము వ్యాంగ్యభూతమయినది. ఈ వ్యంగ్యమును ఉదంకుఁడు వెంటనే గ్రహించెను. పౌష్యుఁడు తనను ప్రశంసించుచు ఆ ప్రశంసల మధ్య తనలోని పాపమును గూర్చి మర్యాదగా ఆ రాజు సూచించెనని యుదంకుఁడు గ్రహించెను. వృషభగోమయ భక్షణ జనితమగు ప పము తనను వెంటాడి వచ్చినది. సంపర్కము చేత వి_స్తరించు పాపమునకు పంకమని పేరు.

"అనిన విని యుదంకుండు అవ్విధ తలంచి యా వృషభ గోమయ భక్షణంబున నైన యశుచి భావంబు గాకేమి" యని గ్రహించినాఁడు. తా నే పాపము చేసెనో యుదంకునకు వెంటనే స్ఫురించెను. ఆ పాపము వృషభగోమయ భక్షణము. ఈ పాపము పోగొట్టుగొనిన గదా యా దేవి కన్పించుట! ఈశ_క్తి యుదంకున కున్నదా? ఉన్నది. ఉదంకుఁడు "అఘ పంకక్షాళన మహాతపస్సలిలుఁడ"ని "పంకజ భవ సన్నిభుఁడ"ని కథా ప్రారంభమున నన్నయగారు వ్రాసిరి. ఇది యొక రచనా శిల్ప రహస్యము. అతఁడు బ్రహ్మ (పంకజభవ) తో సమానుఁడు గావున బ్రాహ్మ్యమగు దృష్టితోఁ దాను జేసిన యశుచి కార్యమును (గోమయ భక్షణము) గ్రహింపఁ గలిగెను. ఆ పాపమును బోగోట్టు కొన జాలిన శ_క్తియుఁ దన కున్నది. పాపపు బురదను తపస్సు అను నీటితోఁ గడిగి వేయఁగలఁడు. (అఘపంక క్షాళన మహా తపస్సలిలుఁడు) వెంటనే యుదంకుఁడు "పూర్వాభి ముఖుండై ప్రక్షాళిత పాణి పాద వదనుండై"నాఁడు పాపము నుండి విము_క్తుఁడై నాఁడు. ఇంతకు మించి యుదంకుఁడు చేసిన పాపమేదియు లేదు. తనకుఁగల "యఘ పంక క్షాళన తపస్సలిలము" చేత "ప్రక్షాళిత" పాణి పాద వదనుఁడై"నాఁడు. క్షాళన, క్షాళిత యను రెండు మాటలు గుర్తింపవలసియున్నవి.

అసలు నన్నయ్యగారు "అవిరళ జపహోమ తత్పరుఁడగు"టచే ఋషుల కథలు వ్రాయుచున్నపుడు తానొక ఋషియై యుందురు.

వ్యాసుని కథనమును గూడఁ బరిశీలించెదము. దివ్యపురుషుఁడు గోమయమును భక్షింపుమనఁగా నుదంకుఁడట్లే చేసెను. వెంటనే పాణి పాద ప్రక్షాళన కార్యము చేసెను. అట్లయినచో నుదంకుని యందుఁ బాపముండదు గదా !

"తద్ వృషభస్య మూత్రం పురీషంచ భక్షయిత్వా ఉదంక స్సంభ్రమాదుత్థిత ఏ వాప ఉపస్పృశ్య ప్రతస్థే" పౌష్యుని రాణి కన్పింప కుండుటకు ఉదంకుని యశుచి భావము కారణమయినచో ఆ యశుచిత్వము జలస్పర్శచే పోయినది. కాని యాామె యుదంకునకు గాన రాలేదు. ఈ క్లిష్టతను నన్నయ్యగారు తొలగించిరి. పాణి పాద ప్రక్షాళనమును బౌష్యునికడ చేసెనని చెప్పుటచేత, రాణి యుదం కునకు గన్పడక పోవుటలోని యౌచిత్యమును గాపాడిరి. తన పాపము నుండి వెంటనే నివృత్తి బొందఁ గలిగెను. గావున నుదంకుఁడు "పంకజభవ సన్నిభుఁడు".

ఇచ్చట యాథ్యర్థము తీసికొన్నచో బురదనుండి పుట్టిన (తామర) దాని నుండి వుట్టిన వానితో (బ్రహ్మ)తో సమానుఁడని యర్థము వచ్చును. బురదనుండి పుట్టిన తామరయొక్క వాసనకు తిరుగులేదు. అట్లే బురదనుండి పుట్టిన, తామరనుండి పుట్టిన బ్రహ్మ మహిమయుఁ దరుగదు. పాపమను బురద తన కంటినను ఉదంకుని మహిమయుఁ దరుగలేదు. బ్రహ్మకును ఉదంకునకును గల యాపమ్య మింతటిది. బ్రహ్మ యనుటకు బదులు "పంక జ భవుఁడ"ని ఉదంకుని గూర్చి "పంకక్షాళన తపస్సలిలుఁడ"ని రెండింట పంక శబ్దమునే వాడుట నన్నయ్యగారి సారమతిని నిరూపించుచున్నది.

ఉదంకుఁడిపుడు పవిత్రుఁ . ఇంతవరకు పౌష్యునిరాణి తన కేల కానరాలేదో తత్కారణమును దెలిపినవాఁడు. రాజుపై నితఃపూ ర్వము పెంచుకొన్న యనుమానము తొలఁగించుకొన్నవాఁడు. "నీవ యక్కుండలమ్ముల తెచ్చియిమ్మని" యడుగువాఁడు కాదు. ఆత్మ స్థైర్యము గలవాఁడు. మరల బౌష్యానుమతితో "అద్దేవి యొద్దకు"

జని"నాఁడు. ఇపుడామె కన్పించునో, కన్పింపదో యన్న శంక, జంకులు లేనివాఁడు. అతడంతఃపురమేగగా

"అదియును (పౌష్యనిరాణి) నమ్మహా మునికి నమస్కరించి కుండలమ్ములిచ్చి యిట్లనియె" కుండలములు కావలయునని యుదంకుఁడు దేవిని అడుగలేదు. అసలామెతో మాట్లాడనే లేదు. ఉదంకుని యభిప్రాయము దేవి కెట్లు తెలియును? ఉదంకుఁడు మౌనముగా నున్నాఁడు. "అమ్మహామునికి" రాణి నమస్కరించెనని చెప్పుటచేత నాయన మాట్లాడుట లేదని తెలియుచున్నది. పౌష్యని భార్య "పవిత్ర ప్రతివ్రత" త్రికాలజ్ఞురాలు, సర్వవిషయములు తెలిసినది. పూర్వము తన్ను చూడవచ్చిన యుదంకున కామె కన్పడలేదు, గాని యామె కుదంకుఁడు కన్పడుచునే యున్నాఁడు. ఆ యుదంకుఁడు తన్ను కుండలముల నడుగుటకై వచ్చుట, అంతఃపురము ప్రవేశించుట, ఉద్యానవనములు, సౌధములు. మఱియుఁ దానెచ్చట నుండుట కవకాశముండునో యాయా ప్రదేశము లన్నింట నుదంకుఁడు తన నన్వేషించుట — యివి యన్నియు నామె పరిశీలించుచునే యున్నది. కాని యతఁడశుచి, వాని మనోఽభిప్రాయమును గూడ నామె యెఱుఁగును ఇపుడ శుచియై వచ్చెను. అతని ప్రార్థన మన్నించి కుండలముల నిచ్చుటయే గాని, అతఁడేల వచ్చెనో యడుగ నవసరమామెకు లేదు. అందుకే యామె యుదంకునకు వెంటనే కుండలముల నిచ్చినదని నన్నయ్యగారు వ్రాసిరి.

ఇచ్చట వ్యాసుని కథనము వేఱుగా నున్నది. ఆ యథార్థ కథన దృష్టి వేఱు. శుచియయిన యుదంకుఁడు తనను జూచుటకు రాగా వారిరువురి మధ్య యిట్లు సంభాషణ జరిగినది.

"స్వాగతం తే భగవన్ అజ్ఞాపయ కిం కరవాణీతి! సతాముపాచ ఏతే కుండలే గుర్వర్థ మే భిక్షితే దాతు మర్హాసీతి" ఓయి, నీకు స్వాగతము. నీకు నేనేమి చేయుదునో ఆజ్ఞాపింపుము అని రాణి యనఁగా గుర్వర్థము కుండలము లిమ్మని యుదంకుఁ డడిగినాఁడు.

ఇప్పట్టున నన్నయ్యగా రుదంకునిచేత మాట్లాడించనే లేదు. కుండలముల నిచ్చిన రాణి.

కం॥ "తక్షకుఁడీ కుండలము ల
పేక్షించుచు నుండు వాఁడభేద్యుఁడు, మాయా
దక్షుండు వాని వలన సు
రక్షితముగ జేసి చనుము రవినిభతేజా!"

అని యుదంకుని హెచ్చరించినది. తక్షకుఁడను సర్పరాజును ప్రస్తావించినది. వాఁడు పాతాళ వాసి. వానికి మాయలు తెలియును. ఉదంకుఁడు "రవి నిభతేజుఁడు" ఆ కుండలములను సురక్షితముగాఁ దీసికొని వెళ్ళవలయును. రవి నిభ తేజా యను సంబుద్ధి యీ పద్యమున కాయువు పట్టు. రవి యనఁగా స్తుతింపఁ బడువాఁడు. త్రిమూర్త్యాత్మక స్వరూపుఁడు. ఉదంకుని యందు సృష్టి స్థితి లయకారకులగు బ్రహ్మ విష్ణు మహేశ్వరుల తేజస్సు రాశీభూతమై యేకత్ర సమావిష్టమై యున్నది. ఉన్నదని పౌష్యుని రాణికిఁ దెలియును. ఆమె తక్షకుని దురాగతమును గూర్చి హెచ్చరింపఁగా నుదంకుఁడు "అట్లు చేయుదు" నన్నాఁడు.

పాతాళము తమోమయలోకము అచ్చట సూర్యుఁడుండఁడు. తక్షకాదులు పాతాళవాసులు. వారికి నుదంకుఁడు సూర్యోదయము వంటి వాఁడగుచున్నాఁడు. ఉదంకుని తేజము ముందుఁ దక్షకాదులు డీలుపడి పోవుదురు. ఇదియంతయు నుదంకుని తపస్సాధిత శక్తి. నన్నయ్యదంతయు ధ్వనాత్మక రచన.

కుండలములు తీసికొని యుదంకుఁడు పౌష్యునికి వద్దకు వచ్చెను. "స యేవ ముక్త్వా తాం క్షత్రియాం ఆమంత్ర్య పౌష్య సకాశ మాగచ్ఛత్" పౌష్యుఁడు దంకునితో నిట్లు పలికెను. "భగవన్ చిరేణ పాత్ర మాసాద్యతే, భవాంశ్చ గుణావా నతిథిః తదిచ్ఛే శ్రాద్ధం కర్తుమ్...క్రియతాం క్షణ ఇతి" తపయింట విందారగించి పొమ్మని రాజుదంకుని ప్రార్థించెను.

వచ్చుచున్నది. ఇది ఆగామి పాతాళలోక ప్రవేశకాల జనిత తీవ్ర కోప స్ఫూర్తిని ధ్వన్యమానము చేయుచున్నది.

పౌష్యుఁడు కూడ నుదంకుని శపించెను పరస్పరము శపించు కొనిరి. లోక స్వభావ మిట్లుండును. కోపము, ద్వేషము, కక్ష వచ్చి నపుడు తాము చేయుచున్న పనుల వలన గలుగు పర్యవసానమును ఎవ్వరు నాలోచింపరు. ఇరువురు నాశన మగుదురు. పశ్చాత్తాప పడు దురు. అప్పటికన్నియుఁ జేతులుం దాటిపోవును. నాశన మగుటయే గాని బాగుపడుట యుండదు. లోక స్వభావమును నన్నయ్య యిట్లు చిత్రించెను కాని యుదంకుని విషయము వేఱు ఆయన శాపానుగ్రహ సమర్థుఁడు. తానిచ్చిన శాపమును ఉదంకుఁడు మరల్చగలఁడు. పౌష్యుఁడు మరల్చలేఁడు. పౌష్యుఁడుదంకుని వేఁడుకొనెను.

"నిండు మనంబు నవ్య నవనీత సమానము పల్కు దారుణా
ఖండల శస్త్రతుల్యము, జగన్నుత విప్రులయందు, నిక్కమీ
రెండును రాజులందు విపరీతము గావున విప్రుఁడోపు, నో
పం డతిశాంతుఁడయ్యు నరపాలుఁడు శాపము గ్రమ్మఱింపగన్"

బ్రాహ్మణ క్షత్రియులకుఁ గల తారతమ్యమీ పద్యమున వర్ణింపఁబడినది. ఉదంకుఁడిచ్చిన శాపము పోవలయును. ఉదంకుఁ డిచ్చిన శాపమును అతఁడే మరల్పగలఁడు. రాజుదంకునికిఁగల శాపానుగ్రహ సామర్థ్యమును ప్రశంసించుచున్నాఁడు. "విప్రుల యందు నిక్కము, గావున విప్రుఁడవు" అని యన్నాఁడు. పయి పద్యము నందు విప్ర శబ్దము రెండు మారులు ప్రయోగింపఁబడినది. బ్రాహ్మణ, ద్విజ, అగ్రజన్మ భూసురాది శబ్దములను విడిచి రాజుచేత విప్రశబ్దమును సాభిప్రాయముగాఁ బ్రయోగింపఁజేసెను. విప్రుఁడనగా నెవ్వరు? "విశేషేణ పాపేభ్యః ఆత్మానం పరం చ పాతీతి విప్రః" తనను పరుని విశేషముగాఁ బాపమునుండి రక్షించువాఁడు విప్రుఁడని యర్థము. ఉదంకుఁడు తాను రాజునకిచ్చిన శాపమును బోగొట్టఁ

గలఁడు, తనకు రాజిచ్చిన శాపమును బోఁగొట్టగలఁడు. రాజు శపింపఁ గలఁడు గాని, శాపమును తొలఁగింపఁ జాలఁడు. ఋషియయిన యుదంకుని మహిమ యిట్లు విప్రశబ్ద ప్రయోగముచేత నిరూపింపఁబడినది. "యథా నవనీతం హృదయం బ్రాహ్మణస్య, వాచిక్షురో నిశితీక్ష్ణ ధారః తదుభ య మేత ద్విపరీతమ్, క్షత్రియస్య వా జ్నవనీతం హృదయం తీక్ష్ణధారః......" బ్రాహ్మణ శబ్దమును విప్రశబ్దముగా మార్చబడినది.

ఇది యిట్లుండగా "నిండుమనంబు" వంటి పద్యములకు, 'నిండు మనంబు' పద్యమే సాటియని తిక్కన్నగారు ప్రశంసించిరని యొక కీర్తి పై పద్యమునకున్నది. నన్నయ్యగారి గొప్ప తిక్కన్నకుఁ దెలియును.

పౌష్యునకు శాపము తీరినది. ఉదంకుని శాపము తీరలేదు. సంతానము లేకుండెడుమని పౌష్యుఁడు ఋషియగు నుదంకుని శపించెను. ఆ శాపమును ఉదంకుఁడు మరల్చుకొనఁడేమి? బ్రహ్మ యంతటి వాఁడు కదా! కావుననే మరల్చుకొనలేదు. పౌష్యుఁడు తననుశపించి నట్లుండెను గాని తనకు సంతాన యోగ్యత యెట్లును లేదన్న విష యము నుదంకుఁడెఱుఁగును. ఇది కర్మానుభవము యొక్క స్థితి. శాపముల యొక్క యంతరార్థము.

ఉదంకుఁడు పౌష్యున కనుగ్రహించి మగుడి పోవునెడ గురు పత్నికిఁ గుండలంబు లీఁ గంటెనని మనంబున సంతోషించి చను వాఁడెదుర నొక్క జలాశయంబుగని శుచిప్రదేశంబున దనచేతి కుండ లములపెట్టి యాచమించు చున్నంతఁదన తోడన వచ్చి తక్షకుండు నగ్న వేషధరుండై యక్కుండలంబులుగొని పాఱెన..."

ఇది యంతయు నొక్క యసంపూర్ణ వాక్యము. హృదయము నందిముడ్చుకోలేని యన్ని యాలోచనలున్నవి. లోనారసి మేలనఁ దగు నంశములున్నవి. ఇట నన్నయ్య ప్రసన్న కథా కలితార్థ యుక్తిఁ దెలియుటకు ముందు సంస్కృత భారతమును గూడ చదువ వలయును. అదియిట్లున్నది.

"ఉదకం తే కుండలే గృహీత్వా, సోఽపశ్య దథపథి నగ్నం క్షపణక మాగచ్ఛంతం ముహుర్ముహు ర్దృశ్యమాన మదృశ్యమానంచ- అథోదంక స్తే కుండలే సన్న్యస్య భూమావుదకార్థం ప్రచక్రమే. ఏతస్మిన్నంతరే సక్షపణకః త్వరమాణ ఉపసృత్య తే కుండలే ప్రాద్రవత్॥".

సంస్కృత భారతమున యథార్థ సంఘటనలు వ్రాయబడునవి గావున సర్వత్రశిల్పమును వెదుకరాదు. నన్నయ్యభారతము సర్వ శిల్పాభిరామము.

కుండలములను దీసికొని గృహాభిముఖుండై యుదంకుఁడు వచ్చుచుండఁగా దారిలో నగ్నరూప ధారి యయిన తక్షకుఁడు వచ్చుటను ఉదంకుఁడు చూచెనని వ్యాసభారతమునఁ గలదు. ఆ తక్షకుఁ డొకసారి కన్పించి యొకసారి కన్పింపకున్నాఁడు. తన వెనుక వచ్చుచున్న దృశ్యాదృశ్య స్వరూపుఁడగు తక్షకుని జూచుచున్న యుదంకుఁడు, కుండలములను భూమి మీఁద విడిచి వెళ్ళుట యజాగ్రత్త కాదా! పౌష్యుని రాణి తనను హెచ్చరించెను గదా! ఉదంకుఁడు తక్షకుని విషయమై యలసుఁడై యుండు నేమో! ఇట్టి ప్రశ్నలు సంస్కృత భారత కథనము వలనఁ బుట్టుచున్నవి.

వ్యాసుని భావమును నన్నయ్యగారు పలికించిరి. ముని ప్రణీత పరమార్థమును దెల్లము చేసిరి. తక్షకుఁడు తనకుఁ గన్పించుచు, మాయమగుచు, తనను వెంటాడుచు వచ్చుచున్నాఁడని తెలిసియు ఉదంకుడు కుండలములను భూమిపైఁ బెట్టుటను నన్నయ్య సమర్థించెను. తెలిసి తెలిసి కుండలములను విడుచుటకుఁ దగిన హేతువును గల్పించిరి.

"గురుపత్నికి గుండలంబు లిఁగంటినని మనంబున సంతోషించి..." నాఁ డుదంకుఁడు సాధించిన మహాకార్యము వలన కలిగిన కలిగిన సంతోషము ఉదంకుని మనస్సు నావరించి యున్నదని నన్నయ్యగారి కల్పన. గురుకార్య విరతుఁడైన ప్రతి శిష్యునకు నిట్టి

సంతోషము మనస్సు నావరించియుండుట సహజము. ఇన్నాళ్ళు తను శ్రమపడి గురుకుల క్లిష్టుఁడై సాధించిన విద్యకు బరిపూర్ణత యేర్పడు చున్నది. ఏతాదృశానంద భావ పరంపర యందుండి యుదంకుఁడు ఇతర విషయములను మరచెను. పౌష్యుని రాణి హెచ్చరికగాని, తక్షకుడు తనను అనుసరించి వచ్చుటనుగాని యుదంకుఁడు గుర్తింప లేదు. ఆ తక్షకుఁడు నన్నయ్యగారి భారతములో "నగ్నవేషధరుఁడై" వచ్చెను. కాబట్టి యుదంకుఁడు వానిని జూచుట కవకాశము లేదు. కుండలములను శుచి ప్రదేశమునందుంచి యాచమనార్థము వెళ్ళెను. ఇట్టి నిత్య కర్మానుష్ఠానముల విషయమున మరపురాకుండుట సామాన్య విషయము.

కుండలముల నపహరించి పాఱిపోవుచున్న తక్షకుని ఉదంకుఁడు చూచెను. వెంటాడెను. ఈ సందర్భమును వ్యాసుఁడిట్లు వ్రాసెను. "తముదంకః అభిసృత్య కృతోదక కార్యః శుచిః" తక్షకుఁడు కుండలములను అపహరించుకొని పోవుచుండగా వెంటనే పరుగెత్తి పట్టుకొనవలయును గాని చేయుచున్న ఆచమనము పూర్తిచేయు వరకుం దక్షకుఁ డుండఁడు గదా !

ఆచమనము పూర్తిచేసిన తరువాత నుదంకుఁడు వెళ్ళినట్లు వ్యాస భారతమున వర్ణింపఁబడినది. తెలుగుభారతమున వేఱుగా నున్నది.

"శుచి ప్రదేశంబున తనచేతి కుండలంబులు పెట్టి యాచమించుచు చున్నంతలో" కుండలాపహరణము జరిగినది. ఉదంకుఁడు "వానిఁ పిఱుందన పాఱె"నాఁడు. తక్షకుఁడు దొంగతనము చేసెనని గ్రహించి నంతనే యుదంకుఁడు తానును చేయుచున్న ఆచమన కార్యమును విడిచి వెంటపడి పరిగెత్తెను. ఇట్లు చేయుట యుదంకుని గురుహిత కార్య దురంధరత్వమే. ఆచమనమును ఈ మధ్యలో విడిచినందువలన వచ్చిన పాపము సంగతి యట్లుంచి కుండలములను తిరిగి స్వాధీనము చేసికొనుట ప్రధాన విషయము. తనకు అఘ పంకక్షాళన మహా

తపస్సలిల మున్నది. గావున పాపము ను బోగొట్టు గొనవగును. చిక్కు లేదు.

తక్షకుఁడెవరు ? వాఁడెట్లుండును ? వాఁడొక సర్పరాజు. మాయావి. కద్రూ కశ్యపుల సంతానము. నగ్నరూపము ధరించి యుండువాఁడు. నగ్నత యనఁగా దిగంబరత్వము. సిగ్గులేని తనము. వాఁడొక వేషమును ధరించియుండును. ఉండఁడు. అది యితరులకుఁ గానరాదు. వాఁడు కృశింపఁగలఁడు. సార్థకమయిన పేరున్నవాఁడు.

ఇక్కడ నొక విషయమును చర్చింప వలయును. సంస్కృత క్రియల కెంత భావ, బోధక శక్తి యున్నదో తెలుఁగు క్రియలకును అంతే శక్తి యున్నది. తక్షకుఁడు కుండలముల గొని "ప్రాద్రవత్" అని సంస్కృతము. తక్షకుండు కుండలంబుల గొని "పాఱెను" అని తెలుఁగు భారతము. 'ప్రాద్రవత్' పాఱుటయను రెండుక్రియలు భావ స్ఫోటయందు సమానమగు శక్తిమంతవే. ప్రాద్రవత్ అనినను పాఱుట యనినను నీరు వలె జాఱిపోవుట యను నర్థము నిచ్చును తక్షకుఁడు పరిగెత్తుట యందలి వేగాతి శయమును సూచించును.

ఉదంకుఁడు వాని (తక్షకుని) వెఱుందన పాఱి పట్టుకొనినాఁడు.

కం॥ "కడిచి దిగంబర వేషము
విడువక మణి కుండలములు విషధరపతియే
ర్పడ నిజరూపముతో న
ప్పుడ యిహిలోకమున కరిగె భూవివరమునన్"

ఈ పద్యమునందు "విడిచి" యను క్రియను రెండు విధముల నన్వయింప వచ్చును. ఉదంకుఁడు తన్ను (తక్షకుని) పట్టుకొనుఁడు వానిని "విడిచె" నాఁడని యొకటి. దిగంబర వేషమును విడిచినాఁడని రెండవది. ఇట్టి క్రియాన్వయ గత చమత్కారము వలన రచన కొక సొగసు వచ్చినది.

తక్షకుఁడు విషధర పతిగావున స్వస్వరూపముతో [పాము] బలముద్వారా నాగలోకమునకుఁ బాఱి పోయెను. వాఁడు సర్పము

గావున తన శరీరమును గృశింపఁ జేయఁగలఁడు. సూక్ష్మమయిన శరీరముతోఁ బాతాళమును జేరఁగలఁడు. ఉదంకుఁడెట్లు చేయఁ గలఁడు ? ఆయన శరీరము స్థూలమయినది గదా !

''తక్షకుండును వాని తోడన తగిలి యవ్వివరంబున నురగ లోకంబున కరిఁగి''నాఁడు. అతి సూక్ష్మశరీరముగల తక్షకుఁడు మాత్రమే ప్రవేశింపఁగల రంధ్రమార్గముననే యుదంకుఁడు పాతాళ లోకము నెట్లు చేరఁ గల్గినాఁడు ? అట్లు చేరఁగల శక్తి యుదంకున కున్నదా ? ఉన్నది. ఉన్నదని ఎట్లు తెలిసినది ? నన్నయ్యగారు చెప్పిరి. వ్యాసుఁడు చెప్పలేదు. ఉదంకుఁడు,

''గురు కులము నందు గురులకుఁ
బరిచర్య లొనర్చి తానపరిమిత నిష్ఠా
పరుఁడై జ్ఞానము వడసెను
గురు దయ నణిమాది కాష్ట గుణముల తోడన్''.

అణిమాది (శరీరము సూక్ష్మముగాఁ జేయఁగలశక్తి) సిద్ధులను ఉదంకుఁడు ఏనాఁడో నేర్చికొని యున్నాఁడని యుదంకుని కథా ప్రారంభమున నన్నయ్య వ్రాసిరి. అణిమాది సిద్ధులుదంకునికిఁ దెలియునన్న విషయమును వ్యాసుఁడు చెప్పలేదు.

తక్షకుఁడు జారిపోవుచున్నాఁడు. వాని ''తోడన తగిలి'' యుదంకుఁడును జారిపోవుచున్నాడు. తగిలి యను క్రియ బహువిలక్షణ మయిన యర్థములో వాడఁబడినది. తగులు అనఁగా చిక్కు, పట్టు, తాకు, అనుమూఁడర్థము లున్నవి. ఈ మూఁడర్థములను అన్వయింప వచ్చును. ఉదంకునకు దక్షకుఁడు చిక్కెను. నునుపు దేలిన శరీరము గల తక్షకుని జారకుండ పట్టుట చాల కష్టము. కాని యుదంకుఁడు వానిని విడువక పట్టుకొనెను. వెఱపులేని బుద్ధిగల యుదంకుఁడు పాతాళమును బ్రవేశించు విషయము నాలోచింపలేదు. ఆలోచించుచుఁ గూర్చున్నచోఁ దక్షకుఁడు జారిపోగలఁడు. అనాతంకమతి

యగు నురదకుఁడు అణిమయను విద్య నుపయోగించి బిలప్రవేశము చేసెను.

ఉదంకుఁడు స్వశక్తి యుక్తులతోఁ బాతాళము ప్రవేశించినట్లు నన్నయ్య వర్ణించిరి. వ్యాసుని కథనము భిన్నముగా నున్నది. "అథ ఉదంకః తస్యాః క్షత్రియాయాః వచః స్మృత్వా త్వం తక్షక మన్వగచ్ఛత్ । స తద్బిలం దండకాష్ఠేన చఖాన, నచా శకత్ తం క్లిశ్యమాన మింద్రోఽపశ్యత్, స వజ్రం ప్రేషయామాస, గచ్ఛ అద్య బ్రాహ్మణస్య సాహాయ్యం కురుష్వ ఇతి......అథ వజ్రం దండకాష్ఠ మను ప్రవిశ్య తద్బిల మదారయత్......" పౌష్యుని రాణి తనకుఁ జేసిన హెచ్చరికను తలఁచుకొనుట, ఉదంకుఁడు కఱ్ఱతో బిలము త్రవ్వుపని కష్టముగా నుండుట, ఇంద్రుఁడు సాహాయ్యమునకై తన వజ్రమును బంపుట, ఆ వజ్రము దండకాష్ఠమున బ్రవేశించి బిలము నుజేసి యుదంకునకుఁ దోడ్పడుట'- యీ పనులన్నియు జరుగుటకుఁ గాల విలంబన మెంతయో జరుగును. ఉదంకునకుఁ దక్షకుఁడు చేజారి పోవును. బిలము త్రవ్వి యందుదంకుఁడు ప్రవేశించుట యనఁగా దక్షకుఁడు అందడని చెప్పుటయే.

ఒక చిన్న విషయమును జెప్పి పై సందేహముల నన్నింటిని నన్నయ్యగారు అద్భుతముగా పటాపంచలు చేసిరి. ఉదంకుఁడు బిలము త్రవ్వలేదు. తక్షకుఁడు రంధ్ర ప్రవేశముచేసినంతటనే యుదంకుఁడు తన నేర్చిన విద్యయొక్క సద్యస్స్ఫురణ చేత తాను సూక్ష్మ శరీరుఁడయినాఁడు. ఇది యణిమ యను విద్య. ఈ విద్య గురుకులమున చిన్నానాఁడే యుదంకుఁడు నేర్చెనని నన్నయ్య చెప్పిరి.

ఉదంకుఁడు నాగలోకము ప్రవేశించెను. అతఁడు చేసిన సర్పస్తోత్రము, వేదము నందలి ఋక్కులవలె భాసించుచున్నది. అనంతుఁడు, వాసుకి, ఐరావతము, తక్షకాదులు ప్రశంసింపఁబడిరి. నాగలోకము తనకుఁ గ్రొత్తది. ఎవరెట్టివారో తెలియనిదికాదు. వారిలోని గుణములనే పెద్దవిచేసి వర్ణించుట యుదంకుని గడుసుదనము మఱియు లోకజ్ఞత.

చం॥ "బహువన పాదపాబ్ధి కుల పర్వత పూర్ణ సరస్సరస్వతీ
సహిత మహా మహీభర మజస్ర సహస్ర ఫణాళిదాల్చి దు
స్సహతర మూర్తికిన్ జలధి శాయికిఁ బాయక శయ్యయైన యా
య్యహిపతి దుష్కృతాంతకుఁ డనంతుఁడు మాకు
ప్రసన్నుఁడయ్యెడున్"

చం॥ ... ... ... అద్రినందనే
శ్వరునకు భూషణంబయిన వాసుకి మాకుఁ బ్రసన్నుఁడయ్యెడున్

చం॥ ... ... ... మహానుభావులై
రావతకోటి ఘోరఫణిరాజులు మాకు బ్రసన్నులయ్యెడున్"

ఉ॥ ... ... ... ఈక్షణ
శ్రోత్రవిభుండు తక్షకుఁడుశూరుఁడుమాకుఁబ్రసన్నుఁడయ్యెడున్"

ఈ ప్రశంస లన్నియుఁ గార్య సాధనకుఁ జేయఁబడినవే. మన సార భక్తితోఁ జేసినవి గావు. ఉదంకుని మనస్సులో సర్పములపై నాగ్రహము పొంగి పోవుచుండఁగా వారిని గీర్తించునా? లోకము తనకు గ్రొత్తది యగుటఁజేత నుదంకుఁడిట్లు ప్రవర్తింపవలసివచ్చినది. అవకాశము వచ్చెనా పాముల యంతు తేల్చగలఁడు. ఇంతలో నొకా నొకదివ్యపురుషుఁడు కన్పడి వరమువేడుకొమ్మని చెప్పగా నుదంకుఁడేమి చేసెను? తానింతవరకు ఏ నాగకులమును ప్రశంసించెనో ఆ "ఇన్నాగ కులంబెల్ల నాకు వశంబగునట్లు అనుగ్రహింపు"- అని యడిగి యా పైని "నాగలోకంబునకెల్ల మహాక్షోభంబు గావించి"నాఁడు.

లోకజ్ఞత యట్లుండును. సమయోచిత ప్రవర్తన కార్య సాధకుల లక్షణము. అనంతుఁడు విష్ణువును భరించుచున్నాఁడని వాసుకి శివుని కంఠాభరణమని, ఐరావతాదులు శత్రు సంహార క్రియా నిపుణులని యుదంకుఁడు చేసిన ప్రశంసలు యథార్థములే. తక్షకుని గూడ నుదంకుఁడు ప్రశంసించెను. ప్రశంసింపలేదు.

ఉ॥ "గోత్ర మహా మహీధర నికుంజములన్, విపినంబులన్ గురు
క్షేత్రమునన్ బ్రకామగతి ఖేలన నొప్పి సహాశ్వసేనుఁడై
ధాత్రిఁ బరిభ్రమించు బల దర్ప పరాక్రమ దక్షుఁడీక్షణ
శ్రోత్ర విభుండు తక్షకుఁడు శూరుఁడు మాకుఁ బ్రసన్నుఁడయ్యెడున్"

పర్వతములపై, అరణ్యములలో నిష్టము వచ్చినట్లు తిరుగును. భూమిమీదఁ బరిభ్రమించుచుండును. ఇతనికి చూచునట్టి కన్నులే చెవులు. ఇటువంటి తక్షకుఁడు శూరుఁడు. తనను మోసగించి కుండలములను దొంగిలించిన తక్షకుని శూరుఁడని యనుట వాఁడు పిరికి వాఁడని చెప్పుటయే. తక్షకుఁడు అవయవ సంపూర్తి లేనివాఁడు. వానికిఁ గన్నులే చెవులు. అనంతుఁడు, వాసుకి మొదలగు వారికి నిట్లే యుండును. కాని వారినిగూర్చి యుదంకుఁడేమాటలు చెప్పలేదు. వారిపై నుదంకునకుఁ గోపము లేదు.

వెదకినప్పటికిని దక్షకుఁడు కానరాలేదు. ఇంతలో "ఆర్వురు కుమారులు, ఇద్దఱు స్త్రీలు "మరియు" అతి ప్రమాణ తురంగంబు నెక్కినవాని మహాతేజస్వి నొక్క దివ్యపురుషుంగని విపులార్థవంతంబులైన మంత్రంబుల నతి భక్తి యుక్తుండై స్తుతియించి నం బ్రసన్నుండై యద్దివ్య పురుషుం డయ్యుదంకున కిట్లనియె."

నన్నయ్య మంత్రశాస్త్ర వేత్త మరియు మంత్రోపాసకుఁడు. ఆ యీ లక్షణమును దివ్యపురుషుని వృత్తాంతమున దర్శింపవచ్చును. అతి ప్రమాణ తురంగంబు నెక్కిన దివ్యపురుషుఁడే, ఇంద్రుఁడు. ఇంద్రుఁడు దేవతల కధిపతి. దేవతలు తేజశ్శరీరులు. వారు తమ తేజస్సును తమ యిచ్చవచ్చిన రూపముల యందుఁ బ్రదర్శింపఁ గలరు. ఆ రూపములన్నియుఁ దేజోమయములు. ఒక్కొక్క దేవత యొక్కొక్క మంత్రమున కధిష్ఠానమూర్తి. ఆ మంత్రమును దెలిసి యుపాసన చేయుట ద్వారా ఆయుపాసకుఁడు ఆయా దేవతలను ప్రత్యక్షము చేసికొనఁగలఁడు. ఉదంకునకు దివ్యపురుషుఁడు ప్రత్యక్షమయ్యెను. కరచరణాద్యవయవములతోఁ గాక దివ్యమగు తేజోరాశిగా బ్రత్యక్ష

మయ్యెను. ఆ తేజోమయ స్వరూపమును మూర్తి మంతము గావింప వలయును. ఉదంకుఁడు “విపులార్థ మతంబులైన మంత్రములతో” ఆరాధించెను. ఉపాసించెను. ఈ యుపాసనా శక్తిచేత నా దివ్య తేజ మింద్రాకృతి యయ్యెను. ప్రసన్నమగుట యనగా నిట్లుండును. ఆ దివ్యపురుషుఁడుదంకునకు “ప్రసన్నుఁ”డయ్యెనని నన్నయ్య వ్రాయుట లోని రహస్య మింతటిది. ప్రసన్నత యనఁగా నిర్మలముగా ప్రకృష్ట ముగా మనస్సును బొందుట యని యర్థము. క్లిష్టముగా, జటిల ముగా, అస్పష్టముగానున్న యే దేని విషయము మనకుఁ దెలిసినప్పుడు అది ప్రసన్న మయినదని యందుము. తనకుఁ గొంతదూరముగా తేజోమయముగా వెలిఁగి పోవుచున్న యీ రూపము ఉదంకుని మంత్ర శక్తిచేత నొక నిర్మలాకృతి యయినది. ఇదమిత్థమని నిర్ణయింపరాని జాజ్వల్యమానమగు తేజస్సునకు రూపము గల్పించి నిల్పుకొనుటయే ప్రసన్నము చేసికొనుట. ఉదంకుఁడీపని చేసెను. నన్నయ్యగారి కవిత్వమును గూడ యిట్లే ప్రసన్నము చేసికొనవలయును.

ఇది యట్లుంచి దివ్యపురుషుఁ డుదంకునకు ప్రత్యక్షమయ్యెను. ఇక్కడ మరల చిక్కు వచ్చినది. పూర్వము తనచేత వృషభ గోమయమును భక్షింపఁ జేసినవాఁడే యీ దివ్యపురుషుఁడు. అసలే నాగులపై ఆగ్రహము నొందిన యుదంకుఁడు, దివ్యపురుషునిపై విరుచుకు పడవలయును. దివ్యపురుషునికి నుదంకుని స్వభావము తెలియును. ఉదంకుని కంటె ముందే దివ్యపురుషుఁడు మాట్లాడు చున్నాఁడు.

“మిత వచన నీ యదార్థ
స్తుతుల కతి ప్రీత మానసుఁడనైతి ననిం
దితచరిత నీకు నభివాం
ఛిత మెయ్యది దానిఁ జెపుమ చేయుదుననినన్”

ఉదంకునకు దివ్యపురుషునిపైఁ గోపము చల్లారినది. సామాన్యుఁ యినచోఁ దనకుఁ గుండలములు తెచ్చియిమ్మని యడిగి యుండెడి

వాఁడు. ఉదంకుఁడిట్లు అడుగలేదు. భవిష్యద్భారత కథా బీజముగా మాట్లాడెను. తనకు—

"నాగ కులంబెల్ల వశంబగు నట్లను గ్రహింపుము" అని దివ్య పురుషుని వేడెను. తక్షకుఁడు చేసిన యపకారమునకు నాగకులము నెల్ల దహింప వలయునని యుదంకుని పట్టుదల. ఇందుకు దివ్యపురుషుఁడంగీకరించెను. తానెక్కి వచ్చిన "అశ్వ కర్ణ రంధ్రాధ్మానము" చేయుమని యుదంకునకు సూచించెను. ఉదంకుఁడా గుఱ్ఱము చెవిలో నూదెను. చెవిలో నూదుట యనఁగా రహస్యముగా చెప్పుట యనియుఁ జెప్పవచ్చును. ఉదంకుడు గుఱ్ఱము చెవిలో నూదగా పాతాళ లోక మల్లకల్లోలమయ్యెను.

"పాతాళైక నికేతనాంతరమునన్ బర్వెన్ దదశ్వాఖిల
స్రోతోమార్గ వినిర్గతోగ్ర దహనార్చుల్ పన్నగ వ్రాతముల్
భీతిల్లెన్ భుజగాధి నాథు మనమున్ భేదిల్లెఁ గల్పాంత సం
జాత ప్రోత్థిత బాడబానల శిఖా శంకాధికా తంకమై"

ఆగామి జనమేజేయ సర్పయాగ కథా ప్రపంచమునకిది బీజము. గుఱ్ఱము నుండి పుట్టిన యగ్ని కల్పాంతవేళ సముద్రమున బుట్టిన బాడబాగ్నివలె దహించు చుండఁగా తక్షకుని గుండె పగిలినది. ఆ గుఱ్ఱము నుండి అగ్నిజ్వాల నెవరు పుట్టించిరి? బాడబ మనఁగా నేమి? సముద్రమున బుట్టిన నగ్నిని బాడబమందురు. ఇది యశ్వ ముఖాకారమై యుండును. మఱియు బాడబుఁడనఁగా బ్రాహ్మణుఁడు ఇది బాడబాగ్ని. గుఱ్ఱమునుండి పుట్టిన యగ్ని. ఆ యగ్నిని బాడబుఁడు (బ్రాహ్మణుఁడైన యుదంకుఁడు) పుట్టించెను. "బాడబాగ్ని రినాత్మప్తో బాడబః".

శబ్దశాసనుఁడైన నన్నయ్య ప్రయోగము లిట్లుండును. తాను చూచుచున్న యగ్నికిఁ గారణ ముదంకుడేనని, ఆయన యాగ్రహామే నని గుర్తించెను. భయపడెను. బాడబాగ్ని యనుటచేత బ్రాహ్మణుని వల్ల పుట్టిన కోపమని భావము.

"శంకర నిభుఁడగు విప్రు భ
యంకర కోపాగ్ని యెక్కొ— యనుచును జాతా
తం కుండయి కుండలములు
దంకునకును దెచ్చియిచ్చెఁ దక్షకుఁ డంతన్!"

శంకరుఁడనఁగా సుఖము గల్గించువాఁడు. శివుఁడు. ఉదంకుఁడిట్టి వాఁడు. ఆగ్రహించినచో శివుఁడు కంటినుండి మంటలు పుట్టింపఁ గలఁడు. అనుగ్రహించినచో శుభములు కల్గింపఁజేయను గలఁడు.

తక్షకుఁడు కుండలములను తిరిగియిచ్చెను. దివ్యపురుషుని అనుగ్రహముతో నుదంకుఁడు అతివేగముగా గురువు నింటికి వచ్చెను. తన గురుపత్ని "తదానీత రత్నకుండల భూషితయై బ్రాహ్మణాంం బూజించినది." ఈ సందర్భమున గురుపత్ని యుదంకునితోఁ బలికిన మాటలను వ్యాసుఁడిట్లు వ్రాసెను.

"అనాగతో౽సి యది ముహూర్తం మయాశప్తో భవిష్యః" (సమయమునకు నీవు రాకుండినచో నేను నిన్ను శపించి యుండెడిదానను. దగ్గరలోనున్న పౌష్యు నింటికి వెళ్ళి తిరిగి వచ్చుటకింత యాలస్య మేల జరిగినదో తెలిసికొనకుండ, గురుపత్ని యుదంకునిపై నాగ్రహించుట చిత్రముగా నున్నది. గురువుగారయిన పైలుఁడేమియును మాట్లాడలేదు. అణిమాది సిద్ధులు తెలిసిన యుదంకుఁడు ఆలస్యమేల చేసెనో గురువునకు గూడ సందేహముగానే యున్నది. కుండలములను దెచ్చినప్పటినుండి యుదంకుని ముఖమునందుఁ గోపము గూఢముగా నుండుటను గూడ గురువు గుర్తించెను. ఒకనాఁడు దంకునితో నిట్లనెను.

కం॥ "ఈ యున్న పౌష్యు పోలికిఁ
బోయి కడుం బెద్ద దవ్వు పోయిన యట్లు
త్యాయత విమల తపోమహి
మా ! యిన్ని దినంబులేల మసలితి చెపుమా".

ఉదంకునికి గురువయిన పైలుఁడు గొప్ప యూహాశాలి. తన శిష్యునికిఁ గోపం వచ్చెనని పైలుఁడు గ్రహించెను. తనకుఁ గోపము వచ్చిన విషయము గురువునకుఁ దెలిసినదని యుదంకుఁడు గ్రహించెను గురువు శిష్యునితో నిట్లనియెను.

"ఇన్ని దినంబులేల మసలితి చెప్పుమా" మసలుట యనఁగా ఆలస్యము చేయుట యని యొక అర్థము. మసలుట యనఁగా సలసలఁ గ్రాఁగుట యని మరియొక యర్థము. ఉదంకుఁడు కుండలములను తెచ్చుటలో ఆలస్యము చేయుటను, ఆనాటినుండి యతని మొగములో ఏదో సలసల గ్రాగుచున్న వైఖరిని గురువు గమనించెను. ఇన్నాళ్ళేల యాలసించితివని పైకి అర్థము వచ్చునట్లు, ఇన్నాళ్ళనుండి యాగ్రహించుచున్నావేమని, గూఢముగా నర్థము వచ్చునట్లు ప్రశ్నించెను. మసలు అనుక్రియ యింత విపులార్థము పుట్టించినది. గురువు ప్రశ్నకుఁ దగినట్లే యుదంకుఁడు సమాధానము నిచ్చెను. మీ యానతిచ్చినట్లు మసలవలదు, తక్షకుండను దుష్టోరగంబుచేసిన విఘ్నంబున నింత మసల వలసె" ఉదంకుఁడు కూడ గురువువలెనే మసలు అనుక్రియ వాడెను. మీ యానతిచ్చినట్లు మసల (ఆలసింప) వలదు. తక్షకుండను దుష్టోరగంబు సేసిన విఘ్నంబున నింత మసల (ఆగ్రహింప) వలసె.

ఉదంకుఁడు ఋషి. ఆయనకు సర్పజాతిపైఁ గోపమువచ్చెను. కోపము వచ్చినట్లు కనబడెను. సర్ప ప్రళయమునకుఁ దానై పూనుకోవలయును. ఆ యీ విషయములనెల్ల ద్రష్టయగు నుదంకుఁడు తెలిసికొని యున్నాఁడు. పైలుఁడు కూడా తెలిసికొనియున్నాఁడు. శిష్యుఁడు పొందిన ఆగ్రహామునందలి యౌచితిని గురువు మన్నించెను. లేనిచో ఏ గురువు శిష్యుని ఆగ్రహాము నంగీకరించును.

"కర నిష్టము సేసితి మా
కరిసూదన ! దీన నీకు నగు సత్ఫలముల్
గురుకార్య నిరతులగు సత్
పురుషుల కగుటరుదె యధిక పుణ్యఫలంబుల్"

పైలుఁ డుదంకునిఁ జూచి "అరి సూదన" (శత్రువులను సంహారించువాఁడా) యని సంబోధించెను. ఇది కేవల సంబోధనకాదు. శత్రుసంహారమే చేయుమని పురికొల్పుటయే. ఈ విధముగా గుర్వాజ్ఞ యయినది. ఉదంకుఁడు మునివరుఁడు కాకపోలేదు. గురు ఋణ విముక్తుఁడయిన యుదంకుఁడు "అనేక కాలంబు తపంబు సేసె" మఱియు "తక్షకు చేసిన యపకార బునకుం బ్రతీకారంబు సేయదలంచి జనమే జేయు పాలికిం బోయిఁనాఁడు. తపముచేయుట ముని లక్షణము. శత్రు కృతావమానమునకుఁ బ్రతీకారము చేయుట వీరుని లక్షణము. ముని వరునకీ వీరత్వ మెందుకు ? గురువుకూడా దీనిని అంగీకరించుట యేమి ?

ఇది ఋషి చరిత్ర. ఈసృష్టి కర్మానుభవమునకై యేర్పడినది. ఏ జీవుఁడు ఏ కర్మ నాచరించుటకు, ఏ కాలమున పుట్టునో ఋషు లెఱుఁగుదురు. వారు బ్రహ్మజ్ఞానులు, వారికిఁ గోప తాపములుఁడవు. కోపాగ్రహముల నభినయింతురు. వారు ప్రతి విషయమును "లోనారసి" చూచుచుందురు. వారికి సృష్టి యొక్క పరమార్థము ప్రసన్నమగును. సర్పయాగము జరుగునని యుదంకునకుఁ దెలియును. తానందుఁ బ్రముఖ పాత్రధారి కావలయును. పాముఁను అకాండ తాండవము చేయవలయును. పాములు తన కేమి యపకారము చేసెను? కుండలములను దెచ్చినపుడు తక్షకుఁడు తనను మోసగించెను. ఈ యపకారము నిమిత్త మాత్రము. నాగకులమునెల్ల అగ్నిలో వేయుట కుదంకుఁడు సంకల్పించెను. భగవంతుని యొక్క సృష్టి దను నిర్వర్తింపవలసిన పనిని ఋషియగు నుదంకుఁడు నిర్వహించుచున్నాఁడు. జనమే జేయునికి సర్పయాగ బుద్ధి పుట్టించినను ఉదంకుఁడు మునివరుఁడే. పంకజ భవ సన్నిభుఁడే, శంకర నిభుఁడే. నారాయణాస్వరూపుఁడగు వ్యాసునిశిష్యుఁడగు పైలునిశిష్యుఁడగుటచే విష్ణుస్వరూపుఁడే త్రిమూర్త్యాత్మకత మయినవాఁడు. అందుకే పౌష్యుని రాణి యుదంకుని "రవినిభ తేజా" అని ప్రశంసించినది.

వ్యాసముని ప్రణీత పరమార్థమును, అజ్ఞాసన కల్పుఁడగు ఋషి వంటి నన్నయ్య యీవిధముగా ఉదంకుని ఋషాత్మ్యను ఆవిష్కరించిరి.

భారతి. సెప్టెంబరు : 1983

—ఐ—

# దుష్యంతోపాఖ్యానము : నన్నయ

— శ్రీ యడవల్లి ఆదినారాయణ

మొన్న జూన్ భారతిలో కలగూరగంపలో పడిన మిత్రశ్రీ కొడవంటి శంకర నరసింహ బ్రహ్మంగారి విమర్శకు సమాధానము :

భారతమున ప్రకరణమును బట్టి యిచ్చట భరతవంశాను క్రమణిక వర్ణ్యము. కాన దీనిని దుష్యంతోపాఖ్యానమనుట లెస్స. శకుంతలోపాఖ్యానము కాదు. వర్ణ్యభాగము నే దృక్పథమున కవి రచించెనో యీ నామము పాఠకులకు చూపును. ఆ దృక్పథమున చూచిన నే కవిహృదయము సమగ్రముగ నవగాహనము కాగలదు.

మిత్రశ్రీ బ్రహ్మంగారి విమర్శకు సమాధాన ప్రసక్తిలేకుండెడిదే. కాని వారు అచ్చటచ్చట రసికలోకమును, విమర్శక లోకమును, విజ్ఞలోకమును తమ విమర్శనకు అనగా నన్నయ అనవధాన రచనకు వారు చూపిన నిదర్శనములకు నిర్ణయములకు నిర్ణాయకులుగా చేసియున్నారు కనుక తప్పనిసరియైనది.

నన్నయను కొందఱు ఆదికవి యనిరి. ఏ దుర్ముహూర్తమున నెంత సహృదయముతో ననిరో తదాది శిఖపట్ల గోత్రమే. పోనిండు, అతనికి ముందున్న కవి ఫలాన యని నిర్ధారింపబడినదా యనిన దానిని మన విమర్శకులే చేసినట్లు తోషద, అట్టిపట్టున నావద్ద వచ్చువరకైన నన్నయ నాదికవి యనుట అపాయకరమేమో. విష్వాక్షీకులైన విమర్శకులే యోజింపవలె. ఆదికవి నని తా ననలేదు. అసలు భారతము మొదట తాను రచించుచుండెనని యనక ప్రథమ పురుషలో నన్నయ యనువా డుండె ఆతడు రచించుచుండెననెను. అట్టి నిరహంకార మూర్తిని ఆదికవి యన్న నేమి? చివరకవి యన్న నేమి? అసలు కవి యనకున్న నేమి? బాధ లేదు, కాని 'ఆదికవి' పేరుపెట్టిన మాత్రనే తద్భావ సామ్యముతో ఆదికవి వాల్మీకి తోడను, వ్యాసునితోడను పోల్చరా నన్నయ్యను?

'వ్యాసునికి మెఱుగులుదిద్దె నన్నయ' యన్నదానిలో వ్యాసునిపై గౌరవభావమా బాధించునది. నన్నయపై నీర్ష్యయా? 'వ్యాసో నారాయణోహరిః' అను దృష్టిలో పూజ్యభావమున నా మహర్షి శ్రేష్ఠుని గ్రంథమును నోటపట్టు నర్హత మనకు లేదని చేతులు కట్టుకొని మోకరించుట నాకు పరమసమ్మతమే. వ్యాస వాల్మీకులు మనకు తేరి చూడరానివారు. మన విమర్శకు లీ భావము పడిరేమో యన్న 'పితా - దుహితా' శబ్దవిచారణ చేయుపట్టుల 'మూలభారతమునకు కాళిదాసుగారు మెరుగులు తీర్చినార'నిరి. కావున వ్యాస భగవానుని నితరకవులతో పోల్చి తక్కువ పరచుట వారికి సమ్మతమే యనిపించుచున్నది. అప్పుడు నన్నయ దిద్దె నన్న విప్రతిపత్తి యేమి, నిజముగ మెఱుగులున్నచో? వ్యాసులు, సమీచీనులై నన్నయ కాకపోయెనా తెలుగువారికి? నిష్పాక్షికత్వ సత్యాన్వేషప్రవణతలు, సహృదయత, స్వాభిమానరహితతలు ఏతద్విషయ తత్త్వైకనిర్ణయదీక్షకత్యావశ్యకములు.

తెలుగుకవులు యథామూల పరివర్తనమునుగాక యనౌచిత్యము పరిహరించి రసోచిత కథోన్నయనము చేసిరనిరి. దీనికిముందు 'వ్యాసుని శకుంతలోపాఖ్యానమున లోపములున్నవనియు, నన్నయ మెరుగులిడెననియు మొదటి విమర్శకులు వ్రాసిరని బ్రహ్మంగారు రచించుటలో వ్యాసునిలో లోపములులేవని భావించినట్లు స్పష్టము. లోపములున్న నే కదా, తెలుగు కవులు అనౌచిత్యము పరిహరించుట, ఈలోపము లేకుండుట యొక్క శకుంతలోపాఖ్యానమున నేనా యావద్భారతమున కూడనా? అయిన తిక్కనాదులు వ్యాసునికి 'మెరుగులు పెట్టి'రను లోకాభిప్రాయ మసంబద్ధమా? అట్లుగాక నన్నయానూదిత వ్యాసభాగములలో తక్క మిగిలినవానిలో లోపములున్నవా?

తరువాత శ్రీనాథుడు నైషధాంధ్రీ కరణాంతశపథ వాక్యముల సత్యత వమర్శకులు విరిశీలించి చూచిరా? -

మహాభారతబద్ధ నిరూపితార్థమునే రచనా రచనా కౌశలమున వ్యంగ్యవైభవము మెఱయ గోరంత వాచ్యముచేసి కొండంత ధ్వనింప చేయగూడదా? ఇది దురూహ్యమా? నిజమే, పాపము. లేకున్న నన్నయాంధ్రీకరణ మనవధానముగా కన్పట్టునా? ఆతని రచనాశిల్ప సుందరి యూహకును సులభముగా నందదు. ఆతడే చెప్పెనుగదా! "సారమతిమై కవీంద్రుడైనవానికే తత్ప్రసన్నకథా కలితార్థయుక్తి లోనారయు నేర్పు కల్గుననియు, అటుల లోనారసినగాని మేలన జాలడనియు"", కావున సామాన్యులకు దురూహ్యమే. అతని రచన ప్రత్యక్షర వ్యంగ్యవైభవ విభాసితము.

వ్యాసభగవానునికి భారతాంధ్రీకరణము కర్తవ్యమైయుండగా కాళిదాసు శాకుంతల గాథ యేల? భారత గాథయేల? నన్నయ క్రొత్త గ్రంథమును వ్రాయుచూనుచుండెనా? లేక వ్యాసుని కథాభాగమును దిద్దతలచుకొనెనా? లేదే. ఏ కవి రచనాశిల్పము వానిదే! ఏ కథా కథన మార్గము దానిదే. నన్నయ పూర్ణముగ వ్యాస హృదయము నెరిగి యనువదింప బూనుకొనెను. గాని యనవధానముగ గాని మూలము నందలి యమూల్యార్థము నెరుగక గాని తన భారతాంధ్రీ కరణము చేయలేదు.

విమర్శకులు నన్నయ యనవధానరచన కుదాహరించినవి చూడుడు. ప్రాదుర్భావాత్మకములైన ఆత్మజ - జనక శబ్దముల వాడుట - రక్షణ, పోషణార్థకములైన పితా దుహితా శబ్దములు మూలమున కడునుచితములుగ వాడబడగా వానిని వీడుట - ఇందలి సామంజస్యము పరిశీలితము. దుహిత యనగా పెంపబడినది. పిత యనగా రక్షకుడు అనిరి. కణ్వుని దుహితననియు కణ్వుడు నా పిత యనియు శకుంతల మూలమున చెప్పినది. అనగా కణ్వునిచే పెంచ బడితిని, కణ్వుడు నన్ను రక్షించెను, అని. "శరీర సంరక్షణా దిభిః తాత కాశ్యపో అస్యాః పితా"- కాళిదాసు. వీనిని సఖి పలుకును. కాని నన్నయ శకుంతల కణ్వుని 'ఆత్మజ'ను కణ్వుడు నా 'జనకుడు'

అన్నది- వ్యాస శకుంతలకు కణ్వుడు పాలన పోషణకర్తగనే భావన. నన్నయ శకుంతలకు కన్నతండ్రిగ - ఏది యుత్కృష్టమో చూడుడు- కన్నతండ్రి భావనలేనిచో శాకుంతలమున నాల్గవ యంక స్వారస్య మేమున్నది ? ఈ కన్నతండ్రి భావన కణునికున్న లోపమే— జితేంద్రియు డగుటచే - ఆత్మజ, జనకశబ్దములు కణ్వుడు వాడినను కవి వాడినను దోసమే కాని శకుంతల వాడుట లెస్స కూడ. ఇక కణ్వుని పల్కులు చూడుడు "ఏము దీనికి భయత్రాతల మగుటచే గురులము. (ఇది పితాశబ్దార్థమే.) ఇదియు మాచే నభివర్ధి యగుటచే (దుహితాశబ్దార్థము) మాకు హృదయానందినియైన కూతురు, ఇట్లు పితా, దుహితాశబ్దార్థముల యౌచితి నెరిగియే మెరుగులు తీర్చి పై రచన చేసియుండ వానిని పీడెననియు ననవధానరచన యనియు ననుట సమంజసము కాదు. కాక శకుంతలకు కణ్వు డుభయత్రాతగనే సం బంధము. ఇది ఆహింసా భూతదయలు పారముగన్న జితేంద్రియుని భావనారీతి. భయత్రాణన మనగా - ఆపద్భయము నుండియు, భవభయమునుండియు నని తెలియదగును. కాననే గురువుల మనెను. విశ్వామిత్రునకు శకుంతల తనుజ, కణ్వునకు ఆత్మజ, కణ్వాశ్రమసంవ ర్ధన విశేషమున నామె భవభయ విమోచన మందినది. అందుచే భయత్రాతలమగు గురువుల మనుట లెస్స ఇక శరీర సంవర్ధనమున కర్త్రర్థకము వాడక ప్రేరణార్థకము వాడుట. ("మాచే నభివర్ధిత"- అనగా మాప్రేరణచే ఆశ్రమస్థులు పెంచిరని యర్థము,) శ్లాఘా పాత్రము. ఇది యిట్లుండ మూలముననున్న పితా, దుహితాశబ్దము లనే వాడిన కాళిదాసు మూలమునకు మెరుగెట్లు పెట్టునో తెలియదు. అట్లయిన నన్నయ వీరికి వృరికిని మెరుగిడె ననవచ్చునా !

రెండవది - మేనకా విశ్వామిత్ర ఘట్టమును శకుంతల చెప్ప టలో గల యనౌచిత్యము, మూలమున మాత్రము మేనకా విశ్వా మిత్రుల కూతుననియే చెప్పింపక "గాలికి గుడ్డ జారిపోగా మేనక దిగంబరయై సిగ్గుతో భూమికిదిగి విశ్వామిత్రు ముందరకు వచ్చినది'

మొదలగు తలిదండ్రుల కామగాథను శకుంతలచే చెప్పింప నేల ? ఇదిమాత్ర మప్రస్తుతముకాదా? అయినచో మహర్షులట్లేల వ్రాయుదురు? ఏదో ప్రయోజన ముండవలెను. చూడుడు, ఈ గాథను చెప్పునది కణ్వుడు; అదియు మరొక మహర్షితో నాతడు శకుంతల జన్మ క్రమమడుగగా చెప్పును. కణ్వుని కూతురన్న నెంత యబ్బురమును సంశయమునో, మేనకా విశ్వామిత్రుల తనుజ యన్న నంతియే. అందుకే మరల సందేహములు ప్రశ్నలు పుట్టకుండునట్లు, మహానిష్ఠా గరిష్ఠుడై ఘోరతపము చేయు విశ్వామిత్రుడు మేనక వలలో పడుటకు సన్నివేశమేమో వ్యాసుడు కణ్వుని ముఖమున వర్ణింపించెను. అచ్చట నవసరము కాన చెప్పియుండవచ్చును. శకుంతల కేల ? అనిన నిచ్చటను దుష్యంతుడు మరింత సందేహాస్పదు డగును. అదియుగాక తన తండ్రి వచ్చుదనుక దుష్యంతుడు తన కతిథి గాన నాతనితో మాట్లాడుచుండవలె. అప్రస్తుతమును, రసభంగకరమును నైన విషయము పనికిరాదుకదా. అదియు గాక ఆత్మకథ చెప్పుచున్నది. ఎంత యుత్సాహముండును. అసలు దుష్యంతుని జూచిన ప్రథమ క్షణమునుండియు నేలొకో యాతనిపై ప్రీతి జనించినది. ఆతనితో నెంత మాట్లాడినను ప్రియముగనే యుండెను. ఇది సహజము. కావున మూలకథారహస్యము చెడకుండ నీ ఘట్టమును పొందు చెడకుండ నమితము గాకుండ చక్కగా నన్నయ రచించెను. ఇందు వర్ణితమైన మనకా విశ్వమిత్ర ఘట్టమునందలి శృంగారము అంగియగు శకుంతలా దుష్యంత శృంగారమునకు ఉద్దీపన విభావము. కణ్వాశ్రమస్థ యగుటచే శకుంతలయు నామె నిరుపమాన సౌందర్యమును తనకు బాధావహ మగుచున్నదే గాని ఉత్సాహజనకమైన ముందడుగు సాగించుటలేదు. శకుంతలా దుష్యంత ప్రణయగాథకు నిరోధక వాతావరణమే యెక్కుడున్నదిగాని ఉద్దీపక సామగ్రి కన్పింపదు. అందుచే రసపోషణ దృష్టిలో నన్నయ, మూలకర్త విగతవస్త్రను చేయుట కంగీకరించిన మేనకారూపమునే జుగుప్సాకరము కాకుండ సావయవముగా నొందు

రెండు మాటలలో వర్ణించెను. తనదృష్టి కవికి ముఖ్యతమము. ఈ పల్కుల శకుంతల ముద్దరాలితనమును, తండ్రి దోసము లేల చెప్పునను నమ్మికయు స్పష్టములు. అందును తండ్రీ తానై చెప్పినట్లు పల్కించి నాడు కవి. "అయ్యో పరపురుషుడే" అన్న దోసము పరపురుషుడే యైనచో కవి జాగ్రత వహించువాడే. కాబోవు భర్త కనుకను, మించి తా నాతనితో మరిమరి మటాడ నిచ్చగలది కనుకను, కవి యుచితమే యని చేసినాడు. అంతియేకాని యిది కవి యనవధానత మాత్రము కాదు. ప్రయోజనము నుద్దేశించియే వాడెను. నేటి మన పరిసరానుభవములతో మన నాగరికతా దృక్పథముతో నాటి యాశ్రమ మర్యాదల జూడగూడదు. వ్యాస శకుంతల తత్త్వము నెఱిగి నన్నయ శకుంతలను పరిశీలింపవలెను. కాళిదాసుని శకుంతల కును వ్యాసుని శకుంతలకును భేద ముండవచ్చును. కాళిదాసు శకుంత లాతత్త్వమున నితిహాస శకుంతలను జూడరాదు. అట్లని యనుచిత మున్నదని తలపకుడు. నాటి యాశ్రమపరిస్థితులనుబట్టి వ్యాస శకుం తలా పాత్ర చిత్రణము జరిగినది. దానికి తూచ తప్పక నన్నయ తన శకుంతల రూపు రేఖల దిద్దెను.

ఇక అవినయార్థస్ఫోరకమునబడిన "అతి రుచిరాగతుండయిన . . . . ." అను పద్యవిషయము. ఈ పద్యము ఈ భాగములో నున్న శిల్పభూయిష్ఠములైన పద్దెములలో నొకటి. భావిశకుంతలా దుష్యంత వివాహసూచకమును, పృథ్వీభర్తకు లతాలలనలు సేసలు పెట్టుట భావి శుభాకాంక్షతో చేయు బహుమానవిశేషమును సంప్రదాయ స్ఫోరకమునుగా వర్ణింపబడిన దిందు. పెండ్లి కుమారునికి దీవనలతో సేసలుపెట్టుటకు ముత్తైదువలు తగరా? ఇది నాగరక జనవృత్తమా? ఆశ్రమస్థులు చేయరా? ఇక ఈపద్దెమున నలంకారరచనముచే పెండ్లి కొమరుడైన దుష్యంతు డలంకృతుడౌట సూచితము. ఇట్లు సర్వాంగ సుందరమై ఔచితీపారముగని వ్యంగ్య వైభవమున వెలయుచు భావికథాసూచనచేయు నీపద్దెమవినయార్థస్ఫోరకమెట్లో తెలియదు.

ఇందలి లతాలలనలు నాగరిక స్త్రీజనవృత్తము కంవారలైన కాళిదా సుని నవమాలికాదులెట్టినారు. నవమాలికా వృత్తాంతమును ఆశ్రమ మధ్యముననే యుంచెనే కాళిదాసు. నన్నయ వర్ణించినది తత్తపోవన ముఖభాగమున. ఇక దీనికి మూలమును దానిని విమర్శకు లర్థము చేసికొనిన తీరును చూడుదుము. "మనోరమమైన వనమున దుష్యంతుడు ప్రవేశించెనట. ఆకసమునంటును పుష్పితశాఖలు గల వృక్షములు గాలితాకున విచిత్రమైన పుష్పవృష్టిని మాటిమాటికిని కురియుచు మధురధ్వనులు చేయు పక్షులచే నినదింపజేయబడినవై నవి".— ఇది మూలము - దీనికి విమర్శకుల వ్యాఖ్యానము. శాంతమైన వనమున రాజును తదితరులును ప్రవేశించిరి. వృక్షాగ్రములనున్న పక్షులు బెదరి పై కెగిరిపోయి కూయదొడగినవి. తదుత్పతనవేగమున పక్షి మారుతోచ్చలితమై శాఖలనుండి పూలు రాలినవి ఇది స్వభావ సుందరము, అని, మూలమును విమర్శకుల భావమును పోల్చనచో మూలమును వారు సరిగ చూడలేదేమో అనిపించుచున్నది. మూల భిన్నమైన యర్థమే స్వభావ సుందరమట మూలయుక్తమెంత సుందరమో? - నా సమాధానము : మనోరమమైన యనాశ్రమము అని యుండ శాంతమైనది యనుట తప్పు. రాజు ప్రవేశించెననియుండ రాజును తదితరులు ననుట తగదు. పూలు రాల్చుటను, నినాదము చేయుటయును వృక్షముల మూలముననై యుండ పక్షులు బెదరి పై కెగిరిపోయి కూసినవనియు, ఆ గాలితాకున పూలు రాలెననియు ననుట తగదు. ఇట్టి యమూలకార్థ భావనయే విచారణీయము. మూలమునందలి సౌందర్యము చూడుదము. ఆ వనము రాజు మనస్సును రమింప చేయుచు ముందునకు కొనిపోవుచున్నదనుటకై 'మనోరమమ్' అనెను. ఇది భావిశృంగారగాథ కుపస్కారకము. శాంతము విరోధ కారకము. పునః పునః అనుటచే మాటిమాటికి కావలెనని యర్థము. వ్యసృజంస్తే ద్రుమాః- అనుటలో వృక్షములు కర్తృత్వము వహించి కోరి వదలుచున్నవని యర్థము. అంతియేగాని పక్షుల రెక్కల గాలి

తాఁకున కాదు. అట్లనుట నిష్ప్రయోజనకరమేకాక మూలార్థ సౌందర్యభంజకముకూడ. పక్షుల కూతల మూలమున భావిశుభాకాంక్షలును, మాటిమాటికి పూలను కోరి వదలుచున్నవనుటచే భావి శకుంతలా దుష్యంత వివాహ మంగళాక్షతలును గమ్యమానములు. దీనినే పై పద్దెమున నన్నయ కడు రమ్యముగా చిత్రించెను. మూలార్థ బోధ కలుగక నన్నయ వ్యంగ్య రచనాసంప్రదాయ మెరుగనిచో నిది యవిషయార్థ స్ఫూరకమే యగును. పోనిండు వారి భావనయైన సుందరమా యన్న కాదే. పక్షులు బెదరి పై కెగిరి కూయుట యేల ? బెదరుటకు దుష్యంతుడు హింసకుడా ? కాదు. అదియును గాక కాళిదాసు "విశ్వాసోపగమాదభిన్నగతయః శబ్దం సహన్తే మృగాః" అనుటచే నాశ్రమములోని ప్రాణులు అపాయశంక లేక విశ్వాసము కలుగుటచే చలింపకున్న వనియె. కాక ఆశ్రమజీవుల తత్త్వము నెరిగినచో 'బెదరి' అవి యనరు.

ఇక నన్నయ రచనలోని సౌందర్యము. శకుంతలకు ప్రకృతి కాంతయు, లతాలలనలును బంధుగణము. కాన చెలికత్తె తరపున దుష్యంతుని కాతిథ్యమిచ్చుచున్నదా యనునట్లు ప్రకృతి వర్ణింపబడుట యసహజమా ? అనుచితమా ? పక్షుల మధురధ్వనులకన్న నాడు తుమ్మెదల నినాదము మంజులతరముకదా. కాకను పూలు రాలుటకు కారణము చూపవలెను కదా. ఇక నతిథిసత్కారము కణ్వుని తరపున శకుంతల కెంత యావశ్యకమో తత్తపోవన చరాచరముల కన్నిటికి నంత యవశ్య కర్తవ్యమే. ఇది కణ్వుని యుదాత్తతకును తపోవన సంప్రదాయములకును మెరుగే గాని తరుగు కాదు. కాగా వేటాడి యలసివచ్చు వీరశిఖామణికిని రాబోవు శృంగార గాథకును తగిన మనోరమమై మనోహరమైన వాతావరణమా కూర్చవలసినది, సర్వేంద్రియశమము కూర్చు శాంతసస్ఫోరక వాతావరణమా. అందుచే నన్నయ యున్నంతలో నాయకునకును ప్రకృతి కథకును రసమునకును కావలసిన పరిస్థితుల కల్పింప యత్నించెను.

ఇది ప్రతిభావంతుడైన కవికి తగునో తగదో విజ్ఞులు యోజింపుడు. ఇంత మనోహరార్థ గాంభీర్యములుగల యీ పద్దెమవినయార్థ బోధకముగా కన్పట్టుట విచారకరము.

తరువాత 'తన్మునివల్లభు మందిరమ్మునన్' అన్నది - దీనికి బైటకాదనియా యర్థము. ఈ సప్తమికి లోపల నెక్కడో కూర్చున్నదనియే గ్రహించుట సరసులకు తగదు. ఇంత వ్యంగ్యవైభవముగల పద్యము ఇంత సుకుమారార్థద్యోతకమైనది, తెనుగు సారస్వతమున లేదనుట అత్యుక్తి కాదు. కాళిదాసుని "శాంత మిద మాశ్రమపదం- స్ఫురతి చ బాహుః" అను రెంటికినిగల బలవత్తర విరోధమును, "కుతః ఫలమిహాస్య" యను సందిగ్ధతయు నిందు కలవు. "తన్వీ, పయోజదళాయతాక్షి, సంకుల మిళితాళి నీలపరికుంచిత కోమలకుంతలన్ శకుంతల యను కన్యకన్ గనియె - శుద్ధాంతదుర్లభమైన యీ సౌందర్యఖనిని చూడగా కలిగిన యాశారేఖను, పరమ తపోనిష్ఠా గరిష్ఠుడైన తన్మునివల్లభుమందిరస్థ యగుటచే గల నిరోధకతయు సూచించుటకు వాడబడిన పద్య సౌందర్య నర్థ గాంభీర్యము పాత్రి మనోభావ చిత్రిణ కౌశలమును గమనింపక శకుంతల ఇంట నున్నదా! బయట నున్నదా ? యను ప్రశ్న పరంపరచే కుస్తీపట్టు చాల విచారకరము.

పరబాలికను చూడగనే ప్రత్యంగసౌందర్యైక లగ్నమైనదృష్టి దుష్యంతుని కున్నదా ? ఈ వర్ణన చేసినది కవియా దుష్యంతుడా ? దుష్యంతుడేయయిన నష్టమేమి ? కాళిదాసు డేమి చేసెను? మొదటి నుండియు కడవరకును నామె బహిస్సౌందర్యమాతడు వర్ణింపని పట్టు కలదా? అందుపోని దుష్యంతపాత్రి పోషణౌచితి నన్నయ తానై వాడిన మూడు విశేషణములకే పోయినదా? పోనిండు. అసలా విశేషణములును ఆ వర్ణమునువేల ? అనిన చూడుడు. పై లలిత సమాసరచనయందలి రమ్యత యద్వితీయ శకుంతలా సౌందర్యస్ఫూరము. ఇదియొక విధమైన వ్యంగ్య రచనావిశేషము. ఏమియు లేక

శకుంతల యన్నంతనే దుష్యంతుడు వలచెనన్న, స్త్రీమాత్ర నేరినైన వంచుపంతటి నీచుడు కాడా ? ఆమె శుద్ధాంతదుర్లభమైనది. కావున అపూర్వ సౌందర్యరాశియు గాననే నిరోధక వాతావరణమునగూడ దుష్యంతుని మనసు పర్వినది అంతేగాని స్త్రీలను వర్ణించు వ్యామోహా ముండి ఔచిత్యమెరుగనివాడైనచో నామెనతిమాత్రముగా వర్ణింపలేడా? అనవసరము — ప్రస్తుత కర్తవ్యము దుష్యంత వంశవర్ణనమును, భరతజననమునుగాని శకుంతలా దుష్యంతుల ప్రణయగాథ నొక శృంగారవనముగ సృజించుట కాదు. కాని ఇతివృత్తవశమున నాతిమాత్రముగా వర్ణింపక తప్పలేదు కాన నంతలో ఔచిత నెరిగి రచించె. ఈతడే శృంగార గాథల రచించుటలోను, నందున పాత్రపోషణ చేయుటలోను, స్త్రీపాత్రచిత్రణవర్ణనల చేయుటలోను ఔచితి నెరుగకున్న తెలుగుకవులెవ్వరు నెరుగరు. స్త్రీ వర్ణన అతిమాత్రముగ చేయక వదలినది నన్నయ తక్క మరెవ్వరున్నారు. తెనుగు శిల్పపు తోటమైన తిక్కనార్యుడే రసాభాసమైన ద్రౌపది నమితముగా వర్ణించి విమర్శకలోకము పున్నన కెక్కెనే. శ్రీనాథుని చెప్పనక్కర లేదుకదా. అసలిట్లు వర్ణించుట దోసమా ? కాదే. వర్ణన లుద్దీపన విభావములని సంప్రదాయజ్ఞు లెరుగుదురుగాక. వర్ణితవస్తుభావనమున గాని పాఠకులు రసానుభూతి నందరు. దుష్యంతునకు శకుంతలా సుందరమూర్తి ఎదుట యున్నది. కాన రసావిష్టుడైనాడు. పాఠకులకేది యామె సౌందర్యమూర్తి. తత్ స్ఫురణకే నాయికానాయక వర్ణనము. ఇది యత్యావశ్యకమని ఎఱుగవలెను. కాననే కాళిదాసు చేసిరసపోషణ చేయగలిగెను శాంతరసము శృంగారమున కంగిగా నుండరాని విరుద్ధరసము. తత్సన్నిధానమున నితర రసభావ వ్యవధానముల శృంగారపోషణము చేయవలెను. అందులకే వీరరసపోషకమైన వేట మొదలైనవి చేయుటయు, శాంతము నెక్కువ వర్ణింపకుండుటయును.

అసంఖ్యాకులైన శిష్యులుండ నొక్కడే పోయి మాలినీతీరంబున నున్న శకుంతలను కణ్వుడు చూచెనని మూలమున కలదు.

అతని శిష్యులేమైరి ? అని శంకించిరి మొదటి వ్యాసకర్తగారు.- దీనిని శకుంతలా దుష్యంతుల సమావేశమున కణ్వుడు పండ్లకై పోయి నప్పుడు శిష్యు లేమైరని అని రనుకొని నన్నయయు నట్లే వ్రాసెననుట వ్యాసమును సరిగా చూడని లోపము.

మూలమున కణ్వుని తలచుకొని దుష్యంతుడు తన కృత్యము నకు దిగులుచెందెననియుండ, నన్నయ, శకుంతల భీతిల్లెననుట శోభాతి శయము కాదు అనుటలోని మంచిచెడ్డల విమర్శ : ఇచ్చట "కణ్వునకు శకుంతల కూతురు. దుష్యంతుడు పైవాడు. తప్పు కలిగినపుడు తన వారిపై కన్న నితరులపై కనలు పూనుట సహజము కాన శకుంతలకన్న దుష్యంతుడే కణ్వుని గూర్చి భయము పొందవలెనను విమర్శక సిద్ధాంతము కణ్వపాత్రౌన్నత్యము నెరిగి పలికినది కాదు. ధర్మస్వరూపుడు, కరుణానిరతుడునైన 'మహా తపస్వి పెంపుడుకూతురై తండ్రికి చెప్పకుండ వరుడు దొరుకగనే స్వతంత్రించి వివాహమాడిన శకుంతల భయమందుట యీ పాత్ర కెంతయు మెరుగు. ఈ భీతిలో శాపభయము కన్న కర్తవ్యోల్లంఘన దోషభయము చూపుట యుత్కృష్టతరము కాదా! దుష్యంతుడు చేసినది విధిచోదిత ధర్మమే కనుక భయమక్కర లేదు. కణ్వుడట్టి పట్టుల కనలడని దుష్యంతు డెరుగును. అట్లు కాక తన చర్యకు కణ్వుడు కనలునేమో యని భయమ దినచో తాను చేసిన దధర్మముకు భీతి యున్నట్లైన దుష్యంతుని పాత్రయే పాడగును. కావున దుష్యంతుడు విచారించుటకన్న శకుంతల చింతిలుటే యుత్తమము.

ఇంక తుచ్ఛ కామావేశమును కణ్వుడు వచ్చునంతకు క్షణమైన నిల్పజాలని దుష్యంత పాత్రపోషణ విమర్శ. ఈ దోషము నన్నయది కాదు. మూలముననే కలదు. దోషమైన వ్యాసుడేల వ్రాయును? దుష్యంతుడు శకుంతలను గాంధర్వ వివాహమున చేపట్టెను. గాంధర్వ వివాహమన నేమి? ఎప్పుడు జరుగును. "తనకు మఱి తాన చుట్టంబు తాన తనకు గతియు తన్నిచ్చుచో తాన కర్త యనగ వనజనేత్ర గాంధర్వ వివాహ మతిరహస్యమును సమంత్రిక

మును నగుచు నొప్పు." అని నన్నయ.- "త్వయాద్యభద్రే రహసి మా మనాదృత్య యఃకృతః పుంసాసహ సమాయోగో నసధర్మోప మాతకః, క్షత్రియస్య హి గాంధర్వో వివాహః శ్రేష్ఠ ఉచ్యతే, సకా సకామాయా స్సకామేన నిర్మంత్రో రహసి స్మృతః—" అని మూలము.

కాముకులైన నాయికానాయకులు అమంత్రికముగా రహస్య ముగా స్వతంత్రించి చేసికొనునది గాంధర్వము. ధర్మ్యము. ఇది క్షత్రియులకు శ్రేష్ఠము. ఇందు దుష్యంతుడు అనూయకురాలిని మోసగించిన దేమి? ధర్మము కాని దానిని ధర్మముగా చెప్పిన దేమి? తుచ్ఛ కామమును క్షణకైన నాపుకొనని దోషమేమి? దుష్యంతుడు సర్వసంగపరిత్యాగియై సన్యసింపవచ్చెనా ఆశ్రమమునకు? లేదు. విమర్శకుల యూహ ప్రకారము కణ్వునికై యాగినచో గాంధర్వ మెట్లగును. అసలు కథ యిట్లేల జరుగు. గాంధర్వము శ్రేష్ఠముకాన నదియే దుష్యంతుడు చేసె. పెద్దలకై ఆగిన దోసముకూడ. ఇందు దుష్యంతుని పాత్ర మూలముగాని, నన్నయ భారతమునగాని పోషిం పబడినదే గాని దూషింపబడలేదు.

మూలమున శకుంతల "విభ్రాజమానాం వపుసాతపసేన దమేనచ" యనియు "శ్రీరివ రూపిణీ తాపసీ వేషధారిణీ" యనియు నున్నది. నన్నయ శకుంతల కనువేదురు కలది. ఈపాత్రచిత్రణము నన్నయ శీల పోషణసామర్థ్యమును వెలువరచుచున్నది అను విమర్శ. వ్యాసుడు వాచ్యముచేసిన దానిని నన్నయ వ్యంగ్యముగ చూపెను. గ్రంథవిస్తరణ భీతిచే చాలింతును.

కాన సహృదయ విమర్శకులు బ్రహ్మంగారి విమర్శలోని యుక్తాయుక్తములు గ్రహింతురుగాక. స్నిగ్ధహృదయముతో జిజ్ఞాసు వులై చూచినగాని మహాకావ్యముల యర్థగాంభీర్యము రచనా విశేషములు గోచరింపవు. కాన నన్నయ తెనుగుభాషకును నాంధ్రీ కృత భారతమునకును జాతికిని నష్టము కల్గింపలేదు.

భారతి. ఆగష్టు - 1955

.........

# నన్నయ కథాకథనము

- విశ్వనాథ వేంకటేశ్వర్లు

నన్నయగారు సర్వకావ్య మార్గముల సిద్ధహస్తుడు. ఆయన కథా కథన రీతి యొక విశిష్టమైనది.

కథ నొకానొక విధముగా మలచినచోఁ బ్రబంధ ధ్వని యుదయించును. కథను సరాసరిగఁ గట్టెఁ గొట్టెఁ దెచ్చె నని చెప్పు పద్ధతి పౌరాణికము. సుహృత్సమ్మిత మగుటచే నందు వాచ్యార్థమే ప్రాధాన్యము నొందియుండును. కావ్యము కాంతాసమ్మితము. ఇందు వాచ్యార్థము ప్రధానము కాదు. ప్రతీయమానార్థమే ప్రధానము. నాగరకులైన జనుల హృదయముల పరిపాకము సుంకు దేరఁగాఁ దేరఁగా గంభీరమైన వ్యంగ్యార్థము కతిపయశబ్ద వ్యాపారముచేతనే ప్రతీయమానమగుచు వక్తయొక్క హృదయ నాగరకత నభివ్యక్త మొనరించుచుండును

కావ్యమున వ్యంగ్యార్థమునకీ ప్రాధాన్యమేలయని ప్రశ్న యుదయింపవచ్చును. వ్యంగ్యము లోకధర్మము. భగవద్ధర్మము, భగవంతుఁడీ లోక వస్తువుచేత నభివ్యంజితుఁ డగుచున్నాఁడు. కాని వాచ్యార్థ ప్రకటితుఁ డగుటలేదు. లోకమునందలి ప్రత్యణువు, సర్వ వాఙ్మనః క్రియాసంపుటి, భగవంతుని, భగత్తత్త్వ వికాసము నభివ్యంజిత మొనర్చుచున్నవి.

వాక్కు స్వతః వ్యంగ్యార్థ ప్రాధాన్యము కలది. కొంచెము దూర మాలోచించినచో నే వాక్కునకు వాచ్యార్థ విషయమైన వస్తువే ప్రపంచమున లేదు. 'గోడ' యను శబ్దమునకు లోష్టసుధా సంపుటియైన 'గోడ' యను వాచ్యార్థము కాగలదా? కావున సర్వశబ్దముల చేత సర్వ వస్తువులు ప్రతీయమానములే యగుచున్నవి గాని వాచ్యముగాఁ జెప్పబడుటలేదు. అట్లన అభిధా లక్షణాలు రెండును నసత్కల్పములనుటకాదు. అస్మాదయమర్థో బోద్ధవ్య ఇతీశ్వర

సంకేత శక్తిః. ఈశ్వర సంకేతమైన శక్తి వ్యంగ్యశోభితమని పరమార్థము,

కావ్యము కాంతాసమ్మితము కదా! కావ్యమునకుఁ గథ శరీరము. శరీర చేష్టాగతములైన భావములు శరీరాంతర్గతమైన-అనగా మనోగతమైన రసవ్యక్తి నెట్లు పట్టియిచ్చునో, ఆ కావ్యకథా గతమైన కావ్యకథా కథనరీతి గత యొయ్యారములు కావ్యాత్మమైన రసవ్యక్తి కుపష్టంభకములై యుద్దీపకములై విరాజిల్లుచుండును.

నన్నయగారు భారతేతిహాసమును కావ్యముగ దిద్ది తీర్చినవారు. ఆయన కథ చెప్పునట్టి తీరు కథాత్మమైన రసవ్యంజ్యకముగా నొకా నొక యొయ్యారమును వెదజల్లుచుండును.

ఆదిపర్వమునఁ బ్రథమాశ్వాసమునందే యుదంకుఁడు తక్షక ప్రముషితుఁడై కోపించి జనమేజేయు పాలికిఁబోయి 'కాదనకట్టి పాటి యపకారము తక్షకుఁడేక విప్ర సంబోధనజేసి చేసె నృపపుంగవ నీవు ననేక భూసురాపాదిత సర్పయాగమున భస్మము సేయుము తక్షకాది కాకోదర సంహతిన్ హుత వహోగ్ర సమగ్ర శిఖాచయంబులన్' అని ప్రోత్సహించెను. మఱల ద్వితీయాశ్వాసమున జనమేజేయ చోదితులైన మంతులు సర్పయాగ నిర్వహణ ప్రరోచకముగా ని వాక్యములనే, యచ్చముగ నీ పద్యరూపముననే చెప్పుచున్నారు. ఉదంకోపదేశము వలన జనమేజేయ హృదయమున సర్పస్పర్శ విషయక బీజావాపనము చేయబడినది. దానికి ఇప్పుడు దోహదము చేయుచున్నారు. ఏకకాల మునందు గాకపోయినను ఒకే వాక్యమును భిన్న కాలములయందుపదేశించినచో వారి యేకవాక్యత శ్రోతను గ్రియోన్ముఖులను గావించును గదా! ఈ రహస్యవేత్తయైన నన్నయగారాపద్యముననే స్థలాంతరమున ననువదించుచూ మహార్థమును సాధించిన వారైనారు. కథా కథన చమత్కారములలో నానుపూర్విని సరిదిద్దుట యొకటి. భారతేతిహాసమునకు బీజప్రాయమైనది సర్పయాగము. దాని యనంతరమైనది కౌరవ వంశ వివరణము. ఈ రెండును భారతకథకుఁ బీఠికలు. ఈ

రెండును రెండు ఖండములుగా తీర్చిదిద్దబడినవి నన్నయగారు సర్వ యాగ ఖండమునొక ప్రత్యేక మహాకావ్యముగా మలచిరి. సర్పయాగ మున ఉదంక చరితము బీజప్రాయము. ఆ బీజము విస్తరించి బిందు రూపము నందింపజేసినది కద్రూవినతల చరితము. అందు సహకారిగా నున్నది సౌపర్ణోపాఖ్యానము. ఈ మహాసంవిధానమునకు నిర్వహణ రూపమైనది సర్పయాగము ఇట్లీ ఖండమొక సమగ్ర శిల్పరూపము నొంది భారత కథాఖ్యానమునకు నాందీ ముఖమై విరాజిల్లినది. జర త్కార్వాస్తీక చరితము బిందుం బతాక వలె భాసించినవి. ఉదంక కథానంతరము ప్రథమాశ్వాసాంతమున కద్రూశాప విషయిక ప్రశ్న చేయబడినది. దాని నంకాస్య లక్షణముగాఁ దీసికొని ద్వితీయా శ్వాసాదియందు కద్రూ వినతల పుత్రప్రాప్తి యభివర్ణితమైనది కద్రూశాపముతోపాటుగ సౌపర్ణాఖ్యానమునందుఁ బరిణమించి వాసుకి విషాదము, జగత్కారు చరిత్రము, ఆస్తీకచరిత్రము, చివరకు సర్పయాగాభివర్ణనము, తచ్ఛాంతియుఁ గ్రమముగా గొలుసు గ్రుచ్చి నట్లానుపూర్వి చెడకుండ నభివర్ణింపబడినవి. సంస్కృత భారతమున నీకథ లిట్లు లేవా యనవచ్చునుగాని యందుఁ దీర్ఘమునకుఁ దీర్ఘము, ప్రసాదమునకుఁ బ్రసాదము నన్నట్లుగా మధ్యమధ్య విషయాంతరము లనేకము లభివర్ణితములగుటచే నానుపూర్వి చెడినట్లుండును. నన్నయ గారి భారతమున నీ యానుపూర్వి చెడకుండ నొక కథకు మరియొక కథకుఁ గార్యకారణ భావము నిరూపింపఁబడియున్నది. నన్నయగా రిందనేక విషయములఁ బరిత్యజించి కథను సంగ్రహించి యీ యాను పూర్విని సాధించినారు. సంస్కృత భారతమునందున్న దేవతాకృబ గరుడస్తుతి, కద్రూకృతేంద్రస్తుతి, వినతోక్త బ్రాహ్మణ మాహా త్మ్యము, జరత్కార్వాస్తీక శబ్ద నిర్వచనములు - మున్నగునవి యనేక విషయములు తెనుగు భారతమునఁ బరిత్యక్తములైనవి. కారణము నన్నయగారి కథాకథన చమత్కార నిర్వహణ దృష్టియే.

'కథం సా ద్రౌపదీకృష్ణా క్లిశ్యమానా దురాత్మభిః
శక్తా సతీ ధార్తరాష్ట్రాన్నాదహత్ క్రోధ చక్షుసా.'

ఇది సంస్కృత భారత వచనము. తెనుఁగున లేదు. నన్నయ
గారు తన కథాసంవిధానదృష్టిలో నీ వాక్యమును విలాపన మొనర్చి
(ఇది శాఖా చంక్రమణము.) నన్నయగారి కథా నిర్మాణ దృ
యట్టిది.

అసలు సర్పయాగమునకు భారతేతిహాసమునకు గార్యకార
సంబంధమేమి ? దీని కది పీఠికా ప్రాయమగుటయేమి యను ప్రశ్న
వ్యాసమహర్షి నడుగవలసినది. భారతకథ జీవకృతకర్మ సంపుటా
వర్ణనము చేయునట్టిది. కర్మానుభవ మపరిహార్యము. ఆ విషయమును
దెలుపుటకై సర్పయాగము పుట్టినదని, యది భారతమున కాముఖ
ముగా వర్ణింపఁబడినదని కవిసార్వభౌముల వ్యాఖ్యానము.

ఈ విధముగనే కథాసంవిధానమునఁ జూపు పెట్టకొని నన్న
గారు కౌరవవంశ ఖండమునుగూడ సమర్థించిరి. సంస్కృత భారతమున
దుష్యంత చరితము ముందును యయాతి చరితము తరువాతను నభి
వర్ణితములైనవి. నన్నయగా రానుపూర్వి చెడకుండ, కావ్య సంవిధా
నమునుమార్చి యయాతి చరిత్రము ముందు చెప్పి తరువాత దుష్యం
చరిత్రమును జెప్పిరి. దుష్యంతుడు పౌరవుఁడు. పూరుఁడు యయా
సంతానము. వంశానుపూర్విని బట్టియే నన్నగారు మార్చిరి.

మఱియొక చమత్కారము. నన్నయగారు మహాపురుషుల
చరిత్రములు చెప్పుచున్నట్లే మహా పతివ్రతలకుఁ బ్రాధాన్యము
నిచ్చుచుఁ గథా నిర్వహణము చేసిరనుటకుఁ బెక్కుదాహరణముల
జూపవచ్చును. భారతమును గొంచెము శ్రద్ధాదృష్టితో బరిశీలిం
నచో సర్పయాగమునఁ గద్రూవినతలు, ఆస్తీక చరితమున జరత్కా
రువు, యయాతి చరిత్రమున దేవయాని, దుష్యంత చరిత్రమున శకుం
తల, యారణ్య పర్వములో నల చరిత్రమున దమయంతి - వీరి
చరిత్రములు ప్రాధాన్యము వహించియున్నవని గమనింపవచ్చును.
ఇట్లే ప్రధాన కథయందు ద్రౌపదికి ప్రాధాన్యమీయబడినది.

సర్పయాగ ఖండమునకుఁ గద్రూ శాపము బీజమనుట నిర్వివా దాంశము, ఆస్తీకోత్పత్తికై వాసుకి తన చెల్లెలైన జరత్కారువును సాధనముగా నుపయోగించినాఁడు.

'వాలుపయి నడచు నట్లు
బ్బాలిక నడు నడ నడుంకి భయమున నియమా
భీలుఁడగు పతికిఁ బవళుల్
రేలును నేమఱక పరిచరించుచు నుండెన్',

దేవయాని కథ జగద్విదితమైనదే. శకుంతలా దమయంతుల కథా నిర్వ హణములో నన్నయగారు వారిర్వుర కిచ్చిన ప్రాధాన్యము నభివర్ణిం చుటకు వేఱుగ వ్రాయవలసియున్నది. అది దుష్యంత చరిత్రము కాదు, అది నలకథ కాదు. అది శకుంతల చరిత్ర. అది దమయంతీ చరిత్ర. ఆ కథలలోని యాయువు పట్టులన్నియు శకుంతలా దమయం తుల మీఁదనే యాధారపడియున్నవి. ప్రవృత్తి నివృత్తి లక్షణమైన ధర్మద్వయమున కద్వైతము నార్జించి కృష్ణద్వైపాయను ప్రధానో ద్దేశము నిర్వహించుటకై నన్నయగారీ మహా పతివ్రతల నిర్వుర నాయా కథలయందు వాహికలుగా వాడినారు. ఆ కథలయందుఁ బ్రతిపాదితమైన ధర్మమున కింధనమై పోయినవారు శకుంతలా దమయం తులు. అందు ధర్మోపదేశమంతయు వారిర్వురి ద్వారా జరిగినది. అది నన్నయగారి కథాకథన విశేషము. భారతీయ పతివ్రతా ధర్మము లకుఁ బట్టుగొమ్మలు.

కథను జెప్పుటలో నాటకమున శ్రవ్యాశ్రవ్య భేదముండును. కద్రూవినతల కథ జెప్పుచున్నారు.

అమ్మహాశ్వంబు ధవళ దేహంబు నందు
వల్ల గలిగిన నీకు పుచ్ఛంబు దాసి
నీకు నే దాసి నగుదు పన్నిదము నజము
నగుము మఱి యందు నల్ల వేదయ్యెనేని

అని యిట్లిద్దఱు నొండొరులకు దాసిత్వంబు పణంబుగా నొడివి- ఈ పద్యము కద్రూముఖాన్వితమైన పన్నిదము. దాని వినత సమా

ధానము చెప్పవలసియుండెను. చెప్పినది, కాని నన్నయగారు దానిని వాచ్యముగాఁ జెప్పలేదు. "అని ఇట్లిద్దరు నొండొరులకు దాసీత్వంబు పణంబుగా నొడివి' యనుటలో వినతావాక్యములు గతార్థములైనవి. నన్నయగారి రచనలో నిట్టివి శత సహస్రాధికములు.

నన్నయగారు కథను సూటిగాఁ జెప్పఁడు. ఎక్కడ నేయంశమెంత వరకు వ్యక్తమో యంతవరకే దానిని జెప్పి, విశేషాంతరమును గాలాంతమున వక్తవ్యాంతరముగాఁ జెప్పును. ఇదియొక మహాకావ్య నిర్వహణ లక్షణము.

మత్స్యయంత్ర భేదనము తరువాతఁ బాండవులు కృష్ణను వెంట బెట్టుకొని యేగి తల్లితో మేమొక్క భిక్షఁ దెచ్చితిమనిరి. ఆమె పంచి కుడువుఁడనెను. తద్విషయికమైన ధర్మసందేహ చర్చ తల్లి కొడుకులకు జరిగినది. తరువాత బలరామకృష్ణులు వచ్చి పాండవులఁ బరామర్శించి వెళ్ళిరి. పాండవులు బ్రాహ్మణరూపముఁ తోనున్నారు. ద్రౌపది రాచకూతురు. ఆమె యత్తింటికిఁ బోగానే యెట్టి మర్యాదల నడచెనన్నది పాఠకునకుఁ దెలియవలయును గదా! కథకుండా విష యమును మనకు చెప్పవలయును. కాని యీ కథకుఁడు గడుసరి. కథను సూటిగాఁ జెప్పఁడు. చెల్లెలిస్థితియెట్లున్నదో యని ధృష్టద్యుమ్నుఁడు పరోక్షముగ వచ్చి పాండవులకుఁ దెలియకుండఁ గుంభకారగృహంబున యుండి వారి యితివృత్తం బెఱింగిపోయి నామె వర్తన మెల్ల నివేదించెను. ద్రౌపది క్రొత్తింటి కాపురముస్థితి మన కప్పుడు తెలిసినది. ఆదిపర్వము సప్తమాశ్వాసము 220 మొదలు 226 వఱకు పద్యములలో నామె వర్తన మభివర్ణితమైనది.

ఇట్లే పార్థుడు చేసిన కాలకేయాది సంహారకుగ ఇంద్రలోకమునఁ జేసిన పనులతోపాటు మనకుఁ జెప్పలేదు. ఇంద్రజుఁడు స్వర్గలోకమునుండి తిరిగి వచ్చి గంధమాదనంబున నున్న ధర్మజాదులఁగూడి యిష్టకథావినోదంబులఁ బ్రొద్దుపుచ్చుచుండ ధర్మజుఁడు తమ్ముఁడింద్రున కొనర్చిన యుపకార కథలు వినఁగోరి ప్రశ్నింపఁగా నింద్రపుత్రుఁడు

నివాతకవచులఁ గాలకేయులఁ దాను సంహరించిన వృత్తాంతము నివేదించెను. ఈ కథను నన్నయగారీ అరణ్యపర్వ ప్రథమాశ్వాసము నందే చెప్పవలసియుండెను. కాని చెప్పలేదు. అందర్జును దివ్యాస్త్ర లాభము, ఊర్వశీశాపాదిక ప్రయుక్తమైన, వాని మనోనిగ్రహాదులు మాత్రమే చెప్పబడినవి. ఆ కథనందే చెప్పినచో నర్జును విజృంభణ వర్ణనముతో నారణ్యపర్వము ముగియవలసివచ్చును. భారతకథకు నాయకుడు ధర్మరాజు. అర్జునుఁడు నాయకుఁడు కాఁడు. అతని కథా ప్రస్తావన ధర్మరాజాభ్యుదయాను షంగముగాఁ జేయవలసియుండును. నాయకుఁడైన ధర్మరాజరణ్యమున నెట్టి యిడుమలొంది, యతని ధర్మబుద్ధి యెవ్విధమునఁ బరిణతినొందెనో యూపక్రమము ప్రధాన వక్తవ్యాంశము. అందుచేత భారత కథాకథనము ధర్మరాజ ప్రధాన ముగా నడచినది. సర్వతీర్థాటన మహాఫలశోభితుఁడై స్వర్గలోక సమీప స్థితినొందియున్న ధర్మరాజుచేఁ గవి తమ్ముని మహాభ్యుదయ గాథా శ్రవణము చేయించినాఁడు. తమ్ముఁడు పొందిన యింద్రతుల్యమైన మహాభ్యుదయమును వినుటకు సర్వతీర్థాభిగమనక్షాళితమనస్కుఁడైన ధర్మరాజు యోగ్యుఁడు. ఆ యోగ్య స్థితియందు యోగ్యమైన కాల మున నీ కథ చెప్పఁబడినది. ఇది సంస్కృత భారతమునందు నిట్లే యున్నది. ఇక నన్నయగారి గొప్ప యేమన, నది తెలిసి యట్లే నిబంధించుటయే నన్నయగారి విశేషమని సమాధానము.

మఱియు నీ రీతిగనే రాజసూయాధ్వర విశేషములు పాఠకునకుఁ బ్రత్యక్షముగ వర్ణింపఁబడి యుండలేదు. మయసభా ప్రవేశమును ధర్మరాజు శుభలగ్నమునఁ జేసినాఁడు. నారదుఁడు వచ్చి సభనుగాంచి దిక్పాల సభావర్ణనము కావించి రాజసూయాధ్వర విషయికమైన ప్రోత్సాహము చేసి వెళ్ళినాఁడు. రాజసూయము జరిగినది. ఇది జరిగిన తరువాత నందు పదార్థగ్రహణ నియుక్తుఁడై యుండి బంధువులందఱును బోయిన తరువాత మయసభా విశేషముల దర్శింప నింద్రప్రస్థంబునఁ గొన్నాళ్ళుండిన దుర్యోధనునకసూయ పుట్టినది. అతఁడు తిరిగి

హాస్తినకువచ్చి తండ్రితో మొఱవెట్టుకొనుచు రాజసూయాధ్వర విశేషముఁ జూసఁగుఱించినట్లు చెప్పినాఁడు. అంతవరకుఁ బాఠకుల కా యాగ విశేషములు తెలియవు. దుర్యోధనునివంటి మహాచక్రవర్తి కసూయా పాత్రమైన యా మఖవిశేష మెట్టిదో! రాజసూయాధ్వర మనగా పాఠకుల మనస్సున నుండునది ముఖ్యముగా శిశుపాలవధ. అది ప్రత్యక్షమగా వర్ణితమైనది. ఎందులకనగా భారతము నరనారాయణ మాహాత్మ్య వర్ణనమే ప్రధాన వక్తవ్యాంశముగా బుట్టిన గ్రంథము. నారాయణుని లీలలన్నియు ప్రత్యక్షముగ గ్రథితములగుచుండును. తక్కిన విశేషములన్నియుఁ బరోక్షముగ నభివ్యక్తములగుచుండును. అట్టివిశేషములలో రాజసూయ మొకటి. న్యాయముగా రాజసూయము భారత కథాప్రపంచమునందొక ముఖ్యమైన కీలకము అనంతర కథ యంతయు దానిపై నాధారపడియున్నది. రాజసూయము జరిగిన దేశ మునఁ బండ్రెండేండ్ల మహాక్షామముగాని, సర్వభూత వినాశకరంబగు మహాసంగ్రామముగాని రావలయును. అది యట్లే జరిగినది. అదియును గాక కౌరవ పాండవ వైరమునకు సుయోధనుని యసూయ ముఖ్య హేతువు. దానికి బీజము రాజసూయము, మయసభ. ఆ యసూయ బీజమును గవి కొంత ప్రత్యక్షముగాఁ గొంత పరోక్షముగా వర్ణించి నాఁడు. దుష్టమైన మనః ప్రవృత్తి పరోక్షముగనే యుండి క్రమక్రమ ముగా ప్రమానుగట్టి జగత్ప్రళయంకరమగును. సభాపర్వమున ద్వితీ యాశ్వాసము 95 పద్యము మొదలు 121 పద్యము వఱకు నీ యసూయా వర్ణనము సేయఁబడినది. ఇవి దుర్యోధనుఁడు తండ్రితో రహస్యముగఁ జెప్పిన పలుకులు. వాని నట్లుగా దిద్దుట కవి ప్రతిభా ప్రమేయమునకు మచ్చుముక్కయై యున్నదనుట నిర్వివాదాంశము.

మనము సభాపర్వములోనికి వచ్చితిమి ఈ పర్వమున నన్నయ గారి కథా కథన చమత్కృతి యమోఘమై వెలసియున్నది. దీనికి ముందొక్కమాట చెప్పవలసియున్నది. భారత ప్రధాన వర్ణ్యాంశము నరనారాయణ మాహాత్మ్యభివర్ణనమేయని పూర్వమే మనవి చేసితిని.

ఈ విషయము సుభద్రా వివాహ ఘట్టమున, ఖాండవ వన దహన సందర్భమున, నరణ్యమున శ్రీకృష్ణుఁడు పాండవులఁ జూడ ద్వైత వనంబునకుఁ బోయిన సందర్భమున, ధర్మజ తీర్థయాత్రా మార్గమునఁ బ్రభాస తీర్థంబున, సాత్యకి బలరామ కృష్ణులు పాండవులఁ గలసికొన్న సందర్భమున మఱియు ననేక స్థానంబుల సువిస్పష్టంబుగఁ బ్రతిపాదింపఁ బడియున్నది. భారత కథా వృక్షమునకు మూలము శ్రీకృష్ణుఁడే యనుటకు మఱియొక ప్రబలతరమైన ప్రమాణము కలదు. పాండవులు ధృతరాష్ట్రు ననుమతితో ఖాండవప్రస్థమునఁ గాపురముండిరి. అప్పటికి ద్రౌపదీ వివాహము జరిగినది. అంతకుముందే లక్క యింట జిచ్చు పెట్టుట మున్నగునవి జరిగిపోయినవి. పరమేశ్వరునకుఁ బాండవులకు బ్రత్యక్ష సంబంధము ద్రౌపదీ వివాహానంతరము ప్రకటముగఁ బ్రారంభమైనది. రాజసూయయాగమునకు నాందీ ప్రస్తావనగా జరిగిన జరాసంధ వధమునందది యొక విస్పష్టమైన రూపము దాల్చినది. ఖాండవ ప్రస్థమునఁ బాండవు లుండిరని చెప్పి నన్నయగారిట్లు వ్రాయుచున్నారు.

హరియింద్రుఁ దలచె నింద్రుఁడు
కర మనురాగమున విశ్వకర్మను బనిచెన్
సుర పురమున కెనయగు పుర
మరుదుగ నిర్మింపు మర్థినని కడుఁ బ్రీతిన్

విశ్వకర్మ వచ్చి యింద్ర ప్రస్థమును నిర్మించి పాండవులకిచ్చి వెళ్ళి నాఁడు. నాటినుండి శ్రీకృష్ణుఁడు పాండవుల యోగక్షేమములకుఁ బ్రత్యక్ష బాధ్యత వహించి మెలగుచుండినట్లు విదితమగుచున్నది. అది జరాసంధవధమున మఱియుఁ బ్రకటితమైనది. శిశుపాలవధముతో జగత్ప్రసిద్ధమైపోయినది.

పరమేశ్వర చైతన్యము జాగరితమైయుండగా జీవుడనిష్టకార్యా చరణ మొనర్చుట సాధ్యముకాదు. 'యానిశా సర్వభూతానాం తస్యాం జాగర్తి సంయామీ, యస్యాం జాగ్రతి భూతాని సానిశా

పశ్యతో మునేః' అని గీతోక్తి. ప్రపంచ జీవులజ్ఞాన నిద్రయందుండగా సంయమి (పరమేశ్వరుఁడు) మేల్కొనియుండును. ప్రపంచ జాగ్రదవస్థ ద్రష్టమైన ముని భావనమున నిద్రావస్థయే. శ్రీకృష్ణ సన్నిధియందుఁ బాండవుల కపకృతి సేయుటకు శివుఁడైనను జాలఁడు. ఈ విషయము నరణ్యపర్వమున శ్రీకృష్ణుఁడు వక్కాణించియున్నాఁడు.

అనిఁ గర్ణ శకుని ధుర్యో
ధన దుశ్శాసన నవాస్రధారాపాతం
బునఁ దృప్తిఁ బొందు వసుధాం
గన రాక్షసకాక గృధ్రగణములతోడన్

అవినీతుల వధ్యులఁ గా
రవ పాంసులఁ జంపి ధర్మరాజునకుఁ గురు
ప్రవరున కొనరింతము యీ
యవనీ రాజ్యాభిషేక మవిజితశక్తిన్

అని యుగాంత్యకాల కుపిత కృతాంతాకృతినున్న జగన్నాథు జనార్ద నుం బ్రశాంత చిత్తుం జేసి యర్జునుండతని నిట్లనికీర్తించె.

ఇది శ్రీకృష్ణుని పరిస్థితి. తత్త్వ మేమనగాఁ జైతన్య జాగ్రదవస్థయందు జీవున కనిష్ట కర్మాచరణము సంభవింపదు. అది మాయావరణముచేఁ బిహితమై యున్నపుడే లోకదుర్వృత్తి సాగును. భారతమున నట్లె జరిగినది. దుర్ద్యూతకాలమున శ్రీకృష్ణుఁడు లేడు. ఆయన యున్నచో ద్యూతము సంభవించియుండదు. "మీకెగ్గులు మత్సాన్నిధ్యమున నగునె యెయ్యెడలన్." ఇవి శ్రీకృష్ణవచనములు.

నన్నయ్యగారి ఘట్టము నీ యంశమునఁ గనుకరిగియే దిద్ది తీర్చినట్లు స్పష్టప్రతీకముగాఁ గన్పట్టుచున్నది. చిత్తగింపుడు. ద్యూత వృత్తాంతము సభాపర్వమున ద్వితీయాశ్వాసమున నభివర్ణితము. అందు మొత్తము 320 పద్యములు మాత్రమే కలవు. వానిలో నూటయేబది

పద్యములు శిశుపాలవధయందు గతార్థములై పోయినవి. ఇక మిగిలిన 170 పద్యములు. వానియందు బదియారు వచనములే. సీసాదులైన పెద్ద పద్యము లాఘట్టమున 35 మాత్రమే యున్నవి. ఈ లెక్క-యంతయు వ్రాయుట ఎందుకనఁగా, శ్రీకృష్ణుని యసన్నిధిలో జరుగుచున్న, జరుగవలసిన యీ యనిష్ట కర్మాచరణము నెంతత్వరలో ముగించిన నంత మంచిదని నన్నయగారు తొందరపడి వ్రాసినట్లున్నది. ఈ 170 పద్యములలో ప్రథమ ద్యూతము, ధర్మరాజునోటవి, ద్రౌపదీ పరాభవము, ధృతరాష్ట్ర వరప్రదానము, పాండవులకుఁ బునారాజ్య లాభము, ద్వితీయ ద్యూతము, పునఃపరాజయము, వనవాసగమనము, పాండవుల ప్రతిజ్ఞాదికములు మున్నగు బహుళాంశములు చకచక సాగి పోయినవి. సిద్ధహస్తుఁడైన చిత్రనిర్మాత కథాపరిణామదశా పరాకాష్ట యందుఁ గథ నతివేగముగ జిత్రించుకొని పోయినట్లే కథా భాగమును నన్నయగారు మహావేగమున నడిపించుకొనిపోయిరి. ఇందున్న తొమ్మిది యంశముల యభివర్ణనము నిజముగాఁ దలచుకొన్నచో నన్నయగారు తొమ్మిది వందల పద్యములలో నిర్వర్తించియుందురు. కాని యీ దేశ కాలము లట్టివికావు. పరమేశ్వరుఁడు లేడు. కర్మ తఱుముకొని వచ్చుచున్నది. ధర్మరాజు తెలివితక్కు-వవాఁడా ? నేను ద్యూత్య మాడనని శరింపలేఁడా ? తన్ను ధృతరాష్ట్రుఁ డాజ్ఞాపించునా ? తాను దలచుకున్నచో భీష్మాదు లాగుదురా ? పిలుపు దూరముననున్న శ్రీకృష్ణ దేవునకుఁ గబురంపరాదా ? కాదు. కర్మ బలీయమైయున్నది. పితృ వచనమునకుఁ గట్టువడినాడు. పితృతుల్యుఁడైన విదురు నిదేశమునకు లొంగినాఁడు. పైగా ద్యూతము సర్వగుణ నాశనియని తానెఱుఁగును. ఆ యావేశము పుట్టినది. రాజ్య ధన ధాన్యాదులనే గాక, తమ్ములను, భార్యను గూడ నొడ్డినాడు. ఇంత మహా కథయు 170 పద్యములలో నొదిగి పోయినది. ఏదో కొంత మనస్సు పొంగిన ప్రతిజ్ఞాదికములైన పలుకులను వ్యక్తీకరించుటకు మాత్రమే నన్నయగారా 35 పెద్ద పద్య

ములను వాడినాడు. కథా వేగము సూచించుటకు 56 వచనములే యున్నవి. తక్కినవన్నియు గీతములు, ఆటవెలదులు, కందములు. అనిష్టము హఠాత్సంభవము. భగవంతుని యసన్నిధిలోఁ నది జరుగవలయును. అర్జునుని ధనుశ్శక్తి వంటి నన్నయగారి కవితాశక్తి యా సందర్భమునఁ గావలయునని బుద్ధిపూర్వకముగఁ గుంటువడినది. అది నన్నయ ఋషిత్వము. దేశ కాలానుసారియైన ఛందః ప్రయోగ వైచిత్రి, దేశ కాలానుసారియైన కథా సంగ్రహణ నిగ్రహదశా విశేషములిందుఁ బ్రకటితములై నన్నయగారి మహాకవిత్వ రచనా సార్వభౌమత్వమును సర్వథా స్థిరీకరించుచున్నవి.

జయంతి. జూన్; 1959

..........

# నన్నయ దుష్యంత మహారాజు చరిత్రము

శ్రీ వడలి మందేశ్వరరావు

భారత కథలో భీష్మునికిగల ప్రాముఖ్యాన్ని అంగీకరిస్తే, ఆది పర్వమందలి చతుర్థాశ్వాస మధ్యమునుండి భారతకథా ప్రారంభ మనుకొన వీలుకలుగుతుంది. మొదటి రెండున్నర ఆశ్వాసాలలో భారత కథావిర్భావానికి గల పరిస్థితులను వివరించడం జరిగింది. తృతీయాశ్వాస ఉత్తరభాగమున కౌరవవంశ వివరణము ప్రారంభమైంది. ఆ వంశము లోని యయాతి చరిత్ర వివరింపబడింది

చతుర్థాశ్వాసమున ఈ వంశ వివరణ మొదటి 118 పద్యగద్యాల వరకు నడిచింది. ఈ భాగములోనే దుష్యంతమహారాజు చరిత్ర చెప్ప బడింది. యయాతి చరిత్రను సవిస్తరముగా చెప్పుమని జనమేజయు డడి గాడు. దుష్యంతుని చరిత్రను వివరింపుమని అడుగకపోయినా, ఈ కథ సవిస్తరముగా చెప్పబడినది. దీనికి తగినంత కారణము లేకపోలేదు.

భరత కులములో ( ప్రధానముగా ) వంశకర్తలు ముగ్గురు కనబడతారు. ఒకడు పూరుడు, రెండవవాడు భరతుడు, మూడవవాడు కురుడు. పూరుని తండ్రి యయాతి, ఈతని కథ తృతీయాశ్వాసమున వివరింపబడింది. భరతుని తండ్రి దుష్యంతుడు; ఆతని చరిత్ర చతుర్థా శ్వాసమున వివరింపబడింది. కురుని తండ్రి సంవరణుడు; ఆతని కథ సప్తమాశ్వాసమున చెప్పబడింది. ఆ కథ అక్కడ చెప్పడంలోని ఔచిత్యం ఆ కథను గూర్చి పర్యాలోచన చేసేటప్పుడు వివరింప బడుతుంది.

అంటే భరతవంశములోని ముగ్గురు వంశకర్తలను కన్న తండ్రుల చరితము ఆది పర్వంలో వివరించబడింది. ఈ కథలో ఈ వంశకర్తల తండ్రులకేగాక, వారి తల్లులకును ప్రాముఖ్యమున్నది. పూరుని తల్లి శర్మిష్ఠ, వృషపర్వుడనే రాక్షసరాజు కుమార్తె. భరతుని

తల్లి శకుంతల. ఈమె తండ్రి క్షత్రియుడై, రాజర్షియై, బ్రహ్మర్షియైన విశ్వామిత్రుడు. తల్లి మేనక. కురుని తల్లి తపతి ఆమె ఆదిత్యుని కూతురు, సావిత్రికి సోదరి. శర్మిష్ఠ దానవి, మహా సౌందర్యవతి' ముద్దరాలు. శకుంతల 'అవనీ తలంబున కవతరించిన తరుణ శశిరేఖ; మహాసాధ్వి. తపతి'నిజశరీర కాంతి నుపాంతంబున వృక్షలతావలిఁగాంచన మయముగ' చేయగల 'త్రిభువనలక్ష్మి' 'లావణ్య సద్గుణ సముదాయ! పౌరవ వంశకర్తల తల్లులు అభిజాత్యము చేతను, సౌందర్యముచేతను ఉత్తరోత్తర ఉత్తమోత్తమ లయారు.

అంతేగాక ఈ పవిత్ర వంశములో ఈ శంశకర్తల తలిదండ్రుల వివాహములు చిత్రమైనవి. యయాతి దేవయానికి భర్త; దేవయానికి శర్మిష్ఠగా దాసి.కనుక శర్మిష్ఠకు యయాతి పతిఅయాయాడన్న న్యాయాన్ని అనుసరించి, శుక్రుని ఆదేశాన్ని గీటుబరచి, శర్మిష్ఠకు యయాతి భర్త అయాడు. తర్వాత శాపగ్రస్తుడయాడు. శకుంతలా దుష్యంతుల వివాహము అంతకన్న పై మెట్టులోనిది. ఇది అమంత్రకమైనదే కాని క్షత్రియోచితమైన గాంధర్వము-ఇక్కడ కణ్వుడుశకుంతల వివాహాన్ని ఆమోదించాడు. ఇక సంవరణుని వివాహము మహోత్కృష్ట సంప్రదాయాన్ని సృష్టిస్తూ, పోషిస్తూ, వైదిక వివాహానికి ఆదర్శోదాత్తమై ఉన్నది. ఇందులో తండ్రి ఆదిత్యుడు తన కూతురునకు తగిన వరుడు సంవరణుడని నిశ్చయించడము ఉన్నది; వధూవరులు నొండొరుల పట్ల గాఢమైన అనురాగాన్ని పొందడము ఉన్నది. భార్యాసమాగమమునకై సంవరణుడు కేవలము మదనార్తుడై కృశించుటయేగాక,'అవిరత తీవ్ర వ్రతోపవాస కృశశరీరుఁ'డగుట ఉన్నది. అన్నిటికన్న మిన్నగా అతని పురోహితుడు వశిష్టుడు వధువుతండ్రి ఆదిత్యుని మెప్పించి, 'తపనదత్త యయిన తపతిం దోడ్కొనివచ్చి, విధిమతంబుగా సంవరణునకుం దపతి వాహంబు' సేయించుట ఉన్నది.

అంటే ఈ వంశకర్తల జననములో మనము చూడవలసింది-ఈ మూడు వివాహములలో ఉన్మీలిత (evolve) మవుతున్న ధర్మాభి ముఖమైన సంస్కారము. ఒక్కొక్క వంశవిస్తారకుని జననములో ఈ వంశములో ధర్మమునకు సంబంధించిన ఒక్కొక్క క్రొత్త (element) ప్రవేశించి, ఒక నూతనమైన మలుపునకు దారితీసింది. శర్మిష్ఠకొడుకు పూరుడు. అసలు శర్మిష్ఠ కొడుకులకే రాజ్యార్హత లేకపోగా, ఈతడు ఆమె కొడుకులలో కడపటివాడు. అయినను తండ్రి వార్ధక్యాన్ని భరించడానికి అంగీకరించడంచేత ఈతనికి రాజ్యార్హత కల్గింది. అంటే లౌకిక భోగ పరాఙ్ముఖత్వానికి, త్యాగానికి చిహ్నమైనవాడయాడు. ఈ వంశకర్త దుష్యంతమహారాజు చరిత్రలో సత్యము సుప్రతిష్ఠిత మైనది. తపతీ సంవరణోపాఖ్యానములో సంప్రదాయము, తపస్సు సుస్థాపితమైనాయి. ఇది భరతవంశకర్తల జన్మల వివరణముల్లోని పరమార్థము.

దుష్యంత మహారాజు చరిత్ర ఈ విశాలమైన దృష్టితో చూడ దగినది. భారత కథ నుండి విడదీసి ఈ కథను పరిశీలించడమన్నది ఆ కథా ప్రయోజనాన్ని విస్మరించడమవుతుంది. కథా ప్రయోజనానికి భిన్నమైన కథనశిల్పముగాని, పాత్రీకరణముకాని, ఈ కథలో కనబడితే అది ఇతర విధాల ఎంత సుందరమైనా, ఆ పరమార్థాన్ని విస్మరింప చేస్తూ, మరుగు పరుస్తూ, అనౌచిత్య దూషితమవుతుంది.



ఆది పర్వమున ఒక తపోవనాన్ని పోలిఉండే వాతావరణం అలముకొని ఉంటుంది. ఈ పర్వానికి మధ్యలో ఉన్న ఈ కథలో నగరాలుకాని, రాజ ప్రాసాదాలుకాని, ఎక్కడా కనబడకుండా, 'ఆది త్యాంశు సమీర దుర్గమ మహోగ్రారణ్య' ములు, "హృదయ సుఖా వహంబగుచున్న" వనములు, "హిమవత్ పర్వత ప్రదేశం"బులు

మాత్రమే కనబడి, ఆదిపర్వానికి మహోత్కర్షను, ఉదాత్తతను కల్గిస్తూ,స్వర్గారోహణ పర్వంవరకు దీని గుబాళింపు సోకేటట్లుచేస్తోంది. భారత కథలోని రాజకీయములు, యుద్ధాలు ఎంత నాగరికములైనా, అందలి ప్రధాన పాత్రలచూపు కోట గోడలను దూసుకొని, అరణ్యాల వైపు, తపోవనాలవైపు పరుగెత్తుతాయి. ధర్మరాజులో అపూర్వమైన, అగాధమైన రాజనీతిజ్ఞత కనబడుతుంది. కాని దానిని మాత్రమేమనము చూడగల్గితే, అతనిని మనము skin deep గానే పైపై పొరలలోనే అర్థం చేసికొన్నట్లు అవుతుంది కాని ధర్మరాజు యొక్క విరాట్ స్వరూపం తెలిసికోవాలంటే అతన్ని అరణ్యపర్వంలో కొంత, తర్వాత ముఖ్యంగా శాంతి, అనుశాసనిక, ఆశ్రమవాస, మహాప్రస్థానిక, స్వర్గారోహణ పర్వాలలోను చూడాలి. ఈ పర్వాలలో రాజునుండి ఉన్నతమయిన ధర్మరాజు గోచరిస్తాడు. భోగముకన్న యోగమే ప్రీతిత్మైన ఇట్టివాని కథను చెప్పేముందు, దాని కనుగుణమైన వాతావరణాన్ని కవి ఏర్పరచాలి. దుష్యంతుని చరిత్రలో దీనికి సహజమైన అవకాశం లభించి, రమణీయోదాత్తమైన తపోవన వాతావరణము విస్తరిల్లింది.

ఈ కథను చెప్పిన పద్ధతి ఈ వాతావరణాన్ని పోషించేటట్టుగా ఉంది ఇక్కడ శిల్పానికి ఎక్కడా అవకాశము లేదనిపించే స్నిగ్ధ సుందరముగా కథ నడచింది. ఇంతటి సూటిగా simple గా కథను చెప్పడం ఎవరికైనా సాధ్యమేనన్న భ్రమను కల్పిస్తోంది ఈ చరిత్ర. కాని ఈ కథను ప్రారంభించినపద్ధతే చాల చిత్రమైనది. తొలి నాల్గు పద్యాలలో కథ పెద్ద పెద్ద అంగలు వేసుకుంటూ నడిచింది మొదటి కందపద్యంలో దుష్యంతుని బాల్యాన్ని గూర్చి, రెండవ కందములో అతని యౌవనాన్ని గూర్చి చెప్పబడింది. తర్వాత శార్దూలంలో 'సమస్తాశాంత మాంతంగ మర్యాదాలం కృతమైన భూ వలయ మాత్మాయత్తమై' యుండగా దుష్యంతుడు దేశాన్ని పాలిస్తున్నాడనివిన్నాము అతని రాజ్యపాలన ధర్మమార్గాన నడిచిందని తర్వాతి కందములో విన్నామో లేదో, ఆతడప్పుడే వేటకు బయలుదేరాడు. ఈ కథా

ప్రారంభములో ఆతని బాల్యాన్ని యౌవనాన్ని గూర్చి చెప్పిన విషయాలుకూడ ఆతనికి అడవులతోను పర్వతాలతోను గల పరిచయాన్నే ఎఱుక పరుస్తాయి. కాని రాజధానీనగరంతో ఆతనికిగల సంబంధాన్ని తెలియపరచవు. ఇక వేటకు బయలుదేరడంలో అతడు కణ్వాశ్రమంలో ప్రవేశించబోతున్నాడు.

తర్వాతి కథఅంతా కణ్వాశ్రమంలో జరిగిందే చివరి భాగంలో శకుంతల భరతుని తీసికొని రాజును చూడడానికి వెళ్ళినప్పుడు, ఆమె తనతో బాటు కణ్వాశ్రమ వాతావరణాన్ని కూడా తీసికొనిపోయింది. కృతక నాగరికతకు, రాజకీయాలకు, అపవాదులకు, ఎత్తుపై ఎత్తులకు కూడలి అయిన రాజధానీ నగరంలోనికి ఈమె 'ఆజ్యహావిర్ధూత సౌరభాన్ని' మోసుకొనివచ్చింది,"మహోద్విజ పఠ్యమాన వేదధ్వనులను" వినిపింపచేసింది, సత్యాన్ని ప్రతిష్ఠించడానికి దివ్యవాణినే మేల్కొల్పింది.

తపోవనపు వాతావరణం అంతా కథను అలముకొని ఉండడం వల్ల ఇందలి పాత్రలెవ్వరిపట్ల మనకు అమర్ష కల్గరాదు. అట్టి అమర్ష కల్గుతే ఈ వాతావరణం అంతా పరిపూర్ణంగా కలుషితమైపోతుంది' విశ్వామిత్రుని తపస్సును పాడుచేసిన మేనకపట్ల మనకు ఈసులేదు. తపోభంగానికి అవకాశమిచ్చిన విశ్వామిత్రునిపట్ల మనకు ఏవగింపు కల్గదు. తలిదండ్రు లిరువురూ పసిపాపని నట్టడవిలో విడిచి వెళ్ళినా, వారిర్వురిపై మనకు రాదగిన కోపంకూడ పిసమెత్తైన కల్గదు.

మేనక మన సానుభూతికి పాత్రమవడానికి ఒక కారణం ఆమె తనకు తానె వచ్చి విశ్వామిత్రుని తపస్సును పాడుచేయలేదు. ఆమెకు విశ్వామిత్రునిపట్ల ప్రగాఢమైన భయభక్తులున్నాయి. అయినా ఆమె తన విధ్యుక్తధర్మాన్ని నిర్వర్తించవలసిఉన్నది. ఆ విధి నిర్వహణములో ఆమె కేవలము విశ్వామిత్రుని తపమును చెఱిచి దేవలోకానికిపోలేదు. విశ్వామిత్రునితో జతకట్టి పెద్దకాలం వానితోనే ఉండిపోయింది. అందుచేత ఈమె తపోవిఘ్నకారిణి అయిన వేశ్యగాక విశ్వామిత్రుని హృదయాన్ని చూరగొన్న ప్రియురాలయింది.

అంతేగాకుండా వీరిద్వరి సమాగమాన్ని వర్ణించే ఘట్టము ప్రబంధసుందరమై, మనోజ్ఞమై ఉండడంచేత, ఈ కథను వినిపింపచేసే శకుంతలకెలా ఉదాత్తప్రకృతులవలె మేనకా విశ్వామిత్రులు గోచరిస్తారో (1-4-97) మనకు కూడా అలాగే వారు కనబడుతారు.[1]

అన్నింటికన్న చిత్రమేమంటే తలిదండ్రులిద్వరూ పసిపాప శకుంతలను నట్టడవిలో వదలి వెళ్ళిపోయినా, వారిపై మనకు కోపం కల్గదు. దీనికి కారణం "శకుంతల తతు"లచేత ఎలాగో మొత్తం మీద ఆ పసిపాప రక్షింపబడడంకాదు. అవి అలా ఆమెను రక్షించడానికి కారణం "అమ్మునిప్రభావంబున, అని చెప్పడంవలన, ఆ తలిదండ్రులు తమ శిశువును దిక్కులేని దానినిగా చేసిపోవడంలేదని మనకు స్పష్టమై, శకుంత తతులచేత పెంచబడడంచేత శకుంతల మనకు మతీ ప్రీతి పాత్రురాలైంది.

ఈ పాత్రలు మన సానుభూతిని కోల్పోకపోవడం ఒకఎత్తు, దుష్యంతునిపట్లకూడ మనకు సానుభూతి నిలచి ఉండడం ఒకఎత్తు. దుష్యంతుడు కేవలం లోకాపవాద భీతివల్లనే నిండుకొల్వులో ప్రజాస్వితమైన శకుంతలను నిరాకరించి, అవమానించాడు మన ఈనాటి ప్రమాణాల ననుసరించి నిజానికి ఇది ఎంతమాత్రం క్షంతవ్యంకాదు. అయినా దుష్యంతుడు మన సానుభూతినేమీ కోల్పోలేదు. ఇది చాల చిత్రంగా సాధింపబడింది.

దుష్యంతుని మనం పుట్టినప్పటినుంచి ఎఱుగుదుము. నన్నయ అతనిని గురించి ప్రారంభములో చెప్పినవి నాల్గు పద్యాలే. అయినా, ఆ నాల్గింటివలన దుష్యంతుడు మహా వీరుడనీ, వెనుకటి మహా చక్రవర్తుల మార్గంలో రాజ్యాన్ని నడిపేవాడనీ, ధర్మాన్ని నిర్వక్రంగా నిర్వహించేవాడనీ, మనకు తోచి అతనిపట్ల సదభిప్రాయం ఏర్పడింది కణ్వాశ్రమాన్ని ప్రవేశించినప్పటి అతనిప్రవర్తన ఎంతో ఔచిత్యంతో కూడిఉంది. అతని వినయం మనల్ని ఆకర్షించింది, దీనికితోడు శకుంతల

యందు తనకు అనురాగం కల్గడం "ధర్మవిరుద్ధమేమో!" అన్న శంక అతనికి కల్గడంతో అతనిది ధర్మాభిముఖముగా ఉన్మీలితమయిన ఉత్తమోత్తమ సంస్కారము అని మనకు రూఢి అయింది. ఇక శకుంతలను తిరస్కరించిన సందర్భములో :

నేనెట నీవెట సుతుఁడెట
యే నెన్నఁడుఁ దొల్లి చూచి యెఱుఁగను నిన్నున్
మానినులసత్యవచనలు
నా నిట్టుల సత్యభాషణం బుచితంబే ?" (1-4-90)

అన్న దుష్యంతుని పొడిపొడిమాటలు గమనింపదగ్గవి. ఈ కందపు నడక వంకరటింకరగా ఉండి, రచన అంతా శిథిలమై, హృదయాన ఏదో ఒక నిశ్చయానికి రాలేక బాధపడుతూన్నవాని మాటల తీరునుపోలిఉన్నది కాని, నిశ్చయంగా భార్యనుకోరి అవమానించదలచినవాని మాటలలా లేవు. అందుచేతనే లోకాపవాద భీతిచేత ఆమెను తానెఱుగనన్నాడని దుష్యంతుడన్న మాటను మనము యదార్థమేనని నమ్మగల్గుతున్నాము.

ఇంకొక చిత్రమేమంటే దుష్యంతుడు యయాతికి పెద్ద contrast (విజాతీయమైన ప్రకృతి). లోకానికి తెలిసిన యయాతి ఒకడు. అంతఃపురములో సంచారం చేసే యయాతి మఱొకడు. తన సాంసారిక విషయాలలో లోకానికి సంబంధము లేకుండా ఉండేటట్లు చేసుకోగల్గాడు యయాతి. అందుచేత రాజుగా కనబడే యయాతికి సంసారిగా కనబడే యయాతికి ఎక్కడా స్పర్థ రాకుండా చూచుకోగల్గిన లౌకికుడాతడు. అయినా చివరకు మాత్రం పూరుని రాజుగా చేసేటప్పుడు లోకానికి ఈతడు కొంత సమాధానం చెప్పవలసిన అవసరం ఏర్పడింది.

దుష్యంతునిలో ఇన్ని అరలు పొరలు కానరావు. దుష్యంతునికి గల వ్యక్తిత్వమంతా రాజుగానే ఉన్నది కాని, అంతకు మిగిలి వేఱే ఏమీ కానరాదు. యయాతి వేటకు వెళ్ళినా, శుక్రాచార్యునిచూచినా, ఒంటరిగా వెళ్ళాడన్న భావం మనకు కల్గుతుంది. దుష్యంతుడు అలా

కాదు, వేటకు వెడితే సపరివారంగా బయలుదేరుతాడు, "అమాత్య పరిజన పురోహిత సహితుండై" కణ్వమహాముని ఆశ్రమం వరకు వెళ్ళాడు, శకుంతల కొడుకుతో "దుష్యంతుపాలికివచ్చి సకల సామంత మంత్రి పురోహిత ప్రధాన పౌరజన పరివృతుండై యున్న రాజు"ను చూచింది. దుష్యంతుడు తన కేమీ వ్యక్తిత్వాన్ని మిగుల్చుకోకుండా అంతా తాను రాజుగా నుండడంలోనే పర్యవసించేటట్టు చేసుకొన్నాడు అందుచేతనే అతడు శకుంతల నెఱుగననీ, అశరీరవాణి పలుకులు వినడంతో మహానందభరితుడై, "శకుంతల పతివ్రతాత్వంబును సత్యం బును" లోకానికి వెల్లడి అవడంతోనే, "మహానురాగంబునం గొడుకు నెత్తికొని హర్ష పులక లెసఁగ నాలింగనంబు" చేసికొన్నాడు.

అందుచేత ఈ దుష్యంతుడు పాపభీతిలేని, సత్యానికి వెఱవని వాడు కాడు. ఈతడు తన సర్వస్వాన్ని - తన హృదయంతో కూడా అన్నింటిని - తన రాజధర్మానికే అంకితం చేసికొన్నాడు. యయాతి రాజధర్మాన్ని, వ్యక్తిగత జీవితాన్ని విడివిడిగా ఉంచుకోగల్గాడు, అది ఈనాటి ఆదర్శం కావచ్చు. కాని జీవితమే రాజధర్మానికి కట్టుబడి ఉండడమన్నది దుష్యంతుని ఆదర్శం. అందుచేత దుష్యంతునికి వ్యక్తిగత జీవితమన్నదే లేదు. యయాతికి ఉన్నది. కాని ఆ యయాతికూడ తన రాజ్యాన్ని పూరునికి అప్పగించేటప్పుడు తన ప్రజకు కొంత సంజాయిషీ చెప్పుకొనవలసి వచ్చింది. దుష్యంతుడలా చెప్పుకొనవలసిన అవసరం లేకపోగా, అతని పక్షాన దివ్యవాణి మాటాడేటట్లు చేసుకో గల్గాడు. ఇది దుష్యంతుని ప్రత్యేకత.

ఇక ఈ కథలోని శకుంతల పాతివ్రత్యానికి,సత్యానికి చిహ్నము పాతివ్రత్య మెంత తీక్ష్ణమైనదో, అంత అమాయకనమైది. సత్యమెంత నిష్ఠురమైనదో, అంత స్వచ్ఛమైనది. శకుంతలకూడ అంతటి ముద్దరాలు ఆమె హృదయము స్ఫటికజలంలా సచ్ఛమైనది. అందులో ఆమె అనురాగాన్ని (1-4-51,55),ఆమె కోరికలను (1-4-59), ఆమె ఆవేదననీ (1-4-77,102), అన్నింటినీ చూడగలం. అయినా ఆమె చూపులో

తీవ్రత, వాక్కులో తీక్ష్ణత లేకపోలేదు. ఇవీ ఆమె పాతివ్రత్య సత్యాల నుండి ఆవిర్భవించినవే. వీని అండదండలవల్లనే ఆమె అడవులలో పెరిగినా, కొలువుతీర్చిన రాజు సమక్షాన ఆమె జంకుగొంకు లెఱుగదు. ఈమె శర్మిష్ఠను పోలిన ముద్దరాలు. దమయంతి యంతటి మహా ప్రాజ్ఞురాలు. అన్నింటికన్న ముఖ్యంగా తన "చిత్తంబెప్పుడు ధర్మవు నంద తగిలియుండను" వరమును పొందింది. ధర్మమందు చిత్తము తగిలి ఉండడానికి ఒకే ఒక ముఖ్యలక్షణం ఉంటేచాలు. pristine purity ని కాపాడుకోగలదు. శకుంతలలో మనకు సృష్టియొక్క తొలి ఉషస్సు నాటి pristine purity కనబడుతుంది !

ఇట్టి శకుంతలకు అనుకూలమైన పరిసరాన్ని సృష్టించడానికి నన్నయ కణ్వాశ్రమాన్ని, తత్ పరిసరాలను సర్వమనోజ్ఞముగా వర్ణించాడు. అక్కడిచేత నాచేతన వస్తు సంచయమంతా రమణీయ భావాన్ని పుంజుకొన్నాయి. అందలి పోకిరీపిల్ల వాయువులుకూడ ఆతిథ్య మర్యాదను పాటిస్తాయి. అగ్నులనుండి ఆవిర్భవించే ధూమ లతలు పవిత్రతను వ్యాపింపచేస్తాయి అక్కడి శుకములు ఆలపించేవి సామ గానములు. సహజవైరి వర్గములు ఏవో మనకు తెలియనంత సహావా సంతో అక్కడి ప్రాణులన్నీ ఒకేఒక పరమపావనమైన స్నేహభావంతో పునీతమైపోయాయి. ఇది "తద్దయు రమ్యంబయిన" ఆశ్రమమన్నాడు కవి. విశాలమైన అవనీతలము ఎంతో ఉండగా "నరనారాయణ స్థానం బునుం బోలె జగత్పావనంబగుచున్న ఈ తపోవనంలోనే శకుంతల "అవతరించడం"లోని ఔచిత్యం అపూర్వమైనది. ఈ ఆశ్రమ సరో వరములో సత్యాహింస శమదమాది సద్గుణ వారిజోత్కరములు తొలి ఉషస్సులో మేల్కొన్నాయి. వీని సౌరభంవల్ల భరతవంశము పునీతమైంది.

అంతేకాదు, ఆ సౌరంభం అజరామరమై నాటికి, నేటికీ కూడ ఈ కథలో గుబాళిస్తూనేఉంది.

సాహితి. జూలై; 1966

..........

# నన్నయ భృగువంశ కీర్తనము

శ్రీ వడలి మందేశ్వరరావు

భృగువంశ కీర్తనము, సర్పయాగ కథ-ఈ రెండింటినీ జంటకథ లనవచ్చును. భృగువంశ కీర్తనము ఆదిపర్వమందలి ప్రథమాశ్వాసమున చెప్పబడినది. సర్పయాగ కథ ద్వితీయాశ్వాసమందలిది. భృగువంశ కీర్తనమును రెండు భాగములుగా చూడవచ్చును. మొదటి భాగమం నందలి కథ అగ్ని సర్వ భక్షకుడగుట, రెండవ భాగము ప్రమద్వరకథ. సర్పయాగ కథనుకూడ రెండు భాగములుగా చూడవచ్చును. మొదటి భాగము, సౌపర్ణోపాఖ్యానము, రెండవ భాగము ఆస్తీకుని చరితము. భృగువంశ కీర్తన కథా శరీరమందలి రెండు భాగము లెట్టినిష్పత్తిలో నున్నవో, సర్పయాగ కథా శరీరమందలి రెండు భాగములను కూడ ఆ నిష్పత్తిలోనే ఉన్నవి. ఈ రెండు కథలలోను పూర్వోత్తర భాగములకు గల కాల వ్యవధి విశాలమైనది. ఈ రెండు కథలలోను సర్పకులమునకు గలిగిన అకాండ ప్రళయము, అది ఉడిగింపబడుట వర్ణింపబడినది.

భృగువంశ కీర్తనము చాల చక్కని కథ. అందులో పూర్వ భాగములోని అందము వేఱు, ఉత్తరభాగములోని అందము వేఱు. ఈ రెండు భాగముల నిర్మాణములోను ఒక రకమైన సౌష్ఠవము (symmerry) కనబడుతుంది.

పులోమను రక్కసుడెత్తుకొని-ప్రమద్వర సర్పదష్ట అగుటపోవుట.

చ్యవనుని వలన పులోమకు విముక్తి కల్గుట

రురుడు తన ఆయుర్దాయానిచ్చి ప్రమద్వరను బ్రతికించుకొనుట.

తన భార్యకు కల్గిన ఆపదకు కారణమగు అగ్నిహోత్రుడని భృగు వానిని శపించుట.

తన భార్య మరణానికి కారణమైన పాపజాతిని రురుడు తుదముట్టించ దలచుట.

. . . . . . . . .

బ్రహ్మ అగ్నిహోత్రునికి తొల్లింటి పవిత్ర స్థానాన్ని ఇచ్చుట. సహస్రపాదుడు పాములకు గల ముప్పును తొలగేటట్లు రురుని మనసు మళ్లించుట.

స్థూలదృష్టికి కథానిర్మాణంలో ఇంతకన్న ఎక్కువ విశేషము కానరాదు. పాత్ర చిత్రణపట్ల ప్రత్యేకమైన శ్రద్ధ కానరాదు. పాత్రల మనస్సులలో అరలు పొరలు కనబడవు. ఛందోరీతులలో ప్రత్యేక ప్రయోగ విశేషములు లేవు.

అయినప్పటికి నన్నయ రచనకు ఉదాహరణగా నీయదగిన రీతిని నడిచినది భృగువంశ కీర్తనము. కథను రెండు మూడు విధాలుగా చెప్పవచ్చును. కథను పాత్రల మనస్తత్వ దృష్టినుంచి గాని, ప్రత్యేక పరిస్థితులలో పాత్రల ప్రవర్తన విధానాలు ఎలా ఉన్నాయో అనిగాని పరిశీలించవచ్చును. ఈ మార్గమున ప్రతీకథా అనేక విధాలుగా వ్రాయవచ్చును. ఇదిగాక కథ చెప్పటలో ఇంకొక మార్గమున్నది. జరిగినది జరిగినట్లుగా, తటస్థుడు చూచినట్లుగా, పాత్రల మనసులలోనికి ప్రవేశించకుండా కేవలము ఒక చరిత్రను కాని, సంఘటనను కాని ఏకరువు పెట్టినట్లు ఉండవచ్చును. ఇది పైకి చాల తేలికైన మార్గము. కాని,కవికి సాయపడే పరికరాలయిన పాత్రల మనస్తత్వాలు,దీర్ఘమైన సంభాషణలు, సంభాషణలోని చమత్కారాలు, మలుపులు,విరుపులు, లోకోక్తులు, ఇందులో ఏమీ ఉండవు. దీర్ఘమైన వర్ణనలకు ఇందులో తావు లేదు. అందుచేత భాషకూడా ఎక్కువ అలంకృతమై ఉండదు. అందుచేత ఇట్టి కథనములో సాధారణముగా కవికి సాయపడే సామగ్రి అంతా బహిష్కరింపబడుటచేత కథ రక్తికట్టుట చాలా కష్టము.

నన్నయ భృగువంశ కీర్తనమిట్టి నిరాడంబరమైనకథ. ఇందులోని రచన ఇంచుమించుగా నిరలంకారముగా నిర్వహింపబడినది. ఇందులో మనలను ఆశ్చర్యపరచే విదగ్ధ సౌందర్యమేమీ లేదు. కాని, యీ కథకు ఒక స్నిగ్ధ సౌందర్య పరివేషం నన్నయ కల్పించినాడు. దీనిని

నన్నయ కేవలము శబ్దమువల్లనే సాధించినాడు. చిత్రకారునికి రంగులు, శిల్పికి రాయి, గాయకునికి నాదము ఎట్టివో, కవికి శబ్దము అట్టిది. కాని, శబ్దాన్ని కవులందరు ఒకేవిధముగ ఉపయోగించరు. శబ్దాలతో చిత్రాలను కల్పించి శబ్దముచేత ఎంతో చాకిరీ చేయించుకుంటారు, కొందరు కవులు. వారికి శబ్దము యొక్క ప్రయోజనము తర్వాత ఏర్పడే చిత్రానికి దోహదము చేసేటంతవఱకే. ఇంకొక తరహా రచనలో శబ్దాల పట్ల కవికి గల మోజు హెచ్చు. అందులో కొందరికి వాటిలోని నాద విన్యాసముపట్ల వల్లమాలిన అభిమానం. అందుచేత ప్రాసలతోను, అను ప్రాసలతోను, లాటాను ప్రాసలతోను శబ్దాలతో శ్రవణ పేయమైన రంగవల్లుల నేర్పరుస్తాడు. మఱికొందరు కవులు శబ్దార్థములకు గల పొత్తు ఎంతవఱకు సాధ్యమో, ఏశబ్దము ఎంత అర్థాన్ని యీయగలదో, ఒకానొక అర్థము సిద్ధించడానికి ఎంతతక్కువ పదజాలాన్ని వాడడ మవసరమో మున్నగు వానికి సంబంధించిన ప్రయోగాలనుచేసి, భాషను ఆలోచనకు, భావ ప్రకటనకు సున్నితమైన, సునిశితమైన పరికరముగా మలుస్తారు. తిక్కన వంటి కవులకు శబ్దము మొదటి విధముగా ఉపయోగపడింది. శబ్దాలంకారములపట్ల మక్కువగల కవులు రెండవ మార్గాన్ని అనుసరించారు. ప్రబంధకవులు మూడవ మార్గాన్ని అన్వేషించారు.

నన్నయ మార్గము వీని అన్నిటికన్న చాల భిన్నమైనది, సుందరమైనది. ఇందులో ఫలము (Effect) కోసం ప్రయత్నంలేదు. భాషను మరి ఏదో ప్రయోజనము నాశించి వాడుతూన్నస్ఫురణకల్గదు. శబ్దాలంకారముల ప్రాచుర్యం కానరాదు. భాషను భావ ప్రకటనకు ఉత్తమమైన పరికరముగా మలుస్తున్నామన్న భావము కానరాదు. ఇందులోని ప్రతి శబ్దము ఒక ముగ్ధ ప్రమద్వర వంటిది. ప్రమద్వరను గూర్చి మనకేమి తెలుసునంటే, ఏమీ తెలియదు. కాని మన మనసున మాత్రం మనకు ప్రమద్వర అంటే విపరీతమైన అభిమానం. నన్నయ ప్రయోగించిన శబ్దాలు కూడ అట్టివే. ప్రమద్వర 'ప్రమదాజనంబుల

యం దెల్ల నుతకృష్ట.' ఆమెతండ్రి గంధర్వరాజు, తల్లి మేనక, పెరుగుతున్నది మహాముని ఆశ్రమమున. అందుచేత తండ్రిలోని ఓజస్సు, తల్లిలోని లావణ్యము ఆమెలో కనబడాలి. ఆశ్రమవాస జీవితంలోని నిరాడంబరత్వం పవిత్రత ఆమెలో ఉండి ఉండాలి అని మనము వూహించవచ్చును. అలాగే నన్నయ రచనలో సంస్కృతములోని ఓజోగుణము, తెనుగులోని లావణ్యముతో బాటు ద్రష్టయొక్క వాక్కు కనబడుతుంది. ఇందులో ప్రయత్న స్ఫురణ ఎక్కడా కానరాదు, అయినా ఏ సందర్భంలోను అర్థమునకు గుఱి తప్పడంకూడా కానరాదు. నన్నయ శబ్దములే కరిగి భావములుగా మారిపోతాయి గాని, శబ్దము నుండి భావము ఉద్భవిల్లదు. శబ్దమే అర్థము, భావము. అంటే నన్నయ శబ్ద ప్రయోగానంతరము శబ్దమునకు అర్థమును మన మాలోచించి, దానినుండి కవి భావమును వూహింపవలసిన అవసరము లేదు. శబ్దమును గూర్చి నగిషి చేయుచున్నంతసేపును శబ్దముయొక్క వ్యాపారము సంకుచితమైనదే అయిపోతుంది. నన్నయ శబ్దమే ప్రాణవంతమైన అర్థము, ప్రణవాన్ని పోలే భావము.

భృగువంశ కీర్తనములో గోచరించే ముఖ్యమైనసౌందర్యమిదే. ఆరంభమున కథ పరుగిడుతూన్నట్లు కనబడుతుంది.[2] ఎక్కడా పాత్ర చిత్రణ కొఱకు ప్రత్యేకమైన శ్రద్ధ కనబడదు అయినా పులోముడు వింతరక్కసుడుగాను, భృగుపత్ని అతి సాధ్వసచిత్తగాను కళ్ళకు గట్టినట్లు కనబడుతారు.

'అయ్యసుర నిన్నెఱింగె? నెవ్వరు సెప్పి?'రని భృగువు అడిగిన ప్రశ్నకు సమాధానముగా 'పులోమ యిట్లనియె :

"ఈ యగ్ని దేవుఁ డసురకు
నోయన చెప్పుటయు విని మహోగ్రాకృతితో
నా యసుర నన్ను సూకర
మై యప్పుడు యెత్తికొని భయంబునఁజనుచోన్.
కుక్షి చ్యుతుఁడై సుతుఁడా

రాక్షసు భస్మంబు సేసె-రాజిత శక్తిన్
రక్షించె నన్ను'ననవుడు
నా క్షణమ మునీంద్రుఁడగ్ని-కతిరోషమునన్.'
(1-1-133, 134)

"నీ వతి క్రూరుండవు, సర్వ భక్షకుండవు(గ"మ్మని శాపంబిచ్చె. (1-1-135) ఈ శాపము వచనంలో ఉన్నది. కాని, యీ వచనంలోని రెండువాక్యాలు వెనుకటి పద్యమునుండి దూసుకొనివచ్చి యీ లెలలా ఉన్నాయి. ఇందులో మునీంద్రుని రోషము ఉన్నది. గర్భవతి అయిన భార్య మహాపదకు గురిఅయి సాధ్వసచిత్త అయినందుకు ఆమెపట్ల జాలి ఉన్నది. కుక్షిచ్యుతుడైన బాలునికి మహాపద తప్పిందన్న స్ఫురణ ఉన్నది. సుతుడా రక్కసుని భస్మము చేశాడన్న తృప్తి విస్మయము కూడా ఉన్నాయి. ముఖ్యముగా ఇన్ని ఇక్కట్లకు కారణామైనవాడు అగ్ని అన్న భావము హృదయాన్ని దహించివేయడమున్నది 'ఆ క్షణమ మునీంద్రు డగ్ని కతి రోషమునన్' అన్న భాగము పద్యములో ఇమిడిపోయి తర్వాతి వాక్యాలు మఱి చిన్నవి కావడం వలన ఈ శాపము మిక్కిలి తీక్ష్ణమైన దయింది.

ఈ కథ ఇంతటితో ముగిసినట్లే. మిగతా కథను రెండు వాక్యాలతో చెప్పవచ్చును. 'అగ్నిభట్టారకుండు నఖిలలోక వ్యాప్తంబైన తన తేజోమూర్తి నుపసంహరించగా, బ్రహ్మ దాని నెఱింగి, యగ్నిదేవు రావించి, అమ్మహాముని వచనం బమోఘుంబు గావున నీవు సర్వభక్షకుండ వయ్యును, శుచులయందెల్ల నత్యంత శుచివై, పాత్రులయందెల్లఁ బరమ పాత్రుండవై, పూజ్యులయందెల్ల నగ్రపూజ్యుండవై, వేదచోదిత విధానంబులయందు విప్రసహాయుండవై భువనంబుల నడపుమని విశ్వగురుండు వైశ్వానరుం బ్రార్థించి, నియోగించి, భృగు వచనంబు ప్రతిష్ఠాపించె!'

కాని, మొదటి భాగము ఏడు పద్య గద్యములలో (25 పంక్తులలో) చెప్పగా, ఈ భాగానికి ఎనిమిది పద్య గద్యాలు (సుమారు 30 పంక్తులు) అవసరమైనది. అందులో సగ భాగము తా నసత్యమాడ

రాదనియు, తాను శాపమును పొందిన లోకయాత్ర లేకుండుననియు, అగ్నిభట్టారకుడు భృగునితో చెప్పిన మాటలు. తర్వాతి సీసపద్యములో అగ్ని తన తేజోమూర్తి నుపసంహరించగా జనులు సంభ్రమాక్రాంతు లగుట, మునులు, దేవతలు బ్రహ్మకడకేగుట చెప్పబడినది. తర్వాత బ్రహ్మ అగ్నిదేవుని రావించి భృగువచనమును ప్రతిష్ఠాపించుట వివరింపబడినది. ఈవిధముగా ఇక్కడ పూర్వోత్తర భాగములు ఎంతో పరస్పరానను రూపముగా ఉన్నట్లు కనబడుతుంది. కాని కథను చదువు తూంటే ఇట్టి అనుమానమే కలుగదు.కథఅంతా ఒకేవిధముగా నడుస్తు న్నట్లు తోస్తుంది. కాని, మొదటి భాగములో అనేక విషయాలు చొప్పించబడ్డాయని, రెండవ భాగములో ఒక్కచిన్న అంశమే సాగదీయ బడిందని ఎవ్వరికీ తోచదు. అసలు కథను ఇన్ని భాగాలుగా విడదీసి చూడదనే చూడము. అంతా ఒకే ఒక సంఘటన అనేభ్రాంతిని కవి కల్పించాడు.'భృగువచనంబు ప్రతిష్ఠాపించి' అన్నమాట యీభ్రాంతిని బలపరుస్తుంది

అయినప్పటికి ఈ ఉత్తరభాగ మింత పొడవుగా ఏల ఉన్నదన్న సందేహానికి సమాధానమీయవలసి ఉన్నది. వైదిక కర్మలకు అగ్ని హోత్రముతో ముడిపడియున్న సంబంధాన్ని బట్టి, నన్నయ నాటి దినములలో ఈ విషయముపట్ల ప్రజలకుగల ఆసక్తిని బట్టి, నన్నయ ఈ భాగానికి ఇంత ప్రాముఖ్యాన్ని ఇచ్చిఉండవచ్చు. కాని వైదిక సంప్రదాయానుయాయులకు ప్రత్యేకముగా ప్రీతిపాత్రమైనదైనా, దాని పట్ల ప్రత్యేకమైన అభిమానము లేనివారికి కూడా యీ భాగము ఆవశ్యకమని తోచునట్లే, యీ భాగమును నన్నయ నిర్వహించాడు. అంటే మొత్తము భృగువంశకీర్తనాన్ని శిల్పదృష్టితో చూడవలసిన అవసర మున్నదన్న మాట.

ఈ దృష్టితో చూడగా ఈ భాగములోను తర్వాతి ప్రమద్వర కథలోను శాంతమే ప్రధానమైనరసము. ఇది కేవలము జీవితాన్నుంచి భయపడి, పారిపోయి, చెట్లు పుట్టలు పట్టగా, లోకమునుండి దూరము

కాగా ఏర్పడిన విరాగముతో కూడిన శాంతము కాదు. భృగువంశ కీర్తనములో ఎందరో మహర్షులున్నారు కాని, చిత్రమేమంటే వీరందరూ వీతరాగులూ, జడ భరతునివలె నిష్కర్ములూ, నిస్సంసారులూ కారు. వీరందరి వివాహములు చిత్రమైనవి. భృగువు పులోముడనె రక్కసునిచే వరియింపబడిన పులోమను వివాహమాడాడు. అతని కొడుకు చ్యవనుడు. అతడు సుకన్య అనే రాచబిడ్డనుకోరి వివాహము చేసికొన్నాడు. అతని కొడుకు ప్రమతి. అతడు ఆమృతోద్భవ యగు ఘృతాచిని వలచి రురుచికి తండ్రి అయాడు. రురుడు ఒక "గంధర్వ రాజునకు మేనకకుం బుట్టినదాని రూపలావణ్య గుణంబులు ప్రమదా జనంబులయందెల్ల నుత్కృష్టయగుటం జేసి ప్రమద్వరయననొప్పుచున్న కన్యక నతి స్నేహంబున" వివాహమాడ దలచాడు. ఆమె సర్పదష్టయై మరణించగా తన ఆయుర్దాయమందు సగ మామెకిచ్చి, ఆమెను బ్రతికించుకున్నాడు. వీరందఱిని నిస్సంగులనీ, వీతరాగులనీ, లోకాన్నుంచి ఎక్కడికో పరువెత్తిపోయేవారనీ ఎలా అనుకోగలం ?

వీరు ఉత్తమ శృంగార ప్రియులేగాక ఇతర విధములుగాకూడ నిష్క్రియాభిముఖులుగారు. భృగువు రోషించినవాడై అగ్ని భట్టారకుని శపించగా, బ్రహ్మకూడా చేయగలిగిందేమిలేక అతని వచనాన్ని ప్రతిష్ఠాపించగల్గాడంతే ! తల్లి గర్భమందుండగానే చ్యవనునికి రక్కసునిపై మిక్కిలి కోపం గల్గింది ! కుక్షిచ్యుతుడైన అతడు ఆ రాక్షసుని భస్మము చేశాడు. ఇక రురుడు :

"కన్నియలతోడ నాడుచు-నున్న దానిఁ
బాద మర్దితమై యొక్క-పన్నగంబు
గఱచెఁ గన్నియ లందఱు-వెఱచి నఱచి
యఱచుచుండ బ్రమద్వర-యవని ద్రెళ్ళె."

(1-1-146)

ప్రమద్వర అంటేనే ప్రకృష్టమైన మదమున కాస్పదమైనది. అట్టి ప్రమదాజనంబులయం దుత్కృష్ట. రాచకూతురు. అందులో ఆడుతూన్నది—ఆమెను కఱచింది ఒక పాము. కాని, నన్నయ అలా అనలేదు. 'పాద మర్దితమై యొక్క పన్నగంబు గఱచె' నన్నాడు. త్రొక్కబడిన పాము కఱవడం సహజమే అయినా, నన్నయ వాడిన శబ్దముల ఔచిత్యము గమనింపదగ్గది. పన్నగమంటే పాదములచే నడచునది కాదని అర్థము. పాదములచే నడచునది కాబట్టి ఒక ప్రాణి పాద మర్దిత కావడంతో, ఆ ప్రాణికి ఎక్కడలేని అక్కసు రావడానికి అవకాశ మున్నదన్న ధ్వనివల్ల తప్పు పాముదిగాక ప్రమద్వరదే అవుతోంది. కాని,సద్యఃదష్టయైక ప్రమద్వర మరణించింది. ఇది తప్పొప్పులు తేల్చుకొను సమయముకాక "కరుణా కలిత హృదయుల"ము కావలసి యున్నది. రురుడామెను వివాహమాడలేదు. కాని, శోకవ్యాకుల హృదయుడు. తన శోకాన్ని పైకికూడా చెప్పుకోలేని అవస్థ.అందుచేత "ఏకతంబ" వనమునకు వెళ్ళారు. దీనవదనుడై ఆక్రోశించాడు. ప్రమద్వరను బ్రతికించుకొని ఆమెను వివాహమాడాడు.

కాని భార్య మరణానికి కారణమైనది పాదమర్దితమైన ఒక పన్నగము కాగా,రురుడు పాపజాతి మీదనే పగబూనాడు. కనిపించిన పామునల్లా చంపడం ప్రారంభించాడు. ఇట్టివానిని మనము కామ క్రోధాలు జయించిన వానిగా ఎలా భావిస్తాము ?

అందుచేత భృగువంశములో శృంగారము, వీరము, కరుణము, క్రోధము మున్నగువానికన్నిటికీని అవకాశమున్నది. కాని పూర్వోత్తర భాగములు రెండింటను ఇవిఅన్నియు శాంతమునందే పర్యవసానమును పొందుట గమనింపదగినది. 'అట్టి' భృగువు (1-1-143) అని వ్రాది చెప్పబడిన భృగువు కూడ శాంతుడై అలిగినను, మహా పరుషములు పల్కినను అలుగనోడిన అగ్నిదేవుని శాంతము ముందు కథలో తిరోహితుడు కావలసి వచ్చినది. అందుచేతనే పూర్వకథయందు శాంతము

ప్రధానమైన అగ్నిహోత్రానికి ఎక్కువ ప్రాముఖ్యమీయబడినది. అనగా ఈ పూర్వ కథయందలి కరుణము, వీరము, క్రోధము మున్నగునవన్నియు శాంతమునందే అంతర్భూతమైపోయినవి.

అట్లే ఉత్తరభాగమునందును పాములపట్ల రురుని పగ, వానిని చంపుటయందు దాతడు చూపిన ఉత్సాహము, అతని సంరంభము అన్నియు సహస్రపాదుని ఉపదేశమువలన తిరోహితమైపోయినది.

ఈ ప్రథమాశ్వాసమునందు శాంత రసావిర్భూతికల్గినది. వినెడివారు మహర్షులు, వినిపించెడివాడు ఉగ్రశ్రవసుడు, కవి బ్రహర్షి, కావ్యము భారతమ్యమరాపగ, అందలి రసము శాంతము. అందుచేతనే ప్రథమాశ్వాసమున గల తొలికథ శాంతరస ప్రధానమైన భృగువంశ కీర్తనముతో భారత కథా విర్భూతికి అనుకూలమైన వాతావరణము సృష్టింపబడినది. భృగువంశ కీర్తనమును సాధనముగా గ్రహించి శ్రోతల మనస్సునందలి కల్మషమును కడిగివేసి, వారిని శాంతరస ప్రధానమైన భారతకథా శ్రవణమునకు అనుకూలమైన చిత్తవృత్తిని గలవారినిగా సన్నద్ధులను చేయగలిగాడు నన్నయ. ఈ ఒక్క కారణము చాలును—ఈ కథకు ఈ ఆశ్వాసమందొక స్థానము లభించడానికి.

○ ○ ○

ఇక ఈ శాంత రసమును పోషించు అంశములు మఱి కొన్ని యీ రచనలో కనబడతాయి. అందులో ఒకటి యీకథలో వచనానికి గల ప్రాబల్యం. ఈకథలోని వచనము భాషకే వన్నె తెచ్చేది. ఇందులో అలంకారములు లేవు. దూరాన్వయం లేదు, పద కాఠిన్యం కనబడదు. పాఠకునికి చిక్కులు కల్గించే గూఢకథలు కనబడవు. ఇంతకన్నా నిష్పాక్షికముగా వివరింపబడిన చరిత్ర ఎక్కడా కానరాదు. రచన ఎంత నిరాడంబరమో అంత ఉదాత్తమై శాంతరస పరిపోషకముగానున్నది. భారతము శాంతరస ప్రధానమైన కావ్య మగుటవల్లనే నన్నయ దానిని చంపూ కావ్యముగ రచింప సమకట్టెనేమో? ఈ

విషయమును గ్రహించిన తిక్కన తన ఉత్తరరామాయణమును నిర్వచనముగా రచించి, శాంతరస ప్రధానమైన భారతమును తిరిగి చంపూ కావ్యముగ రచింప సమకట్టెనేమో ? తర్వాతి కవుల రచనలలో శాంతరస ప్రాధాన్యము తగ్గినకొలదియు వచన రచనయందాడంబరము పెరిగినదేమో ? దీనిని గూర్చి సిద్ధాంతము చేయుట సాహసమే కాని, శాంతరస ప్రధానమైన కావ్యములయందు శోభించినంతగా, ఇతర రస ప్రధానములైన కావ్యములందు వచన రచన శోభిల్లదేమో సహృదయులు పరిశీలింపదగిన అంశము.

శాంతరస ప్రధానమైన భృగువంశ కీర్తనమునకు వన్నె తెచ్చిన మఱొక అంశము అందలి పాత్ర పోషణము. అందలి పాత్రలు ఒక్కొక్కరు ఒక్క క్షణకాలము మాత్రము మన మనోనేత్రమునకు ముందుగ నిలిచి తిరోహితులగుదురే కాని, వివిధ దృక్కోణముల నుండి పరిశీలించుట కవకాశము కల్పించెడివారు కారు. పులోముడు వింత రక్కసుడు, పులోమ అతి సాధ్వసచిత్త, కుక్షి చ్యుతుడైన చ్యవనుడు దుర్నిరీక్ష్యుడు, తండ్రికగపడిన చ్యవనుడు బాలార్కుడు. అగ్నిదేవుని శపించడానికి సన్నద్ధుడైన భృగువు, పాముని త్రొక్కిన ప్రమద్వర, శోకవ్యాకుల హృదయుడై ఆక్రోశించిన రురుడు, కృతాంతకరదండంబుబోని దండము నెత్తుకొని పాములను డొల్లజేసెడి రురుడు, 'హరిహరి' అంను భయపడే డుండుభ మహాహి—ఒక్కొక్కటి ఒక్కొక్క చిత్రం. ఈ విధమైన రచనవల్ల ప్రతీ పాత్ర కూడా మన సానుభూతికి పాత్ర మవుతూ, ఏ పాత్ర కూడా మన మనసునంతా ఆక్రమించుకోదు. శాంత రససిద్ధికి ఒక విధమైన నిర్మమత అవసరం.—అంతర్ముఖులం కావడం అవసరం. ఈ భృగువంశ కీర్తనములోని పాత్ర చిత్రణలో నిర్మమత పరాకాష్ఠ చెందింది. ఇది అగ్నిభట్టారకుని పాత్ర చిత్రంలో మరీ చిత్రముగా కనబడుతుంది. ఈ కథలోని అగ్నిభట్టారకుడు సత్యాసత్యాలను చెప్పగల్గినవాడు, ధర్మాధర్మ వివేచన చేయగలడు. శాపానుగ్రహ సమర్థుడు, ఆకలి దప్పికలు అతనికి ఉన్నాయో

తేదో కాని సర్వభక్షకుడయాడు. అతడు శుచి, పాత్రుడు, పూజ్యుడు కథలో ఏ యితర పాత్రనుగూర్చి మనకు ఇన్ని విషయాలు తెలియవు. కాని, ఈ పాత్ర ఎక్కడా మన కళ్ళకు రూపుకట్టదు. మనకు రూపు కట్టేది ఒక్కటే. అది నిఖిలలోక వ్యాప్తంబయిన అగ్నిదేవుని తేజో మూర్తి. ఈ రూపునకు ఒడ్డూపొడుగు గల మూడు పరిణామములు లేవు. ఇది కాలము అనబడే చతుర్థ పరిమాణంలో కూడ కనబడక, మనస్సు నంతా ఆక్రమించే పంచమ పరిమాణములో నున్న నిర్వికారమైన, నిర్గుణమైన, కాలాతీతమైన శాంతగుణ ప్రధానమైన తేజస్సు; ఏదో మన మనస్సును ఆక్రమిస్తోంది. ఈ మూర్తిని ఆ పరిమాణంలో గాని అందుకోనలేము. పాత్ర చిత్రణములో ఇది అపూర్వమైనది. అద్భుత మైనది. ఇక్కడ మన మనసును ఆక్రమించేది త్రిలోక పావనమైన ఒక తేజోమూర్తి, ఒక తేజో విశేషము. చిత్రవర్ణ స్ఫూర్తి గల విచిత్ర వ్యక్తులను సృష్టించడం కంటె నిరాకారాత్మమైన తేజోమూర్తికి గుణవాచకములను వాడుతూ, ఆ గుణములన్నీ తేజోమూర్తిలో లీన మయేటట్లుగా చేసే సృష్టిలోని అపూర్వమైన, రమణీయోదాత్తమైన, అఘనిబర్హణమైన రచనలోని పవిత్రసౌందర్యాన్ని గుర్తించమని కోరు తున్నాను. ఇట్టి అపూర్వమైన రచన నన్నయ వాక్కునకు కట్టుబడి ఉండడంచేతనే ఈ ఆదికవి వాగనుశాసను డయాడు.

భారతి. మే; 1965

...........

# నన్నయ యయాతి చరిత్ర

శ్రీ వడలి మందేశ్వరరావు

ఒక మహాకవి నన్నయభట్టారకుని ఒక కుంజరముతో పోల్చాడు. ఆ కవి ఆదికవి నలా ఎందుకు పోల్చాడో నాకు తెలియదు గాని, భారతేతిహాస రచనలో నన్నయ పోకడ సామజగమనాన్ని స్ఫురింప జేస్తుంది.

ఆది పర్వ తృతీయాశ్వాసమున 'సురాసుర వంశావతార కీర్తనము' వినిన జనమేజేయునికి మరొక్క కోర్కె కల్గింది.

"అభ్యస్త వేద వే-దాంగులు విధి దత్త
దక్షిణా ప్రీణిత-ధరణి దేవు
లనవరతాశ్వమే-ధావ భృథ స్నాన
పూత మూర్తులు కృత-పుణ్యుల హిత
వర్గజయుల్ పరి-త్యక్త-వర్గ చతుష్టయుల్
సత్త్వాది సద్గుణ-జన్మ నిలయు
లా భరతాది మ-హా మహీపాలకు
లిద్ద యశోర్థు లెం-దేనిఁబుట్టి
రట్టి కేదరవాన్వ - యంబు పాండవ నృప
రత్నములకు వారి - రాశియైన
దాని వినగ వలతుఁ - దద్దయు బ్రీతితో
విప్రముఖ్య నాకు - విస్తరింపు" (1-3-86

మని జనమేజేయుడు వైశంపాయనుని అడిగాడు. అప్పుడు వైశంపాయనుడు కౌరవవంశవివరణము ప్రారంభించాడు. అందులోని తొలి పద్యం చంపకమాల :

"నిరుపమ ధర్మమార్గ పరి నిష్ఠితులై మహినెల్లఁ గాచుచుం

బరఁగిన తొంటి పూరుకురు పాండు మహేశుల పేర్మిఁ జేసి భూ
భరవహన క్షమంబగుచుఁ బౌరవ కౌరవ పాండవాన్వయం
బురుగుణ సంపదం బెరఁగి యొప్పె సమస్త జగత్ప్రసిద్ధమై"
(1-3-88)

ఆలోచించగా వెనకటి సీసపద్యము, ఈ చంపకమాల-రెండూ కూడ ఒకే వంశ ప్రశస్తిని తెలియజేసే పద్యాలు. కాని, వెనుకటి సీసపద్యగతి అణకువతో ఒక విషయాన్ని తెలుసుకొనవలెనన్న ఉత్కంఠతో అడిగినట్లుండగా ఈ వృత్తగతి ఇతిహాసోపన్యాసానికి భూమిక అన్న స్ఫురణ కల్గిస్తోంది. ఈ పద్యగతి సామజగమనాన్ని పోలి ఉన్నది. ఇక్కడినుండి యీ ఆశ్వాసమందలి 95వ పద్యము వఱకు ఈ వంశమందలి రాజులను గూర్చి వరుసగా ఏకరువు పెట్టటయే జరిగింది. ఈ వంశమొక మహారణ్యమంత విశాలమైనదన్నచో ఈ వంశ వివరణ విధానము గజగమనాన్ని అనుకరించినదనవచ్చును. అరణ్యములో సవిలాసముగా కరచాలనముచేస్తూ నడచిపోయే కరిరాజ గమనాన్ని స్ఫురింపజేస్తుంది, యీ కథనము. అంతేకాదు; ఆ కరిరాజు ఒక్కొక్క సారి ఒక కొమ్మనో, ఒక రెమ్మనో, ఒక సుందర పుష్పాన్నో తన హస్తముతో సవిలాసంగా స్పృశించినట్లే ఈ కథనంలోకూడా అక్కడక్కడ ఒక్కొక్క విషయం సవిలాసంగా స్పృశి పబడింది. అట్టి వానిలో ఒకటి పురూరవుని కథ. తర్వాత నహుషుని గూర్చి ఒక్క పద్యంలో చెప్పబడింది ఇది మత్తేభమవడం ఒక విశేషం.

"చతురంభోధి పరీత భూవలయమున్ సద్వీప సారణ్యసత్
క్షితి భృత్కంబగు దాని భూరి భుజశక్తిం జేసి పాలించుచుం
గ్రతువుల్ నూ ఱొనరించి కీర్తి వెలయంగా దిక్కులన్ నిర్జితా
హితుఁడై యీ నహుషుండు దాఁ బడసె దేవేంద్రత్వముం
బేర్మితోన్ (1-3-93)

ఈ పద్యం కథనంలోని గంధసింధుర గమనానికి ఒక ఊతాన్ని ఇవ్వడానికే గాక కవిత్వ తత్వవిచారణకుకూడా మంచి అవకాశాన్ని ఇస్తుంది. ఈ పద్యములో చెప్పిన విషయమునకు వాడిన శబ్దములకు గల మైత్రి అపూర్వమైనది. శబ్దోచ్చారణము పూర్తి కాకమునుపే, శబ్దార్థమున్నకై ఆలోచించక పూర్వమే ఇందలి శబ్దములన్నీ కరిగి దివ్యభావాపగలయిపోతున్నాయి. పద్యములో లోకోత్తరమైన విషయముగాని, ఆధ్యాత్మిక తత్త్వముగాని లేకపోవచ్చును. కాని ఇందులో శబ్దమునకు అర్థమునకు గల హద్దులు అన్నీ తుడిచివేయబడ్డాయి. శబ్దోచ్చారణకు ఉదాత్త భావస్ఫోరకమై అర్థమాలోచనామృత మవుతోంది. అంతేగాక శబ్దోచ్చారణ వల్లనే అర్థస్ఫూర్తి కూడ కల్గడంవలన ఈ పద్యము ఆపాతమధురమై, ఆలోచనామృతమై సంగీతానికి కవితకు గల అవధులు కానరాకుండా చేసింది. ఆదికవి నన్నయలోని యీ లక్షణమే నూతన మార్గాలను సృష్టించిన శ్రీనాథుని, పెద్దనను ఎక్కువగా ఆకర్షించింది.

మత్తేభగమనంలో నడుస్తూన్న కథ పూరుని వరకు సాగింది. యయాతి వరకు నడచిన చరిత్ర సహజంగానే కనబడింది, జనమేజేయునికి. పూరురవుడు గర్వించే శాపాన్ని పొందాడు. యయాతి ఇట్టి అద్భుత విశేషాలేమీ సాధించకపోగా, అతని జీవితంలో మానవత్వ స్ఫురణ విపరీతంగా కనబడుతుంది. అతడు యాగాలుచేశాడు. శుక్రపుత్రి అయిన దేవయానిని వివాహమాడాడు. శుక్రశాపం వలన జరాభార పీడితుడయ్యాడు. ఇన్ని యాగాలు చేసినా, యయాతికి విషయోప భోగాభిలాష వదలక పెరుగుతూనేఉన్నది. అందుచేత తన కొడుకులలో నొకనిని తన వార్ధక్యాన్ని భరించమన్నాడు. దేవయానివలన కనిన తన సంతానమెవ్వరూ అతని వార్ధక్యాన్ని దాల్పనొల్లకపోతే, శర్మిష్ఠయం దాతడు కన్న ముగ్గురు కొడుకులలో కడపటివాడైన పూరుడు తండ్రి వార్ధక్యాన్ని తాను భరించి, తన యౌవ్వనాన్ని తండ్రికిచ్చాడు. యయాతి ఈ పూరుడే రాజ్యానికి అర్హుడని నిర్ణయించాడు.

ఇందులో ఒకదానికొకటి పొసగనిఅంశాలు అనేకముఉన్నాయి. క్షత్రియుడయిన యయాతి బ్రాహ్మణకన్య దేవయాని నెలా వివాహ మాడాడు ? శుక్రుడు ఈ వివాహానికి అలిగియుండడు. ఏమంటే అతడు యయాతినిశపించుట యయాతికి అయిదుగురు కొడుకులను కన్న తర్వాత జరిగిన విషయము. అంటే శుక్రునికి ఈ వివాహము అంగీకారమైనదే అన్న మాట. అయితే ఇక అల్లుని మామ శపించుట ఎందులకు సంభ వించినది? అందును, అందఱును అల్లుని ఆయురారోగ్యములను కోరుట సహజము కాగా, శుక్రుడు తన జామాత వృద్ధు అవాలని శపించుట యేమిటి ? వృషపర్వుడు రాక్షసరాజు. అతని కాచార్యుడు శుక్రుడు. అట్టి వృషపర్వ శుక్రుల కూతుండ్రు యయాతికి భార్యలగుట ఎట్లు సంభవించినది ? శుక్రుడు శపించగా యయాతి వృద్ధు అయాడు. ఆ వార్ధక్యాన్ని కొడుకుల కీయదలిస్తే శుక్రుని శాపఫలమతడేమి అనుభ వించినట్లు? యయాతికి పెద్దకొడుకు తనకు మనవడు నయిన యదువునకు రాజ్యమీయక తన శాపఫలాన్ని అనుభవించడానికి అడ్డువచ్చిన శర్మిష్ఠ కనిష్ఠ సంతానమునకు రాజ్యమును కట్టబెడుతూ ఉంటే శుక్రుడెలా ఊరుకున్నాడు ?

జనమేజేయుడు ఇన్ని సందేహములను వెలిబుచ్చలేదు. కాని, అతడడిగిన ప్రశ్నలలో పై సందేహములన్నీ ఇమిడి ఉన్నాయి.

"వర్ణధర్మముల్ గాచుచు-వసుధనెల్ల
ననఘచరితుఁడై యేలిన-యయ్యయాతి
భూసురోత్తమ భార్గవ-పుత్రియైన
దేవయానిని దానెట్లు-దేవిఁజేసె ?

విప్రు తేజంబునను దపో-వీర్యమునను
జగదనుగ్రహ నిగ్రహ-శక్తియుక్తు
డయిన యట్టి యయాతికి-నలిగియేమి
కారణంబున శాపంబు-కావ్యుఁడిచ్చె ?"

యయాతి కథలో సరిపడని సంగతులుగా పైన కొన్ని పేర్కొన బడినవి. వానిని జనమేజేయుని ప్రశ్నలతో పోలిస్తే ఒక విచిత్రమైన తేడా కనబడుతుంది. జనమేజేయుని దృష్టిలో పొసగని అంశాలకు ప్రాముఖ్యం లేకపోలేదు, గాని, పొత్తు కుదరని ధర్మాలకు అతడు ఆశ్చర్యపడుతున్నాడు. ధర్మాసనం నుంచి అతడు పరిశీలించగా అతనికి మొదటి సందేహము కల్గింది. రెండవ సందేహము మొదటి సందేహానికి 'ఉపసందేహం'వంటిది.

అంతేగాకుండా యీ రెండు పద్యాలు యయాతి కథను రెండు భాగములుగా విభజిస్తున్నాము. మొదటి ప్రశ్నకు సమాధానంగా కచదేవయానుల కథలను, రెండవ ప్రశ్నకు సమాధానంగా యయాతి పూరుని రాజ్యాభిషిక్తుని చేసేవఱకు జరిగిన కథను ఊహించుకొన వచ్చును. మిగత కథను గూర్చి తర్వాత వివరిస్తాను.

యయాతి చరిత్రలోని కథా నిర్మాణము చాల పరిణతి నందింది. ఇది నిజానికి కొన్ని కథల సంపుటి. ఇందలి కథలు : 1) దేవతలు మృత సంజీవని విద్యను సంపాదించడము. 2) కచదేవయానుల కథ 3) శర్మిష్ఠ దేవయానికి దాసి కావడం 4) దేవయాని యయాతిని వివాహమాడడం 5) శర్మిష్ఠ యయాతివలన పుత్రలాభాన్ని పొందడం 6) యయాతి శాపగ్రస్తు కావడం-పూరునికి రాజార్హత కల్గడం 7) యయాతి ఉత్తమ లోకాలను పొందడం. ఈ కథలన్నీ చాల నేర్పరితనంతో ఒకే కథగా అల్లబడ్డాయి.

కథా ప్రారంభమే చాలా చిత్రంగా ఉన్నది. యయాతి కథను చెప్పమని జనమేజేయుడు కోరగా, 'వృషపర్వుడనే రాక్షసరాజు ఉన్నాడు. అతనికి శుక్రుడాచార్యుడు' అని వైశంపాయనుడు ప్రారంభించాడు. తర్వాత దేవాసుర యుద్ధములో శుక్రుని సంజీవని విద్య ప్రయోజనాన్ని వివరించాడు. ఆమీద దేవలోకములో దేవతల అల్లజడి బృహస్పతి పుత్రుడైన కచునివద్దకు దేవతలందరూ వెళ్ళడమూ చెప్పాడు. యయాతి చరిత్రకు క్షణక్షణమూ మనము దూరమవు

తున్నట్లు మనకు తోస్తుంది. కాని ఈ సంజీవనీ విద్యను సాధించడానికి కచుని ప్రయత్నముతో పాటు కథలో దేవయాని ప్రాముఖ్యం కూడా క్షణక్షణమూ పెరుగుతూ వచ్చింది. 'దుహితృస్నేహంబునం జేసి యద్దేవయాని పలుకులు శుక్రుండతిక్రమింపడు, గావున నీ నేర్పు విధంబున దాని చిత్తంబు వడసి శుక్రునారాధించిన నీ కిష్టసిద్ధియగు' నన్నారు, కచునితో దేవతలు, ఒక దృష్టినుండి చూస్తే దేవకార్యాన్ని కచుడు సాధించడంలో దేవయానికిగల సంబంధము అతి స్వల్పమైనదే. కచుడు దానవుల వలన హతుడగుటలో తెలియరాకున్న యీ పాత్ర హఠాత్తుగా విపరీతమైన ప్రాముఖ్యములోనికి వచ్చింది. కథలో ఈమెకు గల ప్రాముఖ్యాన్ని సూచించడానికి నన్నయ ఈమె చేత వృత్తములో మాట్లాడించాడు.

"వాడి మయూఖముల్ గలుగు వాఁడపరాంబుధి గ్రుంకె ధేనువుల్
నేఁడిట వచ్చె నేకతము నిష్టమెయిన్ భవదగ్నిహోత్రముల్
పోఁడిగ వేల్వఁగాఁ బడియె బ్రొద్దును బోయెఁ గచుండు నేనియున్
రాఁడు వనంబులోన మృగ రాక్షస పన్నగ బాధనొందెనో !"

ఈ కథలో ఇదే తొలివృత్తం. ఈ పద్య ప్రయోజనాలలో ఒకటి కథలో మన దృష్టిని దేవయాని వైపునకు మళ్ళించడం. రెండవసారి కచుని దానవులు చంపినప్పుడు 'వానికి నేను శోకింప కెట్లుండుదు' నని దేవయాని శుక్రునితో అన్న మాటలు మత్తేభ వృత్తములో నుండుట గమనింపఁదగ్గ విశేషము. సంజీవని వడసిన తర్వాత కొంతకాలమునకు కచుడు దేవలోకానికి ప్రయాణమైనప్పుడు దేవయాని కచునితో :

"నీవును బ్రహ్మచారివి వినీతుఁడ వేనును గన్యకన్ మహీ
దేవకులావతంస రవితేజ వివాహము నీకునాకు మున్
భావజశక్తి నైనయది పన్నుగ నన్నుఁ బరిగ్రహింపు సం
జీవనితోడ శుక్రు దయ జేయుము నాకుఁ బ్రియంబు. . ."

అన్నది. ఇది తిరిగి వృత్తమవటం గమనింపదగ్గది. ఇలా ఈ పాత్ర పెరగడంతో దేవకార్యము కథలో ద్వితీయస్థానానికి దిగజారి, దేవయాని భవిష్యమును గూర్చి మనకు ఉత్కంఠ కలిగేటట్లు చేయగలిగాడు కవి.

అంటే మృతసంజీవని విద్యను సాధించడమనే కథ నిర్వహింపబడి కచ దేవయానుల కథ పూర్తి అయ్యేటప్పటికి తర్వాత కథకు అప్పుడే కవి మనలను మానసికంగా సన్నద్ధులను చేసి ఉంచాడు. ఇప్పుడిక దేవయాని యయాతిని వివాహమవుతుందని ఊహిస్తాము. కాని కథలో ఇంకొక మలుపు కనిపిస్తుంది ఇంకొక క్రొత్తపాత్ర ప్రవేశపెట్టబడింది. ఈమె శర్మిష్ఠ. ఇకనుంచి దేవయాని శర్మిష్ఠ లిరువురూ జంటగా ఒకరి ప్రక్కన ఒకరు కనబడుతూ ఉంటారు. కాని చిత్రం ఏమంటే మొదటి నుండే తుదివఱకు దేవయానిదే పై చేయి. కాని మనకు సానుభూతి మాత్రం శర్మిష్ఠ పట్లనే. దేవయాని రాక్షసరాజును, తన తండ్రిని, యయాతిని తన యిచ్ఛవచ్చినట్లుగ నడపగలననుకొన్నది. తాను పట్టినదే వ్రతం, తనమాటే ఆజ్ఞ అన్నట్లుగా సాగింది ఆమె ప్రభుత్వం కాని చివఱకు ఆమె సాధించుకోగల్గింది ఏమీ లేకపోయింది. తన మాటను నమ్ముకొని, తండ్రి తన భర్తను శపించగా, తన కేమీలాభము కల్గకపోగా, శర్మిష్ఠ కొడుకు పూరునికి రాజ్యార్హత కల్గింది.

దేవయాని ప్రక్కనున్న శర్మిష్ఠ మనకు సాళువము చెంగట నున్న పారావతము వలె కనబడుతుంది. మఱి చిన్నతనంలో దేవయాని ఏమి ఎగ్గులాడిందో కానీ, తర్వాత మాత్రం అంత ఆత్మాపనయనము కలిగిన మగువ కానరాదు. అయినా దేవయాని ప్రక్కన శర్మిష్ఠ ఉంటే అందరిచూపు శర్మిష్ఠ మీదనే ఉంటుంది. వారిద్దరూ కలిసి ఉన్న సందర్భములు కథలో మూడు నాలుగుచోట్ల ముఖ్యంగా కనబడతాయి. మొదటిసారి మఱి చిన్నతనంలో శర్మిష్ఠ దేవయానితో కలిసి జలక్రీడలాడినప్పుడు. అప్పుడు గాలికి వారి పరిధానములు కలిసిపోగా, 'దేవయాని పుట్టంబు శర్మిష్ఠ గట్టికొనిన, మఱిదాని పధానంబు పుచ్చుకొనక, రోసి శర్మిష్ఠం జూచి యిట్లనియె :

"లోకోత్తర చరిత్రుండగు
నా కావ్యు తనూజ నీకు-నారాధ్యను నేఁ
బ్రాకట భూసుర కన్యక
నీ కట్టిన మైల గట్ట-నేర్తునె...?"

ఈ మాటలలోని అహంకారము స్పష్టమే. శర్మిష్ఠ ఇలా అన్నదట.

"మా యయ్యకు బాయక పని
సేయుచు దీవించి ప్రియము-చేయుచునుండున్
మీ యయ్య వెండి మహిమలు
నా యొద్దను పలుక నీకు-నానయు లేదే?"

దేవయాని మాటలలోని గీర్వాణ శబ్దాలన్నీ ఆమె అహంకారానికి నిదర్శనమైతే, శరిష్ఠ సమాధానంలోని దేశీయమైన పలుకుబడి ఆమె ముద్దరాలని సూచిస్తోంది. శబ్దాలకు అర్థమొక్కటే దానినే విచారిస్తే శర్మిష్ఠ సమాధానంలో ఔచిత్యాన్ని అతిక్రమించినట్లు రూఢి అవుతుంది. దేవయాని ఆమె మాటలలో అంతవరకే చూడగల్గింది. కాని, శబ్దమునకు కేవలము అర్థమేకాదు ప్రాణము: ఉచ్చారణ, కాకువు, నుడికారము మున్నగునవన్నీ కలిపి వాక్కునకు ప్రాణాన్ని పోస్తాయి. అప్పుడు నిఘంటువులిచ్చే అర్థానికి ప్రాముఖ్యం సన్నగిల్లి మాట్లాడే వ్యక్తి యొక్క మనస్సు, మూర్తిమత్వము మనకు ఆవిష్కరింపబడుతాయి. ఇది లోకవ్యవహారంలో మనకు అనుభవంలో నున్న దే కాని, కావ్యములోనికి గొని రాగల్గడము లోకోత్తరమైనది. ఇట్టి సొగసులు అనువాద యోగ్యమైనవి కావు. ఇవి మహాకవిచేతనే ప్రకాశింపగలవు. కాని పది మూలములున్నప్పటికీ అనువాదంలో కనిపించలేవు. ఇట్టి సొగసులను అవలీలగా కవిత్రయము సాధించగల్గారు. కనుకనే వారి కావ్యాన్ని అనువాదమనడం శిల్పదృష్టి లేమిని తెలియజేస్తుంది.

రెండవసారి మఱల దేవయాని శర్మిష్ఠలు కనిపించినప్పటి పరిస్థితి వేఱు. మొదటిసారి శర్మిష్ఠ కన్యకా సహస్ర పరివృత అయి దేవయానీ సహితముగా వనమునకు వెళ్ళింది. అప్పుడు శర్మిష్ఠ రాచకూతురు. ఇప్పుడు శర్మిష్ఠ దాసియై దేవయానిని కొలుస్తోంది. రాచకూతురుని వనవిహారములో వింతఏమీ లేదు. కనుక అక్కడ విషయం వనసంలో వివరింపబడింది. కాని యిక్కడ తారుమారయిన పరిస్థితులతో

"వనకేళీ కౌతుకమున
జనియెను శర్మిష్ఠఁ దోట్టి-సఖులెల్లముదం
బున గొలిచి రాఁగ విభవము
దన కమరఁగ దేవయాని-తద్వనమునకున్.

విషయం వెనుకటిదే. విషయంలో విశేషం లేకపోయినా దేవయాని కబ్బినసిరి క్రొత్తది కనుక ఆమె భాగ్యప్రకటనకు అనువైన ఆమె పరివర్తనను రూపు కట్టించడానికి పద్యం వాడబడింది.

ఆ వనమున వీరందరు 'పుష్పాపచయంబు సేయుచు' నిష్ట వినోదంబులనున్న యవసరంబున 'యయాతి అక్కడకు వచ్చాడు. ఇక్కడకు అతనిని తీసుకొని వచ్చినది అనిలుడనే దూతయట! ఈ విషయాన్ని చెబుతూ నన్నయ వ్రాసిన పద్యం భాషకు ఒక అపూర్వమైన సంపద.

అంగనాజనుల యు-త్తుంగ సంగత కుచ
కుంకుమ చందన-పంకములయు
వారి ధమ్మిల్ల-భారావకలిత ది
వ్యామోద నవపుష్ప-దామములయు
వారివ ముఖస క-ర్పూర తాంబూలాది
వాసనా సురభని-శ్వాసములయు
వారివ వగీధాన-చారు ధూపములయు
విలసిత సౌరభా-వలులు దాల్చి
యనిలుఁడను దూత వోయి తో-డ్కొని యుఁదెచ్చె
దేవయాని పాలికి మృగ-తృష్ణఁజేసి
కాననంబునఁ గ్రుమ్మరు-వాని వీరు
నతి పరిశ్రాంతుఁడైన య-యాతి నంత (1-3-156)

నన్నయ ఆధ్యాత్మిక తత్త్వాన్ని ఎంతగా ఆదరిస్తాడో, ఇంద్రియాను భూతిని అంతగా హృదయాన్ని హత్తుకునేటట్లు చేయగలడు. ఘ్రాణేంద్రియానికి సంబంధించిన అనుభవాన్ని ఇంతచిక్కగా పద్యంలో

నిబంధించిన కవులు ప్రపంచంలోనే కొద్ది మంది ఉంటారు. ఇంద్రియానుభవములకు కవితలో శాశ్వత రూపాన్ని కల్పించగల్గిన పెద్దనకుకూడా యీ పద్యము ఆదర్శప్రాయమైనదే.

వచ్చిన యయాతిని అచ్చటి కన్యలు పూజించారు.

"తరళ నయనాబ్జ దళములు
నెరయఁగ బైమున్ను చల్లి-నృపసుతఁ బూజిం
చిరి నవకుసుమ మయులాం
కరణ విశేషముల నచటి-కాంతలు ప్రీతిన్" (1-3-157)

పై సీసములోను, ఈ పద్యములోను గల రచనా విధానము తర్వాతి ప్రబంధకవులకు మార్గదర్శకమవడం అలా ఉండగా, ఇందులోని విశేషము గమనింపతగ్గది. ఈ రెండు పద్యములు కథలో ఒక లిరికల్ ఎలిమెంట్‌ను, రొమాంటిక్ వాతావరణాన్ని ప్రవేశపెడుతున్నాయి. చరిత్రలా నడుస్తున్న కథను కవిత్వపుపొంగు ఒక్కసారి ముంచివేసింది. ఈ పొంగునకు కారణము దేవయాని మాత్రముకాదు. శర్మిష్ఠ అని మనకు తెలుసును. యయాతి కూడ 'యతిశయ రూపలావణ్య గుణ సుందరి యయిన శర్మిష్ఠ నెఱుంగ నేఁడి, 'మీరెవ్వరి వారలు మీ కుల గోత్రనామంబు లెఱుంగ వలతుం జెప్పుఁడ'ని అడిగాడు. రాజప్రశ్నకు సమాధానమిచ్చినది దేవయాని. తన్ను వివాహమాడుమని రాజును కోరినప్పుడు కూడ శర్మిష్ఠ ప్రసక్తి తీసికొనిపోవడం దేవయానికి తప్పలేదు.

తన పెద్దకొడుకును కన్నతర్వాత ఒకసారి ముగ్గురు కొడుకులకు తల్లి అయిన తర్వాత మఱొకసారి శర్మిష్ఠ దేవయానితో కలిసి కనబడుతుంది. ఈ రెండు సందర్భాలలోను కూడ శర్మిష్ఠయే మన సానుభూతిని పొందగల్గుతోంది. యయాతి వల్ల శర్మిష్ఠకు గలిగిన సంతానాన్ని చూసి 'కర మనురాగిల్లెఁ గన్యకా నివహంబుస్'అన్నాడు నన్నయ. ఈ కన్యకా నివహములో లోకము, దైవము, కథకుడు, శ్రోత ఉన్నారని గమనించాలి.

పూర్వకథలోని దేవయాని శాపగ్రస్త. మతికొంతకాలానికి శర్మిష్ఠచే నొక నూతన్రోయబడింది. ఈరెండింటినీ తనకు అనుకూలమైన వరములుగా మార్చుకొన నిశ్చయించింది దేవయాని. శాపగ్రస్తురాలు కావడము వలన యయాతికి భార్య కాగల అర్హతఉన్నది. నూత్రోయబడడం వలన అతడామె కరగ్రహణము చేయ నవకాశము కల్గినది. అంతేగాక శర్మిష్ఠ వలన పొందిన అవమానాన్ని కూడా ఉపయోగపరచుకొని దేవయాని శర్మిష్ఠను కన్యకా సహస్రముతో తనకు దాసిగా చేసుకొన్నది. దీనివలన తనకు రాణి అయే అర్హత కల్గిందని కూడా భావించి ఉంటుంది. యయాతిని ఒడబరచి అతని వివాహమాడింది.

కాని వారి వివాహము కాకమునుపే రాజు శర్మిష్ఠ పట్ల ఆర్ద్ర హృదయుడని మన మెఱుగుదుము. ఇది కథలో ఇంకొక సంక్లిష్టత. దీనివల్ల రాబోయే కథ ఒడిదుడుకులు లేకుండా సాగదని మనకు అనుమానం కల్గుతుంది. ఈ అనుమానానికి తోడుగా ఈ శర్మిష్ఠను దేవయాని రాచనగరునకు తీసుకొని వచ్చింది. కాని శుక్రుడు యయాతికి శర్మిష్ఠను చూపి 'దీనికిం బ్రియ బున నన్నపాన భూషణాచ్ఛాదన విషయంబునం బరిహరించునది' అని చెప్పాడు. ఇది కథలో ఇంకొక మలుపు. రాజునకు ఆమెపట్లగల అభిమానాన్ని మన మెఱుగుదుము; శుక్రుని నిషేధాన్ని కూడా మనము విన్నాము. ఈనిషేధము చిత్రమైనది. శర్మిష్ఠకు అన్ని భోగములను కల్పించవలెను. గాని ఏతత్ భోగ పర్యవసానముగ నుత్పన్నమగు భోగవాంఛను మాత్ర మాదరింప రాదు.

యయాతి శర్మిష్ఠ పట్ల శుక్రుడు కోరినట్లుగా ప్రవర్తించియుండ వచ్చును. కాని దానితో కథ కంచికి వెడుతుంది. అది అలా ఉండగా ఈ కథలోని విశేషమేమంటే ఎవరేమి కోరుకున్నా వారికది లభించి నట్లే ఉంటుంది. కాని అనుభవములోనికి రాదు; ఫలించదు. దేవతలు కచుని దేవయాని చిత్తము వడయుమన్నారు. అతడామె మెప్పునుపొంద గల్గాడు. కాని తన్ను వివాహము చేసుకొనుమన్నది.

కచునికి సంజీవని లభించినది. కాని తాను ప్రయోక్త అయే అర్హతను పోగొట్టుకొన్నాడు.

దేవయానిని శర్మిష్ఠ నూత ద్రోసింది. చక్కగా బుద్ధి చెప్పానను కొన్నది. కాని దీనికి ఫలితముగా దేవయానికి దాసి కావలసి వచ్చింది.

రాజు దేవయానికి సాయము చేయబోయి నూతినుండి వెలికి తీశాడు; తన్ను వివాహ మాడమన్నది దేవయాని.

రాజుచూపులంతా శర్మిష్ఠమీద: వివాహమాడింది దేవయాని

ఇప్పుడు శర్మిష్ఠను శయన విషయమున పరిహరించునది అని శుక్రుడు ఆదేశించినా, ఫలితము దానికి వ్యతిరేకముగా ఉంటుందని మనకు తెలుసు. యయాతి శర్మిష్ఠకు ఋతుకాలోచితాన్ని ప్రసాదించినప్పుడు యయాతి శుక్రుని ఆదేశాన్ని ఉల్లఘించినప్పటికీ, ఈ కథ అంతటికీ ఇదే ఎంతో పవిత్రమైన ఘట్టమువలె మనకు తోస్తుంది. యయాతి శర్మిష్ఠకు కనఁడడమే 'దాని పుణ్యస్వరూపంబు సన్నిహితంబైన యట్లు' న్నదట! ఆమె కొడుకులు ముగ్గురు,

"కరు వలిచేఁ దూలు-కపిల జటాలియ
కర మొప్పు శిఖలుగాఁ-గనకరత్న
మయజాల భూషణా-మలదేహ దీపుల
తేజంబుగాఁ బ్రిలి-దీప్యమాన
యాగ శతంబుల-నర్చితం బైన మూఁ
డగ్నులు ప్రత్యక్ష-మైన యట్లు" (1-3-182)

కన్నారట. ఈ బాలురను దేవయాని దృష్టిపథములో పడకుండా ఉంచడమంటే అగ్నిని చీరచెరగున దాచడం వంటిది. వారిని దేవయాని చూడనూ చూసింది, యయాతి శర్మిష్ఠవలన లబ్ధ సంతానుడగుటను తెలిసికొన్నది.

ఇది కథలోని కడపటి మలుపు. ఇప్పుడు దేవయాని తిరిగి క్రోధోద్దీపిత అవుతుందని మనకు తెలుసును. బాహుశః తండ్రి దగ్గరకు కూడ వెడుతుంది. అయితే అతడు కూతునే సమర్థిస్తాడా ? వెనుక నొకసారి అతడు దేవయానికి ఒక హితవు చెప్పాడు.

"అలిగిన నలుగక యెగ్గులు
వలికిన మఱి విననియట్లు ప్రతివచనంబుల్
పలుకక బన్నము పడి యెడఁ
దలఁపక యున్న తఁడ చూవె-ధర్మజ్ఞుఁ డెడిన్" (1-3-147)

కాని ఈ కథలో అన్నీ వింతలే. ఇప్పుడు దేవయాని తన అవమానంతో అధర్మాన్ని కూడ జోడించింది. "అధర్మంబున ధర్మంబు గడపఁబడి యమ్మహీశుం డా పురంబున నాసురి యందనురక్తుండై పుత్త్రత్రయంబు వడసి నా కవమానంబు సేసె !" అన్నది వెనుకటి తన సూక్తిని తానే మఱచాడు శుక్రుడు. అయితే అప్పటి పరిస్థితివేఱు. అది పిల్లలతెగవు. ఇప్పుడలా కాదు. తన కట్టడిచేసే రాజు ఉల్లంఘించాడు. ఇది నిజానికి శుక్రుని పరీక్షాసమయము. అతిడలుగ కుండా ఉంటే మన మెంతో సంతోషించి ఉండెడివారము. కాని అప్పుడా తనిలోని మానవత మాయమయిపోయెడిది. అందుచేత శుక్రుని 'జరాభార పీడితుండవుగ' మ్మని శాపమివ్వడం మనకు ఆశ్చర్యాన్ని కల్గించదు.

కాని తర్వాత యయాతి ప్రార్థనను ఆలకించి శుక్రుడు' నీ ముదిమి నీ కొడుకుల యం దొక్కరుని పయింబెట్టి వాని జవ్వనంబు నీవుగొని రాజ్యసుఖంబు లనుభవింపుము. నీవు విషయోపభోగ తృప్తుఁడవైన మఱి నీ ముదిమినీవ తాల్చి వాని జవ్వంబు వానికి నిచ్చునది. నీముదిమిఁ దాల్చిన పుత్రుండు రాజ్యంబున కర్హుండును వంశకర్తయునగు'నన్నాడు. యయాతిని శపించుటలో శుక్రుని మూర్తిమత్త్వము కొంత దెబ్బతిన్నప్పటికిని ఈ కడపటి వాక్యములో అతని న్యాయదృష్టి చాల ఉదాత్తముగా గోచరించి అందఱినితృప్తిపరుస్తుంది. కూతును తృప్తిపరచడానికి యయాతికిచ్చిన శాపము శర్మిష్ఠకు వరమై ఆమె కడగొట్టు కొడుకును రాజునుగా, వంశకర్తనుగా చేసింది.

యయాతి మహారాజు చరిత్ర గోదావరి వంటి నది అయితే అందులో కచదేవయానుల కథ, శర్మిష్ఠ దేవయానిని నూతద్రోయడము మొదలగునవన్నీ చాలా కోలాహలంగా ఉరకలు పరుగులు వేసుకుంటూ ఒక మహానదిలో కలిసిపోయే ఉపనదులవంటివి. యయాతి తన రాజ్యభారాన్ని పూరునికిచ్చిన తర్వాత నడచిన కథ అంతా ఉరుకులు పరుగులు లేక కొండలలో నుండి బయటపడ్డ గౌతమి వలె కనబడుతుంది. బయల ప్రవహించు ఈ అఖండ గౌతమివలెనే కూడా విశ్రాంతి ఉన్నది. ఇక్కడే మనకు యయాతిలో కౌరవాన్వయము నందలి రాజులలో కనబడే సుగుణాలు(చూ. 1-1-86), వారి పరిమితులు కనబడతాయి. యయాతి చరిత్ర అనే గౌతమీ వాహిని ఇలా విస్తరిల్లి, ఇతరులను పవిత్రులను చేసి కౌరవ వంశ చరిత్ర అనే 'వారి రాశి'లో కలుస్తోంది. అదే యీ కథా నిర్మాణంలోని సొగసు.

యయాతి చరిత్రలోని పద్యరచన కథనశిల్పములోని భాగముగా అక్కడక్కడ వివరింపబడినది. దీనికి సంబంధించిన రెండు మూడు అంశములు గమనింపదగినవి.

ఈ కథలోని వరములు, శాపములు (సురను గూర్చి శుక్రుడు చేసిన శాసనమును శాపముగా భావింపనక్కరలేదనుకుంటాను) అన్నీ వచనములోనే కనబడతాయి. ఈ శాపము వలన కథలో పెద్దమార్పు రావడముకన్న, పాత్రల ప్రవర్తన విధానము వల్లనే కథాగమనము, ముఖ్యముగా నిర్ణయింపబడినది. కనుక ఈ శాపములకు పద్యపు టందలముల నెక్కించ నవసరము లేకపోయినది. దేవయాని కచుని శపించుట వలన కచునికి కాని దేవతలకుగాని నష్టమేమీ లేదు. వారి కార్యము వారికి నెరవేరింది. దేవయాని యయాతిని వివాహమాడడానికి లోకదృష్టిలో కనబడే ఒక హేతువు కచుడామెను శపించడం. కాని అంతకంటే ముఖ్యమైన విషయం ఏమంటే ఆమెలో రాచసిరి ఉన్నది. ఆమె పగ రాచపగవలె తీక్ష్ణమైనది. కేవలం కన్యగా ఉన్నపుడే వృషపర్వుని కూతును తనకు దాసిగా చేసికొన్నది. అట్టి స్త్రీ సాధారణ మానవుని ఎన్నడూ

వివాహమాడదు. ఆమె జీవలక్షణము నందే పాలకవర్గమునకు చెందినది కాని పాలితవర్గమునకు చెందినది కాదు. అందుచేతనే అమె పొందిన శాపముకూడా ఆమె శీలమునకు అనుగుణముగా ఉన్నది. ఆమె తండ్రి నుంచి పొందిన వరముకూడా తాను యయాతిని వివాహమాడడానికి నిశ్చయించిన తర్వాత తీసికొన్నదని గమనించాలి.

శుక్రుడు యయాతిని శపించాడు. ఈ శాపములో చూడవలసినది శుక్రుని శీలము. శుక్రునికి కూతురే దైవము. ఆమె కప్రియము జరిగితే లోకాలన్నీ తలక్రిందులై పోయినట్లే అతడు భావిస్తాడు. అందుచేత అల్లునిలోని యౌవన గర్వము కూతునికి అపకారణమైనదని జరాభారపీడితుడవుగమ్మని శపిస్తాడు. కాని ప్రాజ్ఞుడు, పండితుడు, సహజంగా ధర్మ నిర్ణేత గనుక తొందరగా అల్లుని కరుణించాడు. "నీ ముదిమి నీ కొడుకులయం దొక్కరుని పయింబెట్టి వాని జవ్వనంబు నీవుగొని రాజ్య సుఖంబు లనుభవింపుము... నీ ముదిమిఁ దాల్చిన పుత్రుండు రాజ్యంబున కర్హుండును వంశ కర్తయునగు!" నన్నాడు. దీనివలన శుక్రుని ప్రతిష్ఠ పెరగడమే కాకుండా, కథలో చాల బన్నములుపడుట శర్మిష్ఠకు న్యాయము చేకూడము గమనింపదగ్గది. అందు చేతనే శుక్రుని యీ వరముతోనే కథనుండి దేవయాని, శర్మిష్ఠ పాత్రలు ఉపసంహరింపబడినవి. ఎవరు చేసుకున్నంత వారికి అనుభవములోనికి వచ్చిందన్న తృప్తి శ్రోతకు కల్గేటట్లున్నది యీ వరము.

యయాతి కొడుకుల కిచ్చిన శాపము ఒక దృష్టితో చూడగా కట్టుడివలె కనబడుతుంది. ఇంద్రుడు యయాతిని స్వర్గలోక భ్రష్టుని చేయుచూ, "నీగర్వంబు నిన్నింతసేసె!" అన్నాడు. అనగా ఒకరు ఇంకొకరి కేదో శాప మివ్వడం అన్నది ఎక్కడా లేదు. బుద్ధి కర్మానుసారిణి మాత్రమే. యయాతి పదభ్రష్టు డవడానికి హేతువు యయాతి శీలమే. ఇంద్రుడు కేవలము ఆ సన్నివేశమును కల్పించాడు. ఆమాట అన్నాడు. అలాగే యితర సందర్భాలలో కూడా చూచుకోవాలి.

అందువలననే యీ శాపములు వచనములో నుండడం కూడా కథా నిర్మాణములోని ఒక భాగమే. అలాగే యీ కథలోని ఒక్కొక్క సీసము ఒక్కొక్క మణిపూస. ఒక్కొక్క సీసము కథలోని ఒక్కొక్క మలుపునకు దారితీసింది. మొదటి సీసముపూర్తి అయేసరికి కచుడు దేవయాని మనసును చూరగొన్నాడు. రెండవ సీసములో యయాతి.

"వరుణదేవు తోడు - గర మల్గి జల నివా
సంబు విడిచి భూస్థ - లంబు వలని
కరుగు దేర నున్న - వరుణేంద్రు దేవియ
పోనిదాని దేవ - యానిఁగనియె".

మూడవ సీసము యయాతి కన్యకా సహస్రముతో నున్న శర్మిష్ఠ దేవయానులవద్దకు ఆకర్షింపబడిన సందర్భమున చెప్పబడినది. ఇక నాల్గవ సీసమున పూరునికి రాజ్యము నప్పగించేటప్పుడు యయాతి వానికి బోధించిన నీతి "పరమ వివేక సౌరభ" సమన్వితమైనది.

ఈ నాల్గు సీస పద్యములలోను నాల్గురచనా విధానములుకూడ కనబడతాయి. మొదటి సీసమునందు కథనమునకు ప్రాముఖ్యమున్నది. రెండవదానిలో ఎంతో శ్రద్ధగా దిద్దితీర్చిన చిత్రము గోచరిస్తుంది. మూడవదానిలో రొమాంటిక్ (కాల్పనిక) కవిత పారము నందు కొన్నది. నాల్గవసీసము డిడక్టివ్ (అనుమానిక) కవితకు మేలుబంతి. కాని ప్రతి ఒక్క సీసముకూడ కథ నతిక్రమించి మనదృష్టి నాకర్షించ కుండా, దేనికది కథా నిర్మాణములోని భాగముగా అమాయకముగా అణగి ఉన్నట్లు తోచడమే నన్నయ కథన శిల్పములోని విశేషము.

కథలోని పాత్రలను రెండు విధములుగా చూడవచ్చును. ప్రతి పాత్రను ఒకవ్యక్తిగా చూస్తూ, వాని మనసుల గల పొరల నన్నింటినీ పరిశీలించవచ్చును. ఆ పాత్రలనే కథా శిల్పదృష్టితో కూడ చూడ వచ్చును. ఈ రెండవ పద్ధతిలో వ్యక్తులకన్న కథకు ప్రాముఖ్య మెక్కువ. ఆలోచించగా ఈ పద్ధతియే ఉత్తమమైనది. ఏమన

ఒకానొక పాత్రి మనసునగల పొరలన్నీ కథకు అవసరమైనప్పుడే అంద గిస్తాయి కాని కథకు వెలిగా నున్నప్పుడు వాని ప్రయోజనము సన్న గిల్లి పాత్రలు కథను కబళించడమో, ఆ పాత్రయే కథకు అవసరము లేక కేవలము ఉత్సవ విగ్రహముగా తయారవడమో జరుగుతుంది. యయాతి చరిత్రలోని పాత్రలను ఈ దృష్టితో పరిశీలిస్తే, ఇందులోని పాత్ర చిత్రణముకూడ కథానిర్మాణములోని భాగముగ కనబడుతుంది. ఇక్కడ పాత్రలను గూర్చి చేసే పరిశీలన ఆ దృష్టితో చేసేది కాని, ఇది పాత్ర చిత్రణను గూర్చిన సమగ్ర పర్యాలోచనము కాదు.

ఈ కథలో మొదట మనకు కానవచ్చు పాత్ర కచుడు. నన్నయ కచుని ఒక నిలువుటెత్తు విగ్రహముగా రూపొందించలేదు. అతని మనసులోని పొరలలో ఏమున్నదో తెలియజేస్తూ ఆ పాత్రను చిత్రించలేదు. కథలో ఈ పాత్ర ప్రయోజనమెట్టిది ? దేవతల దృష్టినుండి జూస్తే సంజీవని సాధించాలి. దానికై శుక్రుని మెప్పును పొందాలి. దేవయాని అనురాగానికి పాత్రుడవాలి. కాని ఆమెను వివాహము చేసుకొనుట కంగీకరించరాదు. అందుచేత నన్నయ ఈ పాత్రను మూడు రేకలలో తీర్చిచూపాడు "అమ్మౌని కుమారుని (1) సుకుమారత్వంబును (2) వినయ ప్రియవచన మృదు మధురత్వంబును (3) ననవరత నియమవ్రత ప్రకాశిత ప్రశాంతత్వంబునుం జూచి" శుక్రుడు అబ్బురపడ్డాడు. మొదటి రెండింటివలన దేవయాని అను రాగాన్ని చూరగొన్నాడు. అతనిలోని మూడవ లక్షణమువలన ఆమె మోసపోయింది. కచునిలో ఈ లక్షణాలు కథకు చాలును. ఈపాత్రను పెరగనివ్వడం కథా నిర్మాణమునకు ఆటంకమని మహాశిల్పి నన్నయకు తెలుసును. ఆ పాత్రనింక పెరగనివ్వలేదు.

ఇంతకంటె చిత్రమైన పాత్ర వృషపర్వుడు. ఇతడు దానవుడు, రాక్షసుల రాజు. సాధారణంగా దానవుడంటేనే మనకు పెద్దవిహ్వ భావం, కాని చిత్రమేమంటే ఇంత మంచిరాజు ఎవ్వరూ లేరేమో అని పిస్తుంది. వృషపర్వు నిపురము నేను జొర నొల్ల" నని దేవయానిఅంటే,

శుక్రుడు కూడా "నాకు నీవ గతివి" అని కూతును అనుకరించాడు. ఈ విషయాన్ని వృషపర్వుడు విని "శుక్రునొద్దకు వచ్చి నమస్కరించి యిట్లనియె."

"దేవతలన్ జయించుచు నతి స్థిర సంపదలం దదీయ వి
ద్యా విభవంబు పెంపునను - దానవు లుద్ధతులైరి కాని నాం
డీ వసరాశిలోం జొరరె - యింతకు నంతక కోపులైన య
ద్దేవ పతాకినీ పతుల - దివ్య నిశాత మహాయుధాహతిన్
(1-3-151)

"వారణ ఘోటక భాండా
గారంబులు మొదలు గాంగ - గల ధనములతో
నారి నుత యిందఱము నీ
వారకములు గాంగ మమ్ము-వగవుము బుద్ధిన్. (1-3-253)

"ఈ దేవయాని కెద్ది యిష్టంబు దానిన యిత్తుపదుగు" మనిన దేవయాని "అట్లేని శర్మిష్ఠం గన్యకా సహస్రంబుతో నాకు దాసిగా నీ వలయు" ననగానే వృషపర్వుడు నిస్సంకోచముగా ఆమె కోర్కెను తీర్చాడు, కథలో వృషపర్వుడు నిర్వహించవలసిన పాత్ర కనుగుణమైన సచ్ఛీల మాతనికి కల్గియుండడమేగాదు, అతని ప్రవర్తనవలన శర్మిష్ఠ మరెంత ప్రీతి పాత్రురాలైనది. శర్మిష్ఠ వంశకర్తకు జననికాబోతున్నది. ఆమెపట్ల మనకు ఎంతో సానుభూతి అవసరము. ఆ సానుభూతినంతా ఆమె తండ్రి గడించి ఆమెకు అరణముగా ఇచ్చి పంపుతూన్నట్లుగా ఉన్నది యీఘట్టము.

నన్నయ కాక పాత్ర చిత్రణలో సిద్ధహస్తుడయిన మరొక కవి అయితే శర్మిష్ఠ పాత్రపట్ల గల మమకారాన్ని వదులుకోలేక ఆమెను కొండంతగా చిత్రించి ఉంచేవాడు. కాని కథా నిర్మాణములోని ఔచిత్య మర్యాద నెఱిగిన నన్నయ ఈ పాత్రను చాల మెలకువతో తీర్చిదిద్దినాడు. హూమర్ తన కావ్యములో ఒక్కొక్క ప్రధాన పాత్రకు ఒక్కొక్క విశేషణాన్ని ఎప్పుడూ వాడుతాడట. దీనివలన

ఆ పాత్రయొక్క ప్రత్యేకత మన మనసుకు బాగా నాటుతుంటుంది. అలాగే శర్మిష్ఠమాట వచ్చినప్పుడల్లా నన్నయ "కన్యకా సహస్రసంయుతో" అంటాడు. ఆమె దాసిగా నీయబడినప్పుడు కూడా "కన్యకానహస్రసంయుతో" దేవయానికి దాసిగా నీయబడింది. "కన్యకా సహ సంయుతో శర్మిష్ఠ" దేవయానితోపాటు యయాతిని రాచనగరుకు అనుగమించింది. శర్మిష్ఠ దేవయానులు విరుద్ధ ప్రవృత్తులు. శర్మిష్ఠ పుట్టుకతో రాచకూతురు. ముద్దరాలు. బోంకినా ఎంతో మధురముగా ఉంటుంది. దేవయాని పుట్టుకతో బ్రాహ్మణకన్య, కాని ప్రౌఢ, నిజము చెప్పి కూడా మన మెప్పును పొందలేదు. ఈమె ఎదురుగా ఉంటే మనకు మండుటెండలో నిలచినట్లుగా ఉంటుంది. శర్మిష్ఠ మనకెదురుగా నిలవడానికి జంకుతూ తిరోహిత అవుతూన్నట్లుఉంటుంది. కాని ఆమె ఎంతదూరముగా ఉన్నా, అమృతకిరణ ప్రసారమేదో ఆమె నుండి ఉద్భవిల్లుతోందని దానికి తెరలు అడ్డురావని తోస్తుంది. కథా ప్రారంభములో దేవయానిపట్ల మనకున్న సానుభూతి కథ చివరకు క్రమముగా సన్నగిల్లుతుండగా, శర్మిష్ఠపట్ల మన సానుభూతి క్రమముగా పెరుగుతూ వచ్చింది. ఇద్దరూ యయాతిని వరించారు. ఇద్దరూ తమ కోర్కెలను తామే బయటపెట్టారు. ఇద్దరూ శుక్రనీతిని ఆశ్రయించే ఆతనిని పొందారు. కాని, తన్ను వివాహమాడుమని రాజును దేవయాని కోరినప్పుడు ఆమె వలపన్నీ అహంకారపు నిరుకున పెడుతోందని మనము బాధపడతాము. శర్మిష్ఠ తనకు ఋతుకాలోచితాన్ని ప్రసాదించమని రాజును అడిగినప్పుడు ఆమె మాధుర్యము మనకు జాలిని కలిగిస్తుంది. కథ పర్యవసానమును దృష్టిలో పెట్టుకొని చూస్తే యీ పాత్రల పాత్రీకరణానికి కథానిర్మాణమునకు గల సంబంధము విస్పష్టమవుతుంది.

కథలో ఎన్ని చోట్ల కనబడినప్పటికీ శుక్రుడు కూడా కథానిర్మాణమున కనుకూలమైనంత వరకే చిత్రింపబడినాడు. కాని అంతకు పీసమెత్తుకూడా అతనికి అదనపురంగు పూయబడలేదు. కథలో

ఒక్కొక్కచోట ఒక్కొక్క మానసిక స్థితిలో శుక్రుడు ప్రత్యక్షమవుతాడు. కచుని తొలిసారి చూడగనే "వీనిం బూజించిన బృహస్పతిం బూజించిన యట్ల!" అని భావించాడు శుక్రుడు. ఇంకొకసారి "తన దివ్యదృష్టి నసుర వ్యాపాదితుండైన కచుంగని వానిం దోడ్కొనదేర మృతసంజీవని" బనిచినాడు. ఈ శుక్రుడు వేఱు. ఈతడు దేవతలకు భీతిగొల్పే శుక్రుడు. సురాపాన మోహితుండైన శుక్రుడు చాల దిగజారినా "కచుడు సుగతికి జనుగాక! విచారించకు!" అన్నాడు కూతురుతో. దేవయాని నిర్బంధమువలన సురవల్ల కల్గిన మోహము పటాపంచలైపోగా, ప్రసన్నుడైన శుక్రుడు కేవలము అమృతమూర్తి, వేదమూర్తి, ధర్మాధర్మములను నడపుచు నిఖిలలోక పూజ్యుడైన శుక్రుడొకడున్నాడు. ఈతడు యయాతివద్దకు వచ్చినపుడు "తన దివ్యతేజమున నవ్వనమెల్ల" వెలిగెనట ! ఇంతటి మహానుభావత్వము నిముడ్చుకున్న శుక్రుడు "దుహితృ స్నేహంబునం జేసి యద్దేవయాని పలుకులు" అతిక్రమింపలేడు. ఆమె వృషపర్వ నగరము చొరను అంటే "నాకు నీవ గతివి," నీ తోడు నేను వత్తును" అంటాడు శుక్రుడు. తన్ను మోహపరచిన సురకు ఆలిగి !

"మొదలి పెక్కు జన్మములఁ బుణ్యకర్మముల్
పరఁగ బెక్కు సేసి - పడయఁబడిన
యట్టి యెఱుక జనుల - కాక్షణ మాత్రాన
చెఱచు మద్యసేవ - సేయతగునె"? (1 3-120)

అని అనగలిగాడు. సురపట్ల తన అభిమానాన్ని మాన్పుకొనగలిగాడు కాని, కూతుపట్ల మోహాన్ని త్రెంచుకొనలేక పోయాడు. తనకు శర్మిష్ఠను దాసిగా నీయవలెనని దేవయాని కోరగా, వృషపర్వుడామె కోర్కెను తీర్చగనే శుక్రునకు "మనః ప్రియంబు" గల్గినదట. ఆ పితృహృదయాన్ని చూసి మనము హర్షోత్కర్షమును పొందాలో, వాని పామరత్వాన్ని చూసి జాలిపడాలో తెలియని సందర్భమిది.

కథకు అవసరమైన అన్నివిధములైన మనస్తత్వాలు శుక్రు నిలో కనబడతాయి. దేనికది విడిగా చూస్తే, యీ మనస్తత్వాలు ఒకదానికొకటి పొసగవు. కాని నన్నయ శిల్పములో ఇన్ని మనస్తత్వాలు ఒకే వ్యక్తిలో కానరావడంలో ఆశ్చర్యం కనబడదు. ఎంతో శ్రద్ధగా పరీక్షచేస్తేనేగాని శుక్రుని పాత్రలోని విరుద్ధ తత్వము పడుగు పేకలవలె అల్లుకొని ఉన్నాయని మనకు అనుమానము కూడ కలుగదు.

శుక్రునికన్న చిత్రమైన వ్యక్తి యయాతి. శుక్రుని శాపమును పొందేవఱకు మనకు కనబడే యయాతికి, ఉత్తరకథలో కనబడే యయాతికి పోలికలేదు. పూర్వకథలో కనబడే యయాతి మానవంటి మానిసి. అతనిలో ఎంతో మోమాటము, ఊగిసలాట కనబడతాయి. కావాలనుకున్నది చేజిక్కినా అనుభవించడానికి సందేహిస్తాడు. కాని అది సందేహమువరకే. ఎలాగో మనసును సమాధానపరచుకొని ఆ భోగమును అనుభవించకుండా ఉండలేడు (176-179) తనకు అక్కరలేనిది అక్కరలేదని చెప్పే సాహసంకూడా కానరాదు. "శుక్రునికి ఈ వివాహము అంగీకారయోగ్యమైనదే అయితే నిన్ను వివాహమాడతా" నంటాడు దేవయానితో. ఎన్నో భోగాలు చేశాడు, ఎంతో అనుభవించాడు. విషయోపభోగతృప్తుకుగాక, "విషయోపభోగాభిలాషుణ మింకను నాకు వదలక పెరుగుచున్నది !" అని వాయి విడిచి పుత్రులతో చెప్పుకుంటాడు. ఈ భాగములో కనబడే యయాతి అంతఃపురములోను, ఉద్యానవనములోను కనబడే యయాతి. ఇంత ఆర్ద్రంగా చిత్రింపబడ్డ రాజులు ఎక్కడో కాని సాహిత్యంలో కనబడరు.

అయితే ఉత్తరకథలో ఇంకొక యయాతి ప్రత్యక్షమవుతాడు. ఈతడు ధర్మాసనం నుంచి మాట్లాడే రాజు. ఆ యయాతి నుండి యీ యయాతిలోనికి మార్పును నన్నయ చమత్కారంగా సాధించాడు. అది పూరునికి తాను రాజ్యాభిషేకము చేసేటప్పుడు ప్రకృతిజనములు

వెలిబుచ్చిన సందేహానికి యయాతి చెప్పిన సమాధానముతో ప్రారంభ మవుతుంది. అయితే యీ ఉత్తరకథను గూర్చి వెనుకనే చెప్పాను; ఇది కొండలలో నుండి బయటపడ్డ గొతము. ఇది నిజానికి యయాతి కథ కాదు. కౌరవవంశ చరిత్రలో ఒక భాగము; యయాతి కరిగి కౌరవవంశ వారాశిలో భాగమై పోయాడు.

---

1 "నన్ను వివాహమై వహుష నందన యీ లలితాంగిఁ దొట్టియీ
కన్నియ లందఱున్ దివిజ కన్యలతో నెన యైన వారు నీ
కున్నతిఁ బ్రీతి సేయఁగ నృపోత్తమ వాసవుఁ బోలి లీలతో
నిన్నరలోక భోగము లనేకము లందుము నీవు (నావుడున్)
(3-1-161)

భారతి. ఏప్రిల్; 1965

# నన్నయ శకుంతలోపాఖ్యానము

శ్రీ డి. ఆర్. సంగమేశ్వరరావు

భారతి జూన్ నెల సంచికయందు కొడవగంటి శంకరనరసింహ బ్రహ్మంగారు 'కలగూరగంప' శీర్షిక క్రింద నన్నయ శకుంతలోపాఖ్యానమును మూలమునందలి కథతో సరిపోల్చి వ్రాసిన 'విమర్శ' యాశ్చర్యజనకమును కేవలము నన్నయను బొగడు వారినిగూర్చి వ్రాసిన కోపసహిత ఖండనము వలెను దోచుచున్నది. కాని మూలమునందలి కథ నాద్యంతము పరిశీలించి నిష్పాక్షికముగా తత్త్వైక నిర్ణయ దృష్టితో వ్రాసిన వ్యాసమువలె గన్పట్టుటలేదు. మూలమును సావధానముగా జదువని వారికది నిక్కమముగనే తోచును, కాని విమర్శకులు మూలమునందలి తనవాదమును నిరాకరించు ముఖ్యమైన శ్లోకములను జూడ నిరాకరించి, కొండొకచో నేయొక్క శ్లోకపాదము తన యభిప్రాయమును ఖండించునో, దానిని విడచి మిగత శ్లోకములను మాత్రమే పాఠకులకు చూపించినారు. ఆయనకయ్యది సబబుగా తోచియుండవచ్చు లేక పొరపాటుబడి యుండవచ్చును.

కథయా మహాభారతము. ప్రస్తుతఘట్టమా, ఏ మహానుభావుని నామధేయమును భారతకథ వర్తిల్లుచున్నదో, ఎవని రాజ్యము పేరున ననేక శతాబ్దుల యనంతరముగూడ మన మహాదేశము పిలువబడుచున్నదో యట్టి భరతచక్రవర్తి జననీ జనకుల ప్రణయ, విరహ, సమాగమ సంబంధిమైనది. మూలకారుడా యనేక పురాణముల వ్రాసినవాడును, లౌకిక వైదికాచారంబుల నెరింగిన ప్రోడయు, నుపనిషత్సారంబులగు భగవద్గీతల నాలాపించినవాడును, సరససుందరంబులును గంభీరధ్వని గుంభితములును, వేదమంత్రార్థ వివరణ ప్రాయములునునగు ఘట్టముల వ్రాయుటందిట్టయు, మహర్షిజన్మ్మండునునగు వ్యాసభట్టారకుడు. తెనిగించిన కవి యా మహారాజు సన్మాన

పాత్రుడు, రాజాస్థానాంతత బహిష్కార్య వేతృత్వ స్థానమందున్న వాడును, అతి బహుళమై, సరసార్థదాయినియైనను పండిత ఛాందసుల కగమ్యమై రసవహావచ్ఛిన్నమైన మహాభారత చంద్రికను మొట్ట మొదటగా తేటతెనుంగున చేర్చి యాదికవినా బరగు మహానుభావుడు నన్నయ మహాపండితులకైనను తప్పులు గల్గుట సహజమే. ప్రతి యారంభమును దోషముచే నావరింపబడియే యుండును. మనము పురాణకాలమందలి యాచార వ్యవహారముల నెఱిఁగి కదా, యప్పటి వ్యక్తుల తప్పొప్పులు నెన్నఁబూనుట. వానిని తెలిసికొనుటకు సంస్కృత భారత మొక ముఖ్యాధారము కదా అట్టియెడ నాయాచార వ్యవహారాదుల నతిస్వల్పముగా మార్చుచూ భాషాంతరీకరణమువలన నని వార్యములనుకొని తెనుంగు సంప్రదాయముల నందిముడ్చుచు, మూలమునందలి సొగసులు చెడకుండగ వ్రాయుటకు యత్నించుట నన్నయగారి విధి. ఆ పనియందు. ప్రస్తుత ఘట్టమందాతడు చాల వరకు కృతకృత్యుడయ్యెనని భావింతును

రాజరాజు నన్నయఁగోరినది 'మహాభారత బద్ధనిరూపితార్థ మేర్పడ తెనుగున రచియింపు'మని కాని ఆ రచనలో ధ్వని గర్భితము లగు వానిని వ్రాయకుండుమని సూచింపలేదే. నన్నయకూడ 'సార మతిని లోనారసి కవీంద్రులు మేలన' భారతరచన సేయుదునని చెప్పె నాడే ? ఇంతయేల భారతమే మనముందున్నది గదా ! ఈ విషయమతి సుగ్రాహ్యముగను ప్రత్యక్షముగను యున్నపుడందలి తత్త్వము భారత సమగ్ర పరీక్షా సిద్ధముగాని నిరూపితార్థము నేర్పడ రచియింప మను యొక్క వాక్యమువలన, నేమి సిద్ధించును ? ఒక్క పదమువలన నెదురుగా కన్నట్టు నన్నయ భారతార్థము మారిపోవుట వింభవింపదుగదా! ఇంకొక సంగతి నన్నయ యాదికవియా కాడా యను విమర్శ యప్రస్తుతము. ఆదికవైనంత మాత్రమున సరసకవిత్వరచనచేయునని సిద్ధాంత మెచటయున్నది ? ఆదికవి కానప్పుడే రసవత్తర కావ్యరచన కవకాశ మెక్కుడు కదా ! పూర్వకవుల లోపముల దిద్దుకొనవచ్చును.

వారిరచనయందలి మంచిపోకడలను భాషా సంప్రదాయములను దాను పయోగించుకొనవచ్చును. అటుకాదేని యాదికవు లుత్కృష్టకవులు కాజాలరనిగాని, యుత్కృష్టరచనానంతర ముత్కృష్టతర రచనాసంభవ మగుననిగాని సిద్ధారింపతగదుగదా! కొన్ని వందల యేండ్లయినను భారతకవుల రచన కీడగు గ్రంథము లెన్ని వెలసినవి? కాన యా యాదికవిత్వ విచారణ మెల్లపుడును స్పష్టమైన యాధారములు దొరుకనంతవరకును యనవసర ప్రసంగమే యగును. అది కేవలము చారిత్రక విమర్శకులకే యుపయుక్తము. ఇక కథకు వత్తము.

వ్యాసుడు 'శకుంతలాయాం భరతో దౌష్యంతి రభవత్సుతః' అని యారంభించాడు. నన్నయ శకుంతలా భరతుల నామధేయముల నెత్తకయే వారిని సూచించినట్లున్నవి. విషమాటవీ చలితకేసరి శార్దూల మత్తేభ శరభముల దన బాలత్వమునంద యెగచిట్టుచు' అని సర్వదమనుని తండ్రిని వర్ణించి మూలమున భరతుని గూర్చి వ్యాసుడు వ్రాసిన విశేషములను దుష్యంతునికి, 'ఆత్మావై పుత్రనామాసి' యను వాక్య సార్థక్యముగా వాడినట్లున్నది. మూలమున 'సచాద్భుత మహాశౌర్యో వజ్ర సంహననో యువా' అని దుష్యంతునికి వాడిన విశేషణములనే, ముందుముందు భరతుని వర్ణించునపుడు నన్నయ 'సింహాసంహననుడు,' దీర్ఘబాహుడు, ననంత జవసత్త్వ సంపన్నుడు' అని యనుకరించినాడు. ఈ మార్పు యుచితముగనే యున్నది: తరువాత 'సమీర దుర్గమ మహోగ్రారణ్య దేశాళితో నాది శుత చరిత్ర నేలే' యని క్షత్రపదము వలన ధైర్యశాలిని యగు శకుంతలను సూచించి 'ఆవినేలే' యని సమాగమ సూచకముగా వాడినాడు. ఈ ద్వ్యర్థపదమందలి ధ్వని యుచితముగనే తోచును గదా! ఈ యర్థమును నన్నయ యుద్దేశించినాడా లేదా యనునది మనకనసరము. చాలచోటుల నిట్టి సొగసులమరినవి, యనునదే మనకు గావలసినది. నన్నయ యభిప్రాయములు దెలిసికొనుట, కాతని వ్రాతలు తక్క మరొండు యాధారము మనకులేదు కదా!

మూలమున దుష్యంతుని వర్ణనమందొక్క సొగసున్నది. నాలుగు శ్లోకములలో యౌవనవంతుడైన దుష్యంతుని వర్ణించుచు 'బలే విష్ణుసమః, తేజసా భాస్కరోపమః, అక్షోభ్యత్వే అర్ణవసమః సహిష్ణుత్వే ధరాసమః అని మొదలగు వానిని వ్రాసినాడు గాని శృంగార సంబంధమైన పదము నెచ్చటను వాడలేదు. కామ ప్రవృత్తి శకుంతల తోడనే యారంభమయ్యె నేమో! నన్నయ గూడ దీనిని పాటించినాడు. నన్నయ 'క్షత్ర చరిత్రనేల' ధర్మ చరితం బెరుగుచునుండె' ననుటలో దుష్యంతుడు రాజరాజనియు, సామంత క్షత్రియులు ధర్మమును భావించి పెంపొందింప జేయుచున్నారనియు సూచించినట్లున్నది.

మూలమున దుష్యంతుడు వేటకు వెడలినపుడు 'నిర్జలం నిర్మనుష్యం, బహుయోజన మాయతం' అని యడవిని వర్ణించి 'శుష్కాం చాపి నదీంగత్వా జలనైరాశ్య కర్శితాః। క్షుత్పిపాసా పరీతాశ్చ శ్రాంతాశ్చ పతితాభువి' అని జంతువులను వర్ణించి 'కైశ్చిత్ (తనరవ్యాఘ్రైః) అభక్ష్యంత బుభుక్షితైః' అని పదాతుల గూర్చి చెప్పినాడు. 'బిల్వార్క ఖదిరాకీర్ణం కపిత్థ వటసంకులం' అని క్షుద్బాధ్యాహార విరహిత మగు నరణ్యము నింకొకచోట సూచించినాడు. పై యర్థముల నొక్కపదములో 'క్షుత్పిపాసా పరవశులై' పదాతులయ్యాయి ప్రదేశంబుల విశ్రమించిరి' అని నన్నయ వ్రాసినాడు. దగ్గర పల్లెలుగాని జన సమూహముగాని యుండినయెడల పదాతులకు క్షుత్పిపాసా పరవశత్వము కలుగదుగదా! క్షుధార్తులగువారు సులభముగ నక్కాలమున లభ్యములైన వన్యమృగముల జంపి తినుటకు విశ్రమింతురు. మూలమునగల స్వభావోక్తులును 'నరవ్యాఘ్రైః' అను మొదలగు నెంతయు తగియున్న పదముల సొగసును నన్నయ కవిత్వమునందు గన్పట్టుట కవకాశములేదు. బహుళమైన భారతము నాతడు సంకుచించి వ్రాయవలసి వచ్చినపుడు మొత్తము భావమును వీలైనంత తక్కువ పదజాలముతో సూచింపవలెను. పదాతులే రథము ననుగమింపలేక వెనుక నుండి పోయిరనుటలో రథతురగాదుల ముఖ్యపరిజనము రాజు ననుసరించిరని స్పష్టముగా ద్యోతించును గదా!

నన్నయ్య వ్రాసిన 'అమరపతి ఖాండవమునకును వైశ్రవణు చైత్రరథమునకును సమానముగా కమలజుడు దీనిని భూలోకమునకు రచియించెను గాబోలు' ననుభావము బాగుగా నున్నట్లు తోచదు. మూలమున నీవనమునకే 'నందనప్రఖ్యం' 'చైత్రరథప్రఖ్యం' అను పదముల నాడినాడు. కాని దేవేంద్రుని నందన మనుటకు మారుగ ఖాండవమనుటం జేసి, ఖాండవము నింద్రుడు నందనముకన్న సుందరముగా భావించి యుండవచ్చును గాన యీవనము నందనముకన్న సుందరతరమని ద్యోతించు భావమే గమ్యమనుకొందమన్నను యష్ట మాశ్వాసమున 'తక్షకుండను పన్నగేంద్రు డింద్రునకిష్ట సఖుడయి ఖాండవమునం దుండుటం జేసి దీని నమృతము రక్షించునట్లు ప్రయత్నంబున నింద్రుడు రక్షించుకొని యుండునది అని అగ్ని చెప్పినటుల నన్నయయే వ్రాసినాడుగాన యీరెండవ సరసభావంబు కూడ వ్యతిరేకింపబడుచున్నట్లున్నది ఖాండవమగనన్ ఖాండవ దహనమే మనకు జ్ఞప్తికి వచ్చును. అంతియగాక ఖాండవము భూమిపై నున్నది. 'దీనిని భూభాగమునకు రచియించె నొక్కొ'యనుట. పై రెండు వనములును భూమిపై లేనప్పుడే సార్థకమగును. గాన నెటుచూసినను 'ఖాండవ' పద ముచిత ప్రయోగము గానట్లు తోచుచున్నది.

నన్నయ వ్రాసిన లతాలలనలుచేయు పుష్పవృష్టిని గూర్చిన పద్య మెంతేని సుందరముగను మూలమునందలి భావమునకు సరిపోవు నట్లును యున్నది. 'అతి రుచిరాగతుండయిన యాతనికిన్ హృదయ ప్రమోద మాతతముగ లవ్వనంబున లతాలలనల్ మృదులానిలాప వర్ధిత కుసుమాక్షతావళులు సేసలు పెట్టిన యట్టిరైరి సంపతదళినీ నినాద మృదుభాషల దీవెన లొప్పనిచ్చుచున్". ఇందలి సహాయార్థ స్ఫోరక మగునదేదియును లేదు. ఇవ్విషయమై మూలము నుదాహరించుచు (శ్రీ) బ్రహ్మంగారు తమ వాదమును వ్యతిరేకించునట్లున్న యాఖరు పాదమునుమాత్రము విడిచి మిగయ పాదములను వ్రాసినారు.

మారుతాకవితాస్తత్ర ద్రుమాః కుసుమ శోభితాః।
పుష్పవృష్టిం విచిత్రాంతు వ్యసృజంస్తే పునః పునః
దివ స్పృశోథ సంఘుష్టాః పక్షిభిర్మధుర స్వనైః।
విరేజుః పాదపాస్తత్ర విచిత్ర కుసుమాంబరాః॥

బ్రహ్మంగారు 'స్త్రీ జనమిరుగెలంకుల నున్నత స్థానములనుండి విభ్రమముతో నరికించి లాజలు జల్లుటకది నగర విశేషము'గాదన్నారు. మనమేదేని క్రొత్త ప్రదేశమునకు వెడలునపుడు దాని రామణీయకతను మన కితఃపూర్వ మనుభవ వేద్యమగు నొక రమణీయ ప్రదేశముతో పోల్చుట యవినయమా? ఋషి వాటికకైనను బట్టణభోగముల జక్కదనము దెచ్చునటుల గౌరవించుట యవినయమా? దుష్యంతునకట్లు దోచుట యస్వాభావికమా? మూలమునుగూర్చి బ్రహ్మంగారు 'ద్విజాశీర్వాదముతో జేతులెత్తి పూలుజల్లి యభ్యాగతుని సత్కరించు నీతి చెట్లొను నెట్లునేర్చెనో యనిపించిన కణ్వాశ్రమ వాసప్రభావము సూచింపబడుట యదాత్తరమ్యముగా నున్నదనినారు. దీనిని బట్టి యీయన పద్యములను శ్లోకములను సరిగ జదువలేదనియో, చదివినను వ్యాసునియందలి స్వాభిమాన పూరితభ్రమ యాతనిని నన్నయయందలి సరసార్థము జూడనీయలేదో తెలియరాదు. నన్నయ పద్యమునుగూర్చి వ్రాయు నపుడు "అక్షతలు" దీవనలొప్పని చెప్పచున్' అని యున్న పదమును జూచుట మానుటయు వ్యాసుని శ్లోకమునందు "ద్విజాశీర్వాదముతో చేతులెత్తి యభ్యాగతుని సత్కరించురీతి' అని స్వకపోల కల్పిత ధ్వన్యర్థమునే స్వీకరించి 'విచిత్ర కుసుమాంబరాః' అనుపదమును దాటిపోయి జూచుటయు, దుహితృపదముల యాచితినిగూర్చిరమారమి యొక పుట వ్రాసినవారికి దగనిపనియని భావించెద. రాజు వేటకు బయలుదేరు నపుడు 'ప్రాసాద వరశృంగ స్థానాస్త్రియః తం దదృశుః' అనియు 'ససృజుః' పుష్పవృష్టిః 'ససృజుః 'తస్యమూర్థని' అనియు నాగర చేష్టితంబుల వర్ణించినాడు. ఆనందకరము యువమనోహ్లాదకముగాగు నాదృశ్యమే, 'ఇరుగెలంకుల నాకాశము నంటు వృక్షములపై విచిత్ర

కుసుమాంబరములు ధరించిన వనస్త్రీలు పుష్పవృష్టినాతని శిరస్సున జారవిడిచినట్లాతనికి భాసింపజేసినది. ఆశ్రమస్త్రీలు విచిత్రాంబరములు ధరింతురేమో తెలియదు. ఈఘట్టము శృంగారరసప్రధానము. ఇందెక్కడగ తద్దోషోద్దీపనములగు శ్లోకములనే వ్యాసుడు వ్రాసినాడుగాని, తాపసజనోచితములగు వర్ణనములను గావింపలేదు. రాబోవు ఘట్టమునకు సూచనముగా 'ఏతాగృహ సఖీస్తాన్ సునసః ప్రీతివర్ధనాన్' పరస్పరాశ్లిష్ట శిరంఘ్రిపైః కుసుమాంచితైః సేవితం వనమత్యర్థం మహానర కినరైః' 'సుఖశీతస్సుగంధశ్చ... అనిల పరిక్రామన్ వనే వృక్షాన్ ఉపైతి చ రిరంసయా" అను నీమొదలగు వర్ణనల గావించినాడు. ఈ సందర్భమునగల రమారమి పదునారు శ్లోకములలోను, నైదారు పాదములలో మాత్రమే తాపసవృత్తి కను గుణంబులగు భావములను సూచించినాడు. అందే పుణ్యస్వాధ్యాయ సంఘుష్టాం నియమవ్రతచారిణాం' మత్తవారణశార్దూల భుజగేంద్ర నిషేవితాం' అను శ్లోకమున సంఘుష్ట పదమును, రెండవ పాదమును తిలకించిన, నా వ్రతచారులగు ద్విజులఘోషలు శార్దూలాదిమృగముల యరుపులవలెనే దుష్యంతునికి దోచిన:ని సూచించినట్లున్నది. ఇంతమేల ద్విజపదమునుగాని, ఆశీర్వాద పదమునుగాని (నన్నయపద్యము లోనిదీపదము) మూలమున లేనేలేనప్పుడును మరియొక సరసతరార్థముపపన్న మగుచున్నపుడును దూరాన్వయమగు ధ్వన్యర్థమే దానికర్థమని జెప్పి స్పష్టముగాగల పదముల యర్థమునుజూడ నిరాకరించుట దోషావహమని భావింతును. విశ్వనాథవారు "పురుషోత్తమ" పదమునకు నారాయణార్థము జెప్పి తద్భవముగా నన్నయ సూచింపబడినాడనుటవలననే "పక్షి" శబ్దంబునకు "ద్విజ" శబ్దమార్థముం జెప్పి, దానికి మరల ధ్వన్యర్థమును బట్టించుటయగును.

అసలింతకును నన్నయ పద్యమునకు బ్రహ్మంగారు చెప్పిన యర్థమే ధ్వన్యర్థము. అంతకన్నను రసవంతమై, సులభతరసిద్ధమైన మరియొకభావము స్పష్టముగా గోచరించును. "మూర్తీభవించిన వన దేవతా స్త్రీల వలెనున్న లతాలలనలు, రాజైన దుష్యంతుని శిర

ముపై కుసుమాక్షతావళుల జల్లి యళినీనినాద మృదుభాషల దీవెన లిచ్చి"రనుట యెంతయు దగియున్నది గదా! నాగరికస్త్రీలు 'అక్షతలను' జల్లి 'దీవెన' లిత్తురా? పద్యము చదివిన తోడనే నాగరికస్త్రీలే బ్రహ్మంగారి మనంబునకు దోచుటయు, బోనిండట్లు దోచినను, నా భావము విరసమని యాభాసోత్పత్తిం గల్పింప జూచుటయు నెట్లు సంభవించెనో పండితులకే యెరుక.

'పరితాపము దీరగ బైవీచె నన్నదీపవనంబుల్' అని చెప్పి వెంటనే నన్నయ 'ఏచి తనర్చి...' యను మాలినీవృత్త మారంభించినాడు. మూలమున నా నది పేరు మాలిని యని యున్నది. ఇది రమ్యముగా నున్నదిగదా! 'చనిచని ముందట నాజ్య హావిర్ద్రుత సౌరభ ధూమ లతాతతులం, బెనగిన బ్రాకుల కొమ్మలమీద నపేత లతాంతములైనను, బాయని మధుపప్రకరంబుల జూచి జనాధిపుడంత నెఱింగి దపో, వన మిది యల్లదె దివ్యమునీంద్రుని వాసము దానగు నంచు నెడన్' అను నన్నయ పద్యమునకు మూలమున నాధారము లేదు. సాధారణముగా బొగపెట్టిన తేనెటీగలు పట్టునుగూడ వదలి పోవునుగదా. అట్టియెడ బొగయున్నది. పూవులులేవు కాని మధుపంబులు చెట్లకొమ్మలమీద నున్నవి. ఇచ్చట మధుపశబ్దమెంతయు దగియున్నది. ఆ దివ్య హోమధూమ సౌరభభ్రాంతములై మధుపము లుండనోపునని గోచరించుచున్నది. ఆ ధూమమునుబట్టి తపోవన మిది యని యెఱింగి (నల్గడల జూచి) 'అదిగో దూరముగా 'నల్లచ్చట నాముని నివాసము గావలయు'నని దుష్యంతుడు అనుకొనినాడు. 'అల్లదెయెడన్' అనుట. 'అదుగో నల్లచ్చట' యను తెనుంగు వాడుకను జూపుచున్నది.

నన్నయ కణ్వాశ్రమ సమీపమున సహజ వైరివర్గముల మైత్రిని సూచింపుచు వాడిన 'సహవాస' పదమెంతయు దగియున్నది. కాని 'ఒక్కట గలసియాడు' అని యదే యర్థముల నిచ్చుపదముల మరలవాడుట బాగుగాలేదు. మూలమున 'ఆసనాని విచిత్రాణి

పుష్పవంతి మహీపతిః ప్రయత్నోపహితాని స్మ దృష్ట్వా విస్మయ మాగమత్' అని యున్నందున మునులు రాజున కాతిథ్య మీయ లేదను ప్రశ్నయే యుత్పన్నముగాదు. శ్రీ బ్రహ్మంగారు దుష్యంతుని కణ్వాశ్రమ ప్రవేశమును గూర్చి మరియొక యాభాస విరసార్థమును కష్టబడి సాధించిరి. మూలమున 'సోపశ్యమానస్తం ఋషిం శూన్యం దృష్ట్వా తదాశ్రమం। ఉవాచక ఇహేత్యుచ్చైః వనం సన్నాదయన్నివ' అనియున్నది. ఇది సహజమే. నన్నయ 'ఒక్కరుండ చని తన్వి ప్రయోజళాక్షి... గసియె, దమ్మౌని వల్లభు మందిరంబునన్, అని వ్రాసినాడు. కాని దుష్యంతుడు పిలువకయే లోనికి వెడలినాడని వ్రాయలేదే! 'రాజమ్మౌని ఇంటికిన్ జనుచు త్రోవ నెడనెడ మునుల నడుగుచు నయ్యాశ్రమ ద్వారమును సమీపించి పాదరక్షల బయట విడిచి...'' అని మొదలుగా ప్రతీకార్యమును వ్రాసినయెడల స్వభావ సుందరముగా నుండునా! సాధారణాచార వ్యవహారముల యౌచిత్యమును రాజు పాటించినాడని గాని, లేదని కాని వ్రాయకపోవుట దోషావహము గాదే! 'అమ్మౌని వల్లభు మందిరంబునన్' అనుటలో, మందిరము బయట నంతేవాసు లెవరును లేక శూన్యంబయి యున్నది. గాన యూర్ధ్వరేతస్కుడైన కణ్వుని కుటీరమున స్త్రీ జన మెవ్వరుందురను నిబ్బరముచేతను, సహజ రాజస్వభావముచేతను లోనికి దుష్యంతుడు వెడలినాడు గాని, రాజు మందిరము బయట నిలువబడి లోనగల శకుంతలను గనినాడని గాని యూహించుట యసంగతము కానేరదే! అవి కుటీరములే కాని విశాల హర్మ్యంబులు కావె. తొంగి కాని తలుపుద్రోచి కాని లోనివారలంజూచుట ధర్మమని బ్రహ్మంగారన్నారు. నన్నయ "రాజు చని... మందిరంబునన్' అనినాడు. కావున అకస్మాత్తుగా నొక్కయడుగు వేసి, సముద్రంబును హనుమంతుడుం బోలె కణ్వాశ్రమాభ్యంతరమునకు రాజు గెంతినాడా యేమి? అను యనౌచితిని నన్నయ కాయన ఏల నంటగట్టలేనో దుర్గ్రాహ్యమే. అంతేగాదు. 'తన్వీపయోజదళాక్షి సంకుల మిళిత... కోమల కుంతల' అను

పదములలో ప్రత్యంగ వర్ణన మాయనకు తోచుట శోచనీయమే. మూలమున శకుంతలను జూచినపుడు 'శ్రీరివ రూపధారిణీ' అనియే గాక 'దృష్ట్వా సర్వానవద్యాంగీం' అనియు వ్యాసుడు వాడినాడే! నన్నయయందీ ప్రత్యంగ వర్ణనము దురదృష్టముగా నాయనకు దోచినను నది యమూలకము గాదే! అంతేకాదు కణ్వుడు లేడని తెలియు వరకును 'పుష్కరలోచనే' 'శోభనే' అని దుష్యంతుడు శకుంతలను సంబోధించి (అపశ్యమానస్తం ఋషిం తాం వరారోహాం, శ్రీమతీం, చారుహాసినీం) ఋషి లేడని తెలియగానే వరారోహను, చారుహాసినిని 'సుశ్రోణి, నాగనాసోరు, మత్తకాశిని, కలభాషిణి'. అని సంబోధించినాడే దానిని గూర్చి 'ఋషి లేకపోవుటతోడనే బరితెగించి హృదయమందలి శంకా భయంబుల వీడి సరసరంబులకు దిగినాడు' అను విరసార్థము.ను బ్రహ్మాంగా రేల చూడలేదో తత్కారణము మనోతీతముగానున్నది. నన్నయ పై పద్యమునందు కొంచెము దూరాన్వయమైనను నొకసొగసున్నట్లు గోచరించుచున్నది. మూలమున 'స్వాగతం తే ఇతి క్షిప్రం ఉవాచ ప్రతిపూజ్య చ, ఆసనే నార్చయిత్వాథ...' అని శకుంతలగూర్చి చెప్పుటయును 'విద్యుత్ ఘనాంతరాత్ యథా' అని ఆమెను వర్ణించుటవలనను, రాజునకు స్వాగతముం జెప్పి వెంటనే వెనుతిరిగినదని (అర్చనాది సామగ్రికొరకు) యూహింపవచ్చును. ఈ విషయమునే నన్నయ పైవిశేషణముల జూపినాడని తోచుచున్నది. శకుంతలను జూడగనే ఆమె సుకుమారాంగి (తన్వి) యని దుష్యంతుడు గ్రహించినాడు. శకుంతల దుష్యంతుని దగ్గరకు వచ్చి యాతనిని చూడగనే (సా తం దృష్ట్వైవ రాజా దుష్యంత మసితేక్షణా - యని మూలము) యామె పయోజదళాక్షిగా నెరిగినవాడు. స్వాగతము చెప్పి వెనుతిరుగగనే 'సంకుల మిళితాళి... కుంతల'గా జూచినాడు, ఆ తృటిలోనే దుష్యంతునకీ లక్షణము లామె యందు గోచరించినవి. ఇది దూరాన్వయమేకాక సార్థక సంబోధనలను నన్నయ చాలచోట్ల వాడినాడు గావున, సిద్ధించుచున్న ఊర్ధ్వార్థము

నందు యుచితానుచితములకు సహృదయులగు పాఠకులే సాక్షి. వ్యాస భారతమునందొక శ్లోకమును చదివిన వెంటనే యాభావము నన్నయ పద్యమునందు రసమును గోల్పోయినదే యని యావేదన పడరాదు. ఆమూలాగ్రము చదివి ప్రతిపద విమర్శనము జేసి తరువాతనే బాగోగుల నెన్నుట యుచితమని చెప్పుటకే యీ యన్వయము వ్రాసినాను.

'పరబాలికలను చూడగనే ప్రత్యంగ సౌందర్యలగ్నమైన దృష్టి' యనియు ఐశ్వర్య మత్తతచే గలిగిన వికారమనియు 'తత్కాల జృంభిత కామావేశు' యనియు మొదలగు నెవరికి తోచిన పదములు వారు వాడుట చాలసులభము. దాని కాలోచన యవసరములేదు. అది తత్కాల జనితావేశమునే తెలియజేయును. కాని వానిని సకారణముగా గాదని నిరూపించుటకు యత్నించువారికి మాత్రము జాగ్రత్తగా నన్నయను. మూలమును జదివి సాకల్యముగా నాకళించుకొనుట తప్పనిసరి. పైపైన జూచి స్వమనోప్రవృత్తి కనుగుణముగా వ్రాసుకొనిపోవుటకు వారికి కుదరదు. ఈ విధముగానైనను బ్రహ్మంగారా యవకాశము పాఠకులకు గల్పించి కృతకృత్యులైనారని భావించెదను. ఆ దుష్యంతుని మనఃప్రవృత్తినే, సనాతనము, భగవత్స్వరూపము, ధర్మావిరుద్ధమునగు కామమును వర్ణించుట యుచితతరంబుగా నుండునుగదా. దుష్యంతుడాశ్రమ ప్రవేశమును జేయుటతోడనే యాతని మనంబున శృంగారభావము లుద్భవించి, శకుంతలను జూడగనే నామెయం దాతని మనసు లగ్నమైనదని మూలమున "ధర్మదేవ హేశుభే త్వయా మేఽపహృతం మనః" అనియున్నది. మూలమున మహర్షి లేడని తెలియువరకును సామాన్యముగనే శకుంతలను సంబోధించి తరువాత కామావేశ పరవశుడగుట గూర్చి, 'గాంధర్వ వివాహోచిత స్థలకాలంబు లుపపన్నములైనవి గాన తదనుసరణ భావంబులే రాజునందును గల్గినవి. కాని యవి తుచ్ఛములుగావు. అనపేత ధర్మ్యంబులు' అనిచెప్పుట 'శకుంతలను జూచినతోడనే కామమోహితుడై తండ్రి లేడనినతోడనే తమకము హెచ్చి

పైపైకి వచ్చినాడ'ని చెప్పుటకన్న ఎంత యుచితముగానుండును. కణ్వుడు కూడ 'ధర్మిష్ఠతాం మత్వా' 'ధర్మే చాస్ఖలితం మనః' అనియు 'సకామా యా స్సకామేన నిమంత్రః శ్రేష్ఠ ఉచ్యతే' అనియు జెప్పినాడు. ఈ విషయమునే సంచలిత హృదయుడైన దుష్యంతుని స్వగతమున 'ఇది మునికన్యయేని ఏల నా హృదయంబు దీనియందు దవిలె' నప్పలుకు నమ్మనేరన'ని నన్నయ ద్యోతింపజేసినాడు. ధర్మా విరుద్ధకామము కల్గదని దన దృఢమైన నమ్మిక మగుటంజేసి, వాని హృదయసంచలనమును మూలమున కవరోధముగా సమర్థించినాడు. మూలమున 'నమేన్యత్ర క్షత్రియాయాం మనోజాతః ప్రవర్తతే' అని చెప్పించి 'భక్తుంభజ' "భుక్త్వా రాజ్యం విశాలాక్షి" యనిపించినాడు.

దుష్యంతుని భావమున కనుకూలముగనే శకుంతల భావము గూడ ప్రవర్తించినది. వాని ననంత విలాసంబున జయంతుని పోల్కి కలవానిగా జూచినది. చూడగనే యాతని సౌందర్యమామె నాకర్షించినది. అంతమాత్రముననే 'కనువేదుగుగల బాల' యని మహద్యశో విప్రస్థాన కారణుండైన భరతుని జననిని గూర్చి పల్కొనుట సాహసోపేతమై నన్నయయందలి ద్వేషభావముచే సూచించును. వీరి ప్రేమ దివ్యమైనది. కారణజన్మ ప్రభావమూలకమై యకస్మాదుద్భవమైనది. మూలమున విద్యుత్తువలె దుష్యంతునికి దర్శనమిచ్చి యాలిప్తార్థ కాలముననే (మూలమున 'దృష్ట్వైవ') దుష్యంతుని సింహస్కంధునిగా, దీర్ఘబాహునిగా, ఆయత పద్మాక్షునిగా, వ్యూఢోరస్కునిగా సంహతునిగా' వేయేల 'సర్వలక్షణ పూజితు'గా నెఱింగినదే! 'జించి లజ్జావనత వదనయై స్మయమానయై "కిం కార్యం మయా యతాం' అని యడిగినదే! ఈ సాత్త్విక భావజాత మనస్కయైన కుంతలను శ్రీ బ్రహ్మంగారెంత దండింతురో తెలియరాదు.

దుష్యంతుడు తన్ను వివాహము జేసికొనుమని కోరిన తరువాత "ఏకాకీ త మాశ్రమే హసతీ వాక్యం సుమధురాక్షర మువాచ" అని శకుంతలను ధైర్యోపేతయైన శృంగార నాయికగా సూచించి 'నీ

యర్థమును మాతండ్రియగు కణ్వు నడుగు'మని యనిపించిన తరువాత దుష్యంతునకు సందేహ ముదయింపగా 'నీ వెవ్వని కూతురవని' యడిగి నట్లు మూలమున వ్యాసుడు వ్రాసినాడు. అట్లుగాక నన్నయకొలది భిన్నంబుగా, 'కణ్వమహాముని యెందేగిరని' దుష్యంతుడడుగ బండ్లు తేర నేగిరని శకుంతలచే జెప్పించి 'నీ వెవ్వని కూతురను ప్రశ్నకు శకుంతలచే స్వవృత్తాంతమును జెప్పించి దానిని వినిన దుష్యంతు డామెను పాణిగ్రహణము జేయుమని కోరినట్లు వ్రాసినాడు. మూలము నందువలె, శకుంతల యెవరో తెలియకయే తనమనంబునే ఏకైక సాక్షిగా దీసికొని యామె క్షత్రియకన్యకయై తీరవలయునని నిశ్చయించి యామెను 'బెండ్లియగు' మని యడిగినట్లు నన్నయవ్రాయక దుష్యం తునియందు కొంచెము జాగ్రత్త సూచించుచు యామెను క్షత్రియగా యెఱింగిన తరువాతనే బెండ్లాడుమని కోరినట్లు చిత్రించుట కొంచెము మెఱుగుగా గన్పట్టుచున్నదని భావింతును. కాని చూడగనే పరస్పర లగ్నమనస్కులను విషయమున రెండును భిన్నాభిప్రాయములే.

'దృష్ట్వైవ చ తాం ధీమాన్ చకమే చారుదర్శనాం' అని పరాశరుడు సత్యవతిని జూచునప్పుడును "తాం దృష్ట్వా హృష్టరోమా భూత్ దర్శనాదేవ శంతనుః పిబన్నివ చ నేత్రాభ్యాం నా తృప్యత నరాధిపః" అని శంతను గూర్చియు వ్రాయుట వలన, పరాశరుని యుచ్ఛకామావేశ ఫలితంబు వ్యాసుడగుననియు శంతనుని యైశ్వర్య మత్తతావికారుని పుత్రుడు భీష్ముండనుటయు జెల్లునే! కొన్ని యలౌకిక విషయములను భారతకథయందు తప్పక నొప్పుకొనవలయును. కాని యెడల మూలభారతమునందలి చాలకథను తీసి పారవేయవలసి వచ్చును.

మూలమున దుష్యంతుని సింహాసంపనుడైన యువకునిగా చూచినంతనే స్వాగతమును జెప్పి యర్ఘ్యపాద్యాదులిచ్చి 'పప్రచ్ఛా నామయం రాజన్ కుశలంచ నరాధిపం' అని చెప్పుటలో రాజలక్షణ ముల నుపలక్షించుటవలననే రాజని గ్రహించినది. కాని దృశ

ప్రత్యుయార్థము మరల 'నీవెవ్వరని' యడిగినదని యూహించుకొన వచ్చును. నన్నయ 'దుష్యంతు నెఱింగి' యనినాడుగాని దుష్యంతు నిగా నెఱింగి యనలేదు గాన యీ యెఱుంగుట దుష్యంతుని నోటి నుండియే గానవచ్చును లేక రాజలక్షణములనైనను గావచ్చు. ఇందు రెండవ యభిప్రాయమే మూలమునందు సూచితమగుటంబట్టి సమం జసమగునని దోచుచున్నది. 'చూడగనే రాజని యెఱిగినదట' అను బ్రహ్మంగారి యూనడింప సమగ్ర పరీక్షాఫలితమని జెప్పవచ్చునేమో! మూలమున విస్తారముగా హావభావాది సూచితమైన యుద్దేశమునే నన్నయ యొక్క పదములో ప్రస్తుత శృంగార ప్రాదుర్భావ సూచ కంబుగా 'అనంతవిలాసంబున జయంతుని బోలిన' అని సూచించినాడు.

నన్నయ 'కణ్వ మహామునింద్రునాత్మజను' అని శకుంతలచే జెప్పించినాడు. దానిని వినంతనే "యీ పలుకు నమ్మనేరనని" దుష్యంతుడనుకొనినాడు. మూలమున 'దుహితారం మాం విద్ధి' 'సుతామేవం మాం విద్ధి' అనియు శకుంతల బల్కినది. కణ్వునకు బుట్టకపోయినను వారి సంబంధము జన్యజనక సంబంధము వంటిదే. వారి భావములుగూడ నట్టివే. కణ్వుడు 'శకుంతలాచ పితరం మన్యతే మాం' అనుటయు శకుంతల 'కణ్వం వా పితరం మన్యే పితరం స్వ మజానతీ' అనుటయు జూడ నీ సందర్భములయందు 'జనక' శబ్ద ముచితమైనను 'పా ధాత్వర్థకమైన పితృశబ్దమునే వ్యాసుడు వ్రాసి నాడేల? యని సందేహముదయించును. ఆ పదములను తండ్రి, కూతురు అనుపదములవలెనే ప్రయోగించినాడనిపించుచున్నది. ఆత్మ జార్థము నిచ్చు 'సుతాం' అను పదమునుగూడ వ్యాసుడు వాడినాడే! పై జెప్పిన సందర్భములయందు వ్యాసుడుగూడ శ్రీ బ్రహ్మంగారి వలన 'నయథార్థము నపలపించినాడను' నపశయము నార్జించుకొన పలసినవాడే కదా! వ్యాసుని పితృ, దుహితృ శబ్దములకు ధ్వని సంయోగమున నిజమే, అంతమాత్రమున 'ప్రాదుర్భావార్థక జనిధాతు సంబంధములైన యాత్మజ జనకశబ్దంబుల నుపయోగించి

యౌచిత్యమును భ్రష్టమొనర్చినాడు. అవి కేవలానవధానతా కారణంబుగా ననాదృతములైనవి. మూలమౌచిత్య సుభగపద సమన్వితము' అని యనుట చాల యనాలోచితమును నతత్త్వైక నిర్ణయ బుద్ధిద్యోతకమును వలెదోచుచున్నది. ఆపదముల నుపయోగించిన యౌచితి ఏల చెడినదో సకారణముగా వివరింపలేదు. శకుంతల కణ్వుని యాత్మజ అను భావము దుష్యంతునకు కలిగినగదా 'యూర్ధ్వ రేతస్కుడైన కణ్వునికి నీవెట్లు కూతురివైతివి ? యనుప్రశ్న యుదయించును. స్వజనకుని వలెనే కణ్వుని భావించుచున్న శకుంతల 'జనక' పద ముపయోగించుట, అయథార్థప్రలాప మెన్నడును గాజాలదు. మూలమున జనక పదమెచ్చటను సాధారణముగ గానరాదు. 100 కి 99 పదముల స్వజనకునికి గూడ పితృపదమే గానవచ్చును. ఓపిక గలవా రాదిపర్వమును పరిశీలించి నిర్ధారించుకొనవచ్చును. మూలమున దుష్యంతునిప్రశ్న 'దుహితా కథం సంభూతా' యనునది గూడ బ్రహ్మంగారి వాదమున సార్థకముగా నేరదు. వివాహవిషయమున కన్యాప్రదాతయగు తండ్రిని గూర్చి 'మదీయజనకులు ననుఁ డెంతురు. వారు నీకిచ్చిరేని..' యని నన్నయ యనుటలో జనక పద మనౌచితి గానేరదనుకొందును. నన్నయ 'నయథార్థప్రలాపి యనియు' వ్యాసుని 'పితృగునకును బియ్యంబునకును నొక మంత్రమే చదువు బ్రాహ్మణు'డనియు 'ననుట కంటె' 'తండ్రి' 'కూతురు' అను అర్థములనిచ్చు పదముల వాడినారని యుభయపక్షంబుల యందును సౌహార్దత్వమును జూపుట యుచితమని భావింతును. ఒక్క పదమును గూర్చి దీర్ఘ విమర్శచేయునపుడు పూర్వాపరముల జాలవరకు నాలోచించి పనికి గడంగవలయును. నన్నయ చాలచోట్ల సంబోధనలను విశేషణములను అర్థయుక్తముగా వాడినాడు. కొన్నిచోట్ల నవి యౌచిత్యము నెక్కుడు చేయునవిగా గూడ నున్నవి. వాని నన్నింటిని యొక పట్టికగా వ్రాయుట ప్రస్తుతము సాధ్యముగాని పని. కావున కుతూహలులు పై జెప్పిన పితృపదవిషయమై వ్యాసుని నన్నయ కవితల సరిపోల్చి చూచి యౌచిత్య అనౌచిత్య విచారణ చేయుదురుగాక

యని గోరుచున్నాను. 'ప్రమాదో ధీమతా మపి' యన్నట్లు నన్నయ గూడ తప్పటడుగులు వేయవచ్చును. కాని ప్రస్తుత ఘట్టమందలి జనక, యాత్మజ పదములా తప్పటడుగులలో జేరవని నాయభిప్రాయము. వ్యాసుడు పితృపదమును జనకపద నిర్విశేషముగా వాడినాడు.

కణ్వుని యొక ఋషి 'ఊర్ధ్వ రేతా యథాసిత్వం, పుత్రీ త్వత్తః కథం జాతా సత్యమే బ్రూహి' అని యడుగుట యుచితముగానున్నట్లు కన్పట్టదు. కణ్వుడు ప్రఖ్యాత బ్రహ్మచారిగదా! అట్టివానిని శకుంతల యెక్కడిది. దీని జన్మ విధంబెట్టిది అని యొక పై యాశ్రమపు ముని యడిగినటుల నన్నయ వ్రాసినదే బాగుగనున్నట్లు తోచుచున్నది. యూర్ధ్వరేతస్కము విదితము గావున శకుంతల యాతని కూతురు గానేరదు అని నిశ్చయించి యడుగుట బాగుగ నున్నది కదా!

దేవేంద్రుడు మేనకను పంపుచుండ, మూలమున విశ్వామిత్రుని గూర్చి మేనక ఇంద్రునకు జెప్పినదానిని జాల వఱకు దగ్గించి నన్నయ శకుంతలనోటనే దానిని బల్కించినాడు. మూలమున మేనకచే నంత విపులముగా విశ్వామిత్రుని ప్రభావమును వర్ణింపజేయుట దాని భయాందోళనముల వ్యక్తము జేయుచు బాగుగనే యున్నది. కాని రాజేంద్రునివద్ద విదితములైన తద్విషయముల నన్నిటిని మేనక జెప్పుట రాజమర్యాదగా విలక్షణమని భావించి నన్నయ ఇట్లు మార్చి నాడనుకొనవచ్చును. ఈ సంభాషణ యందంతటను నన్నయ రాజ సేవక భావము, వ్యాసుడు రాజ వేశ్యాభావమును బ్రకటించినారు. 'మూలమునగల' 'తేజసా నిర్దహే ల్లోకాన్ చాలయే ద్ధరణీం తథా... తాదృశం తపసాయుక్తం ప్రదీప్తమివ పావకం. కథ మస్మద్విధా బాలా జితేంద్రియ మభి స్పృశేత్' అను శ్లోకములు చిన్న చిన్న వాక్యములతో గూడి భయోచితములుగ నున్నవి. నన్నయ వ్రాసిన 'అమ్ముని యల్గి చూచుడును నాక్షణ మాత్రన గోత్రధారుణీధ్రమ్ములు...' యను పద్యము సందర్భోచితముగ నున్నట్లు గన్పట్టదు. కోపపరు పాలికి భామలు లోవనోడరె' యనుటకన్న ప్రదీప్తం పావక మివ కథ మస్మద్విధా బాలా తమభిస్పృశేత్' అనుట మెరుగగా నున్నట్లున్నది.

మూలమున మేనక 'భవేచ్ఛ మే మన్మథః తత్రకార్యే' అనియు 'కామంతు మారుత స్తత్ర మే వాసః ప్రక్రీడితాయా విస్పృణోతు' అనియును చెప్పుటను నన్నయ 'అమ్మునివరు చిత్తంబు మెత్తన చిత్తజాయత్తంబగునట్లుగా చేసెదనని వాసవు వీడ్కొని మందమలయానిలంబుతోడుగా' అని మార్చినాడు. 'వాయువు నాబట్ట విప్పివేయుగాక, అని దేవవేశ్య రాజుతోనన్నదని, తొలి సమావేశమునందే దుష్యంతునితో వయసువచ్చిన బాలిక శకుంతల యనుటలో ననా చిత్యకల్పనను (శ్రీ) బ్రహ్మంగారేల చూడలేదో తెలియుటలేదు. దేవవిహితమైన యీ వాసనావరణమును కూర్చి ముందుగా మేనక యడిగినట్లు వాచ్యము చేయక నన్నయ ధ్వనిగర్భితముగా 'మందమలయానిలమును తోడ్కొని వెడలినది.' అని చెప్పిన తరువాత 'గాలియామె బట్టం దొలగించినదని చెప్పి, మన్మథుని సహాయమునుగూడం చిత్తజాత్తయంబు చేసెద'ననుటలో సూచించినాడు.

నన్నయ 'చల్లని దక్షిణమారుత మల్లన వీతెంచె దగిలి లలనాధమ్మిల్ల... సుగంధి యగుచు మునివరు మీదన్' అని చక్కని పద్యమును వ్రాసినాడు. ముని ప్రాఙ్ముఖుడై తపంబునకు కూర్చుండును గదా. మేనక మునికెదురుగా ప్రవేశించిన దక్షిణానిల మామె ధమ్మిల్ల కుసుమ సుగంధియై మునివరు మీద ప్రసరింపదుగదా! ఆముని వరునకు కుడిప్రక్క చాటుగా మెల్లమెల్లన భయాక్రాంతయై ప్రవేశించి మునిని ముందటం గనినది. (వనకేళి లాలస విలాసగతిం జనుదెంచి ముందటం గనియె... కౌశిక చిత్తభీతి సంజనన... చిత్త నిరస్త చిత్తజున్) తరువాత నామె వసనంబు తొలగగా విశ్వామిత్రుడామె యంగములయందు దన దృష్టి నాటు డామెను జేరదీసినాడు. ఇచ్చట వ్యాసుడు "అపోవాహాచ వాసోఽస్యాః' అనియు 'అనిర్దేశ్య వయోరూపాం అపశ్యద్వివృతాం' అనియును వ్రాసినాడు. నన్నయ వ్రాసిన 'అలసత యొప్పగా దరుణి...' అను పద్యము విషయమై వల్లకుచంబు

లయు గక్షయుగ్మంబులయు. ప్రశంస, వయసువచ్చిన బాలిక, ఋషి వాటికం బెఱిగిన తపస్విని జగతీవల్లభునితో నప్రస్తుతముగా గావించుట దగదనియు, నవ్యక్త మధురభావము తెలుగు లాలిత్యము గోలుపోయి యమూలకమైన యనౌచిత్య కల్పనగా భాసించినదని శ్రీ బ్రహ్మం గారన్నారు. మూలము సావధానముగ బరికించినను, నన్నయయందలి యసౌహార్దత్వ మాయనకీవిధమగు యనౌచితి నందాయనకు గన్పట్ట కుండ చేసియుండవచ్చును. వనమును వాయుదేవుడు తొలగజేయగా వాసార్థమును చేతితోపట్టుకొని త్వరితముగా వంగి నగ్నమై యనిర్దేశ్య వయోరూపమైన యామెను జూచి కామార్తుడయ్యెను.' అని యర్థ మిచ్చు మూలమునందలి శ్లోకము లప్రస్తుతములుగావా? శృంగార విషయములందు పరిచయములేని తపస్విని యీ శృంగార చేష్టలను వర్ణించుట, అందును రాజామెను పెండ్లాడుమని కోరిన తరువాత, నెంత యుచితముగానున్నది ? 'సాగచ్ఛ త్వరితా భూమిం...' అను బైయర్థము నిచ్చు శ్లోకమును బ్రహ్మంగారేల సరిగా చూడలేదో తెలియలేదు. నిష్కపటముగా కక్షుకుచ ప్రశంస జేయుటయే. ముని వాటిక బెరిగిన కన్యకు అనుమాన రాహిత్యతను, అమాయికతను వెల్లడిచేయునుగాని సరస శృంగార చేష్టావర్ణనములు నాగరక స్త్రీ లక్షణముల వ్యక్తముజేయును. మొగమాట మెరుగని మునికన్యా లక్షణము లిందు గానరావు. నన్నయ భారతమున యీ సందర్భమున దుష్యంతు డింకను శకుంతల బెండ్లియాడెదనని గోరలేదు. మూలమున బెండ్లిమాటల తరవాతనే యీ నగ్నసౌందర్య నిర్దేశ్యరూపసంపదా ప్రశంస వచ్చినది. ఈ పై వాక్యములను, ఇతఃపూర్వమిటువంటి మరికొన్ని విమర్శనములను బ్రహ్మంగారి పాక్షికతను జూపుటకు వ్రాసితినిగాని వ్యాసుని వ్యాసుని యనౌచితి నెన్నుటకుగాదు. వ్యాసుని శ్లోకములగూడ దగు దృష్టితో చూచిన సంసార్థ యుక్త భావము గోచరించును.

అసలింత విపులముగా నీకథను వ్యాసుడు జెప్పించుట యెందు లకు ? నన్నయ వ్రాసినదాని కై దారురెట్లున్నదే! ఇది యప్రస్తుతము

కాదా ? అను ప్రశ్న వేసుకొని మరియు నన్నయ యందలి యప్రస్తుతి నెన్న వలయును. అదెయ్యదియో జెప్పక నన్నయ వ్రాసిన రెండు పదముల స్వీకరించి స్తన శల్యపరీక్ష కారంభించుట యుక్తముకాదు. ఆ రెండుపదములును అప్రస్తుతములుగను, లాలిత్యరహితముగను గన్పట్టును. నిజమే. అట్టియెడ వ్యాసుని యింత విపులకథయు శృంగార వర్ణనమును ప్రస్తుతములు, లలితములును గాజాలవే! దీనికి సమాధాన మాకాలమందు పల్లియలలో శృంగార చేష్టావర్ణన మనౌచితిగాదని భావించుటయే తప్ప వేరొండు గత్యంతరము లేనట్లు దోచుచున్నది. మనమునందలి యుద్దేశముల చాలవరకు వ్యక్తముచేయుటయే వారికి సాధారణ విషయమై యుండపోవును.

పెద్దకాలము కామోపభోగముల రమించు పుత్రికంగన్న విశ్వామిత్రుడు తపోభ్రష్టుడైనాడు. వాచ్యమొనర్చుట యనవసరమని భావించి మూలమున విస్తరముగా వ్రాయబడిన యా విషయమును నన్నయ వదలివేసి యుండవచ్చును.

'ఇది మునినాథ కన్యకయని నిస్పృహా వృతునున్న...' అని దుష్యంతునిచే నన్నయ యనిపించుట మూలముకన్న బాగున్నట్లు తోచుచున్నది మానవుడెన్నడైనను పొరబడుట సహజము గాన దుష్యంతుడు మూలమునందువలె తనయూహనే యాధారము చేసికొని శకుంతల యెవరో తెలియకయే యామెను బెండ్లాడుమని యడుగుట కంటె నన్నయ వ్రాసినది దుష్యంతుని యుచితజ్ఞతను తెలియజేయును. మూలమున మణిమయాద్యాభరణముల నిచ్చెదనని దుష్యంతుడు భోగాశ చూపినాడు. కాని నన్నయ దానిని వదలివేసినాడు. ఆకోమలి యందనురాగ ముపలక్షించి, ఆమె జన్మవృత్తాంతమును వినిన తరువాత నే రాజభోగముల ననుభవింపుమని ఆమెను ప్రోత్సహించినాడు. ఇదియు దుష్యంతుని పాత్రను పోషించునదిగా యున్నది. ఈవిషయమున శ్రీబ్రహ్మంగారి యుద్దేశములు వినదగినవి. తుచ్ఛకామాపేక్షచే ఆయమాయకురాలిని గాంధర్వము శాస్త్రీయముగ నమ్మించి, కామా

వేశంబును నిలువరించుకొనలేక కకుూర్తిపడి యా సాధ్వి నంటు గావించి, కణ్వుడు వచ్చునంతవరకును నిలుచుధైర్యములేక పారి పోయినాడు ? ఈ విషయమున ఎక్కువగా మొదటనుండియు నిలువ రించుకొనలేని కామమును వ్యక్తము చేసినవాడు, వ్యాసుడుచిత్రించిన దుష్యంతుడు. నన్నయ చిత్రించినవాడు 'ముని కన్యకయని' నిస్పృహా వృత్తి నున్నవాడు. గాంధర్వ మహాస్త్రీయమని బ్రహ్మంగారి యుద్దేశమా ? ఉత్తమక్షత్రియుల, మహాపురుషు జన్మకారణభూతులైన వారి కలయిక విషయమై భర్త భార్యను కక్కుర్తిపడి యంటుగావించె నని వాడుదురేమో పండితులకే యెఱుక ! శకుంతల యటూయిక గాదే ! న కొడుకును రాజును జేసినయెడలనే నేనీపని కొప్పుకుందునని రాజును ధైర్యముగా నడిగినదే ! రాజమహిషియు రాజమాతయు గావలెనన్న కోరికగలదే !

మూలమున 'సకామునికి సకామ వగుము' అని ధర్మయుక్త ముగా దుష్యంతు డడిగినాడు. కాని నన్నయ 'పరస్పర ప్రేమంబు కాముడు పెంపదొడగె' ననుట శకుంతల యందలి శృంగార భావంబును పోల్చుట కనుగుణంబుగా నున్నది. శకుంతల యందీవరకే సాత్విక భావము లుత్పన్నమైనట్లు సూచింపబడినది కదా ! మూలమున 'మమ -యతేయః పుత్రః' అని శకుంతల యన్నట్లున్నది. కాని భర్తృ ప్రధాన సూచకముగను సాధ్వీలక్షణ యుక్తముగను నుండునట్లు నన్నయ 'నీ ప్రసాదంబున నాకుదయించిన నందనున్' అని శకుంతలచే ననిపించుట మెఱుగుగా నున్నట్లు దోచుచున్నది

మూలమునందు శకుంతల చాల జాగ్రత్తకలది. యువరాజత్వము నడుగుటయేగాక 'రాజా త్వదనంతరం కర్తవ్యం' అనికూడ చేర్చినది. అంతేగాదు 'సత్యంమే ప్రతిజానీహి ప్రతిజ్ఞాం రాజసత్తమ' అనిగట్టిగా ప్రమాణమును ప్రత్యేయార్థము గోరినది. తదనంతరము గాంధర్వమున కొప్పుకొనిన యామె, రాజు నీకింకేమి గావలయునని అడుగుటయే తడవుగా, దుష్యంతుని నమ్మనిదై 'రహో వివాహమైన గాంధర్వము

కన్న బ్రాహ్మవివాహము మంచిదనియు, లోకాపవాద శాంత్యర్థ మనియు, యుక్తులంబల్కి 'పురోహిత సాక్షిగా వివాహము గావలెనని గోరినది. రాజాలోచింపకయే (అవిచార్యైవ) దాని కొప్పుకొనినాడు.' అని యనుటలో తరువాత నాలోచించి శకుంతల యపనమ్మకమున కామెపై కోపగించియో, మరే కారణమువలెననో శకుంతల నాహ్వానింప లేదని సూచించినట్లున్నది. లేక యాపదము కామాతురతనైనను సూచింపవచ్చును. శాస్త్రీయరీతిగా వివాహానంతరము ఆమెను దుష్యంతుడు గూడి తరువాత పిలువకపోవుట యపరాధ తరంబుగా నుండునని దుష్యంతుని పాత్ర పోషణమునకీ వివాహ ప్రశంసయే నన్నయ ఎత్తలేదని దోచుచున్నది. గాంధర్వవివాహమును మాత్రము సూచించుట యుక్తముగా గన్పట్టుచున్నది.

దుష్యంతుడు 'నిన్ననోన్న రాజలాంఛనములతో తీసికొని వెళ్ళెదను.' అని మూలమున అలాంఛనములను భోగములను మఱి మఱియు వర్ణించి 'సత్యం కరోమి' 'శపేయం సుకృతేనైవ' అనియు ప్రమాణముచేసి మరియు మోసగించినట్లు మూలమున నున్నది. దుష్యంతునికి భయము కలిగిన నాశ్రమమునుండి పారిపో నవసర మేమున్నది ? మహర్షికి కోపము వచ్చిన యెడల పరోక్షమందైనను దానిని జూపలేదేమి ? లోకాపవాదభీతి శాస్త్రీయ వివాహమువలన దొలగిపోయినది కదా ! శకుంతల ఎటులనూ యీ విషయమును కణ్వునకు దెలియజేయును. లేకపోయును అతడు దివ్యదృష్టివలన తెలిసికొనగలడు. అని దుష్యంతుడు భావించి కణ్వునకు క్షమాపణజెప్పి శకుంతల నేలుకొనుటవలన కణ్వుడు శాంతింపవచ్చును గాని, శకుంతలను పుట్టినింటనే వదలివేయుట ధర్మజ్ఞుడైన కణ్వుడు హర్షింపడను విషయము లోకజ్ఞుడైన దుష్యంతునికి తెలియదా ? కణ్వుని వలన భయంబును నన్నయ దుష్యంతునకు చూపలేదు. ఆఖరున నరాధిపుడు లోకాపవాదభీతిని ప్రకటించినాడని మాత్రము చెప్పినాడు. దుష్యంతుని భయమునుగూర్చి గాని మనఃప్రవృత్తిని గూర్చిగాని నన్నయ ఏమియు వ్రాయక పాఠకుల యూహకే వదలినాడు.

పుట్టిన దాదిగా బెంచి పెద్దచేసిన తండ్రి యనుమతి లేకుండ, స్వయందానము చేసికొనిన శకుంతల, లోకజ్ఞానము లేదనియు, బేలయు గాదు కావున తండ్రిని చూసి భయపడుట సహజమే. మూలమున గూడ నట్లేయున్నది. 'తస్మాత్స్వ ధర్మాత్ స్ఖలితా భీతాసా భరతర్షభ। అభవ ద్దోష దర్శిత్వాత్ బ్రహ్మచారిణ్య యంత్రితా' అని మూలమున శకుంతలనుగూర్చి వ్రాసిన శ్లోకము బ్రహ్మంగా రెబుల జూడ మరచి 'శకుంతల భయపడినదని నన్నయ వ్రాయుట బాగులేదని' ఏమో వ్రాయుటవలన ప్రయోజన మెద్దియో గనబట్టి లేదు. మూలమున శకుంతలను దుష్యంతుడు వీడ్కొనునపుడు శకుంతల యొక్క మనోవేదనను వ్యాసుడెంతయో కరుణాపూరితముగా సహజముగా చిత్రించినాడు. నన్నయ దానిని వదలి వేసినాడు.

శకుంతల మొదటగా కణ్వునకు తన వివాహము సంగతి జెప్పి నటులను తరువాత దివ్యదృష్టివలన కణ్వుడు నీకు మహాత్ముడైన కుమారుడు గలుగునని యన్నట్లును వ్యాసుడు వ్రాసినాడు. ఈ విషయమున 'సగద్గదం సవ్రీడా శుచిస్మితా కృచ్ఛ్రాదువాచ' అని శకుంతల మనః ప్రవృత్తిని చక్కగా చిత్రించినాడు. నన్నయ, మొదటనే కణ్వుడు దివ్యజ్ఞానము వలన వృత్తాంతమునంతను గ్రహించి నాడని వ్రాయుట నాతని మహత్త్వము తెలియబడునుగదా! కణ్వుడు (మూలమున) 'రంభోరు' అనియు 'సకామాయాః సకామేన నిమంత్రః' అనియు దుష్యంతుడు పూర్వము శకుంతలతో ననిన పదము లనే వాడుటలో దివ్యజ్ఞానమును సూచించియుండవచ్చును. శకుంతల కణ్వునితో 'రాజా తాతా జగామేహ...తస్య తాత ప్రసీదస్వ' అని యనుటలో తన పాతివ్రత్యమును వ్యక్తీకరించినది. 'నన్ను క్షమింపు' మని యడుగలేదు. కణ్వుడు 'అభ్యాగచ్ఛేత్ పతిర్యస్త్వాం భజమానాం' అనుటలో శకుంతల పూర్వమే దుష్యంతుని గూర్చి విని వివరించి యుండవచ్చు నను ధ్వని యున్నది కాని 'ఋతవో బహవస్తేవై గతాః వ్యర్థాః' సార్థకం సాంప్రతం హ్యేతత్' అని కూతురైన శకుంతలతో ననుట వెగటుగా దోచునట్లున్నది.

కణ్వుని వలన వరంబుగా. మూలమున, శకుంతల ససచివుడైన దుష్యంతుని కనుగ్రహము చేయుమని గోరినది. తెనుగు భారతమున నాకుద్భ విల్లెడు పుత్త్రుడు దీర్ఘాయురైశ్వర్య బలసమన్వితుడగుగాక' యని పుత్త్రప్రేమనే చూపుచు వ్రాయుటకంటె మూలమే యుదాత్తముగాను పాతివ్రత్య సూచకముగను యున్నది. కాని 'ధర్మువునందే నా చిత్తంబెప్పుడు దగిలియుండుగాక' యని కోరుటచే పతిప్రేమను తండ్రియొద్ద వ్యక్తము చేయుటకు సిగ్గుపడి, సతీధర్మము తనయందు ఎల్చుగాక యని కోరుకున్నదనుకొనవచ్చును.

దుష్యంతుడు రాకపోవుట గూర్చి శకుంతల మనఃప్రవృత్తిని దుఃఖమును గూర్చి కొంతయైనను మూలమునందువలె, నన్నయ వ్రాయకపోవుట లోపమేమో యనిపించుచున్నది. మూలమున దుష్యంతుని గూర్చి 'ఋషే ర్భయాత్తు దుష్యంతః స్మరన్నైవా చ్యాయత్' 'గతే కాలేతు మహతి నసస్మార తపోధనాం స్త్రీషుచాన్యాసూపభోగసక్తః' అని వ్రాయుటవలన శకుంతలా విషయమును చాల యల్పమైనదానిగా భావించినాడు దుష్యంతుడని యాతని శీలమును చెడగొట్టునదిగా యున్నది. నన్నయయైనను దానిని గూర్చి దుష్యంతుని శీలమును పోషించుటకు యత్నింపక మూలమును యథాతథ్యముగా చిత్రించినాడు. దీనినిబట్టి రాజునకిట్టి వివాహములు పరిపాటి యనియు బహుభార్యాత్వము ధర్మసహితమనియు, స్త్రీలకే కట్టుబాట్లెక్కుడనియు జెప్పువాద మాభాసకల్పన కాదని తేలుచున్నది. శకుంతలకే ప్రాధాన్యము భారతమునందీయబడినది. దుష్యంతుడు వెనుకకు ద్రోయబడినాడు.

పదునైదు సంవత్సరములు కణ్వు డూరకొనుటకు కారణము గన్పట్టదు. 'పుట్టిన యిండ్లను బెద్దకాలముండుట సతులకు దగదని' నన్నయయు 'నీవు నీభర్తవద్దకు వెళ్ళవలయును' అని వ్యాసుడును కణ్వవాక్యములుగా వ్రాసినారు. అర్థమొకటేయైనను తండ్రియగు కణ్వుని వాక్యము నన్నయదే బాగున్నట్లున్నది. మూలమున సర్వ

దమనుడు 'శకుంతలా భర్తృకామా స్వయం యాతు యథేష్ట 'శృత్వా వాక్యం కిం కరోషి, గంతవ్యం భర్తృప్రీతిః తవాస్తిచేత్' అని యనుట విడ్డూరముగ నున్నది. వాడప్పుడే స్వాధ్యాయము జేయుచున్నవాడుకదా, తల్లినిగూర్చి యట్లనుట బాగుగనున్నట్లు తోచదు. బహుశ రాజస గుణంబును, యువరాజగు తాను పిలువనిదే రాజునొద్దకు బోవుట కాత్మాభిమానము దోచి తండ్రిపై గల కోపమును తల్లిపై ప్రసరింపజేయుటను, పై వాక్యములు వ్యక్తము చేయునేమో కణ్వుడొప్పించిన తరువాత 'కిం చిరాయసి మాతస్త్వం గమిష్యామో నృపాలయం' అని తల్లిని ప్రతిపూజించి నృపాలుడైన తండ్రియొద్ద తగవు తీర్చుటకోయన బయలుదేరినాడు. మూలమున గల కణ్వశకుంతలా శాకుంతలుల సంభాషణములోను, మరియు నచ్చటచ్చటను సర్వదమనుని శీలము, స్వభావము వ్యక్తము చేయబడినవి. నన్నయ వానిని గూర్చి యొక్క పదమైనను వ్రాయకపోవుట లోపమేమో యనిపించుచున్నది.

దుష్యంతుని సభలో శకుంతల 'మఱచిన దలపింపనగు నెఱుగనాడెల్లవాట...' అనిన వాక్యము 'అజ్ఞః సుఖ మారాధ్యః...' అను భర్తృహరి శ్లోకమును జ్ఞప్తికి దెచ్చుచున్నది. రాజు నిరసన వాక్యములను వినిన తరువాత శకుంతల యందలి కోపాది భావములను యథా మూలకముగా నన్నయ చిత్రించినాడు, 'తిర్యగ్వీక్షిత' అను భావమును 'కటాక్షించుచు' అని ద్వ్యర్థముగా రాజునందనుకంపను గూడ సూచించుచు తెనిగించినాడు. 'కెందమ్మి కలువ రేకులను 'శకుంతల' కోపారుణ నయనంబులకును సామ్యము బాగుగనే యున్నది. కాని కోపారుణి తను వాజ్యముచేయక వదలివేసిన బాగుండునని దోచుచున్నది. మూలమున శకుంతల 'నావచనంబులు సేయవేని నీతల నూరు వ్రయ్య'లగుననియు, నీవు పిపీలికకంఠంబెను, కాకి కంఠంబెను గూడ మూర్ఖుడివని యర్థమిచ్చు వాక్యముల దుష్యంతునితో పలికినది, అంతటి కోపావేశము నన్నయగారి శకుంతల కున్నట్లు కన్పట్టదు.

శకుంతల రాజునుచూడగనే 'తలపగ నాడు పల్కిన విధం బెడ దప్పగ జూచె నొక్కొ, చూడ్కులు విరసంబులై, కరము క్రూరము లైన...' యీ మొదలగు స్వగత వాక్యము లమూలకములైనను సహజములుగనే గన్పట్టుచున్నవి. మూలమునగల 'ఏష పుత్రో హితే రాజన్ మయ్యుత్పన్నః' అను 'శకుంతలావాక్యముకన్న నీ యిచ్చిన వరము దలంపవలయు చిత్తంబులోన' అని రాజునకు జ్ఞాపకముచేయుట మృదువుగా నున్నది. మూలమునందలి శకుంతల కుండ బద్దకొట్టునట్లు మాట్లాడు స్వభావము గలదిగా గన్పట్టుచున్నది.

'ఏ నెఱుగ నిన్ను నెక్కడిదానవు మిన్నకయ యనుచితంబులు పలుకంగా నేల యరుగు మంజరుహాసన' అని దుష్యంతు డనుటలో నేను నిన్నెరుగుదును, ఎరుగను అను రెండర్థములు గోచరించును. 'నేను నిన్నెరుగుదును ఐనను మిన్నకుంటిని. నీ వనుచితంబులు పలుకగా నేల ? అను అన్వయముగూడ సిద్ధించుచున్నది. మూలమున గూడ 'త్వయా సహ సమాగమం నస్మరామి' అనినాడు గాని నీవు నా భార్యవుకావు అని అనలేదు. మూలమున 'పూర్వప్రేతం తు భర్తారం పశ్చాత్త్యాపనుగచ్ఛతి' అని శకుంతలా వాక్యము గలదు. నన్నయ 'పురుషుడు మున్న పరేతుండైన పదంపడి దానును బరేతయై' అని స్త్రీ విషయమున 'పదంపడి' యనుపదమును మెఱుగుగా వాడినాడు. మూలమున ధరణీరేణు కుంఠితుడైన పుత్రుని యాలింగనము సంతోషదాయకము. సర్వదమనుడు సాభిలాషముగ మనస్వియై వచ్చిన పుత్రుడు? అనువాక్యమందలి సొగసు నన్నయ వ్రాసిన పుత్రస్పర్శజ సుఖవర్ణనమందు రాదు. మూలమున శకుంతల దుష్యంతుని విరస నంబును తిరస్కరించి నిస్పృహావృత్తిని 'కుమారుని మాత్రము నీవు వదలివేయదగదు నే నాశ్రమమునకు బోదును. అని యన్నతరువాత దుష్యంతుడు, 'న పుత్ర మభిజానామి త్వయిజాతం శకుంతలే. అశ్ర ద్ధేయ మిదం వాక్యం కథయంతీ న లజ్జసే' అని శకుంతల శీలమును శంకించుచు మాట్లాడినాడు. నాభార్యవు నీవు కావని ధైర్యముగా ననలేదు. 'నీ వృత్తము సందేహాస్పదము' అని మాత్రము సూచించి

నట్లు ఉన్నది. నన్నయ 'ఇట్టి లోకవిరుద్ధంబుల కేమోదుదు' మని ధ్వనిమాత్రి సూచన గావించి వదలివేసినాడు. మూలమున 'మేనకా నిరనుక్రోశా వర్ధకీ, విశ్వామిత్రః లుబ్ధః కామ పరాయణః' అని దుష్యంతు డని వెంటనే 'మేనకా అప్సరసాం శ్రేష్ఠా మహర్షి శ్చాపి తే పితా' అనుటలో సంగతమేమియు గోచరింపదు.

'సువర్ణ మణిమయాన్యాభరణంబుల నీకు గావలసిన వానిని తీసికొనుము' అని మూలమున దుష్యంతుడు అనుట యనుచితం బనిపించుచున్నది. భార్యకానిచో దండింపవలెను కాని భరణమిచ్చి సంపుట న్యాయముమా ? దానివలన వ్యక్తముగా సభలో శకుంతలయందు దనకు గల యనురాగము గన్పట్టును. ఇచ్చో వ్యాసుడు సభాసదుల మనః ప్రవృత్తిని గూర్చి మౌనముగా నుండుట గమనార్హము. 'అశ్రద్ధేయ మిదం వాక్యం' అని రాజనుటలో నీకు సాక్ష్యమెవ్వరును లేరు, అని సూచించినాడు. నన్నయ మూలమునందలి దుష్యంతుని దూషణ భూషణాదులను వదలివేసినాడు. మూలమున శకుంతల తన నడువడి యొక్క అయుక్తతను గూర్చి రాజు మాట్లాడినాడని గ్రహించినది. కావున 'రాజ న్సర్షప మాత్రాణి పరచ్ఛిద్రాణి ప్రపశ్యసి । ఆత్మనో మేరు మాత్రాణి పశ్యన్నపి న పశ్యసి॥' అని యారంభించి 'వర్ధకీ పుత్రిక వీవు' అన్నందులకు 'నీ పూర్వపితామహు డూర్వశీ సంజాతుడని' జెంపపెట్టు పెట్టినది.

మూలమున దుష్యంతునిచే నాఖుసారిగా తిరస్కరింపబడిన శకుంతల మహా క్రోధాగ్ని దందహ్యమానమైనది. నన్నయగారి శకుంతల 'బోరన' దొరగు కన్నీటిం దుడుచుకొన్నది. ఇందేది యుచితతమో చెప్పుట సాధ్యముగాదు. మూలమునందలి శకుంతల పతివ్రతయు ననురాగపూరితయు నైనను భావావేశమునందు తీవ్రతం జూపుచు పురుషునికి కోపమున దీసిపోనట్లు గన్పట్టుచున్నది నన్నయగారి శకుంతల పతివ్రతయు, కించిత్స్వార్థపరయు సహజమాతృగుణ ప్రధానముగా గన్పట్టుచున్నది. బీజప్రాధాన్యమున క్షత్రియమునందును పరమ కోపనుండైన విశ్వామిత్రుని కూతురును, అన్యాయముగా భర్తృ తిరస్కృత యైనప్పుడు కోపానల దందహ్యమాన యగుట సహజమే. మహాసాధ్వియు ప్రతివ్రతయు నగుటచే, చింతాక్రాంతయై భగవంతునిపై భారము వైచుటయు గూడ స్త్రీ జనోచితము.

మూలమున 'సన్నియ మ్యాత్మ నోంగేషు తతః క్రోధాగ్ని మాక్మజం' అనుటలో ఆత్మజపదము భరతునికి గూడ నన్వయమై వాని కోపావేశమును చూపుచు యుక్తముగా నున్నది. ఆకాశవాణి పలికిన తరువాత దుష్యంతుడు మూలమున శకుంతలను సాంత్వపూర్వకముగా ననునయించి క్షమాపణ గోరుకొనినాడు. తన మూకీభావమునకు గారణము నామెకే సభలో జెప్పినాడు. అది యెంతయు తగియున్నది. నన్నయ 'అతి ప్రణయ గౌరవంబున సంభావించి' అనినాడు. కాని చిరకాలానంతరము రాజలక్షణ సమన్వితుడైన కుమారునితో వచ్చిన శకుంతలను రాజసభలో నవమానించినందుల కామెకు క్షమాపణచెప్పుట రాజోచితమును భర్తృ కర్తవ్యముగూడను. దానిని నన్నయ వదలివేయుట ముఖ్య పాత్రపోషణకు లోటుగల్గిన జెడనవచ్చును. దానిని గూడ యూహించుకొనవచ్చును గాని అవివ్యక్తము జేయదగిన విషయము. పాత్రపోషణకు శోభస్కరము నని చెప్పవచ్చును. మూలమున 'పరిక్రతే నార్యః క్షాంత్యా పాతివ్రత్యం వ్రజంతి' అని దురుసుగా మాట్లాడినందులకు శకుంతలను రాజు మెల్లగా మందలించుటయు బాగుగనే యున్నది.

మొత్తమున తేలిన విషయము లివియని దోచుచున్నది. మూలమున నున్న సొగసులను, సహజ సౌందర్య వర్ణనములను, స్వభావోక్తులను గొన్నిచోట్ల నన్నయ వదలివేసినను చాలవట్టు మూలమున ననుసరించి కథా ప్రాధాన్యత చెడకుండ వ్రాసినాడనుట న్యాయమని తలంతును బెక్కెడల నసావధానుడయ్యె ననుట సవిమర్శనము కాజాలదు, నన్నయ మూలనందలి ప్రత్యక్షరము నతివిమర్శనముగా చదివి తెనిగించుటకు బూనుకొనినాడు. అతని కవిత యందు సొగసులనేకములు మూలమునందలివే. సాధ్యమయినంతవరకు మూలమునందలి సొగసుల తెనుగునకు దేర్చినాడు. కథను సంక్షిప్తము చేయవలయును గాని కొన్నింటిని వదలివేసినాడు. మరి కొన్నింటిని ధ్వని గర్భితముగా చూపినాడు. కథను సుప్రసన్నము చేయుటకై కొన్ని మార్పులను దెచ్చినాడు. పై వ్యాసము నందలి యుచితానుచిత విమర్శకు సహృదయులగు పాఠకులే దగుదురు.

భారతి. సెప్టెంబర్లు; 1955

..........

# నన్నయ సౌపర్ణోపాఖ్యానము

శ్రీ వడలి మందేశ్వరరావు

ఆదిపర్వములోని ద్వితీయాశ్వాసమును నన్నయ రెండు భాగములుగా విభజించాడు. మొదటిభాగము సౌపర్ణాఖ్యానము, రెండవ భాగము ఆస్తీకు చరితము. ఒక విధముగ పూర్వభాగము ఉత్తర భాగమునకు పీఠిక; ఇంకొక విధముగ దేనికది ఒక స్వయం సంపూర్ణమైన కథ. పూర్వభాగమునందు సర్పములు అగ్నిహోత్రునికాహుతియగుట తప్పనిసరియైనట్లు తోచును. ఇందలి సర్పముల భవిష్యత్తు పూర్తిగ భయావహమైనది. ఉత్తరభాగ ప్రారంభమునుండి సర్పయాగ ముడిగింప చేయుటకు ప్రయత్నములు కొనసాగినవి. సర్పయాగ ముడిగింపబడుచున్న ఆశ క్షణక్షణమునకు పెరుగుచు వచ్చినది. పూర్వభాగమందు సూచింపబడిన సర్పకులప్రళయము ఉత్తరభాగమున శాంతిపొందుటతో కథకొక పూర్ణత కలిగినది. కాగా, పూర్వభాగమొక స్వయంసంపూర్ణమైన ఆఖ్యానము: దానికొక ఫలశ్రుతి చెప్పబడినది. అట్టిదే ఉత్తరభాగమొక స్వయంసంపూర్ణమైనకథ: దానికొక ఫలశ్రుతి చెప్పబడినది. ఈ రెండు కథలను కలిపి చూచినను సర్వాంగ సౌష్ఠవమైన ఒకే ఒక కథగా గోచరించును. ఇదే ఈ ఆశ్వాసమందలి, కథన శిల్ప విశేషము.

అయితే పూర్వకథకును ఉత్తరకథకును మధ్యగల కాలము మాత్రము. అనంతమైనదిగ తోచును. పూర్వ కథయందలి పాత్రల ప్రవర్తన వేఱు. ఉత్తర కథలోని పాత్రల ప్రవర్తన వేఱు. పూర్వరంగము నేటిదికాదు. ఆనాటి వాతావరణమే వేఱు. అది 'ఆదియుగము' నాటి కథ. అప్పుడు కశ్యప ప్రజాపతివలన 'చరాచర భూతరాశి యెల్ల నుద్భవిల్లె' (1-3-59). ఈ కాలము ఇటీవలి దన్న భ్రమను పొందకుండుటకు నన్నయ 'కశ్యప ప్రజాపతి తొల్లి పెద్దకాలము తపంబు సేసి, పుత్రకామేష్టిఁ జేసె'నని కాలమును కొన్ని యుగములు వెనుకకు నెట్టినాడు. కద్రూవినతల గర్భములు అండములగుట, ఆ అండములవి

యుటకు అనేక శతవర్షములు పట్టుట, కద్రువ సర్పములకు, వినత విహగములకు తల్లులగుట, దేవదానవులు పాల సంద్రమును ద్రచ్చుట మున్నగునవన్నియు సహృదయుని సృష్ట్యాది దినములలోనికి తీసికొని పోవు సన్నివేశములు. కాలములో ఇంత వెనుకకు పోగల్గిననాడే సౌపర్ణాఖ్యానమందలి సొగసు హృద్గోచరము కాగలదు.

ఉత్తర భాగమందలి రచనా పద్ధతివేఱు త్రోవను బట్టినది. పూర్వభాగమందలి సర్పములపై మనకు రోత కల్గినది. ఉత్తర భాగమునందు వానిపట్ల సానుభూతి కల్గుచున్నది. పూర్వోత్తర భాగములను కలుపు శేషుని నిర్వేదముతో ఈ సానుభూతి ప్రారంభమైనది. పూర్వభాగమందలి కథ ఎన్నడో జరిగినది. అందలి పాత్రలప్రవర్తనా విధానముకూడ చిత్రమైనది. అచట శాసనములన్నియు విపరీతములు. తల్లి కొడుకులను, కొడుకు తల్లిని శపించును. ఉత్తర భాగమునందు శృంగి పరీక్షితుని శపించుటకు తగినంత కారణము కనబడుతుంది. శాపమిచ్చినందులకు పశ్చాత్తాపము కనబడుతుంది. ఆ శాప ఫలమును అనుభవించకుండా ఉండడానికి వెఱవును వెతుకుతాడు పరీక్షిత్తు పూర్వభాగమందలి సర్పములు శాపోపహతములు; కాని తప్పించుకొనుటకు వెఱవు నాలోచించుకొనే ప్రజ్ఞ వానికిలేదు. పూర్వభాగమందలి ఈ సర్పములే కాలాంతరమున ఉత్తర భాగమునందు వేఱొక విధముగా పరివర్తిస్తాయి. సర్పయాగానికి విఘ్నాన్ని కల్గించాలా? ఉడిగింప చేయవలెనా? - అన్న సమస్యను గూర్చి సర్పములన్నీ సభచేసి చర్చిస్తాయి.[1]

కాగా పూర్వభాగమందెన్నడో ఎక్కడనో జరిగిన కథను డి ఉత్తరభాగమునకు వచ్చుసరికి ఈ కథా భాగ మిటీవలి దన్న భ్రాంతి కల్గుతోంది. అయినప్పటికీ ఈ రెండు కథలను అలముకొనియున్న వాతావరణము పురాణమైనదనే తోస్తుంది.

సౌపర్ణాఖ్యానమందలి పాత్రిలలో మానవత్వము గోచరించడానికి అవకాశమున్న పాత్రిలిర్వురే. వారు కద్రూవినతలు. కశ్యప

ప్రజాపతిని సాధారణ మానవులను చూచు దృష్టితో చూడలేము. ఆయన వాలఖిల్యులతోపాటు లోకాతీతుడు, జగదారాధ్యుడు. కద్రూ వినతలను గూర్చి మనకు చాల విషయములు తెలుసును. కాని వారేలనో మనకు కథలో రూపుకట్టరు. వీరిద్దరు నీడలవలె, సృష్టిని పొదగడానికి శక్తిమంతములైన ప్రకృతులవలె కలువును బోసిన రెండు మాతృభావములవలె గోచరిస్తారేగాని ఇద్దరు వ్యక్తులవలె కనబడరు. కాని వారిద్దరిలోను ఎంతో మానవత్వమున్నది. వారిలో అసూయ నున్నది, స్పర్థకనబడుతుంది. పందెము వేసుకోవడమున్నది, ఒకరి కింకొకరు దాసి కావడము ఉన్నది. అయినను రక్తమాంసము లున్న పశువలలా కానరారు. కాని ఉత్తరభాగములోని సర్పములు మానవాకృతిని దాల్చినట్లు, సరిగ్గా మానవులే అయినట్లు పరివర్తిస్తాయి. మిగత సన్నివేశాలు అలా ఉండగా :

"ధరణీ సుర మంత్రహోమ
స్ఫురణను వివశులయి భూరి భుజగ ప్రభులో
డోరుఁ బిలుచుచు నధిక భయా
తురులై కుండాగ్నులందుఁ దొరఁగిరి పెలుచన్."

(1-2-211)

"అతివేగాకుల చిత్తులై పడి రుదాత్తాశీ విషాగ్నుల్ సితా
సిత పీతారుణ వర్ణదేహులు నవాసృగ్రిక్త నేత్రుల్ మహో
న్నతు లేకత్రిక పంచ సప్త నవ నానామస్తకుల్ పల్వురు
ద్ధత నాగేంద్రులు బ్రిహ్మదండ హతినార్తధ్వానులై వహ్నిలోన్"

(1-2-213)

కట్టలు కట్టలుగా పాములు అగ్నిహోత్రంలో పడిపోతుంటే కవి వాట్లకు ఒక రూపాన్ని కల్పించాలని, కల్పిస్తాడని మనము ఆశించము. కాని ఈ పాముల అవస్థ ఆధునిక మారణాయుధాలకు ఆహుతి అయిపోతున్న ఏ నగసాకీ నగరవాసులనో స్ఫురింపచేస్తోంది. నన్నయ కథన శిల్పములోని విశేషమిదే : ఆయన మానవులను

నీడలుగా మార్చగలడు. కాలుసేతులు లేని పాముల్ని, పక్షుల్ని కూడ తన శిల్ప మంత్రదండ సాయమున సహస్రపాదునిగానో, మహా నీతి యుతునిగానో, కామక్రోధాలకు ఆస్పదమైన మానవులవలె కనబడు నట్లుగానో, మలచగలడు.

సౌపర్ణాఖ్యానములోని గరుడుని జననము వఱకును నడచిన కథ మొదటిభాగమనుకుంటే యీ భాగమును చిత్రమైన సాయం సంధ్యా వాతావరణ మలముకొని ఉన్నట్లుగా కనబడుతోంది. సాయంసంధ్య సర్వప్రాణి సమ్మోహనకరమైనది. ఇక్కడ ప్రశ్నలకు సమాధాన ములకు అవకాశము లేదు. ఈ సౌందర్య పరివేషమందు వ్యక్తులు మనకు గోచరింపరు, వారి గొంతులు వినబడతాయి. తద్వారా వారి మనసులను మనము గుర్తిస్తాము.

సముద్ర మథనకథకు కూడ ఈ సౌందర్య పరివేషమున్నది. అందుచేతనే అందులో ఎంతో వివరణకు, అవకాశమున్నా అవన్నీ కనబడవు. ఈ ఘట్టము చదువుతోంటే దూరమున నుండి సముద్ర మథనాన్ని మనం చూస్తున్నట్లుగా ఉంటుంది. దూరాన జరుగుతూన్న ముఖ్యమైన సంఘటనలు మనకు కనబడుతూన్నట్లు ఉంటుంది. కాని మన కళ్ళ ఎదుట ఆధునిక పరికరాలతో, విద్యుద్దీపాలతో, శబ్దవిస్తారక శబ్దగ్రాహక పరికరాలతో ఆధునిక రంగస్థలంమీద ప్రదర్శింపబడే ఐదంకముల నాటకములవలె కనబడదు. అందుచేతనే ఈ ఘట్టములోని వస్తువులన్నీ ఉదాత్తములైనవి. అవి ఫలానావి అని నిరూపింప గల్గుతున్నాము. నరనారాయణులు దానవులను పారద్రోలడం కూడా ఈ సాయంసంధ్యా వాతావరణాన్ని గాఢతరం చేయడానికి తోడ్పడింది.[2]

కొట్టవచ్చినట్లుగా కాకుండా, మసకగా ఉదాత్త ఫణితిలో వస్తువులు కానవచ్చే ఇట్టి ఒకానొక సాయంసంధ్యలో కద్రూవినతలు వినోదార్థము విహరించ బయలుదేరారు. కాలము సాయంసంధ్య; వారి విహారము వినోదార్థము. ఈ రెండు అంశములు చాల ముఖ్య

మైనవి. తర్వాత కాలమందలి వసుచరిత్రకారునికి శ్లేషవెన్నతో బెట్టిన విద్య. ఇక్కడ నన్నయ సాధించిన శ్లేకూడా అట్టిదే (1-2-27) ఇందులో ప్రయత్నం ఎక్కడా కానరాదు. కద్రూవినతల విహారము వినోదార్థము కనుక వారు దారి పొడుగున జరిపిన సంభాషణలు,వారు చూచిన వింతవస్తువులు, వారికి కల్గిన ఆనందము, మున్నగువానిని గూర్చి పూసగ్రుచ్చినట్లు వ్రాయాలని చాలమంది కవులు సంకల్పించి ఉండేవారు. కాని నన్నయ చూపేవేఱు. కద్రూవినతలు తమ చుట్టును గల ప్రకృతిని ఎలా చూస్తున్నారో మనకు కూడా. అలాగే చూపాడు నన్నయ. ఈ రచన 'వినోదార్థము'గా రచింపబడినది కాక కద్రూ వినతల వినోదాన్ని ప్రతిఫలింపచేసేది మొదటి పద్ధతి జీవితానికి ఒక దర్పణంగా ఉండవచ్చునేమో. కాని నన్నయ పద్ధతిలో పఠితి, శ్రోత కూడా సాయం సంధ్యలోని సముద్రతీరాన్ని కద్రూవినతల కళ్ళతో, వారిఉత్సాహముతో చూడగల్గుతున్నాడు.

వినోదార్థము విహరించు కద్రూవినతలకు సముద్రము ఒకసారి ఉద్యానవనముగా, ఒకసారి నాటక ప్రయోగమువలె, ఒకసారి దివము లాగ కనబడింది. ఇదంతా వినోదమే. అలాగే కద్రువకు అతి ధవళమైన అశ్వము సంపూర్ణ చంద్రునిలో కనబడింది. కాని చిత్రమేమంటే ఆమె ఆ చంద్రుని మచ్చను కూడా చూసింది. "వాలము నల్లన" అన్నది. అంటే వినత నవ్వింది. "నీవే కన్నులం జాచితే యక్కా! యెక్కడిది నల్ల ? ఈ యశ్వరాజు మూర్తి మహాపురుషు కీర్తియుం బోలె నతి నిర్మలంబై యొప్పుచున్నయది;" అని వినత అనగా, 'నవ్వి నవ్వి నతకు గద్రువ యిట్లనియె.

"అమ్మహాశ్వంబు ధవళదేహంబు నందు
నల్లగలిగిన నీ వపుడు నాకు దాసి
వగుము మఱియందు నల్లలేదయ్యెనేని
నీకు నే దాసి నగుదుఁ బన్నిదము సఱము" (1-2-32)

ఇందులో 'నవ్వి' అన్నమాట రెండు మార్లు వచ్చింది. కద్రూ వినత లిద్దరూ నవ్వుతూనే మాట్లాడుకుంటున్నారు. పందెము కూడ

కేవలము వినోదముగానే ప్రారంభమయినట్లు కనబడుతుంది. కాని పందెము నొడ్డువఱకేగాని, ఆమీద ఆవేశాలు కావేషాలు పెరగడానికి ఎక్కువకాలము పట్టదు. అంతవఱకు నవ్వే కద్రూ వినత లిద్దరూ ఒక్క సారిగా గంభీరులు అయిపోయారు.

"ఇట్లిద్దఱు నొండొరులకు దాసీత్వంబు పణంబుగా నొడివి పన్నిదంబు సఱచిన, వినత 'యయ్యశ్వంబు డాసి చూతము ర'మ్మనినఁ గద్రువ 'యిప్పుడు ప్రొద్దులేదు, రేపకడ చూత'మని యిద్దఱు మగిడి తమ నివాసంబులకుం బోయి యున్న...' (1-2-33)

ఈ వచనంలో వినోదానికి, నవ్వులకు స్వస్తి చెప్పబడింది. ఇప్పుడు కొడుకులతో మాటాడే కద్రువ నోట అలంకారములు కానరావు. అహంకారం కనబడదు. తన్ను రక్షింపుడని కొడుకులను బతిమి లాడుతోంది వారు అధర్మానికి అంగీకరించకపోతే' కోపోద్దీపిత ముఖియై.

"అనుపమముగ జనమేజయుఁ
డను జనపతి సేయ సర్పయాగ నిమిత్తం
బునఁ బాములు పంచత్వము
ననిమెదుమని యురగములకు శాపంబిచ్చెన్."

(1-2-36)

కద్రూవినతల వినోదము ఎలా పర్యవసించినదో గమనిస్తే, నన్నయ భారత భాగములో ఆయన జీవితాన్ని ఎంత జాగ్రత్తగా, శ్రద్ధగా, తత్త్వవేత్తగా పరిశీలించాడో తెలుస్తుంది.

ఈ కథలోని తొలి పద్యంలో నన్నయ ఒక మహా శిల్పిగా, పాత్రల మనస్తత్వాన్ని చాలసున్నితంగా, సునిశితంగా ప్రదర్శింపగల లోకజ్ఞునివలె, మానవ జీవితంలోని రహస్యాన్నెఱిగిన తత్త్వజ్ఞునివలె కనబడతాడు. కద్రువయు, వినతయు పుత్రార్థినులై అనేక సహస్ర వర్షములు కశ్యపు నారాధించారు. కశ్యపుడు ప్రసన్నుడై 'మీ కోరిన వరంబు లిచ్చెద'; వేడుండనిన

"అనల తేజులు దీర్ఘ దేహులునైన యట్టి తనూజులన్
వినుత సత్త్వులఁ గోరెఁ గద్రువ వేవురం గడు వేడ్కతో
వినత గోరె సుపుత్రులన్ భుజవీర్యవంతుల వారి కం
టెను బలాధికులైన వారిఁ గడింది వీరుల నిద్దఱన్."

(1-2-3)

ఇది పైకి చాల సామాన్యమైన, అమాయకమైన పద్యంలా కనబడుతుంది. కద్రువ అనల తేజులు, దీర్ఘ దేహులు అయిన తనూజులను వేయిమందిని కోరింది. వినత వారికంటె బలవంతులైన ఇద్దరు పుత్రులను కోరింది. ఇంతకంటె సూటిగా మాట్లాడడం అసంభవమేమో అనిపిస్తుంది. మానవ జీవితంలో కూడా అలాగే జరుగుతుంది. మనం అమాయకంగా ఏదో చిన్న కోర్కెను కోరుకుంటాము. అది ఫలిస్తుంది. కాని అనుభవంలోనికి వచ్చేసరికి మన కోర్కెలోని తెలివి తక్కువ తనం వెల్లడవుతుంది. అంతేకాదు. తానొకటి తలచిన దైవమొకటి తలచినదన్న దానికి సామ్యముగా ఫలితం కనబడగానే మానవుని అసహాయస్థితికి నివ్వెరపోతాము. తన కొడుకులు దీర్ఘ దేహులు కావాలని కద్రువ కోరుకుంది. వారు ప్రాంశువులు కాలేదు కాని దీర్ఘమైన పన్నగములయారు. వారు అనల తేజులు కావాలని కోరుకున్నది. వారు తమ విషాగ్ని చేత లోకాలను దహించ సమర్థులయారు. తక్షకుని విషాగ్నికి ఒక వటవృక్షం, ఒక మహారాజు, అతని ఏక స్తంభ హర్మ్యము అన్నీ దగ్ధమైపోయాయి. కద్రువ కొడుకులు అనల తేజులే అయారు. కాని చిత్రమేమంటే ఈ అనల తేజులే జనమేజయుడు చేసే సర్పయాగములో అనలానికి ఆహుతి అవడంలోనే విధి దుర్విపాకము పరిస్ఫుటమవుతుంది.

వినత ఇద్దరే పుత్రులను కోరింది. వారు కద్రువ కొడుకుల కంటె బలవంతులు కావాలని కోరుకున్నది అంటే ఆమెకు, కద్రువకు మనసులలో మనకు తెలియని రవరవతేవో ఉన్నాయని అనుమానం కల్గుతుంది. ఇక పద్యం నడకలో

"........వారి కం, బెను బలాధికు లైనవారి........."
అని అనడంలో మూడవ పాదం చివర 'కం' అనే అక్షరంతో విరగడం చేతను, నాల్గవ పాదము 'బెను' అన్న లఘువులతో ప్రారంభమవడం చేతను, పద్యగతి ఇక్కడ ఒక్కసారి సడలి కాస్త కుంటుపడి వినత కోర్కెను కోరడంలో ఆమె మోమాటాన్ని, భయాన్ని ప్రతిఫలింప చేస్తోంది. అంటే శబ్దముల వల్లనసేగాక, పద్యము విరుపులోనే నన్నయ పాత్రియొక్క మానసిక స్థితిని లలితముగా ఆవిష్కరింప గల్గాడన్నమాట. ఇది ఒక అద్భుతమైన సృష్టి.

తన కొడుకు లిద్దరూ కద్రువ కొడుకులకన్న భుజ వీర్యవంతులు కావాలని వినత కోరడంలో ఆమె కోర్కె న్యాయమైనది కాదన్న ఊహ శ్రోతకు కల్గడానికి ముందుగానే పైన వివరించినట్లు పద్యపాదం విరగడంలోని సొగసువల్ల, ఆమె మెత్తదనం మన మనసుకు తోచి, ఆమె ఏదో బలవత్తరమైన కారణము చేతనే ఇలా అడుగుతోందని మనకు స్ఫురిస్తుంది. అందుచేతనే ఆమె మన సానుభూతిని కూడ పొందగల్గుతుంది.

అంతేకాదు ! ఈ పద్యంలో కద్రూ వినతల స్వభావాలను ద్యోతమానముచేసే మాటలు రెండు ఉన్నాయి. కద్రువ 'తనూజు'లను వేయిమందిని కోరింది. ఆమెకు ఈ శరీరం మీద మమకారం హెచ్చు ఆమె వాంఛలన్నీ శరీరాన్ని అట్టిపెట్టుకొని ఉండేవే. అట్టివారిని ఆత్మాభిమానం, ఆత్మోత్కర్ష అంటిపెట్టుకొని ఉంటాయి. అట్టివారే నిండు చంద్రునిలో నల్లను వెతుకుతారు; ఇతరులచేత దాస్యాన్ని చేయించుకోవాలని కోరుకుంటారు. వారిలోనే ప్రభుత్వ లక్షణం హెచ్చుగా కనబడుతుంది. వారి కోర్కెలన్నీ స్వర్గలోకపు పొలిమేరల వరకు ప్రయాణము చేస్తాయి.

కాని తనూజులంటే ఎంతో మమకారంగల కద్రువ, ఆ తనూజులే సర్పయాగంలో పంచత్వమును పొందాలని శపించింది. ఎంతో లోకజ్ఞుడైన కవి కాని, ఇట్టి శాపాన్ని ఇచ్చిన తల్లినోట 'తనూజ' శబ్దాన్ని పలికించ సాహసించడు. కవులలో నన్నయ లోకోత్తరమైన లోకజ్ఞుడు, మహా సాహసి.

ఇక వినత కోరింది, 'సుపుత్రులను'. పుత్రులనడంతోనే ఆమెకు పారలౌకికమైన, పారమార్థికమైన చూపు గలదని స్పష్టమవుతోంది. అందులో సుపుత్రులను కోరుకున్నది. కాని, కద్రువ తన ప్రేమకు స్థానముగా భావించిన తన కొడుకులను ఎలా శపించిందో, అలా తన్ను ఉద్ధరిస్తాడనుకున్న కొడుకు తన్ను దాసివి గమ్మని శపించాడు. ఇది విధి వైపరీత్యము.

ఈ పద్యము ఇన్ని విధాలుగా ఈ ఆశ్వాసంలోని కథను, పాత్ర చిత్రణను, కథయొక్క పరమార్థాన్ని ఇముడ్చుకుంటూ ఆలోచనామృతము, రమణీయార్థ ప్రతిపాదకము అవుతూ ధ్వని కావ్యమవుతోంది.

సౌపర్ణాఖ్యానమందలి కథ - సముద్రమథన కథను మినహాయిస్తే - ఒక దాని తర్వాత నొకటి జరిగిన సంఘటనలను వరుసగా ఏకరువు పెట్టడంలో ఉంటుంది. ఇలా చెప్పబడిన వాట్లలో గరుడుడు తనకు ఆహారముగా ఉదధిలో ఉన్న నిషాదులను మ్రింగడం ఇభ కచ్ఛపములను భక్షించడం కూడా రెండు సంఘటనలుగా మనం గ్రహించవచ్చును. ఈ రెండింట అక్కడక్కడ రచన ఎగుడు దిగుడులుగా ఉండి ఆయాచోట్ల నన్నయ రచనవలె కనబడదు. ఇది పరిశీలింపదగిన అంశము.

ఇక మిగత భాగము నెఱసులులేని దూదిపింజనుండి వడకబడిన అతి సన్నితమైన సన్నని దారమువలె నడచినది. యయాతి చరిత్రలో ఆరేడు కథలు ఒకే కథగా అల్లబడినవి. ఆ కష్టము వేఱు. ఇక్కడ ఒకే ఒక వస్తువును సాగదీయవలెను. ఇది మొదటిదానికన్న కష్టమైనది. ఏమన ఇందులో వైవిధ్యముకానరాక శ్రోతకు తొందరగా విసుపు కల్గడానికి అవకాశ మెక్కువ ఉన్నది.

ఇలా విసుపు కల్గకుండా ఉండడానికి నన్నయ కథను నడిపిన మార్గము పరిశీలింపదగినది. నన్నయ ప్రధాన కథలోనికి మఱి రెండు అంశాలను కూడా జొనిపాడు. దీనివలన ప్రధాన కథనుండి ఇతర

విషయములపట్ల శ్రోత దృష్టి మరలుతుంది. అన్నదమ్ములైన సుప్రతీక విభావసులు కలహించుకొని ఒకరినొకరు శపించుకొన్న ఘట్టము ఇటువంటిది. దీనిని ఎంతో పెంచి వ్రాయవచ్చును. కథ అన్నదమ్ముల మధ్య నడిచింది. ఇద్దరు మంచివారిలాగే కనబడుతున్నారు. కాని ధనలాభం చాల చెడ్డది. ధనాన్ని పంచుకోవడం దగ్గర తగాయిదా వచ్చింది. ఒకరి నొకరు శపించుకొన్నారు. ఒకడు ఏనుగు అయ్యాడు. మరొకడు కూర్మమయ్యాడు. జన్మలు మారినా, రూపాలు మారినా, పూర్వవైరం పోలేదు. నిత్యము వారికి పోరాటము తప్పలేదు.

మంచి కథకు కావలసి లక్షణాలన్నీ ఇందులో ఉన్నాయి. పెంచివ్రాస్తే ఇందులో ప్రతీకరణమునకు, ధనలాభాన్ని గూర్చిన తత్త్వచింతనకు ఎంతో అవకాశముంది. కాని మంచి కథ దొరికింది కదా అని కావ్యములో దానిన విస్తృతపరచి చెప్పాలన్న లోభము కూడా ధనలోభములాగే చెడ్డదని నన్నయకు తెలుసును. అందుచేతనే ఈ భాగాన్ని మూడు, నాల్గు గద్య పద్యాలలో ముగించాడు. దీనివలన శ్రోతకు. నూతనోత్సాహముతో తర్వాతి కథను విన నారంభిస్తాడు. శ్రోత ఈ గజ కచ్ఛపములు గరుడునికి ఆహార మవడంతో ఈ అవాంతర కథకు ఒకపరిపూర్ణత్వము కల్గడము, ప్రధాన కథకు పుష్టి కల్గడము-రెండుకూడ సాధింపబడ్డాయి.

దేవలోకములో పుట్టిన మహోత్పాతములను చూసి, ఇంద్రుడు బృహస్పతిని 'ఇదియేమి నిమిత్తం'బని అడుగగా, బృహస్పతి గరుడుని మాహాత్మ్యమును గూర్చి చెప్పాడు. ఈ భాగము ప్రధాన కథకు అవసరమే. శ్రోతకు ప్రధాన కథనుండి విశ్రాంతి లభించడమే గాక, రాబోవు కథకు శ్రోత మనసు నిది సన్నద్ధపరుస్తోంది.

ఇక గరుడుని కథ అంతా అద్భుతములపుట్ట గరుడునికి విషాదగుణము ఆహారమవడం, గజ కచ్ఛపాలను చేత నిఱికించుకొని ఎగిరిపోవడం రౌహిణమనే పాదప మాతనిని తన శాఖమీద కూర్చొని ఆహారాన్ని భుజించమని ఆహ్వానించడం, దానిమీద కూర్చునేటప్పటికి అది ఫెళఫెళ విరగడం, దానిని తన ముక్కున గఱచుకొని కశ్యపుని

వద్దకు వెళ్ళడం మున్నగునవి లోకంలో మనకు కానరాని విషయాలు. అలాగే గరుడుడు అమరవీరుల్ని ఓడించి అమృతాన్ని తీసికొనిపోయే ఘట్టముకూడా మనకు నమ్మకాన్ని కల్గించే ఘట్టము కాకపోవచ్చును.

కాని ఈ కథనమంతా అలముకొనిఉన్న ఈ లోకోత్తరమైన విషయాలే ఈ కథను లోకపు సరిహద్దుల నుండి మనలను దూరంగా తీసికొనిపోయి, దీనినొక రొమాంటిక్ కథగా చేస్తుంది. కాలము 'ఆదియుగము'నకు చెందిన దవడంతోబాటు ఇందులో కనబడే అద్భుతాలవలన లోకాలన్నిటిని స్పృశించే విశేషాలవలన, సౌపర్ణా ఖ్యానము రొమాంటిక్ కథగా కనబడుతుంది.

అయితే రొమాంటిక్ కథలను చెప్పంలో తగిన జాగ్రత్త వహించకపోతే ఇవి ఫెయిరీటేల్స్‌గా దిగజారే ప్రమాదమున్నది. ఈ ప్రమాదం నుండి రక్షించుకోవడంచేతనే కొందఱు కథకులు ఇట్టి కథలలో మానవత్వ స్ఫురణ ఎక్కువగా గోచరించేట్లు చేసి, ఆ కథను లౌకిక పరిధులలోనే నడుపుతారు. దీనివలన కథకొక ఎలిమెంట్ తిరోహితమైపోతుంది.

నన్నయ సౌపర్ణాఖ్యానానికి వాస్తవికత నంటగట్టలేదు. దానిని ఫెయిరీటేల్‌గా దిగజారనీయలేదు. అండము నుండి వెలువడిన గరుడుని గూర్చి నన్నయ ఒక ఉత్పలమాల చెప్పాడు.[3] ఈ పద్య నిర్మాణములోను, సమాసఘటనములోను, ఒక ఉదాత్తత ఉన్నది. దీని తర్వాత రెండు కందపద్యాలుకూడ గరుడునిగూర్చి చెప్పబడినవే. వీటి వలన ఒక్కసారిగ గరుడుడు మనమనసునంతా ఆక్రమిస్తున్నాడు. ఈ మూడు పద్యాల ప్రాతిపదిక వలన ఇతడే ప్రధానమైన పాత్ర అయి, మన దృష్టి అంతా, ఈ పాత్రమీదనే కేంద్రీకరించబడుతోంది. గరుడుడు సాధించిన అద్భుతాలను, విజయాలను గూర్చి మనము ముందెన్నడో శంకించదలచుకుంటే అంతవఱకు ఆగనక్కరలేకుండా ఆశంక ఏదో ఇక్కడే మనం వెలిబుచ్చాలి. ఈ మూడు పద్యాలలోని గరుడుని మనము అంగీకరించదలచుకుంటే, గరుడుడు తర్వాత నిర్వహించిన అద్భుతకృత్యాలను గురించి మనము ఆశ్చర్యపడవలసిన అవసరము కాని, అదంతా పుక్కిటి పురాణమని శంకించవలసిన పనిగాని లేదు.

ఈ విషయాన్నే ఇంకొక విధముగా చెప్పడానికి ప్రయత్నిస్తాను. గణితశాస్త్రములో కొన్ని స్వయం సిద్ధములు ఉంటాయి. వాట్లని నిరూపించడము అసంభవము. అసలు శాస్త్రజ్ఞుడు వానిని నిరూపిస్తా ననడు.” ఈ స్వయం సిద్ధాలను మీరు అంగీకరించండి. వీనిని మీరు అంగీకరిస్తే, నేను ఇంకేమీ క్రొత్త అంశాలను నూతన స్వయం సిద్ధాలను లోకానికి జొనపకుండా కట్టుదిట్టమైన ఒక శాస్త్రాన్ని తయారుచేసి పెట్టగలను” అంటాడు. మనమో స్వయం సిద్ధాలను అంగీకరిస్తే ఇంక కరకమైన శాస్త్రము తయారవుతుంది. యూక్లిడ్ ఒక సరళరేఖకు వెలుపలనున్న ఒక బిందువు గుండా ఆ సరళరేఖకు ఒకే ఒక సమాంతర రేఖను గీయవచ్చునన్న సిద్ధాంతాన్ని అంగీకరించాడు. ఈ స్వయం సిద్ధాన్ని అంగీకరిస్తే ఒక త్రిభుజములోని కోణముల మొత్తము రెండు లంబకోణము లవుతుంది. అలా కాకుండా ఒక సరళరేఖకు వెలుపలనున్న ఒక బిందువునుండి ఆ సరళరేఖకు ఒకటికన్న ఎక్కువ సమాంతర రేఖలను గీయవచ్చునని అంగీకరించ బడింది అనుకోండి. అప్పుడూ ఒక శాస్త్రం ఉత్పన్నమవుతుంది. (ఉత్పన్నమయిందికూడా) కాని ఈ శాస్త్రము ప్రకారము త్రిభుజము లోని మూడు కోణముల మొత్తము రెండు లంబకోణములు కావు!.

అలాగే నన్నయ కొన్ని అద్భుత విషయాలను చెప్పదలచు కొన్నాడు. అవి మన లౌకిక ప్రమాణాలకు అందేవికావు. అందుచేతనే మన సంకోచాలను, సంశయాలను కాస్త విస్మరించాలి. అప్పుడే సౌపర్ణాఖ్యానమందలి, సౌందర్యాన్ని చూడగల్గుతాము. అయితే నన్నయ ఎప్పటికప్పుడు ఒక నూతన విషయాన్ని చెబుతూ, “దీన్ని కూడా మీరు నమ్మండి!” అని కోరలేదు. శాస్త్రజ్ఞుడు కొన్ని స్వయంసిద్ధాలను ఆధారంగా చేసికొని అసిధారావ్రతంగా శాస్త్ర నిర్మాణానికి ఎలా పూనుకుంటాడో, అలాగే నన్నయ కూడ తొలి మూడు పద్యాలలోనే గరుడునికి ఒక రూపకల్పన చేసాడు. “ఇదీ ప్రాతిపదిక. దీన్ని మీరు అంగీకరిస్తే, మిగత కథ అంతా సత్యమైనదనే భావిస్తారు. దీన్ని మీరు అంగీకరించకపోతే మిగత కథ చదవినా నమ్మలేరు.!” అని నన్నయ అన్నట్లుగా నడిచింది ఈ మూడు పద్యాల రచన.

ఇక ఈ మూడు పద్యాలు చదువుతూన్నంతసేపు ఆ రచనా విధానానికి పూర్తిగా వశ్యులమైపోయి, చెప్పిన విషయాన్ని మనంగా హృదయ పూర్వకంగా అంగీకరిస్తాము. ఎప్పుడైతే శ్రోత కట్టుబడి పోయాడో, అప్పుడిక మిగత కథను గూర్చి శంకించే అవకాశము లేదు. నన్నయ ఈ మూడు పద్యాలలోను శ్రోతలో ఇట్టి మనః స్థితిని ఏర్పడేటట్లు చేసాడు.

ఇలా ఏర్పడిన మనః స్థితి స్థిరముగా నిలవడానికి మరికొన్ని అంశాలు తోడ్పడాలి. అందులో ఒకటి కథలో మానవ స్పర్శ కానరావడం. అట్టి అవకాశాలు ఉంటే నన్నయ వానిని జారవిడువ లేదు. ముఖ్యంగా క్రదువ ఇంద్రు నారాధించిన ఘట్టములోను, గరుడుడు అమృతాన్ని తీసికొనిరాపడానికి బయలుదేరేటప్పుడు తల్లి కొడుకును దీవించడంలోను,[4] ప్రదర్శితమైన మానవత గుర్తింప దగ్గది. మొదటి పద్యములో మూర్ఛితులైన ఉరగులనూ విగత పరితా పులుగా చేయుటకు తల్లి కద్రువ ఇంద్రు నారాధించిన సందర్భము లోనిది. రెండవ పద్యంలో వినత గరుడుని ఆశీర్వదించడం కనబడుతోంది. మొదటి పద్యమందలి పదముల కూర్పు ఒక మధురమైన మంత్రము లోని శబ్దాల కూర్పును స్ఫురింపచేస్తూంటే, రెండవ పద్యములో తల్లి డగ్గుత్తికతో, గర్వముతో, ఆశతో కొడుకును మంత్రములకన్న శక్తివంతములైన మాటలతో దేవతలందఱినీ ఆహ్వానిస్తూ, తన కొడుకుని కాపాడమని చెపుతూన్నట్లు ఉంది. ఈ విధమైన రచనవలన అద్భుతానికి మానవత్వమును బాసటగా నిలిపి, సౌపర్ణాఖ్యానమును ఉదాత్త రసాన్వితముగా చేయగలిగాడు నన్నయ్య.

ఈ కథలో ఇట్టి మానవత్వ స్ఫురణ చివరి వఱకు ప్రదర్శిత మవుతూనే ఉన్నది. గరుడుడు అమృతాన్ని తీసికొని కూడా 'అస్వా దింపక యలోలు'డగుట, ఉరగులు'అమృతోపయోగ కుతూహలంబున నొండొరులం గడవఁ గృత స్నానాలంకృతులై చనుదెంచుట' మున్నగునవన్నియు ఈ మానవత్వాన్ని పరిరక్షించే ఘట్టములే.

## అథస్సూచికలు

1) పూర్వభాగమునందు గరుడుడు తల్లికి దాస్యమునుండి విముక్తిని కల్గించాడు. ఇది శాపఫలమును అనుభవించకుండా ఉండడానికి మార్గాన్ని ఆలోచించడం కాదు.

2. "నరచాప ప్రవిముక్త దారుణ బృహన్నారాచధారల్ భయం
కర వైనతేయ నికాయ కాయములపైఁ గప్పెన్ దిశల్ నిండ బం
ధుర ధాత్రీధర తుంగ శృంగ తట సంకోహంబుపైఁ గప్పుదు
ర్ధర ధారాధర ముక్త సంతత పయోధారావళిం బోలుచున్"
"పత దుర్వీధర ధాతు నిర్ఝర జలాభంబై మహాదేహ ని
ర్గత సాంద్రారుణ పూర మెక్కె మొగి నాల్కం ద్రస్సి నారాయణో
న్నత దోర్దండ విముక్త చక్రనిహతిన్ నాకద్విష న్మస్తక
ప్రతతుల్ ఘోర రణంబునం బడియె భూభాగంబు గంపింపగన్."

(1-2-23, 24)

3. ఆతత పక్ష మారుత రయ ప్రవికంపిత ఘూర్ణితాచల
వ్రాత మహార్ణవుండు బలవన్నిజ దేహసముజ్జ్వల ప్రభా
ధూత పతంగ తేజుఁ డుదితుండయి తార్క్ష్యుఁడు తల్లికిన్ మనః
ప్రీతి యొనర్చుచున్ నెగసె భీమ జవంబున నభ్ర వీథికిన్."

(1-2-38)

4. "నరసుర సిద్ధ కింపురుష నాగ నభశ్చర ముఖ్యులెల్ల నీ
కరుణయ వేచి మంద్రు త్రిజగంబుల నీ కులిశాభిరక్షణ
స్ఫురణన చేసి సుస్థిరత బొందుఁ బురందర సర్వలోక సుం
దర శరణంబు నాకగుము దానవ సూదన పాకశాసనా!"

(1-2-46)

"అనిలుడు పక్ష యుగ్మ మమృతాంశుఁడు వీపనలుండు మస్తకం
బినుఁడు సమస్త దేహమును నెప్పుడుఁ గాచుచు నీ కభీష్టముల్
ఘనముగఁ జేయుచుండెడు జగన్నుత యున్నతిన్ జయంబుఁ జే
కొనుమని యిచ్చె దీవనలుఁగోరి ఖగేంద్రునకుం బ్రియంబునన్."

(1-2-56)

భారతి, సెప్టెంబరు; 1965

# నన్నయ్యగారి కథాశిల్పము

## ఉదంకుని కథ

శ్రీ ధూళిపాళ శ్రీరామమూర్తి

మహాకవులు రెండువిధములు. ఒకడు ఋషి, రెండవవాడు ఋషికల్పుడు. ఆ ఋషియైనవాని కవిత్వము శరన్నదివలె అతి స్వచ్ఛముగా ప్రసన్నముగా ప్రవహించును. ఈ ఋషికల్పుని కవిత్వము వార్షనదకది. సుడిగుండములతో తరంగములతో ఒడ్డు నొరసికొని ప్రవహించునది. ఆ ఋషి రచనము నీటికొలది తామర. ఈ ఋషి కల్పుని రచనము ఉత్తాలమైనది. తలయెత్తి చూచినగాని కన్పించనది. ఆ ఋషికవిత్వము దిగినకొలదిగాని లోతు తెలియనిది. ఎప్పటికప్పుడు పాఠకుని ఊహకుపైన బెత్తెడుండునది. అది యెంతదూరము పోయినను అంతే. దానియొక్క తుదిమొదళ్ళివి యని కొలిచి చూపుటకు వీలు కాదు. దాని సౌందర్యమునందు మగ్నమై తన్మయత భజించి ఆనందింపవలసినదే కాని మనసువల్ల తెలిసికొని వాక్కుతో చెప్పుటకు వీలైనది కాదు. ఆ ఋషికల్పుని రచనయన్న మనస్సు దాటినది కాదు. ఆ కవియొక్క యనుభావ సర్వస్వము అతని రచనకంటె ప్రధానమైనవాని యందలి యుత్తాలత్వమును ప్రస్ఫుటముగా వ్యక్తము చేయుచుండును. దాని తుదిమొదళ్ళివి యని కచ్చితముగా కొలిచి నిర్ణయించుకొనవచ్చును.

ఈ ద్వివిధకవులకు నన్నయ తిక్కనలు ఉదాహరణములు. నన్నయగారు ఋషి. తిక్కనగారు ఋషికల్పుడు. అందుచేత నన్నయగారి శిల్పము బాగుగా మరుగుపడి యుండునది. ఆయన మాటలను జాగ్రత్తగా నాలోచించినకొలది వ్యక్తమగునది. తిక్కనగారి శిల్పము ప్రథమ దర్శనమందే కొట్టవచ్చినట్లు కన్పించునది. నన్నయ

గారు ఎంత తెలిసినవాని కంత యర్థమగును. తిక్కనగారు అర్థమైన వాని కగును. లేనివానికి లేదు.

ప్రధానముగా నన్నయగారి శిల్పము కథాకలితమై యుండును. ఆయన కథను తేటమాటలతో చెప్పుకొనిపోవుచుండును. కథకు విఘాతము కల్పించి పాత్రలయొక్క మనఃప్రవృత్తులను, పరిస్థితుల యొక్క వర్ణనమును, కథాంశములయొక్క విస్తృతియు వివరించి చేయడు. ఈ యన్నియు ఉన్నవా యన్నచో నున్నవి. ఎచ్చట నున్నవి. ఆయనమాటల మఱుగున క్రోశక్రోశ దూరముల వెనుక నున్నవి. ఆయన కథాగమనము వేగమైనదగుటచే నిలిచి వానా యన్నిటి నాలోచింపనీయదు. అందుచేతనే ప్రసన్న కథాకలితార్థ యుక్తిలో నారసి మేలునా! వ్రాయుదునన్నాడు. వట్టికథ మాత్రము చెప్పికొని పోవుచున్నట్లు పైకికన్పించి అంతరాంతరమందు సూక్ష్మ సూక్ష్మ తరములైన బహ్వర్థములను సంయోజించుట బహుజన్మ తపఃఫలము తప్ప వేరుకాదు. బహుపరిణత మనస్కుడైన మహాశిల్పి నన్నయగారు.

నన్నయ్యగారి ఈ పరిణత శిల్పమును ఆయన వ్రాసిన భారత భాగమందలి ప్రతికథయు పట్టియిచ్చును. ఎట్లు పట్టియిచ్చునో బహు కథలను శ్రీ విశ్వనాథ సత్యనారాయణగారు వ్యాఖ్యానించి చూపిరి. వారు ముట్టుకొన్న కథలలో ఉదంకోపాఖ్యానమొకటి. కథ మొదలు పెట్టుచునే ఉదంకుని గురించి రెండు కంద పద్యములు వ్రాసినాడు నన్నయగారు. ఇవి ఉదంకుని యొక్క అనుభావమును గురించి చెప్పి నవి. ఆ యుదంకుడు బ్రహ్మతుల్యుడు, తపస్వి. భయము లేనివాడు. అతడు గురుశుశ్రూష చేసి జ్ఞానము పొందినాడు. అణిమాద్యష్టసిద్ధులు పొందినాడు. ఈ రెండు పద్యముల నిచ్చట వ్రాయకున్నను కథ మొదలుపెట్టి చెప్పవచ్చును. అసలీపద్యము లిచ్చట వ్రాయుట యెందుకు ? ఆయన కథ యెట్లునూ చెప్పుచుండెను కదా? ఆ కథయం దీ చెప్పబడిన యుదంకుని గుణము లెట్లును వ్యక్తమగును కదా ? మరి వాని నిచ్చట చెప్పుటలో విశేషమేమున్నది? అను ప్రశ్నలను పుట్టిం

చుకొని యాలోచింతము. కథ యదభిముఖముగ వ్రాయబడునో ఆ ప్రయోజనమునుబట్టి కథ చెప్పవలసిన పద్ధతి యుండవలెను. ఈ కథయం దుదంకుని మహాగుణములు, ఆయనశీలము, అనుభవము వ్యక్తముసేయుట ప్రధానమైనచో ఆయన యా గుణముల నిచ్చట చెప్పుట దోషమగును. ఏ యభిప్రాయమును వ్యక్తముసేయుటకు కథ చెప్పుచుంటిమో ఆ యభిప్రాయము వాచ్యముగా చెప్పినపుడు కథ చెప్పుట యనవసరముగదా! అందుచేత ప్రధానవిషయము దీపింప చేయవలయునే కాని వాచ్యము చేయరాదు. నన్నయగారి ఉదంకోపాఖ్యానమునందు ఈ యుదంకుని అనుభావ విశేషము వ్యక్తము సేయుట ప్రధానముకాదు. ఈ యుదంకుని కథ సర్పయాగమున కంగము. సంస్కృత భారతమునందు ఈ సందర్భమున మూడు కథలున్నవి. తక్కిన రెంటికిని భారతకథతో సంబంధము లేదు. భారత కథతో ముడిపడియున్న దీ ఉదంకోపాఖ్యాన మొక్కటే. అందుచేత తక్కిన రెంటినివదలి నన్నయగారీయొక్క కథనే రచించెను. దానితీర్పు కూడ వేరుగా చేసెను. మొత్తము ఉదంకుని కథ యంతయు మితహిత సత్యవాక్య! జనమేజయ! భూజనవంద్య!... అకారణము నా కపకారము జేసె తక్షకుండు అను వాక్యములో పర్యవసించుచున్నది. ఉదంకు డిట్టివాడు. ఇట్టివానికి తక్షకు డపకారము చేసినాడు. అందుచేత వాడు దండ్యుడు. తక్షకుడు చేసిన అపకారాతిశయము, వాని దౌష్ట్యము. సర్పయాగము యొక్క యవసరము ప్రధానమై, ఇంత మహానుభావత కలవాని కపకారముచేసిన తక్షకుని దుష్టత్వము ఆ సర్పకుల ప్రళయమున కెట్లు హేతువైనదో దీపింపజేయుటయే ఈ కథ యొక్క తాత్పర్యము. కాబట్టి యుదంకుని స్వరూప స్వభావములు చెప్పియే తీరవలయును. ఉదంకునకు తక్షకు డపకారము చేయనేలేదు; సర్పయాగము లేనేలేదు. ఆ తక్షకు డెట్టివాని కపకారము చేసెను? బ్రహ్మవంటివానికి, భయమెరుగని మనస్సు కలవానికి, అఘపంకక్షాళన మహాతస్సలిలునికి, ఈ మూడు విశేషణములను వేయుటవలన తక్షకుడు

## అథస్సూచికలు

1) పూర్వభాగమునందు గరుడుడు తల్లికి దాస్యమునుండి విముక్తిని కల్గించాడు. ఇది శాప ఫలమును అనుభవించకుండా ఉండడానికి మార్గాన్ని ఆలోచించడం కాదు.

2. "నరచాప ప్రవిముక్త దారుణ బృహన్నారాచధారల్ భయం
కర దైతేయ నికాయ కాయములపైఁ గప్పెన్ దిశల్ నిండ బం
ధుర ధాత్రీధర తుంగ శృంగ తట సంకోహంబుపైఁ గప్పుడు
ర్థర ధారాధర ముక్త సంతత పయోధారావళిం బోలుచున్"
"పత దుర్వీధర ధాతు నిర్ఝర జలాభంబై మహాదేహ ని
ర్గత సాం దారుణ పూరమొక్క మొగినాల్కం ద్రస్సినారాయణో
న్నత దోర్దండ విముక్త చక్రనిహతిన్ నాకద్విష న్మస్తక
ప్రతతుల్ ఘోర రణంబునం బడియె భూభాగంబు గంపింపగన్."
(1-2-23, 24)

3. ఆతత పక్ష మారుత రయ ప్రవికంపిత ఘూర్ణితాచల
వ్రాత మహార్ణవుండు బలవన్నిజ దేహసముజ్జ్వల ప్రభా
ధూత పతంగ తేజుఁడుది తుండయి తార్క్ష్యుడు తల్లికిన్ మనః
ప్రీతి యొనర్చుచున్ నెగసె భీమ జవంబున నభ్ర వీథికిన్."
(1-2-

4, "నరసుర సిద్ధ కింపురుష నాగ నభశ్చర ముఖ్యులెల్ల నీ
కరుణయ వేచి మంద్రుడు త్రిజగంబుల నీ కులిశాభిరక్షణ
స్ఫురణనచేసి సుస్థిరత బొందుఁ బురందర సర్వలోక సుం
దర శరణంబు నాకగుము దానవ సూదన పాకశాసనా!"
(1-2-46)

"అనిలుడు పక్ష యుగ్మ మమృతాంశుఁడు పీసనలుండు మస్తక
చినుఁడు సమస్త దేహమును నెప్పుడుఁ గాచుచు నీ కభీష్టముల్
ఘనముగఁ జేయుచుండెడు జగన్నుత యున్నతిన్ జయంబుఁ జే
కొనుమని యిచ్చె దీవనలుగోరి ఖగేంద్రునకుం ద్రియంబునన్."
(1-2-56)

భారతి. సెప్టెంబరు; 1965

---

# నన్నయ్య గారి కథాశిల్పము

## ఉదంకుని కథ

శ్రీ ధూళిపాళ శ్రీరామమూర్తి

మహాకవులు రెండువిధములు. ఒకడు ఋషి, రెండవవాడు ఋషికల్పుడు. ఆ ఋషియైనవాని కవిత్వము శరన్నదివలె అతి స్వచ్ఛముగా ప్రసన్నముగా ప్రవహించును. ఈ ఋషికల్పుని కవిత్వము వార్షునది. సుడిగుండములతో తరంగములతో ఒడ్డు నొరసికొని ప్రవహించునది. ఆ ఋషి రచనము నీటికొలది తామర. ఈ ఋషి కల్పుని రచనము ఉత్తాలమైనది. తలయెత్తి చూచినగాని కన్పించనది. ఆ ఋషికవిత్వము దిగినకొలదిగాని లోతు తెలియనిది. ఎప్పటికప్పుడు పాఠకుని ఊహకుపైన బెత్తెడుండునది. అది యెంతదూరము పోయినను అంతే. దానియొక్క తుదిమొదళ్ళివి యని కొలిచి చూపుటకు వీలు కాదు. దాని సౌందర్యమునందు మగ్నమై తన్మయత భజించి ఆనందింపవలసినదేకాని మనసువల్ల తెలిసికొని వాక్కుతో చెప్పుటకు వీలైనది కాదు. ఆ ఋషికల్పుని రచనయన్న మనస్సు దాటినది కాదు. ఆ కవియొక్క యనుభావ సర్వస్వము అతని రచనకంటె ప్రధానమైవాని యందలి యుత్తాలత్వమును ప్రస్ఫుటముగా వ్యక్తము చేయుచుండును. దాని తుదిమొదళ్ళివి యని కచ్చితముగా కొలిచి నిర్ణయించుకొనవచ్చును.

ఈ ద్వివిధకవులకు నన్నయ తిక్కనలు ఉదాహరణములు. నన్నయగారు ఋషి. తిక్కనగారు ఋషికల్పుడు. అందుచేత నన్నయగారి శిల్పము బాగుగా మరుగుపడి యుండునది. ఆయన మాటలను జాగ్రత్తగా నాలోచించినకొలది వ్యక్తమగునది. తిక్కనగారి శిల్పము ప్రథమ దర్శనమందే కొట్టవచ్చినట్లు కన్పించునది. నన్నయ

గారు ఎంత తెలిసినవాని కంత యర్థమగును. తిక్కనగారు అర్థమైన వాని కగును. లేనివానికి లేదు.

ప్రధానముగా నన్నయగారి శిల్పము కథాకలితమై యుండును. ఆయన కథను తేటమాటలతో చెప్పుకొనిపోవుచుండును. కథకు విఘాతము కల్పించి పాత్రలయొక్క మనఃప్రవృత్తులను, పరిస్థితులయొక్క వర్ణనమును, కథాంశములయొక్క విస్తృతియు వివరించి చేయుడు. ఈ యన్నియు ఉన్నవా యన్నచో నున్నవి. ఎచ్చట నున్నవి. ఆయనమాటల మరుగున క్రోశక్రోశ దూరముల వెనక నున్నవి. ఆయన కథాగమనము వేగమైనదగుటచే నిలిచి యీయన్నిటి నాలోచింపనీయదు. అందుచేతనే ప్రసన్న కథాకలితార్థ యుక్తిలో నారసి మేలునా! వ్రాయుదునన్నాడు. వట్టికథ మాత్రము చెప్పికొని పోవుచున్నట్లు పైకికన్పించి అంతరాంతరమందు సూక్ష్మ సూక్ష్మతరములైన బహ్వర్థములను సంయోజించుట బహుజన్మ తపఃఫలము తప్ప వేరుకాదు. బహుపరిణత మనస్కుడైన మహాశిల్పి నన్నయగారు.

నన్నయ్యగారి ఈ పరిణత శిల్పమును ఆయన వ్రాసిన భారత భాగమందలి ప్రతికథయు పట్టియిచ్చును. ఎట్లు పట్టియిచ్చునో బహు కథలను శ్రీ విశ్వనాథ సత్యనారాయణగారు వ్యాఖ్యానించి చూపిరి. వారు ముట్టుకొన్న కథలలో ఉదంకోపాఖ్యానమొక్కటి. కథ మొదలు పెట్టుచునే ఉదంకుని గురించి రెండు కంద పద్యములు వ్రాసినాడు నన్నయగారు. ఇవి ఉదంకుని యొక్క అనుభావమును గురించి చెప్పునవి. ఆ యుదంకుడు బ్రహ్మతుల్యుడు, తపస్వి. భయము లేనివాడు. అతడు గురుశుశ్రూష చేసి జ్ఞానము పొందినాడు. అణిమాదికాష్టసిద్ధులు పొందినాడు. ఈ రెండు పద్యముల నిచ్చట వ్రాయకున్నను కథ మొదలుపెట్టి చెప్పవచ్చును. అసలీపద్యము లిచ్చట వ్రాయుట యెందుకు ? ఆయన కథ యెట్లునూ చెప్పుచుండెను కదా? ఆ కథయందీ చెప్పబడిన యుదంకుని గుణము లెట్లును వ్యక్తమగును కదా ? మరి వాని నిచ్చట చెప్పుటలో విశేషమేమున్నది? అను ప్రశ్నలను పుట్టిం

చుకొని యాలోచింతము. కథ యదభిముఖముగ వ్రాయబడునో ఆ ప్రయోజనమునుబట్టి కథ చెప్పవలసిన పద్ధతి యుండవలెను. ఈ కథయం దుదంకుని మహాగుణములు, ఆయనశీలము, అనుభవము వ్యక్తముసేయుట ప్రధానమైనచో ఆయన యా గుణముల నిచ్చట చెప్పుట దోషమగును. ఏ యభిప్రాయమును వ్యక్తముసేయుటకు కథ చెప్పుచుంటిమో ఆ యభిప్రాయము వాచ్యముగా చెప్పినపుడు కథ చెప్పుట యనవసరముగదా! అందుచేత ప్రధానవిషయము దీపింప చేయవలయునే కాని వాచ్యము చేయరాదు. నన్నయగారి ఉదంకోపాఖ్యానమునందు ఈ యుదంకుని అనుభావ విశేషము వ్యక్తముసేయుట ప్రధానముకాదు. ఈ యుదంకుని కథ సర్పయాగమున కంగము. సంస్కృత భారతమునందు ఈ సందర్భమున మూడు కథలున్నవి. తక్కిన రెంటికిని భారతకథలో సంబంధము లేదు. భారత కథతో ముడిపడియున్నదీ ఉదంకోపాఖ్యాన మొక్కటే. అందుచేత తక్కిన రెంటినివదలి నన్నయగారియొక్క కథనే రచించెను. దానితీర్పు కూడ వేరుగా చేసెను. మొత్తము ఉదంకుని కథ యంతయు మితహిత సత్యవాక్య! జనమేజయ! భూజనవంద్య!... అకారణము నా కపకారము జేసె తక్షకుండు అను వాక్యములో పర్యవసించుచున్నది. ఉదంకుడిట్టివాడు. ఇట్టివానికి తక్షకు డపకారము చేసినాడు. అందుచేత వాడు దండ్యుడు. తక్షకుడు చేసిన అపకారాతిశయము, వాని దౌష్ట్యము. సర్పయాగము యొక్క యవసరము ప్రధానమై, ఇంత మహానుభావత కలవాని కపకారముచేసిన తక్షకుని దుష్టత్వము ఆ సర్పకుల ప్రళయమున కెట్లు హేతువైనదో దీపింపజేయుటయే ఈ కథ యొక్క తాత్పర్యము. కాబట్టి యుదంకుని స్వరూప స్వభావములు చెప్పియే తీరవలయును. ఉదంకునకు తక్షకు డపకారము చేయనేలేదు; సర్పయాగము లేనేలేదు. ఆ తక్షకు డెట్టివాని కపకారము చేసెను? బ్రహ్మవంటివానికి, భయమెరుగని మనస్సు కలవానికి, అఘపంకక్షాళన మహాతస్సలిలునికి, ఈ మూడు విశేషణములను వేయుటవలన తక్షకుడు

ఎంత ప్రమాదమైన యపకారము తన కులమునకు చేయుచున్నాడో ద్యోతకమగుచున్నది. ఆ కథయందలి ప్రధానమైన మహావిషయమగు సర్వకుల ప్రళయమును తద్ధేతుభూతుడైన ఉదంకుని వర్ణించుటవలన సూచించినాడు నన్నయగారు. ఈసర్వకులప్రళయమునను తాను హేతు వగుటవలన తనకు పాపము రాదా యను ప్రశ్న పుట్టించుకొని అంతటి పాపమును తపస్సుచేసి నివారించుకొనగలడని 'అఘపంకక్షాళన మహాతపస్సలిలు'డని చెప్పినాడు. ఇది యుదంకునియందలి యొకగుణము తనకపకారము చేసిన వారి నాయన సైచడు. వారికి పదిరెట్లపకారము చేయును. దానివలన పాపము సంక్రమించిన తపస్సుచేత నివారించు కొనును. తనకు చేసిన యపకారమునకు సర్వకుల ప్రళయము చేయు నట్టి స్వభావము కలవాడని సూచించుటకే 'అఘపంకక్షాళన మహా తపస్సలిలు'డను క్రమమున సమాస రచన చేసినాడు. లేదు. తపస్సు చేసి తన పాపములన్నియు పోగొట్టుకొన్న పవిత్రుడని చెప్పుటకైనచో తపస్సలిలక్షాళితాఘపంకు డనుక్రమమున సమాస నిర్మాణము చేయ వలయును. 'అఘపంకక్షాళన మహాతపస్సలిలు'డనుటవలన అది యతని స్వభావమును వ్యక్తము సేయుచున్నది. అందుచేత ఈరెండుపద్యముల నిచ్చట వ్రాయుట.

కథ ప్రారంభించుటలో 'అయ్యుదంకుండు' అనుటవలన వాని యప్రతిహతత్వమును సూచించుచున్నాడు. "అయ్యుదంకుండు గురు హిత కార్య ధురంధరుండై గురుపత్నీ నియోగంబునన్ బౌష్యుం డను రాజు దేవి కుండలంబులన్ ప్రతిగ్రహించి తేరంబూని వనంబులో నొక్కరుండ చనువా డెదుర నొక్క మహోక్షంబు నెక్కి చనుదెంచు వానినొక్క దివ్యపురుషుంగని వాని పన్నిన వృషభ గోమయ భక్ష ణంబు సేసి యమ్మహోత్సు నను గ్రహంబు వడసి యతి త్వరిత గతిం జని పౌష్యమహారాజుం గాంచి దీవించి గృహీత సత్కారుండై యిట్లనియె." గురుహిత కార్య ధురంధరుడై గురుపత్నీ నియోగంబున పోవుటయేమి? 'ఒక్కరుండ' యననేల? 'పన్నిన' యనుట యెందులకు? ఈమాటలను

పర్యాలోచించి చూచినచో వానివెనుక బహు కథాంశములు వివృత ములై ప్రధాన కథయందు సంయోజితము లగుచున్నవి. యుదంకుడు గురువుగారి వద్దకు పోయి 'అయ్యా! మీకేమి కావలయునో చెప్పుడు. గురుదక్షిణగా తెచ్చి యిచ్చెదను' అని యడిగినాడు. ఆ గురువుగా రన్నాడు కదా! 'నాయనా నాకే కోరికయు లేదు. నాకు నీవు గురు దక్షిణ యిచ్చునదేమి? వల'దన్నాడు. ఉదంకుడు మీకు కోరిక యుండకపోవచ్చును. నేను గురు ఋణము తీర్చుకొనవలయును గదా. అందుచేత సెలవిం డన్నాడు. గురువుగారికి తన భార్య కోరిక గుర్తు వచ్చినది. నా భార్య కిట్టి కోరిక యున్నది. తీర్చుమని తాను నోటితో చెప్పునా యుదంకునకు? ఆమె కోర్కె తీర్చవలయునన్నచో తాను సమర్థుడు కాడా? అందుచేత గురువుగారికి భార్యకోరిక తీర్చుటయందు నిష్ఠలేదు. ఆమె చాల కాలముగా అట్టి కోర్కెను సూచించుచు వచ్చి నది. ఆయన యుపేక్షించుచు వచ్చినాడు. ఇప్పుడుకూడ ఉపేక్షా భావమే. ఆయన యుదాసీనుడు. ఏదో పిల్లవాడు గురుదక్షిణ యిచ్చుట కుబలాటపడుచున్నాడు పోనీ! నాకా కుండలములు తెచ్చిపెట్టును లెండు అని భార్య యన్నది అది 'గురుపత్నీనియోగ' మన్నాడు నన్నయ గారు. 'గురుహితకార్యధురంధరుండై గురుపత్నీనియోగ' మనుటలో ఈ సర్వమును భాసించుచున్నది.

వనములో ఒక్కడే పోవుచున్నాడట. ఒకడే అనియేవకారార్థ మునకు ప్రయోజనమేమి? ఆగురువుగారు ఈ యడవిలో నీవొక్కడవు పోలేవన్నాడు. ఉదంకుడు 'అనాతంకమతి' భయములేదు నేనొకడనే పోగల్గుదున'న్నాడు. గురువుగారు సరేనన్నాడు. కాని ఇంద్రుని వాని వెనుక కాపు ఒంపినాడు మనపిల్లవాడున్నాడు. వాడు పొరుగూరు బయలుదేరినాడు. నాయనా నీవొక్కడవు పోలేవు. మనపాలెగాడు వచ్చును, వానిని తోడు పంపుదును. అందాక నుండుమన్నచో వాడుం డడు. యావనదర్పమున వాడు బయలుదేరి పోవును. తరువాత పాలె గాడు వచ్చును. 'పిల్లవాడొక్కడేపోయెను! వానికి తోడుగా నీవు

పొమ్మని వానిని వెనుక బంపుదుము. ఈ 'యొక్కరుండ' అను యేవకా రార్థము ఆ యీ పరిస్థితిని వ్యంగ్యము చేయుచున్నది. గురువుగారికి ఉదంకున్నడచో మిక్కిలి ప్రేమ. తన శిష్యుడు సమర్థుడగునో కాదో పరీక్షింపవలయును. ఆయా ఘట్టములయందు వానికాపద గలిగినవాడు నిర్వహించుకోలేనప్పుడు వానికి సాయపడవలెను. ఇట్లు శిష్యుని పరీక్షించుట, సహాయపడుట కుండలములు తెచ్చుట కుదంకుడు బయలుదేరినప్పటినుండి తిరిగి నింటికి వచ్చువరకును కలిపి చేసినాడు పైలముని. కుండలములు తెచ్చిన తరువాత ఉదంకుని పైలుడు 'ఈ యున్న పౌష్య ప్రోలికి బోయి గడుం బెద్ద దవ్వు పోయిన యట్లత్యాయత విమల తపోమహిమా! యిన్ని దినంబు లేల మసలితి చెపుమా!' యని యడిగినాడు. ఇందు 'అత్యాయత విమల తపోమహిమా!' యనుటలో ఆక్షేపమున్నది. ఇంతగొప్ప తపస్వివి. ఇక్కడనున్న పౌష్య పట్టణముపోయి ఇంతాలస్యము చేసితివేమని ఈ యాక్షేపమువలన ఉదంకుడు పడ్డ పాట్లన్నియు గురువుగారెరింగి నాడని మనకు తెలియుచున్నది. ఈ తెలియుట తరువాత ఉదంకు డడిగిన దివ్యపురుషుని యొక్కయు, నాగలోకము యొక్కయు వృత్తాంతములను గురువుగారు వ్యాఖ్యానించి చెప్పుటచేత బలపడుచున్నది. ఆ వాఖ్యానంతరము గురువుగారన్నాడు కదా 'అది నింద్రుడుగాంచి యమృతాశివగుట నీ కభిమతార్థసిద్ధి యయ్యెనయ్య' యని- అందుచేత ఉదంకుడు చెప్పకపూర్వమే ఉదంకుని పడ్డపాట్లు, కుండలములు తెచ్చిన వైఖరి యంతయు గురువుగారికి తెలిసియేయున్నది. ఎట్లు తెలిసినది? ఆయన యజ్వ. ఇంద్రుడు, పర్జన్యుడు, అగ్ని ఆయనకు సఖులు. వారి నాయన ఉదంకుని పరీక్షించుటయందును, రక్షించుటయందును వినియోగించినాడు. ఆ పరీక్షణముగాని, రక్షణముగాని ఉదంకునికి తెలియునట్లు చేయరాదు. చేసినచో ఆ కుండలములు తానే తెచ్చిన సంతోషమును వాడనుభవింపలేడు. అందుచేత ఆ పురుషుడు దివ్యుడు. ఆ యైరావతము ఉక్షము ఆ అగ్ని తురంగము. ఇట్లు పూర్వాపరములను పర్యాలోచించుటవలన

ఆ యీ పరిస్థితియంతయు వ్యక్తమై కథయందు సంయోజిత మగుచున్నది. ఇంత గుర్వనుగ్రహము కలవ డగుటచేతనే 'జ్ఞానము వడసెను గురుదయ నణిమాది కాష్టగుణముల తోడన్.'

మరి 'పన్నిన' యన్నమాట యున్నది. ఇంత సాహసుడైన యుదంకుడు వృషభగోమయము తినుమన్న తినునా? తినునట్లు పన్నినాడట. ఉదంకున కా పురుషుడు కనిపించినాడు. సామాన్యుడుగా కన్పించలేదు. దివ్యుడుగా కన్పించినాడు. ఉదంకు డాతనికినమస్కరించినాడు. ఆ దివ్యపురుషు డతనిని సర్వకార్యసిద్ధిర స్తని దీవించినాడు. నీకేమి కావలయునో కోరుకొమ్మన్నాడు. అప్రతిహతముగా నేను పోవు కార్యము సిద్ధించవలె నన్నాడుదంకుడు. దివ్యపురుషుడు 'ఐనచో ఈ వృషభ గోమయ భక్షణము సేయుము' అన్నాడు. ఉదంకుడు సంకోచించినాడు. తినుటయా? తినకపోవుటయా? తన యెదుటనున్న పురుషుడు దివ్యుడే. సందేహము లేదు. తన యంతరాత్మ దివ్యుడని చెప్పుచున్నది. మరి ఆతడాజ్ఞాపించినట్లు చేయకపోయినచో తన కార్యము విఘటితమగునేమో! ప్రథమముననే పూజ్య పూజావ్యతిక్రమ మేల చేయవలయును? ఈ గోమయము భక్షించుటవలన తనకేదైన పాపము వచ్చినచో తన తపస్సుచేత పరిహరించుకొనవచ్చును. అందుచేత కార్యమతియై వృషభగోమయ భక్షణము చేసినాడు. ఉదంకుని యొక్క కార్యదీక్ష యెట్టిదో పరీక్షించుట యొకటి. అతనికి తెలియకుండ యమృతము తినిపించుట యొకటి. ఇది వెనుకనుండి గురువుగారు చేయుచున్న పని. ఈ యంతయు 'పన్నిన' యనుటలో వ్యక్తమగుచున్నది.

ఉదంకుడు పౌష్యుని యొద్దకు పోయి కుండలములు కోరినాడు. గుర్వర్థమై వచ్చితినన్నాడు. అతడడుగగనే పౌష్య డియ్యవలయునా? అత డీకుండలములు తీసికొనుట కర్హుడో? కాదో? అందుచేత తా నతనిని పరీక్షింపవలయును. తా నతనిని పరీక్షించుచున్నట్లత డెరింగినచో శపించవచ్చును. మరి యదిగాక యతనిని చూడగనే పౌష్యుడు

ఎంత ప్రమాదమైన యపకారము తన కులమునకు చేయుచున్నాడో ద్యోతకమగు చున్నది. ఆ కథయందలి ప్రధానమైన మహావిషయమగు సర్వకుల ప్రళయమును తద్ధేతుభూతుడైన ఉదంకుని వర్ణించుటవలన సూచించినాడు నన్నయగారు. ఈసర్వకులప్రళయమునను తాను హేతు వగుటవలన తనకు పాపము రాదా యను ప్రశ్న పుట్టించుకొని అంతటి పాపమును తపస్సుచేసి నివారించుకొనగలడని 'అఘపంకక్షాళన మహాతపస్సలిలు'డని చెప్పినాడు. ఇది యుదంకునియందలియొకగుణము తనకపకారము చేసిన వారి నాయన సైచడు. వారికి పదిరెట్లపకారము చేయును. దానివలన పాపము సంక్రమించిన తపస్సుచేత నివారించు కొనును. తనకు చేసిన యపకారమునకు సర్వకుల ప్రళయము చేయు వట్టి స్వభావము కలవాడని సూచించుటకే 'అఘపంకక్షాళన మహా తపస్సలిలు'డను క్రమమున సమాస రచన చేసినాడు. లేదు. తపస్సు చేసి తన పాపములన్నియు పోగొట్టుకొన్న పవిత్రుడని చెప్పుటకైనచో తపస్సలిలక్షాళితాఘపంకు డను క్రమమున సమాస నిర్మాణము చేయ వలయును. 'అఘపంకక్షాళన మహాతపస్సలిలు'డనుటవలన అది యతని స్వభావమును వ్యక్తము సేయుచున్నది. అందుచేత ఈరెండుపద్యముల నిచ్చుట వ్రాయుట.

కథ ప్రారంభించుటలో 'అయ్యుదంకుండు' అనుటవలన వాని యప్రతిహతత్వమును సూచించుచున్నాడు. "అయ్యుదంకుండు గురు హిత కార్య ధురంధరుండై గురుపత్ని నియోగంబునన్ పౌష్యుం డను రాజు దేవి కుండలంబులన్ ప్రతిగ్రహించి తేరంబోని వనంబులో నొక్కరుండ చనువా డెదుర నొక్క మహోక్షంబు నెక్కి చనుదెంచు వానినొక్క దివ్యపురుషుంగని వాని పన్నిన వృషభ గోమయ భక్ష ణంబు సేసి యమ్మహాత్ము ననుగ్రహంబు వడసి యతి త్వరిత గతిం జని పౌష్యమహారాజుం గాంచి దీవించి గృహీత సత్కారుండై యిట్లనియె." గురుహిత కార్య ధురంధరుడై గురుపత్ని నియోగంబున పోవుటయేమి? 'ఒక్కరుండ' యననేల? 'పన్నిన' యనట యెందులకు? ఈమాటలను

పర్యాలోచించి చూచినచో వానివెనుక బహు కథాంశములు వివృతములై ప్రధాన కథయందు సంయోజితము లగుచున్నవి. యుదంకుడు గురువుగారి వద్దకు పోయి 'అయ్యా! మీకేమి కావలయునో చెప్పుడు, గురుదక్షిణగా తెచ్చి యిచ్చెదను' అని యడిగినాడు. ఆ గురువుగారన్నాడు కదా! 'నాయనా నాకే కోరికయు లేదు. నాకు నీవు గురుదక్షిణ యిచ్చునదేమి? వల' దన్నాడు. ఉదంకుడు మీకు కోరిక యుండకపోవచ్చును. నేను గురు ఋణము తీర్చుకొనవలయును గదా. అందుచేత సెలవిం డన్నాడు. గురువుగారికి తన భార్య కోరిక గుర్తు వచ్చినది. నా భార్య కిట్టి కోరిక యున్నది. తీర్చుమని తాను నోటితో చెప్పునా యుదంకునకు? ఆమె కోర్కె తీర్చవలయునన్నచో తాను సమర్థుడు కాడా? అందుచేత గురువుగారికి భార్యకోరిక తీర్చుటయందు నిష్ఠలేదు. ఆమె చాల కాలముగా అట్టి కోర్కెను సూచించుచు వచ్చినది. ఆయన యుపేక్షించుచు వచ్చినాడు. ఇప్పుడుకూడ ఉపేక్షాభావమే. ఆయన యుదాసీనుడు. ఏదో పిల్లవాడు గురుదక్షిణ యిచ్చుటకుబలాటపడుచున్నాడు పోనీ! నాకా కుండలములు తెచ్చిపెట్టును లెండు అని భార్య యన్నది. అది 'గురుపత్నీనియోగ' మన్నాడు నన్నయగారు. 'గురుహితకార్యధురంధరుండై గురుపత్నీనియోగ' మనుటలో ఈ సర్వమును భాసించుచున్నది.

వనములో ఒక్కడే పోవుచున్నాడట. ఒకడే అనియేవకారార్థమునకు ప్రయోజనమేమి? ఆగురువుగారు ఈ యడవిలో నీవొక్కడవు పోలేవన్నాడు. ఉదంకుడు 'అనాతంకమతి' భయములేదు నేనొకడనే పోగల్గుదున'న్నాడు. గురువుగారు సరేనన్నాడు. కాని ఇంద్రుని వాని వెనుక కాపు పంపినాడు మనపిల్లవాడున్నాడు. వాడు పొరుగూరు బయలుదేరినాడు. నాయనా నీవొక్కడవు పోలేవు. మనపాలెగాడు వచ్చును, వానిని తోడు పంపుదును. అందాక నుండుమన్నచో వాడుండడు. యౌవనదర్పమున వాడు బయలుదేరి పోవును. తరువాత పాలెగాడు వచ్చును. 'పిల్లవాడొక్కడేపోయెను! వానికి తోడుగా నీవు

పొమ్మని వానిని వెనుక బంపుదుము. ఈ 'యొక్కరుండ' అను యేవకారార్థము ఆ యీ పరిస్థితిని వ్యంగ్యము చేయుచున్నది. గురువుగారికి ఉదంకునియెడ మిక్కిలి ప్రేమ. తన శిష్యుడు సమర్థుడగునో కాదో పరీక్షింపవలయును. ఆయా ఘట్టములయందు వానికాపద గలిగినవాడు నిర్వహించుకోలేనప్పుడు వానికి సాయపడవలెను. ఇట్లు శిష్యుని పరీక్షించుట, సహాయపడుట కుండలములు తెచ్చుట కుదంకుడు బయలు దేరినప్పటినుండి తిరిగి నింటికి వచ్చువరకును కలిపి చేసినాడు పైలముని. కుండలములు తెచ్చిన తరువాత ఉదంకుని పైలుడు 'ఈ యున్న పౌష్య ప్రోలికి బోయి గడుంబెద్ద దవ్వు పోయిన యట్లత్యాయత విమల తపోమహిమా! యిన్ని దినంబు లేల మసలితి చెపుమా!' యని యడిగినాడు. ఇందు 'అత్యాయత విమల తపోమహిమా!' యనుటలో ఆక్షేపమున్నది. ఇంతగొప్ప తపస్విని. ఇక్కడనున్న పౌష్య పట్టణముపోయి ఇంతాలస్యము చేసితివేమని ఈ యాక్షేపమువలన ఉదంకుడు పడ్డ పాట్లన్నియు గురువుగారెరింగి నాడని మనకు తెలియుచున్నది. ఈ తెలియుట తరువాత ఉదంకు డడిగిన దివ్యపురుషుని యొక్కయు, నాగ లోకము యొక్కయు వృత్తాంతములను గురువుగారు వ్యాఖ్యానించి చెప్పుటచేత బలపడుచున్నది. ఆ వాఖ్యానంతరము గురువుగార న్నాడు కదా 'అది నింద్రుగాంచి యమృతాశివగుట నీ కభిమతార్థసిద్ధి యయ్యెనయ్య' యని- అందుచేత ఉదంకుడు చెప్పకపూర్వమే ఉదంకుని పడ్డపాట్లు, కుండలములు తెచ్చిన వైఖరి యంతయు గురువుగారికి తెలిసియేయున్నది. ఎట్లు తెలిసినది? ఆయన యజ్వ. ఇంద్రుడు, పర్జన్యుడు, అగ్ని ఆయనకు సఖులు. వారి నాయన ఉదంకుని పరీక్షించుటయందును, రక్షించుటయందును వినియోగించినాడు. ఆ పరీక్షణముగాని, రక్షణముగాని ఉదంకునికి తెలియునట్లు చేయరాదు. చేసినచో ఆ కుండలములు తానే తెచ్చిన సంతోషమును వా డనుభవింపలేడు. అందుచేత ఆ పురుషుడు దివ్యుడు. ఆ యైరావతము ఉక్షము ఆ అగ్ని తురంగము. ఇట్లు పూర్వాపరములను పర్యాలోచించుటవలన

ఆ యీ పరిస్థితియంతయు వ్యక్తమై కథయందు సంయోజిత మగుచున్నది. ఇంత గుర్వనుగ్రహము కలవా డగుటచేతనే 'జ్ఞానము వడసెను గురుదయ నణిమాదికాష్టగుణముల తోడన్.'

మరి 'పన్నిన' యన్నమాట యున్నది. ఇంత సాహసుడైన యుదంకుడు వృషభగోమయము తినుమన్న తినునా? తినునట్లు పన్నినాడట. ఉదంకున కా పురుషుడు కనిపించినాడు. సామాన్యుడుగా కన్పించలేదు. దివ్యుడుగా కన్పించినాడు. ఉదంకు డాతనికినమస్కరించినాడు. ఆ దివ్యపురుషు డతనిని సర్వకార్యసిద్ధిరస్తని దీవించినాడు. నీకేమి కావలయునో కోరుకొమ్మన్నాడు. అప్రతిహతముగా నేను పోవు కార్యము సిద్ధించవలె నన్నా డుదంకుడు. దివ్యపురుషుడు 'ఐనచో ఈ వృషభ గోమయ భక్షణము సేయుము' అన్నాడు. ఉదంకుడు సంకోచించినాడు. తినుటయా? తినకపోవుటయా? తన యెదుటనున్న పురుషుడు దివ్యుడే. సందేహములేదు. తన యంతరాత్మ దివ్యుడని చెప్పుచున్నది. మరి ఆతడాజ్ఞాపించినట్లు చేయకపోయినచో తన కార్యము విఘటితమగునేమో! ప్రథమముననే పూజ్య పూజావ్యతిక్రమమేల చేయవలయును? ఈ గోమయము భక్షించుటవలన తనకేదైన పాపము వచ్చినచో తన తపస్సుచేత పరిహరించుకొనవచ్చును. అందుచేత కార్యమతియై వృషభగోమయ భక్షణము చేసినాడు. ఉదంకుని యొక్క కార్యదీక్ష యెట్టిదో పరీక్షించుట యొకటి. అతనికి తెలియకుండ యమృతము తినిపించుట యొకటి. ఇది వెనుకనుండి గురువుగారు చేయుచున్న పని. ఈ యంతయు 'పన్నిన' యనుటలో వ్యక్తమగుచున్నది.

ఉదంకుడు పౌష్యుని యొద్దకు పోయి కుండలములు కోరినాడు. గుర్వర్థమై వచ్చితినన్నాడు. అతడడుగగనే పౌష్యు డియ్యవలయునా? ఆత డీకుండలములు తీసికొనుట కర్హుడో? కాదో? అందుచేత తా నతనిని పరీక్షింపవలయును. తా నతనిని పరీక్షించుచున్నట్లత డెరింగినచో శపించవచ్చును. మరి యదిగాక యతనిని చూడగనే పౌష్యుడు

'గుర్వర్థమువచ్చిన మహాత్ముఁడు ఇతనికీగాంచితి కృతార్థుఁడనైతి' నని మనంబున సంతసిల్లినాఁడు. మనంబున సంతసిల్లనేల? అతఁడు నిజముగా మహాత్ముఁడైనప్పుడే ఆ కుండలము లతఁడు పుచ్చుకొనఁగలఁడు. ఈతని మాహాత్మ్యము పరీక్షించి మహాత్ముఁడైనచో నే నా కుండలము లిచ్చుటవలన కృతార్థుఁడవగుదును అని మనస్సులో ననుకొన్నాఁడన్న మాట. ఆయన మాహాత్మ్యమునందు తనకు సందేహము లేనిచో పౌష్యుఁడు పైకే సంతోషించి యుండును. తానే కుండలములు తీసికొనివచ్చి ఇచ్చియుండును. అందుచేతనన్నాఁడు కదా 'అయ్యా, మదీయ ధర్మపత్ని యక్కుండలంబులు తొడుగ నవసరంబై యున్నయది. మద్వచనంబున వాని నిప్పించుకొమ్మన్నాఁడు. ఇప్పించు కొమ్మనుటలో నున్నది సొగసు. ఇప్పించుకొనుట యనఁగా ఆమె యిచ్చునట్లు చేసికొనుట. ఆమె యిచ్చుటకుదంకుని యందర్హత్వమున్నప్పుడే యది పొసగును ఉదంకుఁడు అంతఃపురములోనికి పోయి తిరిగివచ్చి ఆమె కన్పించలేదనిచెప్పినాఁడు. మరియిప్పుడు ఉదంకుఁడు అపవిత్రుఁడని తేలినది. కాని యిప్పటికిని నీ వపవిత్రుఁడవని రాజు నోటితోననలేదు. నోటితోననకుండ నన్నాఁడు. ఆ యపవిత్రత శాశ్వతమో తాత్కాలికమో ఎట్లు తెలియును? అందుచేత ఏమయ్యా! నీవుచూడఁగా త్రిభువనపావనుని వలె కన్పించుచున్నావు. ని న్నశుచి వని యెట్లందును? ఆమె యశుచులకు కన్పించదన్నాఁడు. ఇందుచేత పౌష్యుఁడుదంకుని యొక్క దానార్హతను పరీక్షించుటకే ఇట్లు చేసినాఁడని తెల్లమగుచున్నది. తరువాత యుదంకుఁడు వృషభగోమయ భక్షణంబున నైన యశుచి భావమును పరిహరించుకొని పౌష్యదేవి నుండి కుండలములు పుచ్చుకొన్నాఁడు. ఆమె ఉదంకునకు తక్షకుని గురించి చెప్పినది: వాఁడా కుండలము లపేక్షించుచునుండును. వాఁడభేద్యుఁడు, మాయావదకుఁడు, జాగ్రత్త, యని. అనిన యుదంకుఁ డట్లు చేయుదు నన్నాఁడు. 'అట్లచేయుదు' ననుటలో ఉదంకుని యొక్క అజాగ్రత్త యంతయు లెక్కలేనితనమంతయు వ్యంజితమగుచున్నది.

పౌష్యు డుదంకుని భోజనముచేసి పొమ్మన్నాడు. అన్నము కేశదుష్టం బైనది ఉదంకుడలిగి 'ఇట్లపరీక్షితంబైన అశుద్ధాన్నంబు పెట్టినవాడ వంధుండవగుమని శాపంబిచ్చెను. 'అంధుండవగుమని శాపమిచ్చు టేల ? అపరీక్షితమైన అన్నముపెట్టుటవలన. అపరీక్షితంబైన యను మాటలో శాపమునకు కారణము సంగృహీతమైనది. ఆ యన్నమునం దాదోషమున్నదని చూడని తప్పున్నది. అందుచేత అంధుడవగుమని శాపము. అశుద్ధాన్నము పెట్టుటలో కన్నంధముగా ప్రవర్తించినది. కావున ఆ యంధత శాపమును పురస్కరించుకొని వ్యక్తమైనది. అపరీక్షితమైన మాటలో ఈ యర్థమునంతయు సంగ్రహించినాడు. నన్నయ గారు. మన పౌష్యుడు 'అల్పదోషంబున నాకు శాపంబిచ్చినవాడవు నీవనపత్యుండ'వగుమని ప్రతిశాపంబిచ్చెను. పై అపరీక్షితమను మాట యెట్టిదో ఇచ్చట అల్పదోషంబనుమాట యట్టిది. పిల్లలుకలవాడు చిన్నతప్పును లక్ష్యపెట్టడుకదా? ఉదంకుడు తా ననపత్యుడు కాలేడు. శాపము క్రమ్మరింపుమని పౌష్యుడు నడిగినాడు. తాను క్షత్రియుడు కావున శాపమును క్రమ్మరింపలేనన్నాడు. ఆతనిచే ప్రార్థితుడై ఉదంకు డతని శాపమును క్రమ్మరించి తిరిగిపోవుచు 'గురుపత్నికి' కుండలంబు లీగంటినని మనంబున సంతోషించి చనువాడు' ఒక చెరువువద్ద తన చేతనున్న కుండలంబులుపెట్టి ఆచమించుచుండగా తక్షకుడు వచ్చి ఆకుండలము లెత్తుకొని పోయెను.

పౌష్యాదేవి తక్షకునిగురించి ఉదంకుని హెచ్చరించి యున్నది గదా! ఉదంకు డాకుండలములచ్చట పెట్టనేల? దానికి 'గురుపత్నికి లీగంటినని మనంబున సంతోషించువాడు' అనుటలో చమత్కారమైన సమాధానము నిమిడ్చినాడు. నన్నయ గారు. కుండలములచేతగొని ఉదంకుడు వచ్చుచున్నాడు. ఆ కుండలములు తీసికొనిపోయి తన గురుపత్నికిచ్చినట్లే సంతోషించినాడు. 'ఈగంటి' ననగా ఇచ్చుట తనకు కలిగినది. తనజన్మ చరితార్థమైన దన్నమాట. ఆ సంతోష పారవశ్యమునందు తక్షకునిమాట మరచి పోయినాడని వ్యంగ్యము. తక్షకుడు వెనుకనే యున్నాడు. వాడు

నగ్న వేషధరుడై ఆకుండలములనుగొని పారిపోయినాడు. ఉదంకుడు వానిని వెనుదవిరి పట్టుకొన్నాడు. వాడు దిగంబర వేషము వదలి నిజరూపముతో నాగలోకమునకు పోయినాడు. ఉదంకుడు కూడ నాగ లోకమునకు పోయినాడు. అక్కడ నాగపతులనందరిని స్తుతించినాడు. నన్నయగారి ఈ నాగ స్తుతి పద్యములు ఆంధ్ర సాహిత్యము నందు మిక్కిలి ప్రసిద్ధము లైనవి. ఈ పద్యముల యందున్న నన్నయగారి పద్యరచనాశిల్పము, భాషాప్రభుత్వము జగన్నాథముగా నున్నవి. ఇచ్చట వ్యాఖ్యాతమగు వంశము వాసికంటె వేరు. ఈపద్యములందలి నన్నయగారు అనంతమైన లోకజ్ఞత వ్యాఖ్యానింపబడు చున్నది. ఉదంకుడు వరుసగా శేషుని. వాసుకిని, ఐరావతాదులను, తక్షకుని స్తుతించెను. ఈ స్తుతి పైకి స్తుతి. లోపల నింద. ఇట్టి నిందాగర్భమగు స్తుతి నాన్యతో దర్శనీయము. మొదటి పద్యము నందు 'దుష్కృ తాంతకుడు' అన్నమాట, రెండవ పద్యమునందు 'అమరారుల బాధలు వొందకుండగా' భూషణం అయిన' అను రెండు మాటలు, మూడవ పద్యమునందు మొదటి మూడు చరణములు, నాల్గవపద్యము పద్య మంతయు క్రమముగా అధికనిందావ్యంజకములు. ఇచ్చటి పరిస్థితి యిట్టిది. ఒక యింటిలో పదిమంది యన్నదమ్ములున్నారు. పెద్దవా డూరికి పెత్తనదారు. రెండవవా డిల్లు దిద్దుకొనిపోవును. తక్కిన యెనమండుగురున్నారు. వ రికేమియు పనిలేదు. వట్టి అగ్రహారపు బడితలు. అందులో వొకడు మన పిల్లవానిని కొట్టుటయో వానిచేతిలో తినుబండారము లాగికొని పోవుటయో చేసినాడు. ఆ యేడ్చుచున్న మన పిల్లవానిని వెంటబెట్టుకొని మనము పెద్దవాని దగ్గరకుపోయి ఏ మందుము ? ఏమయ్యా ! ఈ గ్రామ మంతయు నీవు మోయుచుంటివి. ఎవ్వరైన ఏదైన తప్పు చేసినచో చెప్పగలవాడవు. మరి నీతమ్ము డేమి చేసెనో చూసితివా యందుము. అంతకంటె నెక్కువ యనము. దీనిలో వ్యంగ్య మేమి ? నీ పెత్తనము పేలాలు వేగినట్లున్నదిలే యని. నన్నయగారి మొదటి పద్యమునందలి దుష్కృ

తాంతక శబ్ద మట్టిది. సీతమ్మ డీదుష్కృతము చేసినాడు. దానిని నీ వంతము చేయవలయును. లేనినాడు నీ ప్రతిష్ఠ యేమగునో చూచి కొమ్మని బెదరింపు. ఇల్లుదిద్దికొనిపోవు రెండవ వాడున్నాడు. అతనితో నేమందుము ? ఆ యింటికి సంబంధించిన తత్పూర్వపు సంఘటన మేదియో ప్రస్తావించి ఫలానా వాడు మీకపకారము చేసినప్పుడు నీవు వారిని రక్షించుకొనుట కెన్ని పాట్లు పడితివో గుర్తులేదా? మరి మీ పిల్లలితరుల కపకారము చేయుచున్నప్పు డూరకుందు వేమి ? అందుము. ఈ యనుట లోకములో వ్యంగ్యముగా ననవచ్చును. వాచ్యముగా నన వచ్చును. కవిత్వమునందు మాత్రము వ్యంగ్యముగానే యనవలయును. అందుచేత 'అరిది తపో విభూతి నమరారుల బాధలు వొందకుండగా నురగుల నెల్ల కాచిన మహోరగ నాయకు' డన్నాడు. మీ వారిని బాధలనుండి కాపాడుకొంటివి. మీవారు కూడ బాధలు చేయకుండ చూచు బాధ్యత నీ యందున్నది అని వ్యంగ్యము. మరి నీ వెట్టివాడవు? 'అద్రి నందనేశ్వరునకు భూషణమ'వు. ఆ అద్రి నందనేశ్వరు డెట్టివాడు? 'ఆనమత్సురాసుర మకుటాగ్ర రత్న రుచి శోభిత పాదుడు'. దేవరాక్షసుల శిరో భూషణము లాయనకు పాద పాదభూషణములైనను కావు. అట్టివానికి నీవు భూషణమవు. మీ తమ్ముడు భూషణ మపహరించుటయేమి ? నీ కెంత యప్రతిష్ఠయో చూడుమని వ్యంగ్యము. ఇట్లు బాధ్యులైన యిద్దరన్నదమ్ముల యొద్ద వారి ప్రయోజకత్వమును పరామర్శించి వారి యింటి యం దెంత వ్యర్థుడు పుట్టెనో పరమ వ్యంగ్యముగా చెప్పినాడు నన్నయగారు. తరువాత పిల్లవానిని తీసికొని యింటికి వచ్చుచున్నాము. త్రోవలో వీధి మలుపు తిరిగినచోట అగ్రహారపు బడితలందరు కూర్చొని యున్నారు. కాని పిల్లవానిని కొట్టినవా డచ్చట లేడు. ప్రసక్తానుప్రసక్తముగా వారితోకూడ చెప్పుదుము. నాయనా ! మీరు చాల పరాక్రమవంతులు. బలశాలురు, మీకు కోపము వచ్చినచో ఫాలాక్షు డెదురలేడు మీరంతా మహానుభావులురా! మేమేదో బక్కవారము.

మాపిల్లవానిజోలి మీాపాని కెందుకురా అందుము ఇచ్చట విపరీత లక్షణ. అనగా అన్నమాటలకు వ్యతిరేకార్థము భాసించుట. మొదటి మూడు చరణము లిట్టి విపరీత లక్షణ 'దేవమనుష్య లోకముల త్రిమ్మరుచున్'- మీా కేమియు పనిలేదు. మీారు తిరుగని చోటులేదు. అని యర్థము. 'విపుల ప్రతాప సంభావిత శక్తిశౌర్యులు' ప్రతాపమనగా ఇతరులను నొప్పించుట యని యర్థము. అది విపులమైనది. బాగుగా మీారు ఇతరులకు చేయు నపకారము వలన మీా శక్తిశౌర్యములు తెలిసికొనవలయునుగాని ఉపకారము చేయుటవలనగాదు. 'అపార విషోత్కట కోప విస్ఫురత్పావక తాపితాఖిల విపక్షులునైన మహానుభావులు'. ఇచ్చట 'అపార...విపక్షులు', 'మహానుభావులు' రెండును సంస్కృత సమాసములే, మధ్య ఐన అని రెంటిని అతికినాడు. ఈ ఐన లేకుండ ఈ మహానుభావశబ్దమును విపక్షశబ్దముతో కలిపి ఏకసమాసము చేయ వచ్చునుగదా!"... తాపితాఖిల విపక్షా స్తేచ మహానుభావాశ్చ తాపితాఖిల విపక్ష మహానుభావాః" అని ద్వంద్వము చేయవచ్చును. ఇట్లు ద్వంద్వము చేయక ఈ రెండు సంస్కృత సమాసములను వ్యస్తము చేసి మధ్య 'ఐన' అను అవ్యయముతో అతుకుటలో నున్నది విశేష మంతయును. ఎందుచేతననగా మహానుభావ శబ్దమునకు సంస్కృతము నందింత యాక్షేప వ్యంజ్యకతలేదు. తెనుగునందు మాత్రము 'నీ వెక్కడలేరా! మహానుభావుడవు' అన్న ప్రయోగములందు మాత్రమే మహానుభావశబ్దమునకు ఆక్షేప వ్యంజ్యకతయున్నది. తాదృశ్య వ్యంజకత్వము దానియందు సంగ్రహించుటకు వ్యస్తముగా వాడినాడు నన్నయగారు. 'ఐన' అను అవ్యయము యీా మహానుభావశబ్దమునందున్న వ్యంజ్యకతను తీక్ష్ణతరము చేయుచున్నది. మరియును ఐన అను అవ్యయములో పూర్వసమాసము తయు అంగభూతమై పర్యవసించుచున్నది. వారి కోసము మండుచున్న అగ్ని. దానికితోడు వారి విషము అట్టి కోపాగ్నిచేత శత్రువులందరు దహింపబడుచున్నారు. మరి మీా రటువంటి మహానుభావులు. అనగా అంత దుర్మార్గులు.

మీరు నాకు ప్రసన్నులు కాక కోపగించినచో నేనాగగలనా అని వ్యంగ్యము. ఈ సర్వమును విన యను అతుకుముక్కలో పెట్టినాడు. నాల్గవపద్య మంతయు బల్లెములతో క్రుమ్మెట.

'గోత్రమహామహీధర నికుంజములన్ విపినంబులన్ కురు
క్షేత్రమునన్ ప్రకామగతి ఖేలననొప్పి సహాశ్వసేనుడై
ధాత్రి పరిభ్రమించు బలదర్ప పరాక్రమ దక్షు డీక్షణ
శ్రోత్ర విభుండు తక్షకుడుశూరుడు మాకు ప్రసన్నడయ్యెడున్".

తక్షకుడు కులపర్వతము లందలి పొదలలో, అరణ్యములలో, కురుక్షేత్రములో తిరుగుచుండును. ఆ కురుక్షేత్రము పెద్ద యుద్ధభూమి శ్మశానముగా మారినది. దొంగ లెచ్చట నుందురు? కొండలలో, అడవులలో, శ్మశానములలో. 'ప్రకామగతి ఖేలననొప్పి'- వేషములు వేసికొని తిరుగుదురని. ఇది దొంగలక్షణమే. 'సహాశ్వసేనుడై'— నీకు తోడు నీ కొడుకును గూడ తయారు చేయుచుంటివి. 'ధాత్రి— దక్షుడు'— ఉన్న చోట ఉండవు. నీ బలము నీ పరాక్రమము నీ దక్షత అడుగనా ? 'శూరుడు'.. నీ శౌర్యమేమని చెప్పుదును, పట్టుకొనగా పారిపోయివచ్చితివని.'ఈక్షణ శ్రోత్ర విభుండు'—ఆమె నాకుకుండలము లిచ్చుచుండగా, నిన్ను గురించి హెచ్చరించుచుండగా నీ వెప్పుడు చూచితివిరా? యని. ఈ సర్వార్థమును ప్రసన్నమయ్యెడున్ అని ప్రతి పద్యము నందున్న క్రియావాచకముచేత వ్యంగ్యమగుచున్నది. ప్రసన్నుడగుట యెందుకు? మనయందేదో వాని కాగ్రహమువచ్చినది. ఆ యాగ్రహమునకు మనము కారణముకాదు. ఆ వెనుకటి పరిస్థితి యంతయు సువిచారితమై ఈ మాటచేత ఆ యా యర్థములు భాసించును. పరిస్థితిని బట్టి మాటల కర్థము మారుచుండును.

ఉదంకుని స్తుతికి వారెవ్వరును ప్రసన్నులు కాలేదు. ఉదంకుని కేమియుతోచలేదు. ఎట్లా యని విచారించుచు వీథులందు దిరుగు

చున్నాడు. అచ్చట 'సితాసితతంతుసంతాన పటవయనము', 'ద్వాద శారచక్ర పరివర్తనము' చూచినాడు. అతిప్రమాణ తురగారూఢుడైన దివ్యపురుషుని చూచి ఆయనను స్తుతించినాడు. ఆ స్తుతి నాగపతులను చేసిన స్తుతివంటిది కాదు. నాగపతులను చేసిన స్తుతియంతయు నింద యని సూచించుటకై స్తుతికి ముందు 'నిట్లని స్తుతియించె' అనియు, తరువాత 'అనియిట్లునాగ కులంబు నెల్ల స్తుతియించి' యనియు వ్రాసి నాడు నన్నయగారు. మరి దివ్యపురుషుని 'అతిభక్తి యుక్తుండై' స్తుతియించినాడట. ఉద్దిష్టార్థమును సూచించుటకై అచ్చట నట్లును ఇచ్చట నిట్లును వ్రాయుట.

పర్జన్యుడు, అగ్ని దివ్యపురుష తురంగములై కన్పించుట వెనుకనుండి గురువుగారు చేసిన పనియే. అశ్వకర్ణరంధ్రధ్మానము సేయుమనుట వృషభ గోమయ భక్షణము సేయుమనుటవంటిదే. మరి 'పన్నిన' అని ఎందుకు వ్రాయలేదిచ్చట? ఇచ్చట నుదంకుడు ఆయ నను స్తుతించుట. ఆయన కోరిక కోరుకొమ్మనుట, ఈ నాగకులమెల్ల నాకు వశము కావలయునని యుదంకుడు కోరుట వ్రాసియే తీరవల యును. ఆ పర్జన్యుడు ఇతనిచేత కోరించలేదు. ఆ పరిస్థితియే ఉదంకు నట్లు చేసినది. కావున ఉదంకునకు పన్ననక్కరలేదు. ఈపరీక్ష ఉదంకు నకు సహజముగా ప్రాప్తించినది. ఆ తరువాత అశ్వవర్ణమునుండి అగ్నులు బయలుదేరుట, తక్షకుడు భయపడి కుండలము లర్పించుట జరిగినది.

తరువాత దివ్యపురుషు డిచ్చిన తురంగమునెక్కి ఉదంకు డిల్లు చేరుకొన్నాడు. గురుపత్నికి కుండలము లిచ్చినాడు. గురువుగా రతనిని పరిహాసించి ప్రశ్నింపించుకొని సమాధానమును చెప్పినాడు. 'ఆది నింద్రుగాంచి అమృతాశి వగుట నీ కభిమతార్థ సిద్ధిమయ్యెనయ్య' అన్నాడు. దీనిలో తానుచేసిన సహాయము సూచించుట యున్నది. ఉదంకుడు దేవతా ప్రసాదము నందినట్టి భాగ్యవంతుడని చెప్పుట యున్నది. 'కర మిష్టము చేసితి మా కరిసూదన దీన నీకు నగు సత్ఫలముల్, గురుకార్య నిరతులగు సత్పురుషుల కగుటరుదె యధిక

పుణ్యాఫలంబుల్ ?' అన్నాడు. కరమిష్టము సేయుట యేమి ? తా నుదాసీనుడు గదా ? తనకిష్టము సేయుట యనగా? దీనికి మొట్టమొదట 'గురుహిత కార్యధురంధరుండై' అని ప్రారంభమునందు చెప్పి దానిని గురువుగారి నోటన్ 'కరమిష్టము చేసితి' వని ఉపసంహారము చేసినాడు. తా నుదాసీనుడైనను గురువుగారికి ప్రీతికల్గించుటకై ఉదంకుడు బయలు దేరినాడు గదా! ఆ ప్రయత్నమునం దెన్నియో కష్టములు పడినాడు. గురువుగారు సంతసించిన దతని శ్రద్ధకు. 'నీవలన పరమ సంప్రీత హృదయుండనైతి' నన్నాడు. మరి 'అరిసూదన' అనికూడ సంబోధించి నాడు. తక్షకుడు స్తుతికి లొంగలేదు. వానిని నెత్తినమొట్టి కుండల ములు పుచ్చుకొంటివని, మరియు రాబోవు సర్పయాగమున కుదంకుని ప్రేరేపించుట యొకటి ఈ సంబోధనమందు చున్నది.

'ఉదంకు డనేక కాలము సపస్సుచేసి తక్షకుడు చేసిన యపకా రంబునకుం బ్రతికారంబు చేయ జించింతి యొక్కనాడు జనమేజయు పాలికిం బోయి యిట్లనియె'. తక్షకుడుచేసిన యపకారమునకు ఇంత కాల మేల యుదంకు డూరుకొనవలయును? జనమేజయు పాలికెందుకు పోవలయుననగా ఇంత కాలమువరకును తక్షకుని సాధించుట కనుసైన యుపాయ ముదంకునకు దొరుకలేదు. చాలకాలము గడచిన తరువాత తక్షకుడు పరిక్షిత్తును చంపుట జరిగినది. ఉదంకునకు తక్షకుని శిక్షించుట కిది మంచియదను, అందుచేత జనమేజయునివద్దకు వెళ్ళినాడు. తానే వానికి ప్రత్యపకారము చేయరాదాయన్నచో దీనికి రెండుసమాధాన ములున్నవి. ఒకటి లోకమునం దెంత శత్రుత్వమున్నను ఏదియో నెపము దొరికినగాని వానిని సాధింప బ్రయత్నింపము. ఆ నెపము కొఱకై యుదంకు డింతకాలము వేచియుండెను. రెండవది తనంతట తాను దండించుట బ్రాహ్మణ ధర్మముకాదు. అపరాధిని దండించుట రాజధర్మము. తనకు చేసిన యపరాధమున్ననో అది మరణదండనము చేయదగినదికాదు వాడు మరణదండనము చేయదగినంత అపరాధము చేసినప్పుడు తనకుచేసిన అపకారముకూడ దానికితోడై వాని నధిక

శిష్యపాత్రుని చేయవచ్చును. అందుచేత జనమేజయుని పాలికి ఉదంకుడేగినాడు.

తరువాత నాలుగు పద్యములలో ఉదంకుడు జనమేజయునకు సర్పయాగబుద్ధి పుట్టించినాడు. ఉదంకుడు జనమేజయునితో నీ మాట్లాడు వైఖరి మిక్కిలి యపూర్వమైనది. బహువిషయ పరిజ్ఞానము, అనంతమైన లోకజ్ఞత, వచోదక్షత, సూక్ష్మసూక్ష్మతర మనఃపరివర్తనా పరిశీలన మున్నగాని ఇట్లు వ్రాయుట సంభవముకాదు. ఉదంకుడొక్కొక్కమాటయనును. అది జనమేజయునిమనస్సు నందెట్టి ప్రభావము కలిగించెనో పరిశీలించును. దానిపైనవచ్చు ప్రశ్నలను పరామర్శించి సమాధానము చెప్పును. ఆ జనమేజయుడు రాజుగదా! ఆయన ఎదుటివాడు చెప్పునది ఊరక ఊకొట్టి వినునంతే. వ్యతిరేకముగా వాదించుట రాజమర్యాదకాదు. ఈసంగతి ఎరింగినవా డుదంకుడు. అందుచేత తనమాటలపైన జన మేజయునకు కలిగెడు శంకలను పరామర్శించును జనమేజయునకు సర్పయాగమునందు నిశ్చయము పుట్టునట్లు మాట్లాడినా డుదంకుడు. 'మితహిత సత్యవాక్య! జనమేజయ! భూజనవంద్య!' అని సంబుద్ధి. నీవు మితముగా మాట్లాడెదవు. అనగా ఇప్పుడు నేను చెప్పిన పనిని చేయుదునని చెప్పుదువు అన్నమాట! ఊరక చెప్పుటకాదు, 'సత్యవాక్య' చేయుదువుకూడ. 'భూజనవంద్య!' సర్వజనులును నీధర్మపాలనమును మెచ్చుకొనుచున్నారని స్తుతి. నేను గురుదేవకార్యములు చేయుచుండగా ఈ తక్షకుడు 'అకారణము నాకపకారము' సేసెను. అకారణముగా అపకారమెందుకు చేసెనని ప్రశ్న అతికుటిల స్వభావుడని సమాధానము, 'పరాత్మ విశేష వివేకశూన్యుడై!' నేను తపోదాన యజనశీలుడను. నా తన యంతరము గమనించడు అన్నాడు. జనమేజయుడు మాటాడలేదు. జనమేజయునకు రావలసినంత కోపము రాలేదు. మరల ఉదంకు డనుచున్నాడు. నా కపకారము చేయుటయే కాదు. నీ తండ్రి పరీక్షిత్తును చంపినాడు.

ఆయన యెట్టివాడు ? నిరంతర దానయజనశీలుడు, ప్రజారంజకుడు, అర్జునితో సమానుడు, అతిదాంతుడు మరి వాడో 'భుజగజాల్ముడు' వట్టి చెడుపురుగు అన్నమాట. పోనీ ఆచంపుట ఏమైన గౌరవముగా చంపినాడా? 'అసహ్య విషోగ్ర ధూమకేతన హతిజేసి' 'కృతాంత నికేతనాతిథిని' చేసినాడు. విషాగ్నివల్ల చంపినాడు. విషదగ్ధుడగుట నీ తండ్రి కృతాంత నికేతనాతిథియైనాడు. అనగా నరకమునకు పోయి నాడు. జనమేజయుని ముఖమున కోపము కన్పించినది. ఈ తక్షకుడు ఈ బ్రాహ్మణుని కపకారము చేసినాడు. మా తండ్రిని చంపినాడు. వీనివల్ల మా తండ్రి నరకమునకు పోయెను. నిజమే, వీడు చెడుపురుగే. కా॥ ఆ చంపుట వాడు తనంత చంపినాడా? ఎవడో యొక బ్రాహ్మణుని శాపమునకు వశుడై చంపినాడుగదా! ఈ భావము జనమేజయుని ముఖమునందు చదివినాడుదంకుడు. మరల ఉదంకు డగుచున్నాడు. అవునయ్యా! ఎవడో యొక బ్రాహ్మణుడు సంబోధించినంత మాత్రము చేత తాను కాదనకూడదా? ఇక్కడ 'కాదనక' అన్నదానికి అర్థమే మనగా ఆ బ్రాహ్మణ ప్రేరేపణమును తిరస్కరింపక, ఈపని చేయ కూడదని మనసులో విచారింపక అని యర్థము. ఆ బ్రాహ్మణుల పిల్ల వాడేదో కోపముతో తిట్టినచో తాను పోయి కరువవలెనా? తనకు యుక్తాయుక్త విచారమక్కరలేదా యని. మరి వాడు ఒక్క బ్రాహ్మ ణుని పిలుపుచేత ఇంత యపకారమును చేసినాడు. గూఢముగా చేసి నాడు. అని 'యిట్టిపాటి యపకారము' అన్నాడు. వాడు భుజ గజాల్మకుడు. నీవో 'నృపపుంగవుడవు'. అనేక బ్రాహ్మణుల ముఖమున సర్పములను భస్మము సేయుము. వాడు విషాగ్నిచేత చంపినాడు. నీవు సర్పయాగము చేసి యాగాగ్నియందు సర్పములను భస్మము చేయుము వాడు చంపిన పాప మా బ్రాహ్మణునిదైనచో ఈసర్పము లను భస్మముచేసిన పాపము కూడ బ్రాహ్మణులకే పోవును. నీకేమి? అందుచేత సర్పయాగము చేయుము. అన్నాడు. జనమేజయునకు తక్షకుని శిక్షింపవలయునని నిశ్చయము కలిగినది. వాడు బ్రాహ్మణుని

పిలుపు నెపము పెట్టి యపకరించెను. మనము బ్రాహ్మణుల పిలుపు నెపము పెట్టి శిక్షింపవచ్చును. కాని... అని మరల జనమేజయుని ముఖమున శంక ముడిపడ్డది. ఏమయ్యా! ఈ యుదంకుడు తక్షకుని శిక్షించుమన్న చో బాగుండును. వా డపరాధి యన్నది నిజమే. వాని మూలముగా సర్పకుల ప్రళయము సేయు మను టేమి? ఇదియేమి న్యాయము? అని, ఉదంకు డీ శంకను చదివి వెంటనే యన్నడు కదా!

'ప్రల్లదుడైనయొక్క కులపాంసను చేసినదాన దత్కులం బెల్లను దూషితంబగుట యేమి యపూర్వము? గావునన్ మహీవల్లభ! తక్షకాధము నెపంబున సర్పములెల్ల నగ్నిలో ద్రెళ్ళగ సర్పయాగ మతిధీయుత! సేయుము విప్రనన్నిధిన్'. అన్నాడు. 'ప్రల్లదుడైన... యపూర్వము?' ఎవడో ఒక కులపాం యున్నాడు. వాడేను మహాదోష రాధము చేసినాడు. వాని యపరాధమున వాని కులమంతయు నాశన మగుట యేమి క్రొత్తయా? క్రొత్తయా యనగా ఇది పూర్వము జరిగినదే. ఆలోచించుకొమ్మన్నమాట. ఆలోచించుకొన్నాడు. జనమే జయుడు. ఆ ప్రల్లదుడైన కులపాంసనుడెవడు? వాడేమి చేసినాడు? ఆ ప్రల్లదుడు ఆ కులపాంసనుడు దుర్యోధనుడు. వాడు ద్రౌపది నవమానించినాడు. ఆ యవమానమునకు వాని వంశము నాశనమైనది. ఆ నాశనముచేసిన దెవరు? తన ముత్తాత. ధర్మరాజు. అవునయ్యా! నీ ముత్తాత ధర్మరాజంతటివాడు తన భార్య నవమానింపగా ఆ దుర్యో ధనుని కారణముగా వాని వంశమును నాశనముచేయలేదా? అన్న భావము 'ఏమి యపూర్వ' మనుటలో ప్రత్యాయిత మగుచున్నది. ఈ ప్రత్యాయితమైన భారతకథావృత్తాంతము తరువాతి పద్యమునందు కారణమగుచున్నది. 'కావునన్' అనగా ఒక్క దుర్యోధనుడుచేసిన ద్రౌపద్యవమానమువలన ధర్మరాజు వాని వంశమును నాశనము చేసి నాడుకాబట్టి మహీవల్లభ! నీవు రాజవు. నీవుకూడ కులధర్మము నను సరించవలయునుసుమా! అందుచేత సర్పయాగము చేయమన్నాడు ఈ యర్థమును జనమేజయుని ముఖమునందు చూచినవాడు కావుననే

'అతిథీయుత' యని సంబోధించినాడు. మరి పైన సామాన్యాకార ముగా కారణ సంగ్రహ మేలచేయవలయును ? విశేషాకారముగా ధర్మరాజు దుర్యోధనుని కారణమున వాని కులమును నాశనముచేసి నాడు గదా యని యెందుకు చెప్పరాదన్నచో జనమేజయుడు రాజు, ఆ రాజవంశపు స్త్రీకి జరిగిన యవమానమును పరామర్శించి వాచ్య ముగా చెప్పుట ఉదంకున కుచితముగాదు. అది తెలియక జనమేజయు నకు సర్పయాగము చేయవలయునను నిశ్చయము కలుగదు. అందు చేత దానిని జనమేజయుడు గ్రహించునట్లు చెప్పక చెప్పవలయును. దానిని స్ఫురింపజేయుట కితరమార్గము లవలంబించినచో ఆ స్ఫురణ యంత స్పష్టముగా భాసించదు. అందుచేత అప్రస్తుత ప్రశంసాముఖ మున ఏతదాకారక స్ఫురణము కలిగించుట పరమోత్తమమైనది. సాదృశ్యముఖమున ప్రస్తుతమును స్ఫురింపజేయుట కిచ్చట వీలులేదు. ఎందుచేతననగా ఆ సాదృశ్యమునందుకూడ కారణత్వముచెందు బలమున్నదికాబట్టి. అందుచేత భారత వృత్తాంతమే స్ఫురింపవలయును. స్ఫురించినగాని కార్యకారి కాదు. అందుచేత సామాన్యరూపమైన అప్రస్తుత ప్రసంసాముఖమున విశేషరూపమైన భారత వృత్తాంతమును ప్రత్యాయితమొనర్చి దానిని సర్పయాగ సమర్థమునకై వినియోగిం చినాడుదంకుడు. కాబట్టి కారణత్వము సంగృహీతమైనది. వాచ్య మైన సామాన్యమునందుకాదు. వ్యంగ్యమైన భారత వృత్తాంతము నందు. అప్రస్తుతాలంకారముఖమున కావ్యలింగాలంకారము ధ్వనించుచున్నది.

ఇచ్చట ఇంకొక విశేషమున్నది. సర్పయాగము ఆస్తీకుని వలన మధ్యలో విఘటితమైనదిగదా! దానికి హేతువేమి ? ఒక కార్యము సఫలమగుటయో విఫలమగుటయో దానిబీజము నందుం డును. ఇచ్చట సర్పయాగ రూపకార్యమునకు జనమేజయ గతమైన తద్బుద్ధి బీజము. సర్పయాగము విఘటితమగుటకు కారణ సామగ్రి జనమేజయుని సంకల్పమునం దుండవలయు నన్నమాట, జనమే

జయునకు భారతకథ సామాన్యాకారముగనే తెలియునుగాని విశేషా కారముగ తెలియదు. ఎప్పుడు ఆతని మనస్సునం దుదంకు డుదాహ రించిన అప్రస్తుత వాక్యము వలన భారత కథ మెరసినదో అప్పుడా తనికి భారత కథా సర్వమును విశేషాకారమున నెరుంగవలయునని కోర్కె గలిగినది కాబట్టి ఉదంకుని యీ వాక్య మేక కాలమున జనమే జయుని మనస్సునందు భారత కథా శ్రవణబుద్ధి, సర్పయాగబుద్ధి రెంటిని పుట్టించినది. సర్పయాగ బుద్ధికి భారత కథా శ్రవణ బుద్ధికంటు కట్టినా డుదంకుడు. ఇవి రెండును కలిసి కొంతవరకే యభివృద్ధిచెందును. తరుణము నందు దేనిదో యొకదాని తల నరుకవలయును. ఆ స్త్రీకుడు వచ్చి సర్పయాగమును సరికెను. అంతవరకు నణగిపడియున్న భారత కథా శ్రవణబుద్ధి జనమేజయుని మనసునల్లుకొన్నది. వెంటనే భారత మును చెప్పుమని జనమేజయుడు వేదవ్యాసు నర్థించినాడు. జనమే జయుడు భారతమునే వినగోర నేల? మరియొక రామాయణమునో భారతమునో ఏల వినగోరలేదు? అను మాటకిది సమాధానము. ఇంత దూరదూరముగ మహార్థములను వట్టి కథా కథనము నందు నన్నయ గారు సంయోజించును. ఆ కథా కథనము మనసు నిలువనీయదు. చెవులు పట్టికొని లాగికొనిపోవుచుండును. ఆ పట్టు విడిపించుకొని లోప లకు మునిగితిమా అన్నియును ముత్యములు, రత్నములు, ప్రోవులు ప్రోవులు పడియుండును. వానిని సంగ్రహించుకొనువారుండ వలయు నంతే.

జయంతి, జూన్; 1959

# నన్నయ్య చిత్రించిన రసమయ కథ

## బకాసుర వధ

శ్రీ ఎ. ఎస్. ఎల్. కుమార్

"ఆదికవియైన నన్నయశైలి మిక్కిలి మనోహరమైనది. దాని వంటిది వేఱొండులేదు. సంస్కృత పద భూయిష్ఠమైయున్న నర్థకాఠిన్య మేమాత్రము లేనిది. అతఁడుపయోగించిన తత్సమము లితరు లనేకులు నాడు తెలుఁగు పదముల కంటె శబ్దము నందును, నర్థము నందును సరళములు. సాధారణముగా సంస్కృత పదములను సమాసములను ప్రయోగించు వారాడంబరముఁ బ్రకటింతురు. ఆ పద్ధతికి ననుకూలించిన స్థలముల మాత్ర మట్టి శైలిని వ్రాయుదురు. నన్నయ తత్సమపద భూయిష్ఠమైన శైలికి మృదుత్వము, మాధుర్యము మొదలగు కోమలమైన గుణములకు సంయోగము స్థాపించను. నన్నయలో సంస్కృతి కాన్వయములు మిక్కుటములు, అట్లని విషయ వైశద్యమునకు నర్థస్పష్టతకు భంగకరములుఁగావు. అనర్గళ ధారా వేగమునకు నర్థ గాంభీర్యమునకు, సమాస ఘటనా సౌందర్యమునకు నాలవాలమయిన కవిత్వము నన్నయగారి సొమ్ము". ఇతనికి బహువ్రీహి సమాసము నందుఁ బ్రీతి యెక్కువ. "శ్రీవాణీ గిరిజాశ్చిరాయ" అన్న సంస్కృత పద్యముతో నారంభించిన నన్నయ కవిత శారదరాత్రు లందుఁ "గర్పూర పరాగ పాండు రుచిపూరమై" పరిపూర్తి నందినది. అమ్మహాకవి రచనా వైచిత్రిని బకాసుర సంహార ఘట్టము నుండి నిరూపింపఁ బ్రయత్నించెదను

ఏకచక్రపురమున బ్రాహ్మణుల యింటఁ బాండవులుఁ గాపురంబున్న యప్పుడాయింటి పెద్ద కొక యాపద కలిగినది. అది బకాసురాహారార్థమై యా యింటి వారొకరుఁ బోవలసివచ్చుట. అప్పుడు భీమసేనుఁడుఁ దానుబోవుటకు సంసిద్ధుఁ డయ్యెను. అట్లు చని బకాసురుని సంహరించును. ఇది యీ ఘట్టము.

కుంతీదేవి భీముని డాసి విప్రకుటుంబమునకు మేలు సేయఁ గోరి నప్పుడు భీముఁడు :

ఎఱిఁగి నాకుఁ జెప్పు మిది యేమి యెవ్వరివలన నింత యవ్యె వగవనేల ? యెంతకడిఁది యైన నిదియేను దీర్చి ఈ విప్రునకు బ్రియంబు విస్తరింతు.

అని చెప్పుటలో, భీముని ధైర్యము. విజయము నందలి విశ్వాసముఁ, బరోపకారపరత విస్పష్టము లైనవి. ఇంక నన్నయగారు సులభమైన తెలుఁగు పలుకులలో ననాయాసముగ సంగతియెల్ల వివరించినారు. ఇందలి 'ఎంతకడిది యైన', 'ప్రియంబు విస్తరింతు' నన్న పలుకులు మనోహరములు, నర్థవంతములు.

బ్రాహ్మణ దంపతుల సంభాషణములో

"పడిన యామిషంబు పక్షు లపేక్షించు
నట్లు పురుషహీన యయిన యువతిఁ
జూచి యెల్ల వారుఁ జులక నపేక్షింతు
రదియుఁ బాపమనక హీనమతులు."

అని లోకసాధారణమైన విషయ విశదీకరణముఁ గావించినాఁడు. కొంత సంవాదము జరిగిన యనంతరము.

"బాలుఁ డొక్కఁడు కొండొక కోల సేతఁ
బట్టుకొని యేను రక్కసుఁ గిట్టి చంపి
చులుకఁగావత్తుమీ రేడ్వ వలదనుచుఁ
గలయ నూరార్చెఁ దనతొక్కుఁ బలుకులొప్ప".

ఈ పద్యముఁ గడుంగడు ముద్దులొలుకు చున్నది. శైశవ మాధుర్యమిందు జాలువారినది. అంతటి దుఃఖ సమయ మందు నందరి డెందముల నీ పలుకులతో నొక్క కులుకు నవ్వు గుబాళించి నది- క్షణికమే కావచ్చు గాక- సమ్మోహనాస్త్రమై సంచరించినది కాదా ?

భీముఁడు సంగ్రామ సంరంభి యగుచున్నట్లు తలంచి ధర్మజుఁడు.

సరసనుతకీర్తి యియ్యనిల నందను డెవ్వరి తోడ నేని భీ
కర సమరంబు సేయ సమ కట్టిన యట్లు మహానురాగ ని
ర్భరమున నున్న వాఁడితని భావము సూడఁగ వేఱు వీని సు
స్థిరబలు మీరు పంచితిరొ చెచ్చెరఁదాన యుపక్రమించెనో ?

యని కుంతీదేవిని ప్రశ్నింప నామె : "భ్రమ విమోహ లోభ భయ పరిభూతనై కొడుకు విడువ నంత నెఱుఁగనయ్య యేను వీని శక్తి యెఱుఁగక పంచిన దానఁ గాను."

అని తన కొడుకు యుద్ధకౌశల వీరత్వ విజయము లందలి ప్రగాఢ విశ్వాసమును బయల్పరచినది.

ఆపై "ఇష్టాన్నోపభోగంబునం దృప్తుండయి భక్ష్యాన్న పూర్ణం బయిన శకటంబు నెక్కి బకాసురుఁ డున్న చోటికిం జని, యమునా తీరంబున శకటంబు నిలిపి మిన్నకుండ నేల యని కాళ్ళుఁ గడిగికొని యాచమించి కూడుఁ గుడుచు చుండెను" పెద్ద ప్రొద్దయినది బకాసురుఁడు నాకటికిం దాలి—

"అలిగి యాడు గఱచి యాఁకటి పెలుచన
నిలువలేక యసుర నింగి దాఁకఁ
బెరిఁగి యరుగుదెంచె భీమరూపంబుతో
నుగ్ర భంగి భీముఁ డున్న దెసకు."

బకాసుర క్రోధ రూప మింత కన్న సహజముగా నీవాటి కెవ్వారలును వర్ణించినది లేదు.

అంత భీమసేనుండుఁ— చూడుఁ డేమను చున్నాఁడో :

ఇంచుక యేని బాపమున కెన్నఁడు రోయక యెల్లవారి బా
ధించి మనుష్యమాంసముల దించును గ్రొవ్వితి వాని నెల్లఁగ్ర
క్కించెద నీ మదాంధ్య ముడిగించెద నిప్పుడ కాలు ద్రోలి కేఁ
గించెదఁ జక్కనై నిలుము గిట్టి రణంబున రాక్షసాధమా !

అని అదలించి మందలించి, మించి విశాలసాల వృక్షంబు పెకలించి రక్కసుపై వైచిన వాఁడును దనచేతి వృక్షంబున దాని భగ్నంబుఁ జేసినాఁడు. ఇట్లా యిర్వురొక్క వడి వృక్షయుద్ధంబుసేసి, యాసన్న మహీరుహంబులు సమసిన మల్లయుద్ధ సన్నద్ధులైనాడు.

మల్లయుద్ధ వర్ణన మనన్య సామాన్యమై యద్భుతమై, యానం దదాయమై, యాచిత్రము మన కన్నులఁ గట్టుచున్నది.

పరుపడి నొండొరుం బెనఁగి
పట్టుచుఁ ద్రోచుచు నీడ్చుచుం బర
స్పర జయ కాంక్షులైన బక
పాండవ వీరుల పాదఘట్టనన్
ధరణి తలంబు గ్రక్కదలెఁ
దన్నికట ద్రుమవల్లు లెల్ల జ
ర్జరితము లయ్యె నిష్ఠుర వి
శాలశిలల్ నుఱుమయ్యెనయ్యెడన్
దారుణ జానుదండమున
దండధర ప్రతిముండు భీకరా
కారుఁడు వాని వీఁపు విఱు
గం బొడిచెం బళితంబుతో నవ
ద్వారములన్ మహో రుధిర
ధారలు బోరన నొల్క మాంసపం
కారుణ వారి ఘోర నదు
లై పఱపన్ విపినాంతరంబునన్॥

భీమవర్ణన మిప్పట్టున నెట్లు చిత్రితమో కనుగొనుండు !

ఇట్లు బకాసురుఁడు భీముచేత నిహతుండయి విగత జీవితుఁడగు చుండి పెల్లఱచినాఁడు. అమ్మహాధ్వని విని వాని బాంధవులైన రక్కసులు వఱతెంచిన వారలం జూచి భీముండు : '...మనుజ భక్షణంబు సేసితిర యేని బకుని యట్లు చత్తురని' చాటినాఁడు.

వీఁడొక మంత్ర సిద్ధుఁడగు
విప్రు డసాధ్యబలున్ బకాసురున్
నేఁడనిఁ జంపె నట్టె యత
నిం జనుచుత మటంచుఁజెచ్చరం
బోఁడిగ నేత్రకీయమున
భూసురు లాదిగ వచ్చి చూచిర
వ్వాఁడి మగంటిమిన్ వెలయు
వాని వృకోదరు నెల్ల వారలున్.

ఇట్టి ఘట్టముల వర్ణించు పట్టు లందు సంగ్రామ రంగ కథా కథన కౌశల విశేషంబున, నన్నయ భట్టారకు లనన్య సామాన్య ప్రతిభాభాసమాను లనుటలో నతిశయోక్తి యొక్కింతయు లేదు.

కృష్ణాపత్రిక. ఏప్రల్; 1960

---

# భారతంలో శకుంతల

(యుగ యుగాల నుంచి స్త్రీలకు జరుగుతున్న అన్యాయాలకు ప్రతీక)

శ్రీ ఆచార్య తమ్మారెడ్డి నిర్మల

ఆంధ్ర మహాభారతం ఆదిపర్వం చతుర్థాశ్వాసంలో వంద పద్యాలలో (8-109) చెప్పబడిన శకుంతల కథ చాలా మందికి తెలిసిందే. దుష్యంతుడు వేటకోసం అడవికి వెళ్ళి అక్కడ కణ్వాశ్రమంలోని శకుంతలను గాంధర్వ వివాహం చేసుకొని తన రాజ్యానికి వెళ్ళిపోవటం, భరతుడు జన్మించిన తరువాత కుమారుడితో సహా వచ్చిన శకుంతలను నిరాకరించటం, దివ్యవాణి పలుకుల వలన పరిగ్రహించటం ఇందులోని కథ.

ఇది భారత స్త్రీ కథ. ఇందులో ఈ నాటికీ స్త్రీకి సమస్యగానే ఉన్న అంశాలు కొన్ని కనిపిస్తాయి.

శకుంతల పుట్టగానే తలి దండ్రులచేత అడవిలో విడువబడింది. ఏడుస్తున్న ఆ పసిబిడ్డను పక్షులు రెక్కలతో కప్పి రక్షించాయి. ఆ సమయంలో అక్కడకువచ్చిన కణ్వుడు తరుణ శశిరేఖ లాగ బిడ్డను తీసుకొనివెళ్ళి శకుంతల రక్షిత కాబట్టి శకుంతల అని పేరుపెట్టి పెంచాడు.

ఈమె పుట్టగానే తలి దండ్రులచేత వదిలేయబడటం ఎందుకు జరిగింది ? ఆమె జన్మ వృత్తాంతం తెలియాలి. రాజర్షి అయిన విశ్వామిత్రుడు చేస్తున్న అతి ఘోర తపస్సుకి దేవేంద్రుడు భయపడతాడు. అప్సరసలలో అగ్రగణ్య అయిన మేనకను పిలిచి విశ్వామిత్రుడి దగ్గరకు వెళ్ళి అతని తపస్సును పాడుచేసి తన రాజ్యాన్ని కాపాడుకుంటాడు. ఇంద్రుడు చేయుమన్న పనికి మేనక చాల భయపడుతుంది. అతనికి నమస్కరించి నీతో సహా ఈ దేవతలందరూ అవారిత సత్త్వ

డయిన ఆ విశ్వామిత్రుడంటే భయపడతారు. అటువంటి ఉగ్రకోప పనుని దగ్గరకు వెళ్ళమని నన్ను పంపటం న్యాయం కాదంటుంది. ఆ ముని కోపంగా చూస్తే పర్వతాలు పగిలిపోతాయి. సముద్రాలు ఇంకిపోతాయి. ముల్లోకాలు గిరగిర తిరుగుతాయి. గాలి కదలకుండా నిలుస్తుంది. అని విశ్వామిత్రుడి కోపం ఎటువంటిదో వివరించి అటు వంటి కోపపరుని దగ్గరకు భామలు వెళ్ళగలరా? వెళ్తే జయించగలరా! అయినా, నాకు చేతనయిన విధంగా ఆ ముని మనస్సు 'చిత్త జాయత్తంబగునట్లుగా' (4-39) చేస్తానని ఇంద్రుడితో చెప్పి విశ్వామిత్రుడి తపోవనానికి చేరుతుంది.

ఇంద్రుడు దేవతలకు రాజు. అప్పటి రాచకార్యం విశ్వామిత్రుడి తపోభంగం. అది ఎప్పుడు జరుగుతుందంటే ఆ ముని చిత్తాన్ని తపస్సు నుంచి మరలించినప్పుడు. ఆపని చేయటానికి రాజు నియోగించింది తన రాజ్యంలో తన అధీనంలో ఉన్న స్త్రీని. ఆమె వెళ్ళి అతన్ని ఆకర్షించి తపోభంగం జరిగేటట్లు చేయాలి. రాజులు (లేక ధనవంతులు లేక బలవంతులు) తమ కార్యసాధనకు తమ అధీనంలో ఉన్న స్త్రీలను ఉపయోగిస్తారన్నమాట. ఇందు కాస్త్రీల ఇష్టానిష్టాలతో పనిలేదు. వాళ్ళ మాన ప్రాణాలకు ప్రమాదం సంభవించే పరిస్థితుల్లో కూడా వాళ్ళు రాజాజ్ఞను పాటించవలసిందే. మేనక కూడా అదే చేసింది.

మహా తపస్సులో నిమగ్నుడైన మునిని చూసి మేనక వినయంగా నమస్కరించింది. పుష్పాపచయ వ్యాజంతో సవిలాసంగా అక్కడ విహరిస్తుంది. ఆమె మునికి దగ్గరగా ఉన్నపుడు గాలి వీచి పై వలువ జారిపోతుంది. అదే సమయంలో ఆమె సౌందర్యం మీద విశ్వామిత్రుడి దృష్టి నిలుస్తుంది. అతనామెను కోరతాడు. ప్రభువు ఆజ్ఞను శిరసావహించిన మేనక విశ్వామిత్రుడి ఇష్టానికి తగినట్లుగా ప్రవర్తిస్తుంది. ఈ సందర్భంలో మేనకా విశ్వామిత్రులకు పుట్టిన బిడ్డను ఏటి ఒడ్డునపెట్టి మేనక దేవలోకానికి వెళ్తుంది. విశ్వామిత్రుడు తపోవనానికి వెళతాడు.

మేనక - కన్నతల్లి - బిడ్డ నెందుకు వదిలేసింది ? ఈ బిడ్డను ఆమె కావాలని కనలేదని స్పష్టం. విధి నిర్వహణంలో తానొక సమిధ అయి బిడ్డకు జన్మనిచ్చింది. ఆ బిడ్డ జన్మ కారకుడైన తండ్రి ఎటువంటి బాధ్యతనూ వహించడు. అది వైవాహిక సంబంధం వలన, దాంపత్య ధర్మం నిర్వహించటం వలన కలిగిన సంతానం కాదు. సంఘం ఆమోదించిన స్త్రీ పురుషుల కలయిక వివాహం. ఆ వివాహ బంధం లేనిచోట జన్మించిన సంతానాన్ని సమాజం గౌరవించదు. అందుకే ఇటువంటి సందర్భాలలో నిస్సహాయురాలయిన తల్లి (స్త్రీ) చేసే పని అప్పటినుంచి ఇప్పటివరకు ఇదే.

అట్లా వదిలేయ బడిన బిడ్డను దారినపోయే ఏ పుణ్యాత్ములయినా చూస్తే కావాలనుకుంటే పెంచుతారు. అట్లాగే కణ్వుడు శకుంతలను పెంచుతాడు.

ఈ కథా నాయకుడు దుష్యంతుడు మహారాజు. ధర్మంతో పరిపాలన చేస్తున్నవాడు. శకుంతలను కలుసుకొని, ఆమె మేనకా విశ్వామిత్రుల కుమార్తె అని తెలుసుకొంటాడు.

శకుంతలను చూడక పూర్వమే ఆ తపోవన రామణీయకం దుష్యంతునికి హృదయ ప్రమోదాన్ని కలిగిస్తుంది. అది నేపథ్యం. ఆ సంతోష సమయంలోనే అనుకోని విధంగా మన్మథ రాజ్యలక్ష్మి వంటి శకుంతల దర్శన మిస్తుంది. అతిథి మర్యాదలు చేసి మృదు మధురంగా మాట్లాడుతుంది. అతని హృదయం చలిస్తుంది. ఆమె ముని కన్య అని నిస్పృహ చెందిన సమయంలో రాజపుత్రి అని తెలుస్తుంది. ఇంకిక మనస్సుకి అడ్డు తొలగి పోయినట్లే.

"...నాకు భార్యవగు భాసురలీల నశేష రాజ్యలక్ష్మి మహనీయ సౌఖ్యముల మేలుగ నందు మనింది తేందు పాదామలతుంగ హర్మ్య తలహారి హిరణ్మయ కుట్టిమంబులన్ (4-54) అని ప్రలోభ పెడతాడు. తనకు భార్యగా వచ్చి రాజ్యసుఖాలను పొందమంటున్నాడు. అవెలా ఉంటాయో పెద్ద సమాసంలో చెప్పనే చెప్పాడు, భార్యగా

వెళ్ళాలంటే పెళ్ళి జరగాలి. అదెట్లా? దీనికి ఉపాయం చెప్పాడు. అష్టవిధ వివాహాలలో క్షత్రియులకు గాంధర్వ రాక్షసములు తగినవి మనకు పరస్పరం ప్రేమ కలిగింది. కాబట్టి గాంధర్వ విధి వివాహం చేసుకోవటం యుక్తమే అని నచ్చ చెప్పాడు.

ఇంక శకుంతల ఎదురు చెప్పే సమస్య లేదు. కాని ఆమె వెంటనే అంగీకరించదు. సిగ్గుతో తలవంచి నా తండ్రి అడవి నుంచి వస్తారు. వచ్చి నన్ను నీకిచ్చి పెళ్ళి స్తే పాణిగ్రహణం చేయమం టుంది. అది కన్యోచితం. దుష్యంతుడి ఆలోచనకిది అంతరాయం. ఆమెను సుముఖురాలినిగా జేసుకొనే యత్నంలో గాంధర్వ వివాహ స్వరూపాన్ని గురించి చెప్పి శకుంతలను అంగీకరింపచేస్తాడు. ఈ వివాహంలో మిగిలిన విషయాల కంటె గమనించవలసిందేమంటే ఇది అతి రహస్యం అనేది. అమంత్రకం కూడ గూడ కాబట్టి మంత్రాలు చదివే వాళ్ళు కూడా సాక్ష్యానికి ఉండరు.

శకుంతల ఈ వివాహానికి అంగీకరిస్తుంది. కాని ఒక షరతు పెడుతుంది. తామిద్దరికీ జన్మించిన కుమారుడికి రాజ్యాభిషేకం చేయాలి అనే వరాన్ని ఇవ్వమని కోరుతుంది.

"...అట్లయిన నీకును నాకును సంగమంబగున్ (4-60) అని ఖచ్చితంగా చెపుంది. దుష్యంతుడు సంతోషంగా ఆమె కోరిన వరాన్ని ఇస్తాడు. గాంధర్వ వివాహం చేసుకొని అభిమత సుఖాల ననుభవిస్తాడు.

ఇంక రాజు తన రాజ్యానికి వెళ్ళిపోవాలి 'నిను దోడ్కొనిరా నస్మత్ప్రధాన వర్గంబు గణ్వ మహాముని పాలికిం బుత్తెంచెదనని (4-61) శకుంతల నూరడించి వెళతాడు. నన్నయ చెప్పకపోయినా భార్యలందరి లాగానే ఆమె కూడా నమ్మిందని మనం భావించాలి. ఈ సందర్భంలో సంస్కృత భారతంలోని-

"విశ్వాస్య చైనాం సంప్రాయాత్ అబ్రవీత్ చ పునఃపునః
ప్రేషయిష్యే తవార్థాయ వాహినీం చతురంగిణీం
తయా త్వా మానయిష్యామి నివాసం స్వం శుచి స్మితే"
(ఆది. 67-29)

(ఓ శుచిస్మితా! నా నివాసానికి నిన్ను తీసికొని రావటానికి చతురంగ వాహినిని పంపగలను. అని మాటి మాటికి చెప్పి ఆమెను విశ్వసింపజేసి దుష్యంతుడు వెళ్ళాడు.) అనే శ్లోకాన్ని బట్టి దుష్యంతుడు శకుంతలను నమ్మించి వెళ్ళాడని స్పష్టమవుతుంది.

అరణ్యం నుంచి తిరిగివచ్చిన కణ్వుడు శకుంతలను చూసి విషయాన్ని గ్రహించి సంతోషంతో అంగీకరిస్తాడు. కొన్నాళ్ళకు శకుంతలకు భరతుడు జన్మిస్తాడు. మరికొన్ని సంవత్సరాలు గడుస్తాయి. శకుంతలా భరతులు కణ్వాశ్రమంలోనే ఉంటారు. ఒకనాడు కణ్వుడు శకుంతలతో—

"ఎట్టి సాధ్వులకును బుట్టిన యిండ్లను
బెద్ద కాలమునికి తద్ద తగదు
పతుల కడన యునికి సతులకు ధర్మువు
సతుల కేడు గడయు బతులచూవె" (4-66)

ఎటువంటి సాధ్వీమ తల్లులయినా పుట్టింట్లో చాలాకాలం ఉండటం తగదు. పతుల దగ్గరుండటమే సతులకు ధర్మం. సతులకు రక్షకులు కూడ పతులే అని అంటాడు.

వివాహం కాగానే స్త్రీ పుట్టినప్పటినుంచి ఉన్న తండ్రి - ఇంట్లో ఉండే అర్హతను కోల్పోతుందన్న మాట.

కొడుకుని తీసుకొని నీ భర్త దగ్గరకు వెళ్ళమని తనశిష్యులను తోడిచ్చి శకుంతలను పంపుతాడు కణ్వుడు. శకుంతల భరతుడితో సహా దుష్యంతుడి దగ్గరకు వస్తుంది. "సకల సామంత మంత్రి పురోహిత ప్రధాన పౌరజన పరివృతుండై యున్న (4-67) ఆ రాజుని చూస్తుంది. చూడగానే ఆమె ఒక విషయాన్ని గ్రహిస్తుంది. కణ్వాశ్రమంలో

చూపిన అనురాగం, ఆదరణ, అనుగ్రహం కరుణ, సంభ్రమం ఇవేవీ రాజులో కనిపించలేదు. వెంటనే అనుకొంటుంది. తనను ఎరగడా? లేక ఎరిగికూడ ఎరగనట్టున్నాడా? అని. చాలాకాలం కావటం వలన మరచిపోయాడా అనికూడాఆలోచిస్తుంది.అధిపులుబహుకార్యమగ్నులు కదా అని మరపును సమర్థించుకొంటుంది.

కాని రాజు చూపులు విరసంగా, క్రూరంగా కనిపిస్తాయి. అందువలన అతను ఆశ్రమంలో ఇచ్చిన మాటనుంచి తప్పుకోవాలని తలుస్తున్నాడేమో అనిపిస్తుందామెకు. మరచిపోతే జ్ఞాపకం చేయవచ్చు. తెలీకపోతే తెలియజేయవచ్చు. కాని "ఎఱిగి ఎఱుగనొల్లని కఱటిం దెలుపంగ గమల గర్భుని వశమే. (4–72) అని భావిస్తుంది. అయినాగాని వచ్చిన విషయాన్ని ప్రస్తావిస్తుంది. వేటకి వచ్చినపుడు కణ్వాశ్రమంలో సంతోషంతో నువ్వు నాకిచ్చిన వరాన్ని జ్ఞాపకం చేసుకోమంటుంది. బాలార్క తేజుడైన ఈ బాలుడు నీ కొడుకు ఇతన్ని యువరాజుని చేయమంటుంది.

అప్పుడు దుష్యంతుడు విషయమంతా తెలిసికూడా తెలినివాడి లాగ మాట్లాడతాడు.నువ్వెవరవో నేనెరగను. అనుచితంగా మాట్లాడకుండా ఎక్కడినుంచి వచ్చావో అక్కడికి వెళ్ళిపొమ్మంటాడు. శకుంతల తెల్లబోతుంది. నిశ్చేష్టురాలవుతుంది. నిట్టూరుస్తుంది. ఇట్లా జరుగుతుందేమోనని రాజుని చూడగనే అతని ప్రవర్తన వలన ఆమె ఊహించింది గాని నిజంగా జరిగేసరికి ఆమె కోపారుణిత నయనాలతో అశ్రు బిందువులు రాలతాయి. రాజు చేసిన మోసానికి కోపం, తాను మోసపోయినందుకు దుఃఖం. దాన్ని కనపించనీకుండా తలవంచి రాజుని క్రీగంట గమనిస్తూ హృదయావేదనకు తానే ఉపశమింప జేసుకొని బాగా ఆలోచించి మళ్ళీ రాజుతో మాట్లాడుతుంది.

"ఏల యెఱుక లేని యితరుల యట్లనీ
వెఱుగ ననుచు బలికె దెఱిగి యెఱిగి
యేన కాన దీని నెఱుఁగు రిందొరులని
తప్పబలుక నగునె ధార్మికులకు" (4-79)

నన్ను ఎఱిగికూడ ఏమి తెలీనివారిలాగ ఎరుగనని అంటున్నావు. నేను తప్ప ఇక్కడున్న వారెవరు ఈ విషయాన్ని ఎరుగరు కదా! అని మాట తప్పి పలకటం ధార్మికులకు తగదు అంటుంది. అతను చెప్పింది అసత్యమని వాళ్ళిద్దరికీ తెలుసు. తాను చెప్పింది ఋజువు చేసుకోవటానికి శకుంతలకి అవకాశం లేదు. ఎందుకంటే సభలోని వారెవరికీ ఆ విషయం తెలీదు, అందుకే, నువ్వు ధార్మికుడవయితే అసత్యం చెప్పవు, అని ముందరికాళ్ళకు బంధం వేస్తుంది.

కావాలని మోసం చేసేవాడికి అంత సున్నితంగా చెప్తే బుర్రకెక్కదు. విమలయశోనిధీ ! అని మొదలు పెడుతుంది మళ్ళీ. విమలమైన నీ యశస్సుకి కళంకం తెచ్చేపని చేయవద్దు, అని భంగ్యంతరంగా చెప్పటం, వేదాలు, పంచభూతాలు, ధర్మం, సంధ్యలు, అంతరాత్మ, యముడు, చంద్ర సూర్యులు, దివారాత్రాలు పురుషుడి ప్రవర్తనను గ్రమనిస్తూ ఉంటాయి. మానవుడు వీటినుంచి దాక్కోగలడా? తప్పించుకోగలడా? నువ్వు నాకిచ్చిన వరాన్ని నే నెఱిగినట్లుగానే ఇవన్నీ కూడా ఎరుగును. కాబట్టి పూర్వంలాగ నాపట్ల అనుగ్రహం చూపమంటుంది.

ఏవయితే తన ప్రవర్తనను గమనిస్తాయని చెప్పిందో అవి శకుంతలకి సాక్ష్యమివ్వడానికి రావు. ఆ విషయం దుష్యంతుడికి తెలుసు. వాటిల్లో చెప్పబడిన అంతరాత్మ గొంతునపుడు ఎప్పుడో నొక్కేయగలిగాడు ఇప్పటికి అతనిస్వరూపం కొంతవరకు అర్థం చేసుకోగలిగిందామె. అతను దుర్మతి అనుగ్రహించింది. అందుకే గుణవతి, సంతానవతి, అనుకూలవతి అయిన భార్యను అవజ్ఞ చేసిన దుర్మతికి ఇహము, పరమూ కూడా దక్కదంటుంది. ఇంకేవేవో ధర్మాలను ఉపదేశిస్తుంది.

అయినా రాజులో మార్పు కనబడలేదు. ఇవన్నీ రాజయిన దుష్యంతునికి తెలినివా? బాగా తెలుసు. అయినా శకుంతలను

భార్యగా అంగీకరించటానికి అతను సిద్ధంగా లేడు. నీ కుమారుడు వంశకరు డవుతాడని సరస్వతి పలికింది. ఇటువంటి బిడ్డను 'నిష్కార ణము తప్ప జూడగ సారమతీ చనునె వాటి సత్యము గలుగన్(4-93) అంటుంది. ఆమె ఎన్ని చెప్పినా అతను నిజాన్ని అంగీకరించేటట్లు లేడు. అందువలన సత్యవచన ప్రాముఖ్యాన్ని ఉగ్గడిస్తుంది.

"క్రతు శతంబున కంటె సుతుండు మేలు, తత్సుత శతకంబు కంటె నొక సూనృత వాక్యము మేలు (4-94) వేయి అశ్వమేధా లకంటె ఒక్క సత్యం యొక్క బరువు ఎక్కువ.

"సర్వతీర్థాభి గమనంబు సర్వ వేద
సమధిగమము సత్యంబుతో సరియు గావు
ఎఱుగు మెల్ల ధర్మంబులకెల్ల బెద్ద
యండ్రు సత్యంబు ధర్మజ్ఞులైన మునులు." (4-96)

కాబట్టి 'కణ్వాశ్రమ సంభావిత సమయస్థితి దయ గావింపుము కొడుకు జూడు కరుణార్ద్రదృష్టిన్' (4-97). అని కోరుకుంది. కణ్వాశ్ర మంలో తనకిచ్చిన మాట ప్రకారం అయితే ఆమె కొడుకుని యువ రాజుని చేయాలి. అది శకుంతలా దుష్యంతుల మధ్య జరిగిన ఒడం బడిక. దుష్యంతుడు దాన్ని గౌరవించాలంటె మొదట ఆమెను భార్యగ అంగీకరించాలి. కాని ఆ జాడే కనపడలేదు. అంతే కాదు ఆమె అసత్యం చెబుతోంది, అనే భావం దుష్యంతుడి మొహంలో కనిపించి ఉండాలి. అందువల్లనే 'బొంకు పలుకగ— అంత ధర్మేతరానే (4-98) అని చివరి మాటగా అడుగుతుంది.

మొదటే నిశ్చయించుకొన్నవాడు గాబట్టి దుష్యంతుడు తన కనుకూలమైన విధంగా సమాధాన మిస్తాడు.

"ఏనెల నీవెట సుతుడెట
యే నెన్నడు దొల్లిచూచి యెఱుగను నిన్నున్" (4-100)

అంటాడు. నేనెక్కడ! నేనా మహారాజుని. నువ్వేమో ముని పల్లెలో ఉన్నదానివి. మనిద్దరికీ వివాహం జరిగిందని అంటున్నావు.

అది అసలు జరిగే పనేనా అని అడగటం. మరింక కుమారుడి మాట చెప్పే పనేలేదు. ఇంతకు పూర్వం నేనెప్పుడు నిన్ను చూడనేలేదు. అని ఒక్కమాటలో తప్పుకొన్నాడు. అంతేకాదు.

అసత్యం పలకటం ఉచితమా అని మెత్తని కత్తిలా గాయపర చాడు. ఆమె చెప్పిన పరమ సత్యం అతని అసత్యం ముందు అసత్యమై పోయింది. అతని ధర్మపరిపాలన (4-9) లో తానే స్వయంగా నిండు సభలో పలికిన అసత్యం సత్యాన్ని హత్యచేసింది. అది చాలదన్నట్లు "మానినుల సత్యవచనులనాన్" అని స్త్రీ జాతికి అన్వయించటం. విగతాశయైన శకుంతల దుఃఖిస్తూ దైవంమీద భారంవేసి తన కొడుకుని తీసుకొని అక్కడనుంచి వెళ్ళిపోబోతుంది

ఆమెది ఏమీ చేయలేని నిస్సహాయస్థితి తన సర్వ ప్రయత్నాలు విఫలమయ్యాయి. అందువలన దుఃఖం. తనకు కావలసిన న్యాయం మానవుల వలన జరిగేది కాదని తేలిపోయింది. అందువలన దైవానికి వదిలేసింది. ఇక్కడొక విషయం గమనించాలి. ఎట్టి సాధ్వులయినా పుట్టింట్లో చాలకాలం ఉండటం తగదు. సతులు తమకు రక్షకులయిన పతుల దగ్గరుండుటయే ధర్మం అని కణ్వుడు ముందే చెప్పాడు. దీన్ని బట్టి వివాహమైన శకుంతల కణ్వాశ్రమంలో ఉండే హక్కును కోల్పో యిందని భావించాలి. మరిప్పుడు దుష్యంతుడు శకుంతలను నీ ఆశ్ర మానికి పొమ్మంటాడు. రక్షకుడు కావలసిన భర్త బాధ్యతనుంచి తప్పించుకొన్నాడు. ఇంక శకుంతల వెళ్ళబోయిం దెక్కడికి? ఎక్క డికో స్పష్టంగా చెప్పబడలేదు.

ఆ సమయంలో మహా పతివ్రత, సాధ్వి అయిన శకుంతల సత్యం పలికింది. వీడు నీకు, శకుంతలకు పుత్రుడు, గ్రహించి భరించు అనిదివ్యవాణి సభాసదులంతా ఆశ్చర్యపడేటట్లుగా దుష్యంతుడికి వినిపి స్తుంది. ఆకాశంలో నుంచి దేవతలు చెప్పేసరికి దుష్యంతుడికి నిజాన్ని ఒప్పుకోక తప్పలేదు. ఆ పరిస్థితిలో రాజు సభాసదులతో మావివాహం విషయం నేను ఈమె తప్ప ఇతరు లెరుగరు. ఎవరు ఎరుగక పోవడం

వలన నేను ఈమెను ఎరిగి కూడా ఎరగనన్నాను. ఇప్పుడు ఆశ్చర్యంగా ఆకాశవాణి అందరికీ తెలియజేసింది.

పెళ్ళి చేసుకొనేటప్పుడేమో నెమ్మితో ప్రీతితో పాణిగ్రహణం చేసాడు. స్వీకరించవలసి వచ్చినప్పుడు మాత్రం ప్రీతి తప్పి తెలీదన్నాడు. ఎందుకు తెలీదన్నాడు? అన్న ప్రశ్నకి సమాధానం "అన్యైరవిజ్ఞాతమిమి జేసి" అనేది. ఇతరు లెవరికీ ఈ గాంధర్వ వివాహ విషయం తెలీదు గాబట్టి, దానికి తోడు 'లోకాపవాద భీతి! ఇందులో లోకాపవాదం గురించి భయపడవసిందేముంది ? పోనీ ఉందే అనుకుందాం. ఆ విషయం వివాహానికి పూర్వం గదా ఆలోచించవలసింది. అప్పుడే శకుంతలకి చెప్పవలసిన బాధ్యత ఉంది గదా! ఎందుకు చెప్పలేదు? దీనికి సమాధానం దొరకలేదు. సంస్కృత భారతంలో—

"యద్యహం వచనాదేవ గృహ్ణీయామి మమాత్మజం
భవేద్ధి శంకా లోకస్యనైవం శుద్ధో భవేదయం" (69-36)

నీ మాటతోనే ఇతణ్ణి పుత్రుడిగా స్వీకరిస్తే ఇతడు శుద్ధుడు అవునా కాదా అనే శంక లోకానికి తీరదు.

"మన్యతే చైవలోకస్తే స్త్రీభావాత్ మయిసంగతమ్
పుత్రాశ్చాయం వృతో రాజ్యేమయా తస్మాత్ విచారితమ్.
(69-41)

స్త్రీ లోలుడై నిన్ను సంగమించానని నీ కుమార్ణి రాజ్యార్హుణ్ణి చేసానని లోకం భావిస్తుంది. అందుకని ఆలోచించి ఇలా చేసాను.

అని దుష్యంతుడు చెప్పినట్లుగా వుంది. శకుంతలను దుష్యంతుడి భార్యగాను, ఆమె కుమారుణ్ని రాజ్యార్హుడుగాను లోకం అంగీకరించటానికి ఈ విధంగా చేసాడట. రాజుకి ఈ విషయం గాంధర్వ వివాహానికి పూర్వం తెలీదా ? తెలీదనటానికి వీల్లేదు. మరి శకుంతలకి ఎందుకు చెప్పలేదు? చెప్తే ఆమె వివాహానికి అంగీకరించదు గాబట్టి.

ఈ సందర్భంలో ఒక విషయాన్ని గ్రహించాలి. ఈ పెళ్ళి పెద్దలు చేసింది కాదు. పైగా అతను మహారాజు. ఆమె మునిపల్లెలో పెరిగిన అనాథ. క్షత్రియుని కుమార్తె అయినా గాని ఐశ్వర్యం లేదు. ఆర్థిక సంబంధమైన అసమానత కూడా దుష్యంతుణ్ని తన బాధ్యత తప్పించుకొనేటట్లు చేసింది. శకుంతల యొక్క నిస్సహాయ స్థితికి కారణమయింది. ఆర్థిక అసమానతకి తోడు సాంఘికామోదం లేక పోవటంతో శకుంతల వివాహానికి భద్రత లభించలేదు.

విషయం అందరికీ తెలిసిన తర్వాత మహానురాగంతో కొడుకుని ఆలింగనం చేసుకొని శకుంతలను అతి ప్రణయ గౌరవంతో సంభావించాడు. యౌవరాజ్యానికి భరతుణ్ని అభిషిక్తుణ్ని గావించాడు.

ఆకాశవాణి పలికి ఉండకపోతే శకుంతల గతి ఏమయ్యేది? అసలు అకాశవాణి చెప్పటం ఏమిటి? ఆ కాలంలోనే జరిగిందని అంగీకరించలేని ఈ విషయాన్ని ఇప్పుడసలు ఒప్పుకోలేం. పోనీ ఎవరయినా మనుష్యులు వచ్చి సాక్ష్యమిచ్చినట్లుగానే ఈ సన్నివేశాన్ని అర్థం చేసుకొందాం. ఎవరూ సాక్ష్యం చెప్పకపోతే ఆ పరిస్థితిలో ఆ స్త్రీ, ఆమె సంతానమూ కూడ అవమానింపబడవలసి వచ్చేది. వేల సంవత్సరాల నుంచి స్త్రీ ఎదుర్కొంటున్న అనేక సమస్యలలో ఇది కూడా ఒకటి.

అభినందన (ఆచార్య తూమాటి దొణప్ప షష్టి పూర్తి సంచిక) 1990

# శకుంతలోపాఖ్యానము : నన్నయ

శ్రీ కొడవంటి శంకరనరసింహాబ్రహ్మం

ఆంధ్రుల దురదృష్టమున నుద్గ్రంథములెన్ని యలబ్ధములై యజ్ఞాతములై యడఁగియుండెనో యెఱుఁగరాదు. నన్నిచోడని కుమార సంభవ కావ్య మీ శతాబ్దారంభమువఱకు నష్టప్రాయమై యుండినదే కదా! తిక్కనసోమయాజి తన యుత్తర రామాయణారంభమున 'సారకవితాభిరాముఁడ'నియుఁ గేతన దశకుమార చరిత్రమున 'సాహిత్యవిద్యా పారీణుఁడ'నియు హెచ్చరించిన తిక్కన తాతయైన భాస్కరమంత్రి రచించిన గ్రంథము లింకను బయలుపడలేదు! నిర్వచనోత్తర రామాయణమునఁ 'గవిస్వాభౌమాంకుఁడ'ని సంస్తుతుఁడైన మనుమసిద్ధి తండ్రి తిక్కనృపాలుఁడా బిరుదమునే కావ్యమును రచింపకయే కొనియుండెనా? పెక్కురు కవులచేఁ గొనియాడబడిన చిమ్మపూడి యమరేశ్వరుని కృతు లేమైనవి? భీమకవి యుద్ధండలీల రాఘవ పాండవీయ ద్వ్యర్థి కావ్యమును రచింపఁగా నది నామమాత్రావశిష్టమై నశించెనని పింగళి సూరనామాత్యుఁడు దెల్పుచుండెనుగదా! 'యః సంస్కృత కర్ణాట ప్రాకృతి పైశాచికాంధ్రభాషాసు కవి రాజశేఖర ఇతి ప్రథితః సుకవిత్వ విభవేన' ఇత్యాదిగఁ బొగడ్తఁగన్న నన్ని నారాయణభట్టు గావ్యముల రచింపలేదా? ఆంధ్రశబ్ద చింతామణిలో సగౌరవముగా స్మరింపబడిన కవిభల్లటుని గ్రంథము లేవి? ఇందులోఁ గొందఱు నన్నయకు సమకాలికులు. కొందఱాతనికిం బూర్వులనియుఁ దలంపఁబడుచున్నారు. జనాశ్రయ బిరుదాంచితుఁడై క్రీ. శ. 600 ప్రాంతమున రాజ్యపాలన మొనర్చిన విష్ణుకుండినరాజు మూడవ మాధవవర్మనాఁడు రచింపబఁడి దండిచె స్మరింపఁబడిన (జనాశ్రయ) ఛందో విచితిలో నాంధ్రదేశ విలక్షణమైన సీసగీత ద్విపదాదుల లక్షణములుగూడ నున్నవని యందురు. కాఁగఁ దెనుఁగున నన్నయభట్టే యాదికవియని నిశ్చితముగాఁ జెప్ప నవకాశముచాలదు.

కనుక నసమగ్రపరీక్షణ కారణముగాఁ బుట్టిన యుపోహా నాధారముఁ జేసికొని నన్నయ నాదికవి భావసామ్యముచే వాల్మీకిఁబోని వాఁడ నియు వ్యాసునికన్న ఘనుఁడనియు రాద్ధాంత మొనర్చుటకుఁ బూనుట సరికాదని నా మనవి. వ్యాసుని శకుంతలోపాఖ్యానమున లోపము లున్నవనియు నన్నయ దానినెల్ల సరిదిద్దియుఁ గ్రొమ్మెఱుంగులఁ గూర్చియుఁ దీర్చెనని గత ఏప్రియల్ నెల భారతిలో శ్రీ మల్లంపల్లి వీరమల్లేశ్వరశర్మగారు వ్రాసియున్నారు. ఇదెంత సత్యమున్నదో పరామర్శించుటయే యీ వ్యాసోద్దేశము.

'ఇతివృత్తవశాయాతాం త్యక్త్వాననుగుణాం స్థితిం ఉత్ప్రేక్ష్యా-ప్యంత రాభీష్ట రసోచిత కథోన్నయః' ఈ మొదలుగా నానంద వర్ధనాచార్యులవారి నిబంధన. ఇది పురాణేతిహాసములందలి యితి వృత్తములఁ గావ్యవస్తువులుగా మార్చి కూర్చుకొను విషయమై చెప్పఁబడి నను దెనుగుఁ కవులు సంస్కృత గ్రంథముల నాంధ్రీకరించు సందర్భమున యథామూల పరివర్తనమును గాక పై విధానమును గొంతవర కనుసంధించిరని చెప్పనొప్పును. శ్రీనాథుఁడు నైషధాంధ్రీకరణాంతమున 'శబ్దం బనుసరించియు నభిప్రాయంబు గుణించియు భావం బుపలక్షించియు రసంబు పోషించియు నలంకారంబు భూషించియు నౌచిత్యం బాదరించియు ననౌచిత్యంబు పరిహరించియుఁ" దానా గ్రంథమును జెప్పినట్లు తెల్పినాఁడుగదా! మఱియు రాజరాజ నరేంద్రుఁడు' నన్నయను గోరినది 'మహాభారత' బద్ధ నిరూపితార్థ మేర్పడఁ దెనుఁగున రచియింపు'మని! అట్టియెడ నన్నయ గోరంతఁ జెప్పి కొండంత సూచించెననుట యెట్లు చెల్లునో దురూహ్యము. ఆతఁడు మూలమునందలి దెల్లఁ దెనుఁగునకుఁ దేనవసరము లేదు; తెచ్చుట కాతఁడు పూనను లేదు. కాని రచించినమట్టుకు మూలము నందలి సొగసులు చెడఁగొట్టకుండ విస్పష్టముగాఁ (ఏర్పడ) దెనుఁగు వారి కందిచ్చుటకు బాధ్యుఁడై యున్నాఁడు. ఆ బాధ్యత నాతఁడెంత వఱకు నిలుపఁబెట్టుకొన్నాఁడని ప్రశ్నించినచోఁ బెక్కెడల నసావధా

నుండై పొలుపడెనని చెప్పవలసియున్నది. భారతమునందలి యితర కథాభాగములం గల ప్రమాదము లిట నప్రస్తుతములగుట శకుంతలోపాఖ్యానమునే విమర్శింతము.

శకుంతలోపాఖ్యానము భారతముననేకాక భాగవతాది పురాణము లందునుం గలదు. మహాకవి కాళిదాసుని కావ్యకళానైపుణ్యమున లోకోత్తర చమత్కారకారిగాం బరిణమించిపోయినది కూడ. ఇది నన్నయనాంటి పరిస్థితి. ఇట్టియెడ మూలగాథ నెటనేని యనౌచిత్యమున్నం దొలగించి మార్చుటకు స్వతంత్రుండై యట్టి మార్పులకు మార్గదర్శకములై భాగవతాభిజ్ఞాన శాకుంతలాదు లెదుట నుండ నన్నయ గావించినదేమి? దుష్యంతుండు శకుంతలా జన్మవృత్తాంతమును గూర్చి యడుగంగా నామె తెల్పిన చొప్పు కనుంగొనుండు. మేనక విశ్వామిత్రుతపంబుం జెఱుపబూని వచ్చినదంట. అప్పుడు

చ. అలసత యొప్పంగాం దరుణి
యమ్ముని వల్లభు మ్రోల నున్న స
మ్మిళిత సుగంధ బంధుర స
మీరవశంబునం దూలి చాలపై
వలువెడలన్ బయల్పడియె
వల్గుకుచంబులుం గటియుగ్మము
లలిత కృశోదరంబుం దర
ళత్రివలీయుత రోమరాజియున్

క. అందుం దనదృష్టి నాటినం
గందర్ప నిశాత సాయకంబులు పెలుచన్
డెందము నాటిన ధృతిసెడి కంది
మునీంద్రుండు దానిం గవయంగం దివిరెన్

ఇట మూలమున నిట్లు గలదు—"అభివాద్య తతస్సాతం ప్రాక్రీడ దృషిసన్నిధౌ అపోవాహచ వాసోఽస్యా మారుతా శ్శశిసన్నిభమ్.

సాగచ్ఛత్త్వరితా భూమిం వాసస్తస్యాపహృతం తదా స్మయమానా సేవ సవ్రీడం మారుతం వరవర్ణినీ. పశ్యత స్తత్ర తత్రాగ్నే రపర్యగ్ని సమతేజసః విశ్వామిత్ర స్తతస్తాంతు విషమస్థా మనిందితామ్. గృద్ధాం వాసని సంభ్రాంతాం మేనకాం ముని సత్తమః అనిర్దేశ్యవయోరూపా మపశ్య ద్వివృతాం తదా. తస్యా రూపగుణాన్ దృష్ట్వా సతు విప్రర్షభ స్తదా చకార భావం సంసర్గా త్తయా కామవశం గతః" అని.

వయసు వచ్చిన బాలిక, ఋషి వాటికం బెరిగిన తపస్విని నాఁడే క్రొత్తగా వచ్చిన, 'జగతీ వల్లభుఁడ'ని తనచే గుర్తింపబడిన, పరపురుషునితో 'వల్ల కుచంబులుఁ గటియుగ్మము'ల ప్రశంస-అందునను నప్రస్తుత ప్రశంసఁ-గావించుట యెట్టి యౌచితియో విజ్ఞు లెఱుంగక పోరు. ఇది యమూలకమని గ్రహింతురు గాక! 'అనిర్దేశ్యవయో రూపాం' అన్న యవ్యక్త మధురభావము దెనుగున లాలిత్యముఁ గోలుపోయి సామాన్య భావణప్రాయమై పర్యవసించినది. ఔచితీ నిర్వాహణముపైఁ గన్నుగల కళాతపస్వి యీ ఘట్టమున నన్యముఖ మున సూచనా మాత్రముగా నీ విషయమును కాళిదాసువలెఁ జెప్పింపకున్న మానె సంక్షేపించియైన రాజుగారి ప్రశ్నకు ముక్తసరిగా 'విశ్వామిత్రాత్మజేవాహం త్యక్త్వా మేనకయావనే' ఇత్యాదిగా భాగవత మార్గమునేని యనుసరించి యుండవలసినదికదా! అందుకు మాఱుగా నమూలకమై యనౌచిత్య కల్పనను గూడ గూర్చుట యిట వ్యక్తము.

ఇంకొక యుదాహరణము. శకుంతల దుష్యంతునితో:

క. జగతీ వల్లభ! యే న
త్యగణిత ధర్మ స్వరూపుఁడని జగములు దన్
బొగడఁగఁ జగదారాధ్యుం
డగు కణ్వమహా మునీంద్రు నాత్మజను సుమీ అనియు,

క. కరుణానిరతులు ధర్మ
స్వరూపు లింతకు మదీయజనకులు సనుదెం
తురు వారు వచ్చి నీ కి
చ్చిరేనిఁ బాణిగ్రహణము సేయుము నన్నున్,

అనియుఁ జెప్పినది. ఇట మూలము 'కణ్వ స్యాహం భగవతో దుష్యంత ! దుహితామతా' అనియు, 'ఫలాహారి గతో రాజన్! పితా మే ఇత ఆశ్రమాత్' అనియు, దుహితా, పితా శబ్దముల యౌచితిని గమనింపుఁడు. 'నిర్జనే విపినే రమ్యే శకుంతైః పరివారితాం అనయిత్వా తతశ్చైనాం దుహితృత్వే న్యవేశయత్. శరీరకృత్ప్రాణదాతా యస్యచాన్నాని భుంజతే క్రమేణై తే త్రయోఽప్యుక్తా పితరో ధర్మశాసనే. ఏవం దుహితరం విద్ధి మమ విప్ర శకుంతలాం శకుంతలాచ పితరం మన్యతే మామనిందితా' అని మూల మాశబ్దద్వయ నిర్వచనమును గూడఁ జేసియున్నది. ఆ భాగమును నన్నయ 'నేము దీనికి భయత్రాతల మగుటంజేసి గురుల మిదియును మాచే నభివర్ధిత యగుటం జేసి మాకు హృదయానందినియైన కూతు'రని తెనుగించుటం జూడ నాతఁడా శబ్దద్వయ విశేషమును గుర్తింపలేదనియే చెప్పవలసి యున్నది. ప్రపూరణార్థకమైన దుహధాతు జన్యమైన దుహితృశబ్దమును రక్షణార్థకమైన పా ధాతుజన్యమైన పితృశబ్దమును సార్థకములు సరసములునని రసజ్ఞు లూహింపకపోరు. కవికుల సార్వభౌముఁడైన కాళిదాసు వైఖానసవాక్యముగా 'ఇదానీ మేవ దుహితరం' అని ప్రారంభించి, రాజాపదమును పుత్త్రికా పర్యాయపద మాత్రముగా భావించి శాశ్వత బ్రహ్మచర్య నిష్ఠాపరుఁడైన కణ్వున కెట్లీమె జనించెనాయని సంశయించినట్లు, 'తదాత్మ జేతి కథం' అని చమత్కరించి తుదిఁ దత్సఖీముఖమున 'శరీర సంవర్ధనాదిభి స్తాతకాశ్యపో స్యాః పితా (పిదా - ప్రాకృ)' అని సమాధాన మిప్పించుటలో సార్థపద ప్రయోగసామర్థ్యమును బరాకాష్ఠనొందించి నాఁడు;మూలభారతమునకు మెఱుఁగుఁ దీర్చినాడు. అట్టిచో నన్నయ్య

యిప్పట్టున నాసార్థపద ప్రయోగ సారస్యము నూహింపక 'యావదర్థ పదోక్తి విద్యానియాధిని' గనిపింపజేసికొనలేకపోవుటయే కాక ప్రాదుర్భావార్థకమ్మైన జనిధాతుజన్యమైన 'యాత్మజ జనక' శబ్దముల నుపయోగించి యౌచిత్యమును భ్రష్ట మొనర్చినాఁడు; అయథార్థము నపలపించినాఁడు.

'అనౌచిత్యా దృతే నాన్యద్ రసభంగస్య కారణమ్' అన్న యానందవర్ధను ననుశాసనము నంగీకరించి 'ఔచిత్యం రససిద్ధస్యస్థిరం కావ్యస్య జీవితమ్' అని సిద్ధాంతీకరించిన క్షేమేంద్రుఁడు 'పదే వాక్యే ప్రబంధార్థే గుణేఽలంకరణే రసే క్రియాయాం కారకే లింగే వచనేచ విశేషణే. ఉపసర్గే నిపాతేచ కాలేదేశే కులేవ్రతే తత్వే సత్వేఽప్యభి ప్రాయే స్వభావే సారసంగ్రహే. ప్రతిభాయా మవస్థాయాం విచారేనా మ్న్యథాషే కావ్యస్యాంగేషుద ప్రాహు రౌచిత్యం వ్యాపి జీవితమ్' అని తద్వ్యాప్తిస్థానములఁ దెలిపి కేవల తత్త్వ నిర్ణయైకబుద్ధియై కాళిదానమహాకవినిగూడ నిలువరించి 'క్రోధం ప్రభో! సంహర సంహరేతి యావద్గిరఃఖే మరుతాం చరంతి తావత్సవహ్నిర్ భవనేత్ర జన్మాభస్మావశేషం మదనం చకార' అన్న కుమార సంభవ కావ్యాంతర్గత శ్లోకమునుగూర్చి "సంహారావసరే రుద్రస్య భవాభిధాన మనుచితమేవ" అని చెప్పి శాసించుటయందలి నిర్భయత్వ నిష్పాక్షికత్వ సత్యాన్వేషణప్రవణతలు నేఁటి విమర్శకలోకమున కాదర్శ పాత్రము గాదగియున్నవని మనవిచేయుచున్నాను. కాళిదాసుని యెడకన్న నిటఁ గల విశేషమేమన్న మూలగ్రంథ మౌచిత్య సుభగంబులైన పదంబుల సిద్ధపఱచియుంచినను గేలావనవధానతా కారణముగా నవియనాదృతములైన వనుటయే!

భారతి ఏప్రెల్ సంచికలో నుద్ధృతములైన విషయములఁ గొన్నిటి నిటఁ బరీక్షింతము. కణ్వుఁడొంటరిగా మాలినీతీరమునకు వెళ్ళినట్లు మూలమునఁ గలదఁట. కులపతివెంట శిష్యులు వెళ్ళకుందురా యని యాక్షేపము. పైగా రాజక్కడక్కడ కొందఱి విప్రుల

జూచినట్లు చెప్పియు వారాతని కాతిథ్యమిచ్చి సత్కరించినట్లుఁ జెప్ప కుండుట మూలమునందలి లోటుఁట. దుష్యంతుఁడు పిలువవలసివచ్చుట యసమంజసమఁట. ఏవంవిధలోపములనెల్ల నన్నయ సరిదిద్దెనఁట. కణ్వుఁడు కులపతి నిజమే. అనఁగా నేమి ? కొందఱు విద్యార్థులకు గ్రాసవాసాది సౌకర్యములిచ్చి విద్య బోధించు నాచార్యుఁడన్న మాట. నేఁటి 'రెసిడెన్షియల్ యూనివర్సిటీ'వంటి దాని నడుపుచున్న మహర్షి. అట కణ్వకుటీరము ప్రత్యేకముగను తదితర విద్యార్థుల నివాస్థానములు వేఱుగను నుండును. దుష్యంతుఁడు కణ్వదర్శనార్థమై తద్ గృహవాటికకే వెళ్ళినాఁడు. 'తత్ర తత్రద విప్రేంద్రాన్ నియతాన్ సంశితవ్రతాన్ జప హోమపరాన్ విప్రాన్ దదర్శ' అని మూలమునఁ గలదు. కాని 'తత్రతత్ర' అనుటచే మార్గమున వచ్చుచు నెడనెడ నల్లంత దవ్వునఁ జూచుట ద్యోతిత మగుచున్నది. మఱియుఁ జూచినది "నియతాన్, సంశితవ్రతాన్, జపహోమ పరాన్" అని తత్తత్కార్యవ్యగ్రులను. అట్టి స్థితిలో నున్నవారు కణ్వుని కుటీరముం గూర్చి పోవుచున్న జనమును నిల్వరించి యాతిథ్య మీవలయుట యెట్టి ధర్మమో యెఱుఁగ రాకున్నది. వారా,తత్తత్కార్య దీక్షితులు; దుష్యంతుఁడా కణ్వునాశ్రమము త్రోవ నరుగుచున్న వాఁడు; కణ్వునింట నాతిథ్యమిచ్చువారును లేకపోలేదు ఇప్పట్టునఁగాళిదాసుని శాకుంతలమును జూడుఁడు. త్రోవ నెదురైన వైఖానసులు రాజున కాతిథ్యమిచ్చుటకుఁ దిరిగిరాక, కులపతుల వారింట లేరని యెఱింగియు వారి కూతురట నాదరింపఁగలదని చెప్పి తమదారిం బోవుచున్నారు. కావున నిట మూలము సర్వథా సంగతమును సహజమును. అటఁగల వారెల్లరును రాజుం జుట్టముట్టి యేదో వింతవస్తువుం జూచినట్లు చూచుటకాని, స్త్రీజన మిరుకెలంకుల నున్నతస్థానములనుండి విభ్రమ ముతోఁ బరికించి లాజలఁజల్లుటకాని జరుగుటకదినగర విశేషముగాదు; శాంతి సమావృతమైన నిరీహమైన మునిపల్లె.

ఇప్పట్టున నింకొకమాట. నన్నయభట్టు మూలమున లేని శోభను గూర్చినాఁడని మురిసిపోవుచున్న పద్యము.

చ. అతిరుచి రాగతుండయిన
యాతనికిన్ హృదయప్రమోద మా
తతముగ నవ్వనంబున ల
తాలలనల్ మృదులానిలావ వ
ర్జిత కుసుమాక్షతావలులు
సేసలు పెట్టిన యట్టిరై రి సం
పత దళినీ నినాద మృదు
భాషలదీవనలొప్ప నిచ్చుచున్.

అవినయార్థస్ఫోరకమే. ఏమన నీ లతాలలనల చర్య నాగరిక స్త్రీ జనవృత్తమును బోలి సాధారణోద్యాన వనలతా విషయమున కలవడందగినదే కాని ఋష్యాశ్రమంబుల వనంబుల కనుచితమే కదా! ఇట మూలమిట్లు-"మనోరమం మహేష్వాసో వివేశ వనముత్తమం మారుతా కలితా స్తత్ర ద్రుమాః కుసుమ శాఖినః పుష్పవృష్టిం విచిత్రాంతు వ్యసృజం స్తే పునః పునః దివస్పృశోఽథ సంఘుష్టా పక్షిభిః మధుర స్వనైః" అని. నిశ్చలము, శాంతమునైన యాశ్రమ వాటికర నారాజును దవితరులును ప్రవేశించుటయు నచ్చటి వృక్షాగ్రములనున్న పక్షులు బెదరి పైకెగిరిపోయి కూయం దొడంగినవి. తదుత్పతన వేగమున, బహుమారు తోచ్చలితమై శాఖలనుండి పూలు రాలినవి. ఇది స్వభావసుందరము. ఈ సంఘటనయందు ద్విజాశీర్వాదములతో చేతులెత్తి పూలుజల్లి యభ్యాగతుని సత్కరించు నీతి "చెట్లును నెట్లు నేర్చెనో"యనిపించి కణ్వాశ్రమవాస ప్రభావమని సూచించి యుదాత్తరమ్యముగా, జిత్రించినాడు వ్యాసభగవానుండు. ఈ రెంట నేది ప్రశస్తమో రసికులకే యెఱుక.

ఇంక కణ్వుండొక్కండే వెళ్ళినట్లు మూలమున నున్నదనుట సరిగాదు. శకుంతలంగూర్చి కణ్వమహాముని యెందరిగెనని దుష్యంతుం డడుగంగా నామె 'గతః పితామే భగవాన్ ఫలాన్యాహర్తు మాశ్రమాత్' అని సమాధాన మిచ్చినది. నన్నయయు నిప్పట్టున

'కలిచ్చరవేఁటవచ్చి యిటఁ గణ్వమహామునిఁ జూచి పోవఁగా వచ్చితి 'మెందుఁ బోయిరొకో వారని' దుష్యంతుఁడు ప్రశ్నింపఁగా 'ఈక్షణమ యేగిరి కానకు బండ్లుదేర'నని శకుంతల సమాధాన మిచ్చినట్లుగానే చెప్పియున్నాఁడు. మఱియు 'నంత నమ్మహాముని వనంబునుండి కంద మూల ఫలంబులు గొని చనుదెంచి' అనియు నాతఁ డొక్కఁడే యరుగుటను నిర్ధారించినాఁడు. కాఁగా 'అసంఖ్యాకులైన యాతని శిష్యు లేమైరి' ఈ మొదలైన ప్రశ్న పరంపర నన్నయ కథాభాగము పట్ల సైత ముదయింప వలసినదేకదా! ఇంతకును గణ్వుఁ డేట నని ప్రశ్న, ఫలాహారణమున కేగెనని సమాధానము: ఇటఁ గణ్వేతరులైన శిష్యాదుల ప్రసక్తి యప్రస్తుతము. కణ్వుఁడు గులపతియై యాతని శిష్యు లాతనివెంటఁ బోవుట సహజధర్మమైనచోఁ బోయి యే యుందురు, రాజు నాగమనమును జెప్పినప్పుడు తద్భృత్యానుగ మనము ప్రత్యేకముగా వాచ్య మొనర్ప నక్కరలేకయే యూహ్యా ముగదా!

మఱి మిగిలినది దుష్యంతుఁడు దనరాఁక దెల్పుకొనవలయుట దోషమను విమర్శ. రాజు కణ్వుని యింటివద్దకు వచ్చినాఁడు. బైట నెవరును లేరు, కణ్వుఁడింట లేఁడుగదా! మిఁగిలిన స్త్రీజనము (భారత కథను బట్టి శకుంతల యొక్కర్తుకయే వలె నున్నది) లోపల నుండక వెలుపల కొలువు దీర్చునా? 'సోఽపశ్య మాన స్తమృషిం శూన్యం దృష్ట్వా తథాశ్రమం ఉవాచ క ఇహే త్యుచ్చైర్వనం సన్నాదయ న్నివ. శ్రుత్వాథ తస్య తం శబ్దం కన్యా శ్రీ రివ రూపిణీ నిశ్చ క్రామాశ్రమాత్తస్మాత్తాపసీ వేషధారిణీ' అని యప్పట్టున మూల కారుఁడు సందర్భోచితముగా గథఁ జెప్పినాఁడు. రాజు మునికొరకు జూచి కానక వెలుపల నెవరును లేకపోఁగా 'ఎవరిచ్చట' అని ప్రశ్నించి నాఁడు. ఆ మాట విని శకుంతల బైటకు వచ్చినది. ఇది యెంత సహజముగా నున్నది! ఇయ్యెడ నన్నయ కథ వినుఁడు—

చ. వలయు నమాత్యులన్ దగిన
వారలనుండఁగఁ బంచి ధారుణీ
తల విభుఁ డొక్కరుండ చని తన్విఁ
తన్విఁబయోజదళాయతాక్షి సం
కుల మిళితాళి నీల పరి
కుంచిత కోమలకుంతలన్ శకుం
తల యను కన్యకన్ గనియె
దన్మునివల్లభు మందిరమ్మునన్.

'మందిరంబునన్' - బైటకాదు. వెలుపల నెవ్వరును లేకున్నఁ గేక వేయుట ధర్మమో తొంగికాని తలుపుఁ ద్రోచికాని లోనివారిం జూచుటయే ధర్మమో విమర్శింపుఁడు. ఇంకొకటి, యిట రాజునకుఁ గంటఁ బడినది. 'తన్వి, ప్రయోజదళాయతాక్షి, సంకుల మిళితాళినీల పరికుంచిత కోమలకుంతల'. పరబాలికను జూచుటతోడనే ప్రత్యంగ సౌందర్యైకలగ్నమైన దృష్టి. ఆహా దుష్యంతుని శీల మెంతగాఁ బోషింపఁబడినది! 'శ్రీరివ రూపిణీ నిశ్చక్రామాశ్రమాత్తస్మాత్తాపసీ వేషధారిణీ' అన్న మూలమెంత గంభీరము. రాజు చూడవలెనని చూచుటకాదు. ఆశ్రమమునుండి బైటకు వచ్చినది. ఎవరు? తాపసి వేషమున నున్న యామె. కానియామె రూపుదాల్చిన కాంతిపుంజము వలె నున్నది. విద్యుల్లతంబోని యామె వచ్చుటయు నాతని కండ్లకు మిరుమిట్లు గొల్పినది. ఈ తాపసి వేషమేమి అనిపించిన దాతనికి. ఇంత సౌమ్యగంభీరభావమిం దిమిడ్చినాఁడు వ్యాసముని చంద్రుఁడు. 'శ్రీరివ' అంతే, ప్రత్యంగవర్ణనములేదు. మెఱపువంటి రూపము మాత్రమే యుద్భాసించినది. వివిధాంగవిభాసమువంక నాతఁడు చూడ లేదు. ఇందేది యుచితమో రమ్యమో చదువరులే నిర్ణంచుకొందురు గాక.

ఇఁక నొకటి. మూలమున దుష్యంతుఁడు గణ్వునిఁ దలంచుకొని తాను చేసిన పనికై దిగులు చెందినట్లుండ నది సరికాదని నన్నయ

శకుంతలయే భీతిలినట్లు సవరించి శోభాతిశయమును గూర్చెనని యొక ప్రశంస. 'పురుషునకు పరవనితాసాంగత్యము సామాన్యదోషమే యగును గాని మహాపరాధము మాత్రము కానేరదు. స్త్రీ, పాలకుని యనుమతి లేకఁ బరపురుషునివంకఁ జూచుటయ మహాపరాధము. పురుషుఁడు స్వతంత్రుఁడు. స్త్రీ కేవల మస్వతంత్రురాలు.' అని యేమేమో ఉపపత్త్యాభాసకల్పన. ఏమైనను గణ్వునకు శకుంతల హృదయానందిని యైన కూతురు, దుష్యంతుఁడు పైవాఁడు. తప్పు గలిగినప్పుడు తమ వారిపైకన్న నితరులపై నెక్కుడు కినలు పూనుట లోకసహజము. కనుక దుష్యంతుఁడు భీతుఁడగుట సహజము. ఇంకొక విశేషము 'నన్ను గాంధర్వమున వివాహమాడు'మని దుష్యంతుని హెచ్చరిక. 'మా తండ్రిగారు ఫలములకై యరిగినారు, వారు త్వరలోనే రాగలరు, ఒకక్షణ మాగుము, వారై నన్ను నీ కిచ్చి వివాహము చేయఁగలర'ని ధర్మబద్ధమైన శకుంతలా సమాధానము. పాప మామె కేమి తెలియును! కల్లకపటము లెట్టివో తెలియనైన వీలులేని ఋషివాటికఁ బెరిగినది. సాధుహృదయగా నున్నది. వివాహమాడుటకదా నృపు నభిప్రాయ మనుకొన్నది. ఋషిమాత్ర మందుల కంగీకరింపకుండునా యని భావించినది 'తపోవన సంవర్ధితోఽనభిజ్ఞోఽయం జనః కైతవస్య' అన్న కాళిదాసోక్తి ననుస్మరింపుఁడు. మఱి నృపుఁడన్ననో రాజకార్యములఁ దీర్చి స్వతంత్రోపాయజ్ఞుఁడై యారితేరిన ప్రోఢ. ఐశ్వర్యమత్తతచే వికారము లావరించునఁట! ఇట నాతనికిఁ దత్కాల జృంభితమైనది కామాపేక్ష. దానిఁ దీర్చికొన జిత్త ముద్వేగ మగుచున్నది. ఆలస్యమైనఁ గణ్వుఁడు వచ్చునేమో! గాంధర్వ వివాహమన్న మంత్రహీనమును రహస్యమైనదియు నని నిర్వచించి యది శాస్త్రీయమైన పద్ధతి యని నచ్చఁజెప్పి క్షత్రియుల కదియే ప్రశస్తమని నిరూపించి యా యమాయకురాలి నొప్పించి 'ముహూర్త' మైనను దన తుచ్ఛకామావేశమును నిలువరించుకొనలేక కక్కుర్తిపడి యాసాధ్వి నంటుగావించి యావెనుకనైన పండ్లకు వెళ్ళిన కణ్వుఁడు వచ్చునంతకు నిల్చు ధైర్యముచాలక మళ్ళి వెళ్ళిపోయినవాఁడు, దుష్యంతుఁడు.

స్వరూపిణియై ధర్మసంరక్షణ మొనర్పవలసిన మహారాజగు దుష్యం తుని వాక్యములు యథార్థములని విశ్వసించి శాస్త్రీయమైన వివాహ మాతనితో జరిగెనని నమ్మియున్నది శకుంతల. ఇం దెవరు తమ నడవడికై కణ్వునకు శాపానుగ్రహసమర్థుఁడైన తపోధనునకు వెఱువ వలసి యున్నదో సహృదయులే ప్రమాణము. మూలకారుఁడు శకుం తలను 'విభ్రాజమానాం వపుషా తపసాచ దమేనచ రూపయౌవన సంపన్నాం' అని వర్ణించి యున్నాఁడు. నన్నయగారి శకుంతల కిట్టి తపస్సు దమము నున్నట్లు తోఁచదు. పైగాఁ జూచుటతోడనే 'అనంత విలాసంబున జయంతుండపోలె నున్న యతని దుష్యంతునిగా నెఱింగి' నదఁట. చూచుటయే తడవుగా నామె నాతని సౌందర్యమే యాకర్షిం చినది. ఇంత కనువేదురు గల బాలకు దమముచే నొప్పుచున్న తపస్వి నికి శీలమున నెంత యంతరముండును! ఇది నన్నయ శీలపోషణ సామర్థ్యము.

ఇటఁ గొన్ని ప్రసంగములు మాత్రమే పరామర్శింపఁబడినవి. కడమవికూడఁ దత్త్వైకనిర్ణయ దీక్షతోఁ బరిక్షించినచో సత్యము గోచరింపకమానదు. ఉదాహరణప్రాయముగాఁ గొన్ని మాత్రము స్పృశించి నన్నయ సర్వోత్కృష్టకవి, వ్యాసాదులకును మిన్నయను స్వాభిమానపూరితభ్రమల గొంత తొలగించుటకే యీ ప్రయత్నము. ఇందలి గుణాగుణములయెడ సహృదయులైన విచక్షణులే నిర్ణాయకులు.

భారతి. జూన్; 1955.

. . . . . . . . . .

# సౌపర్ణోపాఖ్యానము — ఒక పరిష్కారము

శ్రీ వి. వి. యస్. శర్మ

"ఆయతపక్షతుండవాలి నఖ్యాలశైలము లెల్లనుగ్గుగాఁ
జేయు మహాబలంబునుఁ బ్రసిద్ధియునుంగల నాకు నీపనిం
బాయక వీపునం దవడుఁ బాముల మోవను వారికింబనుల్
సేయను నేమికారణము సెప్పుము దీనిఁబయోరుహాననా"[1]

పై పద్యమునందు సమన్వయము కొంత క్లిష్టముగనున్నది. 'నాకు నీ పనిం - బాయక వీపునంద వడుఁ బాముల మోవను' అన్న చోట, 'ఈపనింబాయక' యనగా, వీపునందవడుఁ బాములమోయుట, లేదా వారికింబనుల్ సేయుట యను నీపనిబాయకయని చెప్పవలయును. వీపునందవడుఁ బాముల మోవను, వారికిం బనుల్ సేయును, అను నీపనింబాయక యని యన్వయము కుదుర్చుకొనవలయునే కాని, అది సరళముగ కుదురునది కాదు. రెండింటికిఁ గలిపి, ఈ పనింబాయక యనుట, మరల నా పనులనే వివరముగా తెలిపియుండుటను బట్టి చూడగ, నన్నయభట్టారకు లిట్టి క్లిష్టాన్వయ భూయిష్ఠమైన రచన చేసి యుండరని తోచుచున్నది, ఇది పరిష్కారార్హమైన యంశమని తోచి, యీ పనికిఁ బూనుకొంటిని.

ఇది గరుత్మంతుడు తన తల్లియైన వినతతోననిన సందర్భము. కద్రువచేసిన వంచనము కతమున, వినత కద్రువకు దాసియైనది. ఆమెకు గరుత్మంతుడుదయించెను. తల్లి దాసి యగుటచేత, అతడు కూడ కాద్రవేయులకు దాస్యము చేయవలసి వచ్చినది. కద్రువ ప్రభుత్వమేర్పడ పనులు సేయుమని యజ్ఞాపించినది.[2] తల్లి యను యనుమతిని, వినయశీలుడై గరుత్మంతుడు దాస్యమున కంగీకరించి నాడు.[3] కాద్రవేయులు కోరినట్లు వారిని తన వీపున నెక్కించుకొని, దిశాపాలకుల లోకములన్నియుఁ ద్రిప్పిచూపించినాడు.

సూర్యమండలము సన్నిహితముకాగా, కాద్రవేయులు మూర్ఛ నొంది నేలపైఁబడిరి. కద్రువ యింద్రుఁ బ్రార్థించి, వారిని విగత పరితాపుల నొనర్చినది. తన కుమారుల కట్టి దైన్యము నాపాదించిన గరుడనిపై కినిసి యామె గర్వమున నులుక యతనిని. అతని తల్లియైన వినతను పనులుసేయ నాజ్ఞాపించినది. [4] పూర్వము ప్రభుత్వమేర్పడ నాజ్ఞాపించి నప్పుడు గరుడడు, తల్లి యనుమతిని యామె యాజ్ఞలంఁ దలఁదాల్చినాడు. కాని యిప్పుడామె, తన్ను, తన తల్లిని. ఐన పనికిని కాని పనికిని పంప నారంభించినది. అదియును గర్వమున. పరాక్రమ వంతుడు పరగర్వరేఖనోర్చగలడా ? అది యాతని కసహ్యముగ నుండెను. ఐనను కొంతకాల మోపికఁ బట్టెను కాబోలు, ఒకనాడదియు నసహ్యమైన దేమో, తల్లిని సమీపించి, తన హృదయ వేదనను వెల్ల డించినాడు. వినయశీలుడగుటచేత, కద్రువయాజ్ఞల నతడు తిరస్క రింపలేక పోయినాడు. కాని తామీ విధమున సేవజేయవలసిన కారణ మేమియని వితర్కించుకొనినాడు. ఆలోచనాపరుడగుటచేతను, వినయ శీలుడగుటచేతను, వివేకముతోఁ దమయప్పటి స్థితిగతులను విమర్శిం చుకొని, హేతువు నరయఁజాలక, తల్లినే యడిగి తెలిసికొనుట మేలని భావించినాడు. కావుననే తల్లిని పై విధముగ ప్రశ్నించినాడు. ఆ ప్రశ్నించుట యెట్లున్నది? తన యాలోచనాధార నందిమిడ్చి, సహే తుకముగ ప్రశ్న వేసిట్లున్నది. 'తాను కులశైలమునెల్ల నుగ్గుగాఁ జేయు మహాబలము గలవాడు. కేవలము బలవంతుడగుటయె గాదు, ప్రసిద్ధియును గలవాడు. అనగా నతడు బలవంతుడను విషయము లోక మునకు సువిదిత మన్నమాట, అట్టివాడు 'వీపునందవఁడు బాముల మోవను, వారికింబనుల్ సేయనినేమి కారణమని సందేహమును వెలిఁబుచ్చినాడు. కాద్రవేయులనక, అవడుబాముల (నింద్యమైన పాముల) మోవనేల నన్నాడు; అంతియేకాదు వారికి పనులు సేయు టయు తప్పుటలేదేయని, వారియెడ తనకుగల యేహ్యభావమును ప్రకటించినాడు. దాసీపుత్రులు, తమ యజమాని సంతానమును వీపున మోయుచునే, వారు పురమాయించిన పనులు సేయుచుండుట

లోకసమాజమైన విషయమేగదా! అంతకన్న హీనస్థితి లేదని ధ్వని. నికృష్ట దాస్యమని స్పష్టము. అట్టి దాస్యమును చేయవలసిన గతి తమకేల పట్టవలయును? అందును తనవంటి మహాబలసంపన్నుని కుమారునిగఁ బొందిన వినత యిట్టి దైన్యము నొంద నేలయని యాతని యావేదన. అదియే పై పద్యమున కొట్టవచ్చినట్లు స్పష్టపరచఁ బడినది.

సాధారణముగ లోకమున బలవంతునకు లొంగియుండి బలహీనులు దాస్యము సేయుట యున్నది. కాని మహాబలసంపన్నుడైన వాడు, తనకంటె బలహీనులకు, అందును నింద్యములైన పాములకు లొంగి దాస్యముచేసి బ్రతుకవలసిన దుస్థితియేల కలుగవలయును? ఇది గరుడని యాలోచనాధార. ప్రస్తుతస్థితి లోక వ్యవహారమునకు, అత్యంతము భిన్నముగ నున్నది. అసంబద్ధముగ నున్నది, దీని కేదియో బలవత్తరమైన కారణముండి తీరవలయును. అనగా ప్రస్తుత స్థితిలో సేవ్యసేవక న్యాయము, అసంబద్ధముగనున్న దన్న మాట. అనగా గరుడుడు కాద్రవేయులకు సేవఁజేయుటయందా యసంబద్ధత భాసించు చున్నదన్నమాట. కాగా సేవించుచున్న గరుడని మహా బలసంపద సుస్పష్ట మొనర్పబడినది. సేవ్యులైన కాద్రవేయుల విష యమున కేవలము 'అవడుఁ బాములు', అనుట చేత నింద్యమైన పాములని మాత్రమే చెప్పబడినది. కాని యసంబద్ధతను స్పష్టము చేయుటకు తగిన విధమున వారి నైచ్యము వర్ణింపబడియుండ లేదు.

పుట్టినవెంటనే పైకెగసిన గరుడుడు, 'హరికులిశక్షతి యెఱుగని, పరతర పక్షములతోడి కులగిరివోలె' నున్నాడని నన్నయభట్టారకులు వచించియున్నారు.[5] పెరిగి పెద్దవాడైన పిదప, తన్నుగూర్చి తాను చెప్పకొనుచు, కులశైలములునైన నుగ్గుగాఁ జేయగలనని గరుడుడు చెప్పుకొన్నాడు. అనగా పుట్టిననాడే కులశైలవములతో సామ్యమువందియున్నాడు. పెరుగుటచేత వానినిప్పుడు నుగ్గుగాఁజేయ గల సమర్థుడైనాడని సూచన. కులశైలములు హరికులిశక్షతి యెఱుగవు. అట్టి వానిని గూడ నుగ్గుగాఁజేయగల ననుటచేత, ఇంద్రుని

కసాధ్యమైన దానిని తాను మించి సాధించగలడన్నమాట. అట్లనుట చేత గరుడుడు, ఇంద్రుని మించిన వాడనియు, నాతని జయింప సమర్థుడనియు ధ్రువపడుచున్నది. ఇది భావ్యర్థ సూచకము. మునుముందాతడు మహేంద్రుని జయించుటయు, హరికులిశక్షతి యాతని యెడ వ్యర్థమగుటయుఁ జూడ నిది సమంజసముగనే తోచును. ఆ తరువాత తల్లి వలన తమ దాస్యమునకు హేతువునెఱింగిన గరుడుడు, కాద్రవేయులతో,

"మా యీ దాస్యము వాయు ను
పాయము సేయుండు నన్నుఁ బనుపుం డిట్టు
పాయది దానిన శెత్తు న
జేయుడనై యమరవరులఁ జేకొనియైనన్" 6

అని వీరాలాపములాడినాడు. ఇందు, 'అమరవరులఁ జేకొనుట', యనగా, అమరశ్రేష్ఠుల జయించుట యని యొక యర్థము. అమరశ్రేష్ఠుల నాదరించుటలేక స్నేహము చేయుట యనునది యర్థాంతరము. ఈ రెండర్థములు ప్రస్తుతములై సహృదయావర్జకములుగ నున్నవి, గరుడుడట్లు కోరగా, కాద్రవేయులు, 'అమృతమును తెమ్మ'ని కోరుకొందురు, ఇదియెట్లున్నదనగా, గరుడని వాక్యములందలి ధ్వనిని గమనించి, కాద్రవేయులట్లు కోరిరో, వారు కోరఁ బోవునది యమృతము కనుక దానికి తగినట్లు మహాత్ముడైన గరుడనినోట, యట్లమృతమును సాధించుట కనువైన, ఇంద్ర పరాజయము భావ్యర్థ సూచనమై బయల్వెడలినదో, తేల్చి చెప్పుటకు వీలుకాకపోవచ్చును. కాని యిట్లు పొంది పొసగియుండునట్లు రచించిన నన్నయభట్టారకుల శబ్దప్రయోగౌచిత్యము కథా కథన శిల్పనైపుణ్యము, ప్రశంసార్హములు. ఇంత యేలచెప్పవలసి వచ్చెననగా, నన్నయభట్టారకులు కథా కథనమునందింత శ్రద్ధవంహించి, ప్రసన్న కథా కవితార్థయుక్తి సంపన్నులై వచించియుండగా 'సౌపర్ణోపాఖ్యానము' నకు నాందీప్రాయమైనదియు, భావి కథా సూచన సమర్థమైనదియు నగు నీపద్యము

నందు, క్రీస్తాన్వయ మెట్లు దాపురించెనని ప్రశ్నించుకొని చేసిన విచార మును స్పష్టము చేయుటకు.

పూర్వ కవికృతములైన బహుకార్యములందు లేఖక దోషము లుండుట చూచుచునే యున్నాముగదా! ఇందును లేఖక దోషము న్నదని నా యభిప్రాయము. నన్నయగారు, 'వీపునంబాయక' యని వ్రాసియుందురు. దానిని లేఖకుడెవ్వడో, 'నీ పనింబాయక' యని వ్రాసియుండును. రెండింటికిని వ్రాతలో భేదము చాల తక్కువ. వీపునంబాయక యన్నచో, గరుడుడు, కాద్రవేయులనెల్ల వేళల మోయవలసి వచ్చెనే యని వేదనాయమైన తనమనోభావమును వెల్ల డించిన సందర్భమునకు తగియున్నది. అప్పుడు తరువాత సమన్వయ మెట్లన్న ప్రశ్న పుట్టును. 'వీపునంపాయక వీపునందవడుంబాముల మోవను' అనురీతి పరిష్కారము సిద్ధించును. ఇట 'వీపున' యను మాట పునరుక్తి దోషము నాపాదించు నదగును. ఇది సరికాదు. రెండవచోట 'వీపున' యనికాక మరియొక శబ్దముండి యుండవలయును. పరిశీలించినచో 'బొమ్మనంద వడుంబాముల' యను పాఠాంతరము కానిపించును. పక్షులు బొమ్మన నెట్లు మోయును? అవి వీపున మోచునవిగదా యని యాశంకించుకొని, పరిష్కర్తలు 'వీపునంద వడుంబాముల'యని పరిష్కరించినట్లు తోచుచున్నది. కాకున్నచో బెక్కు ప్రతులలో, 'బొమ్మనన్' అనియుండగా దానిని 'వీపునన్' అని మార్చి యుండనేల? కావున నిచ్చట పక్షుల బొమ్మన మోచు నవిగా వను భావన చేత దోషభ్రమగలిగి. దానిని 'వీపునన్' అని మార్చిరని తలంతును యథార్థమున కిచ్చట దోషమేలేదు.

'బొమ్మనందవడుంబాముల' అనికాక, 'బొమ్మనందడవు. బాముల' మని యుండనోపును. 'ట' ప్రతియందున్న పాఠమే సరియైనదని అప్పుడు, 'బొమ్మనన్ + తడవు' అనగా బొమ్మతోం బ్రాకునట్టి పాములు అని యర్థము సిద్ధించును. అనగా 'ఉరగ' మను సంస్కృత శబ్దమునకు, అచ్చ తెనుగు సమాసమన్న మాట. ఇట్లనుటచేత కాద్ర వేయులు కాలు చేతులు లేని హీన జాతి వారవియు, వారు నేలపై ప్రాకుచు జీవించు నికృష్ట జీవనుల నియు యెత్తి పొడుపు స్పష్టముగ

# ఋుశ్య శృంగర్షి. నన్నయ : విశ్వనాథ.

శ్రీ కేతవరపు వేంకట రామకోటిశాస్త్రి

ఋుశ్య శృంగర్షి కథ రామాయణమున నున్నది. భారతమునను నున్నది. రామాయణమునకు ఋుశ్యశృంగునితో గల దగ్గరతనము భారతమునకు లేదు. భారతమున ఋుశ్యశృంగుని వృత్తాంతము ప్రాసంగికముగ చెప్పబడినది. రామాయణమున ప్రధాన కథా. సంబంధగా చెప్పబడినది. ఋుశ్యశృంగుడు లేనిచో రామాయణములేదు. అతడు లేకపోయినను భారతముండును. రాముడు లేనిచో రామాయణములేదు. దశరథుడు పుత్రకామేష్టి చేయనిచో రామావతారముండదు. మరొకరు ఋుత్విజులుగా నుండిన ఇష్టి కాదా యనిన అగును. ఇష్టి యగుట కాదు ముఖ్యము. ఇదియే ముఖ్యమైనచో ఆ యజ్ఞమును ఋుశ్యశృంగుడే నిర్వహించవలయును. ఇది దేవరహస్యము. కనుకనే ఇతడు లేనిచో రామాయణమే లేదని చెప్పుట. భారత కథా విధానములేదు. కాలకర్మ ప్రభావములకు లోనైన ధర్మరాజు వనము లందుండి, కాలము వెళ్ళబుచ్చుకొనుటకు తనకు కనుపించిన బృహదశ్వ, నారద, రోమశ, మార్కండేయాదుల నేవేని కథలు చెప్పవలసినదిగా కోరును. ఉత్తమ పురుషుల కథలు, ధర్మసూక్ష్మములు వినుట ఉభయతారకమని వానిని వినిపింపవలసినదిగా కోరును. ఆ ఋుషులు చెప్పుదురు. రోమశుడీ ఋుశ్యశృంగుని కథను ధర్మరాజునకు చెప్పినాడు. అగస్త్యోదంతము, గంగావతరణము హేమకూట మాహాత్మ్యము చెప్పుచు నడచుచు నల్లదె ఋుశ్యశృంగుడను మునిప్రాదమని చెప్పినాడు. ధర్మరాజాకథ చెప్పవలసినదిగా కోరినాడు. రోమశుడు చెప్పినాడు. ధర్మజుడూ కొట్టినాడు.అంతవరకే ఆ కథకు భారతమునగల ప్రాధాన్యము. భారతమున ప్రధానేతివృత్తము దీనివలన మారుటగాని- సాగుటగాని ఏమియులేదు. కనుకనే ఋుశ్యశృంగుడు లేకపోయినను భారత ముండునని చెప్పుట.

వ్యాస వాల్మీకులతో నీ వ్యాసమునకు సంబంధములేదు. భారతమును నన్నయ వ్రాసినాడు. రామాయణమును చాలమంది వ్రాసిరి. రంగనాథ, భాస్కర, రఘునాథాదులు ముఖ్యులు. నవ్యులలో నొకరు భారతమును, ఒకరు రామాయణమును వ్రాసిరి. భారత కర్తయైన నవ్యునితో మనకు నిమిత్తములేదు. రామాయణ కర్తయైన నవ్యుడు విశ్వనాథ. ఈయనచే వ్రాయబడిన ఋశ్యశృంగుని కథను వెనుకటి వారి కథలతో పోల్చిచూచి గుణ నిర్ణయము చేయుటకే వ్యాసముద్దిష్టము. నన్నయ విశ్వనాథులను పోల్చుట యనగా రంగనాథాదులను సందర్భానుసారముగ పేర్కొనుచు పోల్చుట యని గ్రహింపవలయును. నన్నయతో విశ్వనాథకు తాదాత్మ్యమున్నది. పురా మహాకవు లందరి తోడను నున్నది. ఇది మహాకవి లక్షణము. నన్నయ విద్యాదయితుడు. విశ్వనాథ కవితారూప తపస్సమాధి గత చేతస్కుడు. అతడు గాఢ ప్రతిభుడు. ఇతడు పోవా సర్వ కవిత్వ మర్మవిదుడు. అతడు నానారుచిరార్థ సూక్తినిధి. ఇతడు బ్రాహ్మీమయ మూర్తి. ప్రసన్న కథా కథన శిల్పానేక మార్గాభిరామ వేతృత్వము విశ్వనాథది. కనుకనే నన్నయతో విశ్వనాథను పోల్చి చూడవలసియున్నది. రంగనాథాదులు విశ్వనాథ వ్రాసిన ఒక్క కథను మాత్రమే గాక, ఆ గ్రంథమును సర్వమును వ్రాసిరి. పూర్వరామాయణ కర్తలలో వారు శ్రేష్ఠులు. పూర్వకవీంద్రుల కావ్యప్రపంచమును క్రాంతదర్శిత్వమున దర్శించుట- పరిశీలించుట చేయగలవాడు కవియగుచో అతడు మహాకవి యగును. విశ్వనాథ అట్టివాడు. కనుకనే వారితో పోల్చదగినవాడు. ఆ పోల్చుటకే ఋశ్యశృంగుని కథను గ్రహించుట.

నన్నయ ఈ కథను 29 గద్య పద్యములలో వ్రాసెను. రంగనాథుడు 86 ద్విపదలలో వ్రాసెను. భాస్కరుడు (మల్లికార్జున భట్టు) 82 గద్య పద్యములలో వ్రాసెను. రఘునాథుడు 110 గద్య పద్యములలో వ్రాసెను. విశ్వనాథ 54 గద్యపద్యములలో వ్రాసెను.

అందరికంటెను తక్కువ మాటలలో ఋశ్యశృంగుని ఉదంతము చెప్పినది నన్నయ. ఋషులు ఎక్కువ యర్థమును తక్కువ మాటలలో చెప్పుదురు. నన్నయ ఋషి వంటివాడు. అదియునుగాక భారతమున నాకథ నంతకంటె యెక్కువ మాటలలో చెప్పరాదు. ప్రాసంగికముగ వచ్చిన కథ యది. నాలుగైదు విషయముల నూహించుట కవకాశము కల్పించుచు నొక విషయమును చెప్పుట నన్నయ కథాకథనములోని యొక శిల్పము. కనుక, నన్నయ తక్కువగనే వ్రాయును. రఘునాథుడందరి కంటెను ఎక్కువ మాటలలో వ్రాసెను. అతడు దక్షిణాంధ్ర యుగకవి ఆ యుగమున వర్ణన లెక్కువ. వాచ్యమెక్కువ వ్యంగ్యవిభవ శిల్పము తక్కువ. కనుక రఘునాథు డట్లువ్రాసెను. రంగనాథుని కంటె మల్లికార్జునభట్టు ఉత్తమకవి. కథను స్వయం సంపూర్ణముచేసి కథన శిల్పమును ప్రదర్శించుటలో మల్లికార్జునభట్టు కంటె విశ్వనాథ గొప్పవాడు. ఈ విషయమున విశ్వనాథ నన్నయ వంటివాడు కనుకనే నన్నయ విశ్వనాథలను పోల్చవలసి వచ్చినది.

రామాయణమునకు ఋశ్యశృంగునకు త్రెంచరాని విడదీయరాని సంబంధమున్నది. వనముల బడియున్న ఋశ్యశృంగుని దేశములోనికి తెచ్చినవాడు రోమపాదుడు. ఒక హేతువును పురస్కరించుకొని తెచ్చినాడు. అనగా తెప్పించినాడనుట. ఆ హేతువును ముందు సుస్పష్టముచేయుట కథను స్వయం సంపూర్ణము చేయుట. ఆ పని చేయుట రామాయణమున కొక క్రొత్తబిగువును దెచ్చుట. భారతమున నట్లు చేయనక్కరలేదు. సూచించిన చాలును. నన్నయ అట్లే చేసెను. విశ్వనాథ అవసరమును గ్రహించి బిగువు కూర్చెను. పూర్వ రామాయణ కర్తలలో ఒక్క రఘునాథుడు మాత్రము స్పష్టముగా నా హేతువును చిత్రించినాడు. అనావృష్టి హేతువు తత్ఫలితమును వర్ణించుట వలన రఘునాథుని చిత్రణము రక్తికట్టినది. విశ్వనాథయు వర్ణించినాడు. రఘునాథుడా వర్ణనమునకు సీసమొకటి, కందమొకటి, సీసమొకటి వాడినాడు. విశ్వనాథ ఒక ఉత్పలము - ఒక

సీసము వాడినాడు. ఇరువురి భావనయు దాదాపు ఒకటిగనే యున్నది. భావన యొకటియైనను కథన శిల్పము భిన్నమగుటవలన విశ్వనాథది పైచేయి అయినది. అనావృష్టియు, తత్ఫలితమును రోమపాదుడే పురోహిత బ్రాహ్మణులతో చెప్పినట్లుగా వర్ణించినాడు రఘునాథుడు. సుమంత్రుడు దశరథునకు చెప్పినట్లుగా వర్ణించినాడు విశ్వనాథ. ఇందొక విశేషమున్నది. పురోహిత బ్రాహ్మణులకు అనావృష్టియు, తత్ఫలితమును తెలియును. తెలిసిన వారికి తిరిగి విషయమును వివరించుటలో వాస్తవికత యుండిన నుండవచ్చును గాని శిల్పములేదు. అనావృష్టివలని ఫలితములు దశరథునకు మాత్రము తెలియవా? అట్టిచో సుమంత్రుడు దశరథునకు చెప్పినట్లుగా వర్ణించుటలో మాత్రము విశేషమేమి? అని అడుగవచ్చును. నిజమే. కనులముందు జరుగుచున్న విషయమును వివరించుటలో కంటె, తెలిసిన దయినను ఎన్నడో జరిగిన విషయమును చెప్పుటలో నొక విశేషమున్నదిగదా! దానినే విశ్వనాథ సాధించినాడు. ఇది మాత్రమేగాక మరొక రమణీయమైన కల్పన చేయుటవలన విశ్వనాథదైన పైచేయి విశేషమయినది. ధర్మము రాజానుమతము, ధర్మహానివలని అనావృష్టియైనది. తత్ఫలితమెంతవరకు పోయినదనగా 'పాడియావుల చన్నులు పట్ట నెత్రుధార లోడు' వరకు పోయినది. అధర్మ విజయమును సూచించుటకు భారతీయుల కింతకంటె కొలమానము లేదు. నాలుగైదు దినము లన్నము లేకపోయినను భారతీయాత్మ నిమ్మళముగనే యుండును. గోవు లేమాత్ర మస్వస్థములైనను అది కలగుండు కొనును. హాహారవము చేయును. అంగదేశ హృదయ మట్లు చేసినది. రాజ్యమొగసాల నిలిచి చేసినది. అపుడు రాజేమి చేయును? చేయవలయును? అనావృష్టి అంతకు పూర్వము చాల కాలము నుండియు నున్నది. అన్ని వారణోపాయములు రోమపాదుడాలోచించుచునే యున్నాడు. అనావృష్టివలన ఫలితములను ప్రజలనుభవించుచునే యున్నారు. సహించుచునే యున్నారు. ఆవులు నెత్రు లోడుటతో, కలతపడి ప్రజాహృదయము హాహారవము చేసినది దానిని రాజు చూచినాడు. మాటాడలేక

పోయినాడు. దైన్యము వేయి మానవాకృతులతో ప్రత్యక్షమైనట్లున్న ఆ ప్రజా సమూహమును జూచి రాజును దైన్యపడినాడు. ఏడ్చుచు వారిని చేవిసరి పంపినాడు. పురోహితులను మంత్రులను కనుగొని 'పాపమూర్తిపతిది. వికృతపు బాములు ప్రజలవి. ఈ యనావృష్టికే ప్రాయశ్చిత్తమో చెప్పుడు. అదియు శీఘ్రమేను గావించెదను' అని ప్రలాపించుచూ నడిగినాడు. అంతః పూర్వ మట్లు వారి నడుగలేదు. అడుగకపోయినను చెప్పవచ్చును గదా యనిన మార్గము దుర్ఘట మనియు, చేయ నసాధ్యమనియు వారు చెప్ప లేదు. ప్రస్తుతము రాజు ఆప్రాయశ్చిత్తమెట్టి దుర్ఘటమును, అసాధ్యమును నైనను చేయుటకు నిశ్చయించుకొనినాడు. నిశ్చయము వ్యక్తమైనది. ద్విజులు మార్గము నుపదేశించినారు. రోమపాదుని గూర్చి యింత వ్రాయుట కథను స్వయం సంపూర్ణముచేయుట. నన్నయ భారతమున నెంత వ్రాయుట అవసరమో అంత వ్రాసినాడు. విశ్వనాథ రామాయణమున నెంత వ్రాయుట అవసరమో అంత వ్రాసినాడు. భారతమున ఋశ్యశృంగు నకే ప్రవేశమున్నది గాని రోమపాదునకులేదు. కనుక నన్నయ ఒక గీతము, మూడు పాదముల వచనముతో రోమపాదుని స్థితిని యెరుక పరచి వదలినాడు. భాస్కర రంగనాథుల కంటె రామాయణ కథా హృదయమును రఘునాథుడు కొంచ మధికముగా నర్థము చేసికొని నాడు. కాని, తరచు అనౌచిత్యమునకు పాలుపడుట హేతువుగా వారి ముందు నిలువజాలక పోయినాడు. అనౌచిత్యములను సాధ్యమైనంత వరకు పరిహరించుచు గాఢమైన ప్రతిభకలిగి, రామాయణ కావ్యా త్మతో పూర్వులకంటె అధికముగా తాదాత్మ్యమును చెందుటకు శక్తుడైన విశ్వనాథ ఇంతవరకు వచ్చిన రామాయణ కర్తలలో శ్రేష్ఠుడు. రంగనాథుడు భాస్కరునకు చాలడు. రఘునాథ రామాయణ మంతయు లభింపకపోవుట, లభించినదానిలో అనౌచిత్యపు పాలధికముగా నుండుట కారణములుగా రఘునాథుడు పై వారికి తీసికట్టు. పూర్వరామాయణ ములలో ఒక్క భాస్కరరామాయణమే విశ్వనాథ రామాయణముతో

పోల్పించు కొనుటకు శక్యమైనది. కథా కథనమునను, పాత్ర చిత్రణ మునను - మన స్తత్త్వ నిరూపణమునను విశ్వనాథ కుశలుడగుట వలన తరచు భాస్కరుని కంటె పై చేయిగా కనుపించును.

అనావృష్టి దోషము నపనయించు మార్గమును ద్విజులు రోమ పాదునకు చెప్పిరి. ఋశ్యశృంగర్షి అంగదేశమున అడుగిడినచో వర్షము కురియునని చెప్పిరి. ఆ మాట విని రాజు 'మీరు వేగనని యాముని పుంగవుఁ దెండు' అనినాడనియు, 'ఏము చాల మప్పరమ తపోధనోత్తముని పాలికిఁ గాంతలఁ బంపు' వారు ప్రత్యుత్తరమిచ్చి నారనియు, అంత జనపతి వారస్త్రీలను రావించి 'మీరు చతురత తోడం జని ఋశ్యశృంగుఁ గొనిరండు' అనినాడనియు భాస్కరుడు వ్రాసినాడు. 'మునినాథు నగరి కేరీతి రావింతునని విచారముచేసి మంత్రులఁబిలచి మునులను రప్పించి యడుగ 'వారకాంతల బంపు'డని వారు చెప్పినట్లును తరువాత రాజు వారస్త్రీలను పిలచి చెప్పి పంపినా డనియు రంగనాథుడు వ్రాసినాడు. రఘునాథుడు భాస్కరుని వలెనె వ్రాసినాడు. బ్రాహ్మణులవలన విషయము నెరిగి బుద్ధిమంతులతో విచారించి విదగ్ధవేశ్యాంగనలను బిలువనంపి, చెప్పి, పంపినట్లు నన్నయ వ్రాసినాడు. అందరును వేశ్యలనే పంపించిరి. విశ్వనాథయు వేశ్యలనే పంపెను. ఉచితమును చమత్కారమును నైన నొక కల్పన చేసి పంపెను. మంత్రులతో విచారించి యదికాదని పెక్కు ఆలోచనలు త్రోసిపుచ్చి దారి తోఁచకయున్న సమయమున వింజామరలు వీచు వారయువతులు నలువురు తమలో తాము కన్గిలిపుకొని ప్రభువులు తాంబూలంబు దయ సేయించినచో పోయి ఆ ఋశ్యశృంగుని దెత్తు మనిరి. రాజు వారిని బంపెను. ఇట్లు సన్నివేశమును కల్పించుటలో విశేషమున్నది. ఋశ్యశృంగుని వృత్తాంతమును పురోహితులు రాజు నకు చెప్పుచుండగా వారస్త్రీలు వినినారు. అతడు స్త్రీ పురుష భేదము నెరుగని వాడని వారి మాటల వలన వ్యక్తమైనది. అట్టివానిని చూడవలయునన్న ఒక ఉబలాటము కలుగుట తగును. వారకాంతల

కది కలిగినది అతనిని చూచివచ్చుట రాజుగారి ప్రయోజనమును చేయుటగాదు. అతనిని గొని తేరవలయును. స్త్రీ స్పర్శ నెరుగక ముక్కు మూసికొని యున్నవారి నెందరను తమజాతి వెంటబడి తిరుగునట్లు చేసికొనలేదు? అట్టివారిని వశము చేసికొనుట యనునది వారస్త్రీజాతికి గౌరవాపాదకమే యగును. అది వారి జాణతనమునకు, రాసికత్వమునకును నిదర్శనము. అట్టిచో స్త్రీ పురుష భేద మెరుగని వానిని వశము చేసికొని వెంట పడవేసికొనుట తమ జాతిలో తమ్ము తామున్నతస్థితిలో నుంచుకొనుట. అందులకు వారుత్సహించిరి. 'అతనికి లోకమే తెలియదు. స్త్రీ పురుష భేదముకూడ నెఱుంగఁ'డని పురోహితులు రాజుతో చెప్పినప్పుడే వారి కాయుత్సాహము కలిగినది. తరువాత మంత్రులతో నాలోచించి ఆలోచించి 'అనావృష్టిచేఁ జెడియున్ మృత్యువు వద్ద నుండియు మునిఁ జేరన్ భయంబంట' అని రాజు ఒక దీర్ఘ నిశ్వాసము విడుచువరకు, వారస్త్రీల యుత్సాహము ద్విగుణమై త్రిగుణమై లోపల నిముడక హృదయమును ఛేదించుకొని వచ్చునంతయైనది. అట్లే వచ్చినది. ఇంత యుత్సాహము, పట్టుదల పూర్వరామాయణములలోని వేశ్యలకు లేదు. ఉండుట కవకాశము లేదు కనుక లేదు. రాజు వేశ్యలను పిలిపించి చెప్పి పంపుట కంటె వారే ముందుకువచ్చి తాము పోయి తెచ్చెదమనుటలో గుణమున్నది. కొత్తగా రాజుచేత పిలిపింపబడి, వచ్చినవారికి ఋశ్యశృంగుని యుదంము తెలియదు. రాజుగాని, తదితరులుగాని వారి కాతని విషయము చెప్పినట్లు పూర్వరామాయణకర్తలు వ్రాయలేదు. అందువలన పూర్వరామాయణములలోని వేశ్యలు ఋశ్యశృంగుని యాశ్రమ ప్రాంతములకు వెళ్ళుట— ఋశ్యశృంగుని గుర్తించుట— ఇత్యాదులెట్లు పొసగినవను ప్రశ్నములకు సమాధానము లంత తృప్తికరముగా నిచ్చుటకు వీలుపడదు. భాస్కరుడు మాత్రము చమత్కరించి ఒక సమాధానమును చెప్పినాడు. ఋశ్యశృంగుడు మెలగెడు వృక్షవాటి చెంతల వారస్త్రీలు నిలిచియున్న సమయమున నొక ఋషి యట

వచ్చిన 'ఓ మునిపుత్ర యేల యొక్కరుడవు జొచ్చి యీ విజన కానన భూమిఁ జరించెద'వని వారడిగి నట్లును దానికి సమాధానముగా నాతడు ఋశ్యశృంగుడనువాడ నని తన యుదంతము చెప్పినాడట. అందువలన వేశ్యలు తమ కౌశలమునుజూపుట కుపక్రమించినారట. ఇది భాస్కరుని కల్పన. రంగనాథునకీ సందేహము కలుగలేదు. సమాధానము వ్రాయలేదు. రఘునాథుని వేశ్యలు సుపరిచితమైన స్థలమును ప్రవేశించినట్లు ఋశ్యశృంగుని యాశ్రమమును ప్రవేశించిరి. తప్పటడుగులు వేయుటలో రంగనాథ, రఘునాథు లొకరినొకరు మించిరి. నన్నయ తానొక చమత్కారము చేసెను తాను పంపిన విదగ్ధ వేశ్యాంగనలలో నొక జరద్వేశ్యను గూడ నుంచెను. అది ఆరితేరిన గడుసరి. విభాండకుడు వన్యఫలాహరణార్థము వనమున కరిగిన యవసరము గుర్తించి అభినవ యౌవన విలాస భాసినియైన తన కూతు నా ముని పుత్రుని పాలికి పంపినదట. ఇది నన్నయ పద్ధతి. విశ్వనాథుని వేశ్యలు ఋశ్యశృంగుని కథను వినిరి. కావలెనని విశ్వనాథ వినిపింపలేదు. అట్లు కలిసివచ్చినది 'ఆ జనకుండు పుత్త్రవిరహంబు సహింపఁడు. విభాండకునన్ యెఱఁగి రావలె. తేవలె గుట్టువకాని' నను మాటలుగూడ వారు వినిరి. కనుక జాగరూకులరై తాము మెలగవలసి యున్నదను విషయము విశ్వనాథ రామాయణములోని వేశ్యలకు తెలియును. కనుకనే వారు 'విభాండకుని యాశ్రమంబున కుల్లయగు ప్రదేశంబున బండ్లువిగి యందు విడిసి' ఋశ్యశృంగుని రాకకై ఎదురు తెన్నులు చూచు చుండిరి. ఒకనాడు ఋశ్యశృంగుడు వచ్చినాడు.

రంగనాథ, రఘునాథుల వేశ్యలకు విభాండకుని గూర్చిన జ్ఞానమున్నట్లే లేదు. విభాండకుని యాలోచనలేక యాశ్రమమును ప్రవేశించుట వలన సమయమున కతడచటనే యున్నచో శపింపకపోడు. అపుడు వారు వచ్చిన కార్యము సాధ్యముగాదు. స్త్రీలను స్త్రీలగా గుర్తించగల జ్ఞానము విభాండకున కున్నది. కనుక అతడున్నచో కుపితుడై శపించుట యనివార్యము. ఋశ్యశృంగుడని తెలిసికొనిన

తరువాతనే భాస్కరుని వేశ్యలు ప్రసంగమునకు దిగిరి. కనుకనే ఇట విభాండకుని ప్రసక్తిలేదు. నన్నయగారి జరద్వేశ్య, విభాండకుడు లేని సమయము చూచి, తన కూతునా ఋశ్యశృంగుని పాలికి పంపినది. విశ్వనాథుని వేశ్యల నుల్లయగు ప్రదేశమున నుంచినాడు. అటు నిటు తిరుగాడుచు ఋశ్యశృంగు డటకు రావచ్చును. విభాండకుడు గూడ రావచ్చును గదా? అట్టిచో నాతడు వారిని శపింపక పోవునాయనిన, దూరముగా నున్నవారిని, పాంథులను, స్త్రీలను, అతడూరక యేల శపించును? అతడు వచ్చినపుడు వీరు హావభావ విలాసము లేల ప్రదర్శింతురు? ఋశ్యశృంగుడు వచ్చినపుడు తామన్నియు ప్రదర్శింపవలయునుగదా. అతనిని గుర్తుపట్టుట ఎట్లు? అతని కథ వారికి తెలియును గదా! అతనికి స్త్రీ పురుష భేద జ్ఞానములేదు. తన కంటె భిన్నమైన యాకృత్తి ప్రవృత్తి కలిగి తనవలెనె యున్నవారు కనిపించినచో మానిసి ఎంతవింతగా చూచును. ఆ వింత దనము, ఋశ్యశృంగుడటకు వచ్చినపుడు కప్పిపుచ్చుకొనలేదు. దానిని బట్టియే గ్రహింపవచ్చును. విభాండకున కట్టి ప్రవృత్తి యుండదు. కనుకనే వేశ్యలుల్లయగు ప్రదేశమున దిగినారని విశ్వనాథ వ్రాయుట.

యదృచ్ఛాగమనంబున నొకనాడు ఋశ్యశృంగుడు వేశ్యలు విడిసియున్న కాంతారాభిముఖుడై వచ్చినాడు. వారు చూచిరి. వీణయు, మృదంగమును, తాళములును ప్రమోయించిరి. నాయకురాలు గొంతెత్తి కృతులు వర్ణములు పాడినది. వేశ్యలు గానము చేసినట్లు రంగనాథుడు, భాస్కరుడు వ్రాసిరి. రఘునాథు డట్లు వ్రాయలేదు. నన్నయ, ఋశ్యశృంగుని చేరిన వేశ్య 'ముని ముందటఁ గందుక నర్తన మృదుగీతములయందుఁ దన కౌశలమెల్లను జూపి, విరచితాలింగనయై, మునిపతికి ముదము గావించెమది' నని వ్రాసినాడు విశ్వనాథ భారతశాస్త్ర సరణిని బాడిన యాపాటలు వినిన ఋశ్యశృంగునిలో కలిగిన ఆంతరములయిన మార్పులను వర్ణించెను. ఇది పూర్వకవు లెవ్వరును చేయనిపని. మానవ జీవితముపై గానకళా ప్రభావ

మెంతయుండునో యీఘట్టమున విశ్వనాథ నిరూపించినాడు. సంగీతము మానవుని ఎంత చైతన్యవంతముగ చేయగలదో అంత చేసినదా వేశ్యల సంగీత మా ఋశ్యశృంగుని. (అంత వారు నృత్యము జేసిరి. నాలుగం బుధుల వోలె చేసిరి. నర్తన కళా ప్రదర్శనమును గూడ చేసినారని మాత్రము రంగనాథుడు వ్రాసినాడు.) గానము చేసినారని చెప్పుటలో లేదు గొప్పతనము. దాని ప్రభావమును, తత్ఫలితమును చెప్ప గలుగుటలో నున్నది అదియే విశ్వనాథ చెప్పినాడు. ఆగానము వినుచున్న ఋష్యశృంగునకు "తన యాత్మం దానెరుంగని యొక్క యానందపరిధి రేఖాస్వయంవ్యక్తి కలిగి నై గగుర్పాడిచి వెనుకటి బిగువు చెడి క్రొత్త బిగువులను దెచ్చుకొనన'దట. కనులు విచ్చి చూచుచు నిలువబడిపోయినాడు ఋష్యశృంగుడు. అంతవారు నృత్యము చేసిరి. నాలు గంబుధుల వోలె చేసిరి. నర్తన కళా ప్రదర్శనమునుగూడ చేసినారని మాత్రము రంగనాథుడు వ్రాసినాడు. కేవలము నర్తనము చేసినారని గాక ఎట్లు చేసినదియు విశ్వనాథ వ్రాసినాడు. నాట్యశాస్త్రముతో వానికి గల పరిచయమునకిది నిదర్శనము. ఉచిత స్థలమున శాస్త్రపాండిత్యమును ప్రదర్శించుటను మహాకవులు చేయుదురు. విశ్వనాథ ఆకోవలోని వాడు. సంగీతమును, నృత్యమును, 'వినివిని, చూచిచూచి కను వేదుఱు తీరంగ వారిం జేరి' నాడు ఋశ్యశృంగుడు. కనులు చెవులు సుతరితముగా నొనరించినారని వారల పొగడి, ఆనందాతిశయమున వారిని అల్లనల్లన స్పృశించి కౌగిలించుకొనినాడు. ఒక తెలియరాని సుఖానుభూతికి లోనయి నాడు. పూర్వ రామాయణములలో కౌగిలి ప్రసక్తి లేదు, 'ఒడలెంతయు బులకింపంగ పుడికిం నారని మాత్రము వేశ్యలను గూర్చి భాస్కరుడు వ్రాసెను. ఆలింగన ప్రస్తావన భారతమున నున్నది. భాస్కరుడు – మఱునాడు వచ్చినపుడు వేశ్యలు వానిని పలుమాఱు కౌగిలించుకొనినా రనినాడు. నన్నయ విశ్వనాథ లిరువురును మొదటి నాడే కౌగిలింతలు జరిపించిరి. నన్నయ ఋశ్యశృంగుని వేశ్యయే

కౌగిలించుకొన్నది. విశ్వనాథ ఋశ్యశృంగుడు తానే వేశ్యలను కౌగిలించుకొనెను. ఈ విషయమున నన్నయ విశ్వనాథులకు భేదమున్నది. నన్నయ సంయమనమున కిచ్చిన ప్రాధాన్యము కళా ప్రభావమున కీయలేదు. విశ్వనాథ కళాప్రభావము సంయమనమును లోగొనగలదని నిరూపించినాడు. నన్నయ వ్రాసినది కావ్యముగాదు. కావ్యత్వము నిముడ్చుకొనిన ఇతిహాసము. విశ్వనాథ వ్రాసినది ఇతిహాసముగాదు ఇతిహాస రేఖల నిముడ్చుకొనిన కావ్యము. ఇది సర్వమును సపర్యవసితము కావలయును. అందుకే నర్తన కళా సంగీత తతులను, వాని యాథార్థ్య స్వరూపమును చిత్రించినాడు విశ్వనాథ. భారతమున సంయమనమునకు ప్రాధాన్యమున్నది. కనుకనే, తరువాత విభాండకునితో ఋశ్యశృంగుడు జరిగిన వృత్తాంతమంతయు పూసగ్రుచ్చినట్లు తూచా తప్పకుండా చెప్పినట్లు నన్నయ వ్రాసినాడు. రామాయణ కర్త లెవరును, ఈ పని చేయలేదు. చేయగూడదు కనుక చేయలేదు. చేయవలయును గనుక నన్నయ చేసినాడు. భారతములోని ఋశ్యశృంగునకు వేశ్యచూపిన కందుక నర్త మృదుగీతముల యందలి కౌశలము వలన ముదము గలిగినది. రామాయణమునందలి ఋశ్యశృంగునకు తన యాత్మం దానెఱుగని ఒక ఆనందము కలిగినది. ముదమునకంటె ఆనందము గొప్పది. ఆనందము కలిగినది గనుకనే విశ్వనాథ ఋశ్యశృంగుడు వారిని తానుగా కౌగిలించుకొనినాడు. భారతమున నన్నయ ఋశ్యశృంగర్షి యందు నిగ్రహమును పరాకాష్ఠతో చూపినాడు. తన కౌశలము జూపి, విరచితాలింగనయైనగాని భారతమున వేశ్య మునిపతికి ముదము గావించలేకపోయినది. అధిక నిష్ఠాశీలుడైన ఋశ్యశృంగుని స్థితి భారతమున నన్నయ అట్లు చూపినాడు. వేశ్యలను ఋషికుమారులనియే రెండు గ్రంథములలోని ఋశ్యశృంగుడును తలచినాడు. కనుక రెండింటి యందును, కామవాంఛ రేఖామాత్రముగనైనను వాని హృదయమున పొడగట్టలేదు కళాప్రభావమునకు లొంగినవానిగా చిత్రించుట మూలముగా, కొందరు ఋశ్యశృంగునకు

వేశ్యల యందు కామిక యేర్పడిన దని తలంతు రేమోనని విశ్వనాథ, అంతగా వ్రాసియు చివరకు' అసమశరుడు తొంగిచూడడు ముని ఋశ్యశృంగు వంక' అని స్పష్టము చేసినాడు. అంత యానందమును గూర్చిన వారి యాశ్రమ భూము లొకమాఱు చూడవలయునన్న సాత్త్వికపు కోరిక మాత్రము కలిగినది. ఋశ్యశృంగునకని విశ్వనాథ వ్రాసినాడు. చనుదెంచిన 'తరుణి మునినందను చిత్తంబునకు వైకృతముఁజేసె'నని మాత్రము నన్నయ వ్రాసెను. మఱునాడు ఋశ్యశృంగుడు వారి వద్దకేగెను. పోదమా యనిన పోదము పోదమనుచు నందరును కదిలి అందరును అంగదేశము చేరిరి. అంతట వర్షము అదివరకేమియు తెలియని మునికుమారుడు అంగదేశ ప్రవేశమాత్రమున సర్వమును గ్రహించెను. సహజబోద్ధలు నిశ్చల తత్త్వమానసులని విశ్వనాథ సమర్థన. నన్నయ కూడ తన భారతమున నొక విషయమును సమర్థించినాడు. అది విశ్వనాథ సమర్థించినదానికంటె భిన్నము. వేశ్యను మఱునాడు ఋశ్యశృంగు డనుసరించుటను 'విలాసినుల సహాలాప సహాసన సహాయానములు బంధ సమములు' అను సిద్ధాంతమును చూపి సమర్థించినాడు. ఇనుపకచ్చడాలు కట్టుకొనిన మునులనుకూడ స్త్రీల మెయితావు గగుర్పొడిపించును. ఇక సామాన్యుల విషయము చెప్పవలసినదేమి ? అను విషయమును నిరూపించుటయే నన్నయ యుద్దేశము. తపస్సమాధిగతచేతస్కత మానవుని అత్యున్నత స్థానమున నిలుపగలదని వైదికమైన యభిప్రాయము. వేద తుల్యమైన భారతము వ్రాయు నన్నయ కున్నదియునదియే. 'సచ్చరితంబైన తన యాశ్రమంబువిడిచి మనుష్యయోగంబునందగిలి యక్కోమలి పిఱుందనచని' యెనని ఋశ్యశృంగుని గూర్చి నన్నయ వ్రాయుటలో నర్థమదియే. వాస్తవమును చెప్పి అవసరమును నన్నయ సూచించినాడు. ఆ సూచనకే ఋశ్యశృంగుని కథను వ్రాసినాడు. ఋశ్యశృంగర్షి పట్ల పొడసూపిన వాస్తవిక విషయమే రామాయణమునకు ముఖ్యము. సాంసారిక విషయ పరిజ్ఞానము ఋశ్యశృంగునకు కలిగినట్లు

వ్రాయవలసిన యవసరము భారతకర్తకు లేదు. ఆత్మసంయమనమును నిరంతరమును ఈవణత్రియము భేదించుటకే చూచుచుండును. కనీస మాజ్ఞానములేని వానిని గూడ అవిలోగొనునని భారతకర్త చేయ దగిన పని. దానినే నన్నయ చేసినాడు. సాంసిద్ధికమైన సాంసారిక విషయ పరిజ్ఞానము కలుగుటయే రామాయణమునకు కావలయును. ఋశ్యశృంగునకది కలిగినది. దానిని విశ్వనాథ సమర్థించినాడు. ఉచిత స్థలమున దేనిని సమర్థించుట యవసరమో దానిని సమర్థించుట మేధావంతులు చేయగలరు. నన్నయ, విశ్వనాథ లట్టివారు. ఋశ్య శృంగుని ప్రవేశపెట్టినప్పటినుండియు నన్నయ నిగ్రహము వైపునకు ములు సూపించుచు నడిపించి నడిపించి చివరకు 'విలాసినుల...బంధ సమములుగావె'అను సూత్రమును వ్రాసి ఋశ్యశృంగుని వేశ్యవెంట పంపినాడు. విశ్వనాథ ఋశ్యశృంగుడు గానమును వినుటకు ప్రారంభించి నప్పటి నుండియు ఆ మహర్షిలో ఎక్కడనో, అందని స్రోతులందు, అంకురింపకయే చివికిపోయిన భావసముదాయము, ప్రాణము పోసికొని నెమ్మదిగా పైకి వచ్చి చివరికొక క్రొత్త బిగువును కూర్చుకొని, పూర్వ మనను భూతమైన ఒక ఆనందానుభూతిని అతనికి కలిగించి నట్లుగా వ్రాసి, తరువాత నతడు వారిని కౌగిలించుకొని మాటాడి, వారిచ్చిన భక్ష్యముల నారగించి, తదుపరి తన యాశ్రమమునకు పోయి 'దినము దినము నారేయును వారలఁగూర్చి యూహాలూహిం చుచు ప్రొద్దునలేచి, వేశ్యలున్నచోటకువచ్చి వారితో కలసి అంగ దేశమునకు వచ్చినట్లు వ్రాసినాడు. నన్నయ ఋష్యశృంగుని నొక మార్గమున నడిపించినాడు. విశ్వనాథ మఱొకట నడిపించినాడు. నన్నయదృష్టి సంయమనముమీద,విశ్వనాథ దృష్టి సంసారముమీద. భారతమునకు నన్నయ యవసరము. రామాయణమునకు విశ్వనాథ యవసరము. ఋశ్యశృంగుని సంసారము వైపు త్రిప్పుటకు విశ్వనాథ సంగీతమును సాధనముగా వాడినాడు. సంగీత శ్రవణ మాత్రమున మహర్షి యట్లు బిగువుచెడి లోబడునాయని ప్రశ్న. అట్లయినచో

నాతని మహర్షిత్వము కుంటుపడిన యట్లేగదా ? కొంచెము కుంటుపడవలయును. అట్లు పడినపుడే భారత రామాయణకర్తల నిరూపణము రక్తిగట్టును. సంగీత మట్టి ప్రభావమును చూపగలదని తులసీదాసు కూడ వ్రాసినాడు. సీతారాముల కళ్యాణ సమయమునందలి గాన కళా ప్రదర్శనమునకు మహర్షులు, ధ్యానముద్రవిడిచి ఒక ఆనందము ననుభవించినారని తులసీదాసు వ్రాసినాడు. మహర్షుల తపోభంగము చేయుటకు వచ్చిన స్త్రీ జనము గానకళా నర్తన ప్రదర్శనము మునుముందు చేసినట్లుగనే మన పూర్వగ్రంథములు చెప్పుచున్నవి. కనుక గానకళకు సంయమిలోబడుట వింతగాదు.

విశ్వనాథ ప్రదర్శించిన కథాకథన శిల్పమును పూర్వులతో పోల్చి స్థూలముగపైన నిరూపించితిని. ఋష్యశృంగ పాత్రవిషయమున నన్నయ విశ్వనాథలకున్న దృష్టి భేదముకూడ కొంత వ్రాసితిని. నన్నయ విశ్వనాథలలో నున్న ఈ రెండు విశేషములు భాస్కరాదులలో లేవు. నన్నయకు లేని యవసరము విశ్వనాథ కున్నందున కథను స్వయం సంపూర్ణము చేసినాడీతడు. ఆ చేయుటలో రోమపాదుని పూర్తి మూర్తిని చిత్రించుట యొకటిగా వెనుక నిరూపించితిని. ఇక వేశ్యల పాత్రములున్నవి. వారి విషయము వ్రాసినగాని ఈ వ్యాసము సంపూర్ణముగాదు.

విశ్వనాథ, రాజునకు వింజామరలు వీచుచున్న వేశ్యలతో రంగము ప్రారంభించెను. వారు నలువురు. కుసుమ శర కోదండలస్తక మధ్యలు, తత్కార్ముక భ్రూయుగలు, తజ్జ్యాతనూలతల - అగు వార యువతుల నలువురని వ్రాసినాడు. నలువురకును మూడు విశేషములు వాడినాడు. నలువురకును నాలుగు వాడవచ్చునుగదా-వాడలేదు. అందరి మధ్యములు, అందరి భ్రూవల్లులు, అందరి తనూలతలు కూడ కుసుమశర కోదండుని లస్తకమును వలెను, కార్ముకమును వలెను, జ్యావలెను నున్నవట. ఇందొక విశేషమున్నది. అందరును అన్నింటి వలె నున్నను, ఒక్కొక్కరియందు ఒక్కొక్క గుణము త్రిగుణాపై

యున్నది. మరి నాల్గవదానిమాట-చెప్పబడలేదు. మిగిలినవారియందు వలె గాక ఈమెయం దన్ని గుణములును మూర్తి గట్టుకొని యున్నవి. ఈమెయే నాయకురాలు. వీణయును, మృదంగమును, తాళములును ప్రయోగించుటయే పై ముప్పురపని. గొంతెత్తునది నాయకురాలు ఈమెను, ఈమె పాటను చూచుటనే, వినుటనే మునుముందాముని బిగువు చెడినాడు. ఆ ముప్పురయందు కంటె నాయకురాలియందొక విశేషముండవలెనే, విశ్వనాథ ఆమెకు ప్రత్యేకముగా నొకవిశేషణము వాడలేదు. సూచించినాడు. రాజుతో మాటాడినది నాయకురాలు. ఆమె గడుసరియట కనుకనే "మౌనీంద్రుడున్ గొని మమతం దెత్తున్, క్షేమం జాలక ధృతి రానే రానీ పట్టణరమ సిగ్గేన్" అని 'పణవము' కొట్టి చెప్పినది. ఆ గడుసరి తనమునకు రోమపాదు డచ్చెరువడి "ముని శాపభీతి మీకు లేదా భీతహరిణ నేత్రలార! యన లవిత్రముల్ వోని చూపులు నిగుడ్చి మందముగ హాసించినారట వారస్త్రీలు. భీతహరిణ నేత్రలారయని రాజనగానే లవిత్రముల్ వోని చూపులు నిగుడ్చి పై పెచ్చు మందముగా హాసించినారనుటలో నున్నది కవిత్వము. వ్యంగ్యవైభవ వాసనయనగానది. హరిణ నేత్రములందముగా నుండును. హరిణమునకు బిత్తరపోవు గుణమొకటి సహజము. ఆ గుణము దాని నేత్రా పాంగములలో వ్యక్తమగుచుండును. అదియే ఆ నేత్రములకందము. స్త్రీల కన్నులట్లుండునని వర్ణించుట కవిలోక సామాన్యము. ఊరకే హరిణము భీతిగొనును. నిజముగా భయమే సంభవించినపుడు దాని కన్నులు చూడవలసినదేగాని చెప్పనలవిగాదు. రోమపాదుడా వేశ్యలను భీతహరిణ నేత్రలారయని సంబోధించినాడు. వారు రాజునకు పరిచారికలు. హరిణ నేత్రలైన వారు రాజుగారిని చూడగనే భీతహరిణ నేత్రులగుట వారి కలవాటు. అది మర్యాద. అతఃపూర్వము రాజు వారి భీతహరిణ నేత్రములనే చూచినాడు. నేడు వారు తాముగా ముందునకువచ్చి ఋష్యశృంగర్షిని గొనితెత్తుమనినారు. హితులు, పురోహితులు, మంత్రులు మునిని

చేరుటకు భయపడుచుండగా వారు తెత్తుమని ముందుకు వచ్చినారు. రాజును నచ్చెరు వడినాడు. తాను ప్రతిదినమును చూచు భీతహారిణ నేత్రలేనా వీరు. ? అను సందేహము కలిగినది, భీతహారిణ నేత్రలుగా కనుపించు మీకు మునిశాపభీతి లేదేమి యనినాడు. అపుడు వారు భీత హారిణ నేత్రలు కాదుగదా, హారిణనేత్రలుకూడ కాకుండ లవిత్రయ ముల్ వోని చూపులు నిగుడ్చిరి. ఈహఠాత్సంభవమునకు రాజచ్చెరు వడి గ్రహించుకొనినాడు. మా అసలు విషయము ప్రభువులకు దెలియదేమియని మందముగ హాసించిరి. లవిత్రములు వోని చూపులు నిగుడ్చుట వారు నేర్చుకొనిరి. ఆ నేర్పునంతకు పూర్వము ప్రదర్శించ వలసిన యవసర మేర్పడలేదు. భరతు నాగమ మెల్లను ప్రయోగ శైరిం దెచ్చినవారు వారు. ఆ చూపులు నిగుడ్చుట వారికొక లెక్కయా ? అలవోకగా వారట్లు చూచిరి. ఆ చూపులు రాజునకు వారి గుండె నిబ్బరమును చూపినవి. రాజు వారి నంపినాడు. విశ్వనాథ వ్రాసిన ఆ యాటవెలది పద్యములోని ఆ రెండు వాక్యములలో నింత అర్థమున్నది. ఈ పద్ధతిని నన్నయ వ్రాయగలడు. లవిత్రముడువోని చూపులు వారు చూడగా వారి గుండె నిబ్బరమును తెలిసికొనుటయే గాదు రోమపాదుడు చేసినది, ఋశ్యశృంగుని తప్పక ఆ చూపులను మెడక తగిలించి తీసికొనివత్తురు-అతడు వచ్చును-అని తాను ముందు గుండెనిబ్బరము చేసికొనినాడు. క్షణములో నింత వ్యవహారమును రెండు వాక్యములలో చెప్పి భాస్కరాది పూర్వ రామాయణ కర్తలను మించినాడు విశ్వనాథ.

వేశ్యలు బయలుదేరినారు. 'బాతినిగూడ మాదు మెయిబాపు గగుర్పొడిపించు నిట్టులే చేతము గల్గువారి నిఁకఁ జెప్పుమటంచును గువ్వకోలుగా నవ్వుచుఁ ద్రుళ్ళుచు-మధ్యమధ్య-'ఓసీ నవ్వెక్కువ నీకు' అని పరస్పర మనుకొనుచు బయలుదేరినారు. విభాండకుని, ఋశ్యశృంగుని తలంచుకొనుచు వెళ్ళినారు' విభాండకున్ మొఱఁగి రావలెనను వాక్యము వారు మరచిపోలేదు. కనుకనే మార్గ

మధ్యమున 'నిమా కోపంబున నోసి మిమ్ము నెవరందు పంపినారన్న భూవరుని చెప్పకుడు. ఏమె వచ్చితి మన పాడో నా బీడో నా' అని యనుకొనినారు. ఇది వారి స్వామి భక్తికి నిదర్శనము. ఇట్టి సమయములందు తప్ప వారు రాజునకు చేయు సాహాయ్యము మఱియొకటి లేదు. ఇట్టి యవకాశము మాత్రము తరచు వచ్చునా ? ఋశ్యశృంగుని గొని తెచ్చుట కుపక్రమించుటలో వేశ్యల కుత్సాహముతో పాటు ప్రభుభక్తియు నిరూపించి విశ్వనాథ వారికొక యున్నతి కలిగించినాడు. ఇంత ప్రభుభక్తిపరాయణలు గనుకనే, ఋశ్యశృంగుడు తమ్ము సమీపించి ఉరములు తాకుచు, పిరుదులు ముట్టుచున్న సమయమున 'భూపశ్రేష్ఠుని కూతు పెన్మిటనుచున్ బూజింతురమ్మాని' నని విశ్వనాథ వ్రాయుట. సంగీత నర్తన కళాకౌశలము నెరపిన తరువాత ఋశ్యశృంగుడు వారిని సమీపించి యెన్నియో ప్రశ్నలడిగి వారలను కౌగిలించుకొని ఉరములు-ఆననములు-పిరుదులు స్పృశించు చున్నంతసేపును వారేమియు మాటాడలేదు. సాద్భుతమగు నా సన్ని వేశమున వారుమాటాడలేదు. తాము మాటాడక ఋశ్యశృంగుని యౌత్సుక్యమును పెంచిరి.' ననున్ మీ వెంటఁ గొంపోదురో ? మీ పుణ్యాశ్రమ హోమకర్మలు గనన్ మేలౌను నా గుండె'కని యాత డనిన తరువాత' మా యాశ్రమమున నన్నియుఁ గనక సౌధములు గల' వనిరి. ఇవి యాతడడిగిన ప్రశ్నకు సమాధానముగాదు. ఇంకను తని కొక అస్తిత్వమున్నదా ? లేక తమ చేతిలోని వాడైనాడా ? ను విషయమును స్పష్టము చేసికొనుటకు వారావాక్యము పలికిరి. వానికి అస్తిత్వము లేదు. ఉన్నచో తన ప్రశ్నకు సమాధానమును ముందిమ్మని కోరి యుండెడివాడు. లేదు కనుకనే కనక మన సేమని వారి మాటనంమకొని యడిగినాడు. వారేది పలికిన నదియే అతని చెవికింపుగానున్నది. కనకమనసేమో వారు చూపి చెప్పిరి. అట్లయిన తప్పక వత్తుననినాడు. ఈ రెండింటికిని సంబంధము లేదు. తెలియకుండనే వారియందొక గౌరవము, వ్యామోహ మేర్పడినది.

ఋశ్యశృంగునకు వారి యాహ్వానముతో నిమిత్తము లేకుండ వారి ననుసరించవలయు నన్నంత ఉత్సాహ మాతనిలో వారు రేకెత్తించిరి. వారిచ్చిన భక్ష్యములు సేవించుచు మరల 'నన్నాహ్వానించుట కేదియైనఁ గలదా యభ్యంతర? మని యడిగినాడు. వారికి నమ్మక మేర్పడినది. మూడు మారులాతనిచేత నడిగింపించి "తమరున్ జనుదెంతురో? యాతిథేయ మందిచ్చెద మింతకన్న వలెనే చరితార్థుల మమ్ముఁ జేయఁగ" ననినారు. అతడు తృప్తిపడినాడు. తన యాశ్రమమునకు వారి నాహ్వానించినాడు. వారంతట 'మిమ్ముల బట్టి నిల్చితిమి. మేమును బోవలె మాకు ప్రత్యవాయమ్ములు పుట్టు తత్క్షణమయార్చవలెన్ జని. మీదు నాతిథేయమ్ములు మాకువచ్చె, భవదాగమనార్థము యుండుమందురా మమ్ముల నిందె యెల్లి.' అని బ్రాహ్మణ సంప్రదాయము ననుసరించి మాటాడినారు. మంచి దట్లే యుండుడని చెప్పి తన తండ్రి యుటజము చేరువేళ యైనదని చనినాడు ఋశ్యశృంగుడు.

తాము నిర్వహించవలసిన దంతయు జాగరూకలై నిర్వహించిరి. అతడు పోయిన తరువాత వారికొక భయము పట్టుకొన్నది. ఈ యమాయకవ్యక్తి జరిగినదంతయు తండ్రియైన విభాండకునకు చెప్పునేమో నని వారి భయము. చెప్పినచో క్రుద్ధుడై వృద్ధమౌని వచ్చినచో నిక తమపాట్లు పెరుమాళ్ళకే ఎరుక. మరునాడు ఋశ్యశృంగుడు వారిని చేరవచ్చువరకు వారికా భయమున్నది. అంతవరకు వారు ముండ్లపై కూరుచున్నటుల బాధపడినారు. ఎంత గడుసరులైనను వృద్ధమౌని వలని భయమిప్పుడు వారికి కలిగినది. ఇది సహజము. ఇపుడు వారు భీతహారిణ నేత్రలు. తండ్రికి చెప్పినాడో లేదో తెలియదుగాని విభాండకుడు మాత్రము రాలేదు మరునాడు ఋశ్యశృంగుడే వచ్చినాడు. వారియత్నము సఫలమైనది. అందరును అంగదేశమునకు వచ్చినారు. వర్షము కురిసినది. దేశ ప్రజలకు హర్షము కలిగినది. అంగదేశము ప్రవేశించుటతోడనే లౌకికవ్యవహార రహస్యములన్నియు నా ఋషి

కుమారునకు తెలిసిపోయినవి. అంత రోమపాదు డెదురువచ్చి శీర్షక మాతని పదాబ్జములచేర్చి, ఆత్మజ నిచ్చి వివాహము చేయుదునని శాంతను పిల్చి చూపగా ఋశ్యశృంగర్షి లజ్జ యొత్తిడిబడి మొగము వాల్పగా "మజ్జారే! పురికిన్ వనంబునకు నీ మాత్రంబు భేదంబటంచ జ్జల్ ప్రోవులు వార ముఖ్యులు సురంటంటించి గెంటించుచు పరిహాస ములు' చేసిరట. అంత శాంతకును ఋశ్యశృంగునకును వివాహము చేసినాడు రోమపాదుడు.

ఋశ్య శృంగోపాఖ్యానమున వేశ్యల నింత కట్టుదిట్టముగా పూర్వ రామాయణకర్తలు దిద్దలేదు. ఈ విషయమున మాత్రము భాస్కరాదుల కంటె రఘునాథుడు కొంత నయము. అతడు కూడ ఋశ్యశృంగునకును, వేశ్యలకును జరిగిన సంభాషణము గాక, వారి చేష్టల నభివర్ణించినాడు. వేశ్యలను గూర్చి ఋశ్యశృంగుడును, ఋశ్య శృంగుని గూర్చి వేశ్యలును మనస్సులలో ఏమేమనుకొనిరో కొంత విపులముగా రఘునాథుడు వర్ణించినాడు. వేశ్య లనుకొనిన విషయము లన్నియు అతి సామాన్యములు. అందుకొన్ని పేలవములు. కొన్ని అనౌచితీదోష దూషితములు. వారు దక్షిణాంధ్రయుగమునకు సంబం ధించినవారేగాని, రామాయణ కాలమునకు, అంగదేశమునకు సంబం ధించిన వారుగారు. వారిని చూచిన ఋశ్యశృంగునకు కలిగిన ఆంతర భావములను వ్యక్తీకరించుచు వ్రాసిన మూడు సీస పద్యములలో నొకటి అత్యుత్తమము. ఒకటి ఉత్తమము. ఒకటి అధమము.

"అబ్బురంబుగ నెద గుబ్బ కొమ్ములు మొల్చె
ఘనులు వీరౌర నాకన్న ననుచుఁ
బదములఁ బొడమెడుఁ బద్మము ల్వీరల
మహిమ యెంతటి వింత మహి నటంచు
ఘనములు వెనువెంటఁ గదియుచున్నవి జల
దాకర్షణము వీరి కబ్బెననుచు
బలుకుల నమృతంబు దొలఁకెడు బళివీర,
లమృతాంధసుల కన్న నధికులనుచుఁ

గానమెన్నఁడు నీ సామగాన గరిమఁ
గఠినపాషాణముల నీరుగాఁ గరంచె
నంచు మదినెంచి పలుమఱు నరుదు పడుచుఁ
గొమ్మకొన యూగఁ దలయూచి కొనుచుఁజేరె!"

(రఘునాథ రామాయణము. ఆ. 2. ప. 157)

ఈ పద్యము తరువాత నున్న రెండు సీస పద్యములును నతని చేష్టలను వర్ణించునవి. చేష్టలకంటె భావములను సృష్టించుటలో గొప్పతనమున్నది. పై పద్యములో రఘునాథు డదియే చేసినాడు. అతని రామాయణమున సర్వత్ర ఇట్టి భావ కల్పన కనిపించదు. అనౌచిత్యము లెక్కువ. ఋశ్యశృంగునకు వేశ్యలను చూచునపుడీ పై భావము కలిగినట్లు పూర్వ రామాయణ కర్త లెవ్వరును వ్రాయలేదు. విశ్వనాథ సర్వమును నానందములో లీనము చేసినాడు. రఘునాథుని వేశ్యలకు సంభాషణ చాతుర్యమే లేదు. భాస్కరాదులంత చాతుర్యమును చూపకపోయినను వేశ్యలచేత అధిక ప్రసంగము చేయింపలేదు. రఘునాథుడు చేయించిన దంతయు నదియే ఏమి దిద్దినను విశ్వనాథ దిద్ది తీర్చినాడు వేశ్యలను.

రోమపాదుని దీన స్వరూపమును, పురోహితుల యుచితజ్ఞతను, వేశ్యల నెరజాణ తనమును- ఉచిత ప్రవర్తనమును, ఋశ్యశృంగుని అమాయకవృత్తిని కమ్మచ్చున తీసినట్లు చిత్రించినాడు విశ్వనాథ. ఋశ్యశృంగుని పాత్ర చిత్రణమున విశేషమైన వైదుష్యమును ప్రదర్శించి తన్నయతతో తౌల్యము తెచ్చికొనినాడు. వేశ్యల విషయమున నొక యుదాత్తతను కల్పించి, పూర్వ రామాయణములను మించి ఋశ్యశృంగోపాఖ్యానమును తేజోవంతము చేసినాడు. పాత్రలు మనస్తత్త్వ వ్యక్తీకరణమునను, అర్థ గాంభీర్య ప్రతిపాదక రచనా కౌశల్యమునను విశ్వనాథ టెక్కునను తెలిపించుచున్నాడు. ఆ మహాకవుల గ్రంథములను వలె విశ్వనాథ రామాయణమును మననము చేసిచేసి ఒకమాట మాటాడవలయును.

భారతి. జనవరి; 1956.

..........

# కిరాత, సూకర వర్ణన-నన్నయ శ్రీనాథులు

— శ్రీ డా॥ డి. సి. రెడ్డి,

కవిత్వం అనగానే పది వర్ణనలు, ఇరవై అలంకారాలు లేకుండ ప్రాచీన కవులు కావ్యాలు రాయలేరు. ఈ వర్ణనలలో రకరకాల వర్ణనలు వున్నాయి. భారతంలాంటి మహాకావ్యంలో విపరీతంగా వర్ణనలు చెయ్యడం, అలంకారాలు గుప్పించడంవల్ల కావ్యం మరింత పెద్దదవుతుంది. తర్వాతి కావ్యాలు చూస్తే భారతంనుండి ఉపాఖ్యానాలు తీసుకుని రాసినవే ఎక్కువగా కనిపిస్తున్నాయి. పద్య, గద్య కావ్యాలే కాక సామెతలు కూడా చాలవరకు భారతాన్నాధారం చేసుకుని పుట్టినవిగానే కనిపిస్తున్నాయి. ఇటువంటి వాటిలో వర్ణనలు అధికంగా వున్నాయి. అవకాశం దొరికినచోట్లంతా వర్ణనలు విస్తారంగా చేసే అలవాటు లక్షణంగా పెట్టుకుని కావ్యాలు పంచుకుంటూవచ్చినారు ప్రబంధకవులు. కానీ ఒక దృశ్యాన్నికానీ, ఒక సన్నివేశాన్ని కానీ వర్ణించాల్సి వచ్చినపుడు అవసరమయినంతవరకు క్లుప్తంగా, శక్తివంతంగా వర్ణనలు చెయ్యడం భారతంలో మనకు చాలాచోట్ల కనిపిస్తుంది.

పాండవులు ద్యూతక్రీడలో శకుని చేతిలో ఓడిపోయి పన్నెండు సంవత్సరాలు అరణ్యవాసం, ఒక సంవత్సరం కఠోర అజ్ఞాత వాసం చెయ్యడానికి వెళ్తారు. పన్నెండు సంవత్సరాలు అడవిలో ఒకేచోట వుండకుండా అపుడపుడు స్థలం మార్చుతూవుంటారు. ఒకో ప్రదేశంలో ఏదోరకమైన సంఘటన సంభవిస్తుంటుంది. ఈ మధ్యలో కాలయాపన కోసం కథలు, కబుర్లు వుంటాయి. ధౌమ్యుడు పాండవులతోనే వుంటాడు. ఇతనే కాక అపుడపుడు వ్యాసుడు, కృష్ణుడు, బృహదశ్వుడు, రోమశ మహాముని,మార్కండేయముని మొదలైన మునులు, శ్రేయోభిలాషులు అపుడపుడు వీరి యోగక్షేమాలు కనుక్కోవడానికి వచ్చినపుడు సందర్భానుసారంగా నలదమయంతుల కథ సౌకన్యాఖ్యా

నం. మాంధాతృ చరిత్ర, శిబి చక్రవర్తి కథ, అజగరోపాఖ్యానం, వైవస్వత వృత్తాంతం, ఇంద్రద్యుమ్ని కథ, మధుకైటభుల కథ, ధర్మవ్యాధుని పూర్వజన్మ వృత్తాంతం, వ్రీహిద్రోణాఖ్యానం, రామాయణకథ, సావిత్ర్యుపాఖ్యానం మొదలైనవి వింటుంటారు. కథలతో, పురాణాలతో కాలం గడుపుతూవుంటే రాబోయేయుద్ధంలో గెలవడం ఎలా? పాండవుల చేతిలో ఓడిపోయిన రాజులు, వీరులు, మల్లులు అంతా కౌరవసామ్రాజ్యంలో వారి కొలువులో వున్నారు, పాండవులందరికీ దీటైన కర్ణుడు రారాజుకు బహిః ప్రాణం, అస్త్రశస్త్ర విద్యల్లో ప్రవీణులయిన భీష్మద్రోణ కృపాచార్యులు కూడా కౌరవుల కొలువులో వున్నారు. యుద్ధంలో వీళ్ళను ఎదుర్కొనాలంటే వున్న శక్తిసామర్థ్యాలు చాలవు. ఈ విధంగా చింతిస్తున్న సమయంలో కృష్ణ ద్వైపాయనుడు ధర్మరాజువుండే చోటికి వచ్చి; అతని ఆలోచనకు కారణాన్ని తెలుసుకుని 'ప్రతిస్మృతి' అను విద్యను నేర్పించి; సమర్థుడయిన విజయునికి ఈ విద్యను నేర్పి శివుని ద్వారా పాశుపతాస్త్రాన్ని సంపాదించునట్లు చెప్పిపోతాడు.

ప్రతిస్మృతి విద్యతో అర్జునుడు మొదట ఇంద్రుని గురించి తర్వాత శివుని గురించి తపస్సుచేసి పాశుపతాది అస్త్రాలు సంపాదించడం గల యితివృత్తం మహాభారతంలో నన్నయ అరణ్య పర్వంలో వుంది. ఈ ఘట్టాన్నే స్వీకరించి శ్రీనాథుడు 'హరవిలాసంలో' చివరి అశ్వాసంలో వర్ణించాడు.

సంస్కృతంలో భారవి 'కిరాతార్జునీయం' అనే పేరుతో కావ్యాన్ని రాసినాడు. భారతి కిరాతార్జునీయానికీ, నన్నయ శ్రీనాథుల కిరాతార్జునీయానికీ తేడాలున్నాయి. కథాకథనంలో, వర్ణనలో నన్నయకు శ్రీనాథునికీ తేడాలున్నాయి. నన్నయ వైదికుడు, సౌమ్యుడు. శ్రీనాథుడు సర్వభోగాల్ని అనుభవించినవాడు. ప్రౌఢ కవి, సరసుడు. పైగా శివాభిమాని. నన్నయ హిందూమతోద్ధరణ ధ్యేయంగా పెట్టుకుని, శివకేశవుల్ని ఎక్కడ వర్ణించాల్సి వచ్చినా

సమానంగా వర్ణిస్తూ వచ్చినాడు. ఇతని వర్ణనలు స్వాభావికంగా వున్నాయి. శ్రీనాథుడు శైవమతాభిమాని కావడం వల్ల ఆతనురాసిన కావ్యాల్లో శృంగార నైషధం తప్ప మిగిలిన వన్నీ శైవసంబంధ సాహిత్యాలుగానే వున్నాయి. హరవిలాసంలో 'కిరాతార్జునీయం'తో తృప్తి చెందని శ్రీనాథుడు 'ధనంజయ విజయం' అనే కావ్యాన్ని రాసినట్లు తర్వాతి కవుల ప్రస్తావన వల్ల తెలుస్తుంది. కానీ ఇది అలభ్యం. శైవమతాభిమాని అయినప్పటికీ తన రచనల్లో ఎక్కడా వైష్ణవమతాన్ని గానీ. మరే యితర మతాన్ని గానీ దూషించినట్లు ఆధారాలు లేవు శివ సంబంధం కలిగిన ఒకో యితివృత్తాన్ని తీసుకుని ఒకో కావ్యంగా రాసుకుంటూ వచ్చినాడు. అలాగా వచ్చినవే పండితారాధ్యచరిత్ర, భీమఖండం, కాశీఖండం, హరవిలాసం, శివరాత్రి మాహాత్మ్యం మొదలైనవి.

హరవిలాసంలో 'కిరాతార్జునీయ కథ' సప్తమాశ్వాసంలో వుంది. నన్నయ భారతంలోని కిరాతార్జునీయ 'ఘట్టాన్ని' తీసుకుని శ్రీనాథుడు 193 పద్యాల్లో వర్ణించినాడు.' శ్రీనాథుని 'కిరాతార్జునీయం' ప్రాయికంగా భారవి కృతినుండి గ్రహించబడింది. అని శ్రీమాన్ ఉత్పల వెంకట నరసింహాచార్యులుగారు చెప్పినా శ్రీనాథ కిరాతార్జునీయానికి నన్నయ భారతమే మూలమని చాలామంది తెలుగు సాహితీ సమీక్షకుల అభిప్రాయం. ఇందులో అర్జునుడు తపస్సు కోసం వెళ్ళినప్పటినుంచి శివుడు అర్జునునికి పాశుపతాస్త్రం యిచ్చి అదృశ్యమయ్యే యితి వృత్తం 103 పద్యాల్లో వర్ణింపబడింది.

నన్నయ ఈ వృత్తాంతాన్ని 49 పద్యాల్లో వర్ణించాడు. వర్ణించవలసిన విషయాన్నీ, సందర్భాన్నీ మాత్రం నన్నయ వదిలిపెట్ట లేదు. అర్జునుడు హిమశైల శిఖరంలో తపస్సు చేస్తున్న ప్పుడు శివుడు కిరాతుడైన తీరు, వచ్చిన తీరును నన్నయ, శ్రీనాథు లిద్దరూ వర్ణించినారు.

నన్నయ ఒక సీసంతో, ఒక చంపక మాలతో శివుని కిరాత రూపాన్ని, అతని అనుచర బలగాన్నీ, పార్వతినీ వర్ణిస్తే, శ్రీనాథుడు

మూడు తేటగీతులు, ఒక సీసం, ఒక కందం - ఈ మూడింటిలో వర్ణి స్తాడు. నన్నయ వర్ణనకూ శ్రీనాథుని వర్ణనకూ తేడా వుంది. మూకాసుర సూకరవర్ణన శ్రీనాథుడు చేసినా, నన్నయ చేయలేదు. నన్నయ కిరాత వర్ణనలో స్వభావోక్తి కనిపిస్తుంది.

'కాంచన వర్ణాప ఘనుడై మహోన్నత
కార్ముకహస్తుడై కాలకంఠు
డెఱుకురాజయ్యె నద్రీంద్ర తనూజయు
వనచరీ భావంబు వఱలఁదాల్చె
గుఱుచ చేతులు మిడిగ్రుడ్లును గడుకొన్న
తఱటులు మఱచెంబు దలలు నమరఁ
దడవిండ్లు సేపట్టి తడయక యెఱుకులై;
యార్చుచు భూతమ్ము లాత్మసతుల'

ఎఱుకతలుల చేసి వేటకోసం బయల్దేరాడు శివుడు.

మొదట శివుని కిరాతరూప వర్ణన, తర్వాత పార్వతీ, భూతాల కిరాతరూప వర్ణన, తర్వాత వాళ్ళు వేటకు బయల్దేరగా పశుపక్ష్యాదుల వర్ణన.

'అలబలమంది యందుల మృగావలియున్ విహగంబులున్ భయా
కులగతిఁబొంది మూగలును గుంటులు జీకులు నైనయట్లు లై
యులియక యున్నచో నడిగియుండ గిరాతబలంబు తోడ బిం
గళ నయనుం డుమేశ్వరుడు గవ్వడి డాయగ వచ్చెఁ జెచ్చెరన్.

ఈ మాయా కిరాత బలగం వేటకు వస్తున్నది, అనగానే అడవిలో మృగాలు, పక్షులు భయంతో మూగవైనాయి. కుంటివి, రోగం వచ్చినవి, అయిపోయి; కదలకుండా వుండిపోయినాయి.

మిడిగుడ్లు, కుఱుచచేతులు, గడుకొన్న తఱటులు మరచెంబు తలలు అమరగా, మాయాకిరాత జనాన్ని నన్నయ వర్ణించిన విధం స్వభావ సిద్ధంగా ఉంది. వేట వృత్తిగా గల ఆటవికజాతి చెంచుజాతి. శ్రీశైలం అడవుల్లో వీళ్ళు ఎక్కువ. చెంచుల్ని గురించి చాలా పరి

శోధనలుచేసిన 'హైమన్ డార్ఫ్' అతను చెంచుల ఆకారాన్ని వివరిస్తూ ఛాయకారునలుపు మొదలు తామ్రవర్ణం వరకు మారుతుంది. కాటుక కండ్లు, ఉంగరాలు తిరిగిన తలకట్టు ఒక్కొక్కప్పుడు మొట్లుమొట్లుగా కూడా కనబడతాయి. గడ్డాలు మేకగడ్డాలే. మీసాలు వున్నా లేనట్లే కనబడుతుంటాయి. ఒడలిపైని వెంట్రుకలు మొలవనే మొలవవు. కొందరికి పిక్కలపైని, వక్షములమీద ఉంగరాలు తిరిగిన వెంట్రుకలు ఉంటాయి. (యానాది - వెన్నెలకంటి రాఘవయ్య, పే. 41) నన్నయ ఏ సందర్భంలోనైనా ఈ ఆటవిక జాతిని చూసి ఉండాలి. నన్నయ మొదట శివుణ్ణి. తర్వాత పార్వతిని, సకల భూతాల్ని వర్ణించి ఇలా వేటకు బయల్దేరగా పశుపక్ష్యాదులు ఎలా ఉన్నాయో వర్ణించాడు.

కానీ శ్రీనాథుడు కొసనుంచి ప్రారంభించి శివపూజకు పూలు కోస్తున్న అర్జునుడు కుక్కలు భాభా రావాలు వినడం, ఛాయ గోలు సులను, కేసరాలకంటే పొగరు కలిగిన కుక్కలను, వాటిని పట్టుకుని వస్తున్న ఎరుకలను, వాళ్లు ఇరు ప్రక్కల రాగా చివర్లో శివుణ్ని వర్ణిస్తాడు.

అర్జునుడు దేవార్చనా పుష్పకోరకాలు కోస్తూవుంటే కుక్కుర ప్రకరోదంచిత కంఠనాళ కుహాలీ భాభా మహారావాలు శ్రావ్యంగా వినిపించినాయట. ఇంకా

ఛాయగోసుల కంటెం గేసరులకంటె
బులులకంటెను బిరుసలై పొగరు మిగిలి
జల్లుకొనివచ్చె పైపైని సారమేయ
యూథములు వేదమయ మూర్తు లుద్ధతముగ.

ఈ వేదమయమూర్తుల్లాంటి సారమేయాల ఘోషణాన్ని శ్రీనాథుడు.

ప్రకటలీల నుదాత్తంపు ఫణితిఁగొన్న
క్రమముతో ననుదాత్త స్వరములఁ గొన్ని
స్వరితముల ప్రచయంబుల వరుసఁగొన్ని
ఘోషణము సేయఁదొడఁగె నాకుర్కురములు

అని వర్ణిస్తాడు. ఇలా ఉదాత్త స్వరిత భేదాలతో శబ్దించేస్తున్న ఆ కుర్కురాల్ని బంగారు గొలుసులతో పట్టుకొని ప్రమథులు మాయా వనచరులై కొలుస్తుండగా, మాయ వేటగాడై శివుడు వచ్చేతీరును, అతని అహంకారాన్ని వర్ణిస్తాడు.

వికట పాటల జటా మకుటికా భారంబు
కరమొప్పు జుంజుఱు నెఱులు గాఁగ
జాఱు సుధాధామ శకలావతంసంబు
పెడకొప్పుపై నుండు పీకె గాఁగ
ఘన లలాటంబున గనుపట్టు కనుచిచ్చు
గైరిక ద్రవ తిలకంబు గాఁగ
భుజమధ్యమున గ్రాలు భుజగహారంబులు
గురిజపూసల గుబ్బసరులు గాఁగ

శంకరుండు కిరాత వేషంబు దాల్చి
యగజ చెంచెతయై తోడ నడువ దేర
బాణి నోంకార దివ్యచాపము ధరించి
వచ్చె విప్పచ్చు వరతపోవనము కడకు.

జడ గరకుజుట్టుగా, నెలవంక పీకెగా, మూడవకన్ను తిలకంగా, పాములు పూసల హారాలుగా మారి శివుడు కిరాతుడై, చెంచెత అయిన పార్వతి తోడు రాగా విల్లుధరించి అర్జునుడుండే చోటికి వచ్చినాడు అని శ్రీనాథుడు చెప్తాడు. ఇలాంటి వర్ణన నేడు మనకు సినిమాల్లో, కాథానికల్లో, నాటికల్లో కన్పించే 'సస్పెన్స్' (Suspense) గా కనిపిస్తుంది. నాటకంలో పాత్ర ప్రవేశించినట్లు గావుంటుంది. దీనికి తిక్కన ఆద్యుడు. దృశ్య సాక్షాత్కార పద్ధతికి, నాటకీయుతకు తిక్కనభారతం ప్రమాణం. ఈ ప్రభావానికి శ్రీనాథుడు పూర్తిగా లోనయి వర్ణనలు చేసినాడు. నన్నయది కథాకథనశైలి.

ఈ శైలి ఈఘట్టంలోనే కాకుండా నన్నయ, భారతం అంతట్లోనూ కనిపిస్తుంది.

సూకర వర్ణన :

నన్నయ పందిని గురించి ఏమీవర్ణించలేదు.' అంత నీశ్వర చోదితుండయి మూకుండను దైత్యుండు సూకరంబై భీకరాకారంబున భీభత్సు వధియింప సమకట్టి పయింబడ తెంచిన' అనీ కథలాగా చెప్పి వదలిపెడతాడు. శ్రీనాథుడు అట్టి సమయంబున' అని వచనంలో చెప్పి మూడుపద్యాల్లో సూకరరూప వర్ణనచేస్తూ-

జలధర నీలదేహమును జంద్రకళాయుగళీ సమాన దం
ష్ట్రిలు భిదురోపమానముఖ సంపుటపోత్రము పుల్లమేచకో
త్పలదల వర్ణకర్ణములు బాటల వర్తుల లోచనంబులుం
గలిగి కఠోరకంఠ ఘన ఘర్ఘుర ఘట్టన ఘోషజన్మమై.

అని చెప్పి దాని ఆర్భాటాన్ని చెబుతూ—

మట్టియ నింద్ర నీల తట మూల మహాప్రభవంబులైన పె
న్పుట్టలు ద్రొచ్చివైచుచును భూరుహషండము జాపకట్టుగా
మట్టుచు ఘర్ఘురధ్వనుల మాటికి మాటికి దిక్పుటంబులం
ఘట్టన చేయుచు న్వెడద కన్నుల నిప్పులువెళ్ళ గ్రాయుచున్.

డంపడి గొరిజల తాకుల కందుకములులాగ శిలలు గరువారంగా శివార్జునుల మధ్యకు పరుగెత్తి వచ్చింది.

అని శ్రీనాథుడు పందిని వర్ణిస్తాడు. నన్నయ 'ఈశ్వర చోదితుడయిన 'మూకుడు' అనే రాక్షసుడు పంది అయి అర్జునునిపైకి వచ్చినాడు' అని చెప్పగా; శ్రీనాథుడు నల్లనైంది, తెల్లని దంతాలు కలిగింది, నల్లని చెవులు, ఎర్రని కళ్ళు కలిగి గర్జిస్తూ, ముట్టెతో పుట్టల్ని దుమ్ముచేస్తూ, చెట్లు కూల్చివేస్తూ, ఘర్ఘుర ధ్వనులుచేస్తూ శివార్జునుల మధ్యకు రాగా; వీరిద్దరి బాణాలకు సూకరాకారంలోవున్న మూకుడు

గిరాగిరా తిరిగి వచ్చినాడు,' అని వర్ణింపబడేది. ఏదోదాన్ని చివర్లో వ్యక్తంచేస్తాడు. పంది ఎలా వుంది, ఏంచేస్తూ వచ్చింది అనే దృశ్యం కళ్ళకు కనిపించునట్లు వర్ణించడం తిక్కన తర్వాత శ్రీనాథునికే చేతనైంది. ధూర్జటి తన 'కాళహస్తీశ్వర మాహాత్మ్యం'లో తిన్నని కథలో తిన్నడు శివునికి ఆహారంగా చంపి, కరకుట్లుగా తేబడిన పందిని వర్ణించినా ఇంత విస్తారంగా లేదు. ధూర్జటి భక్తిప్రధాన క్షేత్రమాహాత్మ్య కావ్యాన్ని రాసినాడుకానీ వర్ణనాప్రబంధాన్ని కాదుకదా. శ్రీనాథుడు కూడా శైవమతాభిమాని అయినప్పటికీ వర్ణనాప్రియుడు, ప్రౌఢకవి, కావడంవల్ల వర్ణనలు సందర్భానుసారంగా చేస్తూవచ్చినాడు. నన్నయ అలా విస్తృత వర్ణనలు చెయ్యకపోవడానికి కారణాలుగా అతనిపైనున్న బాధ్యత, రాజరాజు కోర్కె ప్రకారం భారతాన్ని ఆంధ్రీకరించాలి అనే దీక్ష, అతను తీసుకున్న కావ్యం ఉద్గ్రంథం కావడం మొదలైనవి మనం చెప్పుకోవచ్చు.

సమాలోచన. 1-6-1984

# తెలుగు కన్నడముల చుట్టరికము

శ్రీ పుట్టపర్తి నారాయణాచార్యులు

పంపని భారతమును భట్టారకుని భారత రచనమును బోల్చి చూచినప్పుడు రెండు గ్రంథములను రచించిన దొకరేనా? యన్నంత పోలిక కన్పించును. కొంత సావధానముగ వింటిరేని ఒక్కటొక్కటిగా మనవిసేతును.

భారతమును రచించిన పంప డాంధ్రుడని యనుకొంటిమి. ఇతని కాశ్రయదాత అరికేసరికి యనియు నెఱుగుదుము. "కవితాగుణార్ణవ, సుకవిజన మనోమానసోత్తంసహంస, సంసారసారోదయ, సరస్వతీ మణిహార, కవితాగుణార్ణవ" మొదలైన వాతడు దించుకున్న బిరుదులు చిత్ర విచిత్రములుగ నుండును.

పంపమహాకవి చాళుక్యవంశమును బ్రహ్మాండముగ నభివర్ణించినాడు. అట్టియెడ చాళుక్య వంశమునకు జెందిన రాజరాజనరేంద్రునకు దానితో నాతని యాశ్రితులకు పంపని భారతముపై సహజముగ నభిమానము కద్దు. రాజరాజనరేంద్రుని సింహాసలగమునందు పంపని భారత మప్పుడప్పుడు చదువబడుచుండుట యుదాత్త మగుటయే కాని అతిశయోక్తి గాదు. పైగా ఆ మహారాజు వేంగిదేశము వాడగుట మరికొంత యాదరమునకు గారణము. కవికిని వేంగి విషయమున్న నభిమానమే.

పంపమహాకవిపై నింతటి యభిమానము చాళుక్యుల కున్నను అతని విషయమై యతృప్తియు లేదనలేము. పంపడు ప్రచారము చేసినది జినధర్మము. రాజనరేంద్రుడు శైవుడు. దానితో భారత శ్రవణాసక్తి యెంతయున్నను అద్దానియందు 'పార్వతీపతి పదాబ్జధ్యాన పూజామహోత్సవము' లేదే యన్న కొఱత రాజరాజునకు తప్పక యుండియుండును. పశ్చిమ చాళుక్యులు జగద్విదితముగ భారతమును వ్రాయించి తమకీర్తి కాయువు బోసికొనిరి. పూర్వచాళుక్యులు గూడ

'దుర్గమార్గ జలగౌరవ భారత భారతీ సముద్రము'ను మథించి కీర్త్యమృత కలశమును పొందవలెనను దాయాదులకు సహజమగు భావము గూడ అతని కుండదనుకొనవలేము గదా! దీనితో రాజనరేంద్రుడు భట్టారకుని భారతరచనమునకు పురికొల్పినాడు.

నన్నయకే, సహజముగ భారతమును ఆంధ్రీకరింపవలెనను ఆవేశమున్నది. అది అతని దృష్టిలో ధర్మతత్త్వజ్ఞులకు ధర్మశాస్త్రము, అధ్యాత్మవిదులకు వేదాంతము, నీతి విచక్షణులకు నీతిశాస్త్రము, కవి వృషభులకు మహాకావ్యము, లాక్షణికులకు సర్వలక్ష్య గ్రంథము, ఐతిహాసికుల కితిహాసము, పరమ పౌరాణికులకు బహుపురాణ సముచ్చయము. ఇట్టి భారతముపై పంపడు వేసిన జినముద్ర భట్టారకుని మనస్సును శూలమై బాధించినది. పంపభారతము ఊసు యెవ్వరైన నెత్తినపుడంతయు తాను వ్రాయబోవు 'కృష్ణద్వైపాయనముని వృషభాభిత మహాభారతబద్ధ నిరూపితార్థము' కనుల యెదుట నిలుచుచుండినది. రాజరాజు తన్నడుగుటతో నా కవికి రెక్కలు వచ్చినట్లయ్యెను. భారతరచన కుపక్రమించినాడు. కాని మహాకావ్య కరణక్షమమైన భాష యేదీ? అందుచే సంస్కృతము నండగొని నాటి తెనుగు నేల యందలి తేటలగు తెనుగులను జార విడువక జతచేర్చుకొన్నాడు. ప్రాచీన కర్ణాట సాహిత్యమును గాలించి కళగల పదములపై కన్ను వేసి యుంచినాడు. ఆ పోకడలో పంపని భారతమును గూడ నాతడెన్నియో సారులు జదువవలసివచ్చినది. పంపడు జినధర్మమును ప్రతిపాదించినచోట నంతయు వైదిక ధర్మమును నుత్తేజిత మొనరించుచు భట్టారకుడు భారతమును వ్రాసెను.

కన్నడ భారతమునం దర్జునుడు నాయకుడు. ద్రౌపది యాతని కొక్కనికే భార్య. అర్జునునకే పట్టాభిషేకము. పంపమహాకవి అరికేసరిని అర్జునునకును అభేదప్రతిపత్తి కల్పించు రచన మొనర్చెను.

తన భారతమునం దర్జునుని వృత్తాంతము వచ్చినపుడంతయు— అరికేసరి బిరుదములన్నియు శ్లేషగనో స్పష్టముగ తగిలించని దాతనికి

నిద్ర పట్టదు. ఇట్టే రన్నడుగూడ- తనరచితమగు 'గదాయుద్ధము' శైలపుని కుమారుని- భీమునితో బోల్చుచు గ్రంథమును సాగించెను. కన్నడము నందిది యొక విచిత్రమగు సంప్రదాయము.

పంపడు గావించిన ఈ చమత్కారమును నన్నయ భట్టారకుడు- చూచినాడు. అతనికన్న మెఱుఁగుగ - ధ్వని మార్గమున దా పనిని చేయదలచెను. భారతములోని—

ఉ॥ రాజకులైక భూషణుడు, మొదలైన పద్యములను చదివి నప్పుడు - రాజరాజును ధర్మరాజునకు పోల్చినచాయ స్పష్టముగ గన్పించుచుండ లేదా ? దీనియందు మఱియొక చమత్కారమున్నది. రాజరాజెట్లున్నాడో దెలుపుటయేగాక యెట్లుండవలెనోగూడ నీ భాగము వ్యంగ్యమార్గమున దెలుపుచున్నది. ఇది పంపని జూచి— యనుసరించిన త్రోవయే. అసలు 'అంకితము' సేయుట - అను పద్ధతి తెనుగున కెక్కడనుండి వచ్చినది ?

సంస్కృతమున నంకితమొసగు పద్ధతి - నేను జూచినంతలో లేదు. రాజులను గురించి ప్రత్యేకముగ వ్రాసిన గ్రంథములున్నవి. ప్రాకృత కావ్యములందు గూడ నీ మార్గము లేదు. కనుక కర్ణాటాను కరణమే ననుకొందును.

నన్నయ భట్టారకుడు. 'హరిహరాజ గజాననార్క- షడాస్య మాతృ సరస్వతీ, గిరిసుతాదిక దేవతాతతికి నమస్కరించెనట. మనకు కనుపించునది శిష్యశిక్షకై యాతడు - గావించిన దొక శ్లోకము దప్ప మఱేదియు లేదు. పోనీ మానసిక సంస్కారమే జేసినాడనుకొందము, అర్కునకు షడాస్యునకు మాతృకలకు నమస్కార మెందులకు గావించెను ? సంప్రదాయమా ? పంప భారతమందీ స్తుతులన్నియు గలవు. మనోజస్తుతి పంపడు గావించినాడు. దాని నాచార విరుద్ధ మగుటచే నాదికవి నన్నయభట్టు వదలెను.

ఇట్టి చోటు నే గాదు. అతడు పంపని ననుసరించిన చోటులం దంతయు వేద మార్గమునకు విరుద్ధమగు వానిని వదలిపెట్టెను. వ్యాస

మహర్షిని వర్ణించుచు పంపడు "నీలాంబుదశ్యామనుం కనక పింగళ జటాబంధ కలాపనుం దండకపాళ హస్తనుం కృష్ణమృగత్వక్పరిధానను మాగి వ్యాసభట్టారకం పుట్టువుదు".

అని పలికెను. నన్నయభట్టు పైదానిని కృష్ణాజినపరిధాన కపిల జటామండల దండకమండలు మండితుండై యని సంకోచపరచినాడు. పైదాని యందున్న కపాళధారణము పనికిరాదనియే వదలివేసెను.

పూర్వకవులను నుతించుచు - పంప మహాకవి, ఉ॥ వ్యాస మునీంద్ర రుంద్ర వచనామృత వార్ధియ నీసు వెంక విన్యాసనెనెంబ గర్వమెనగిల్ల" అని పలుకగా- అంతతో తృప్తిపడనివాడు వోలె భట్టారకుడు.

ఉ॥ భారత భారతీ శుభగభస్తి చయంబునజేసి మోరసం
సారవికార సంతమసజాల విజృంభమువాపి సూరిచే
తోరుచిరాబ్జ బోధనరతుండగు దివ్యపరాశరాత్మజాం
భోరుహ మిత్రుగొల్చి మునిపూజితు భూరియశోవిరాజితున్.

అని ప్రశస్తమైనగ నభివర్ణించెను. 'వ్యాసమునీంద్ర వచనామృత వార్ధి' యనెడు రూపక మింతకుముందే 'భారత భారతీ సముద్రము' అనుచోట నదికిపోయినది. ఈ సందర్భమున పంపడు — నుతింపక విడిచిన "గురుపద్యవిద్యకునాద్యుడగు, అంబురుహగర్భ విభుడునునగు, ప్రచేతసుపుత్రుని గూడ" నన్నయ కూడగట్టికొనెను. తన కవితాప్రయోజనమును దెల్పుచు నన్నయ యిట్లనిరి.

ఉ॥ సారమతిం గవీంద్రులు ప్రసన్నకథా కలితార్థయుక్తిలో
నారసి మేలునా నితరు లక్షరరమ్యత నాదరింప నా
నారుచిరార్థసూక్తినిధి నన్నయభట్టు దెనుంగునన్ మహా
భారత సంహితారచన బంధురుడయ్యె జగద్ధితంబుగన్.

ఇట్లే పంపడును :-

ఉ॥ ఆసకలార్థ సంయుత మళంకృతి యుక్త ముదాత్తవస్తువి
న్యాస మనేక లక్షణ గుణ ప్రభవం మృదుపాద మాదవా
క్ర్మిసుభగం కళా కలితమెంబ నెగర్తయ నార్థకబ్బమం
కూ సుమ నీవు నీవు దరికేసరి గల్లద వస్తువునే

చ॥ లలితపదం ప్రసన్నకవితా గుణమిల్లదె పూణ్ణు పేర్గె బె
ళ్గళ కృతిబంధముంబిరెహ కాజరకై గళ కేడునుణ్ణవ
స్పళ పదకేడు వేజసి వొడర్థకేడినె పేర్దు బీగి పొ
ట్టళిసి నెగర్తగాటిసువ దుష్కవియం బెలెక్కయే.

అని మొదలుగా చెప్పికొన్నాడు. భట్టారకుల 'ప్రసన్న కథా త్వ'ము పంపని 'ప్రసన్న కవితాగుణం' 'ఉత్తమ వస్తువిన్యాసం' అనెడునవి రమ్మని పిలుచుచున్నవి. అర్థయుక్తిని 'ఆ సకలార్థసంయుత' అను శబ్దము పెనగూడుచున్నది. 'అక్షర రమ్యత'కు పంపమహాకవి 'మృదుపాదం, లలితపదం', వాక్ర్మిసుభగం' అనబడునవి బంగారు నగలగుచున్నవి. 'కవీంద్రులారసి మేలునాన్ అను భావమును పంపడే స్పష్టముగ చెప్పినాడు. ఇక తక్కిన పదములన్నియు నన్న పార్యునకు బునరుక్తులుగ దోచి యుండుటచే వదలివేసెరి. పంపని కారకము లిట్టివి.

"నారదనపేరు (6-21) వైరియమాడిద (8-00) తన్నసుడిద (12-190) నరకాంతక నంనుడి నరేంద్రం (12-129).

పై వానియందు – ద్వితీయకు ప్రథమ – చతుర్థికి ద్వితీయ తక్కినవాని యందు ప్రథమకు షష్ఠి వాడబడినవి.

పై వానిని దెనిగించినచో–

"నారదుని చెప్పిన – వైరిచేసిన–" తన చెప్పిన – నరకాంతకుని నరేంద్రుడు పలికెను."

ఈ పై కారకములు – నన్నయ వాడినవో లేదో – వాఙ్మయ వేత్తలకు నేను చెప్పవలసిన పనిలేదు.

భట్టారకుని సంస్కృత సమాసములందు స్పష్టత యెక్కువ. వారి కవిత్వమునకే స్పష్టతజీవనము. మైత్రేములవంటి ప్రాసలు

అందముగా నదికి యుండును. సంస్కృత సమాసములను బ్రహ్మాండముగ పెంచి పెద్దచేసి - యసహ్యాకరముగ మార్చు టాతడెరుగని విద్య. ఈ గుణములన్నియు కన్నడ కవి సమాస గ్రంథమునందున్నవి. మచ్చునకొక రెండు చూపెదను.

"అదెంతనె - సమున్మిష రత్నమాలా ప్రభాభీలారుణ జల పల్లవ విళోళవీచిరయ ప్రదారిత కులాచలోదధి పరీతమాగిర్ద జంబూ ద్వీప దొళనుంటునాడు కురుజాంగణ నామదిం అంతా కురుజాంగణ విషయదొళ్".

కం॥ అతం నిజభుజ విజయ
ఖ్యాతియ నాళ్దల్గ నధిక బలనవనిపతి
వ్రాత మణి మకుట కిరణ
ద్యోతితపాదం సపాదలక్షక్షితియం

కం॥ శ్రీపతిగె యుద్ధమల్ల మ
హీపతిగె నెగ ళ్దపుట్టి పుట్టిదనఖిల
క్ష్మాపాల మౌళి మణికిర
ణాపాలిత నఖమయూఖరంజిత చరణం.

పై వచనమునందు - పద్యములందు కన్నడ పదములను తెనుగుచేసి ఆంధ్ర పదములను చేర్చినచో - నన్నయ కవితకన్న వేరు వానిని చూడలేము. వారిద్దరు వచనములందు గూడ చాల - పోలిక గలదు.

వచనములయందు, - గథా వృత్తాంతమును ధారావాహికమగు వేగముతో పలుకుట అవసరములను విషయములను పెంచకుండుట, వైదిక వాఙ్మయమునందు వాడునట్టి సంస్కృతమును ప్రయోగించుట- భట్టారకుని లక్షణము. ఆ గుణములు పంపని గద్యమందు గలవు.

ఇక పద్యరచనల నుదహరింతును.

కంద పద్యమునందు పాదాదిని జగణము నన్నయయొక యొయ్యారమునకు వాడును. ఆ సొగసు - మృదంగవాద్యమునకు ముక్తాయింపు వంటిది.

కరుణా నిరతులు ధర్మ
స్వరూపులింతకు మదీయ జనకులు ననుదెం
తురు వారువచ్చి నీకి
చ్చిరేని పాణిగ్రహణము సేయుము నన్నున్.

ఇట్టి పద్యములు నన్నయగారి కవితలందు కొల్లలుగ దొరకును. స్పష్టముగా దెలిసిన విషయములం దుదాహరణములిచ్చి మీ కాలమును ఖర్చుచేయుట నాకిష్టములేదు. ఇట్లే పంపదును - ఒయ్యారమునకు - ఒక విషయమును జెప్పి - ముగింపదలచినపుడు - కొన్నియెడల భావస్ఫూర్తికి - ఒక విషయమును జెప్పి - విషయాంతరము నందుకొనవలసినపుడు - పలుకును. పాఠకుల మనస్సులపై నొక విషయమును గాఢముగా పాదుకొనునట్లు చేయవలెనని భట్టారకునకు దోచినప్పుడు వారొకటే పదమును పునరావర్తింతురు.

క॥ అన్యోన్య ప్రియభాషణ
అన్యోన్య హితైషులసుర లస్యులబోలెన్
నన్యు పరిప్రేరితులై
యన్యోన్యాభిహతి జనిరి యమపురమునకున్.

(ఆది. 8-113)

క॥ గంగాధర సింగజటా
సంగమ మంగళ విశాల సలలితరంగన్
గంగానది సేవించెను
గంగాద్వారమున విగత కల్మషుడగుచున్ (ఆది.8-126(

ఇట్టివి పంపదుగూడ ఇట్టి సన్నివేశములందు ఒక పదమునే పలుమారు త్రిప్పి త్రిప్పివాడును.

క॥ నిజభూరంభ పురస్సర
విజయ గజంగళనె పిడు ఘూర్జరరాజ
ధ్వజినీ యేనిఱదోడిని భుజ
విజయదె విజయను మనిఱపిదం నరసింహం.

క॥ ఆత్మభవనా నరాధిప
నాత్మజనా నహుషపృథు భగీరథనతమా
హాత్మర నిఱలు నెగఱ్దమ
హాత్మం నరసింహా నెఱవినోళ్ పరమాత్మం.

నన్నపార్యుని కవితలు విమర్శించునపుడు వారు "వస్తుకవిత" నము పలుకుదురని కొందరందురు. ఆ వస్తుకవిత పంపలోనిదే. మహారాజు మాద్రి పీరి శృంగారమును వర్ణించునపుడు పంపడు వచనములను వ్రాసినాడు. దాని భావముననే నన్నపార్యుడు గ్రాహులలో సుందరముగ చిత్రించెను. రసపిపాసువులు బోల్చి చుకొనవచ్చును.

సీ॥ శ్రవణ సుఖంబుగా సామగానంబులు
చదివెడు శుకముల చదువుదగిలి
కదలక వినుచుండు కరులును కరికర
శీతలచ్ఛాయ దచ్ఛీకరాంబు
కణముల చల్లని గాడ్పునపడి వాని
జెంది సుఖంబున్న సింహములును
భూసుర ప్రవరులు భూతంబులే దెచ్చి
పెట్టి నీవారాన్న పిండతతులు

గీ॥ గడగి భక్షింప నొక్కట గలసియాడు
చున్న యెలుకలు బిల్లులు యొండుసహజ
వైరి వర్గంబులయు సహవాస మపుడు
సూచి మునిశక్తి కెంతయు చోద్యమంది

అనెడు నది చాల బాగున్నదని నేటి విమర్శకు లెందరో న్నారు. పూర్వకవులలో దీని కనుకరణములు కొల్లలు. ఈ వర్ణ

నము పంపని రచనకు నీడ వంటిది. పాండు మహారాజు దరిసించిన శత శృంగము నందలి ఋషుల యాశ్రమ భూములిట్లుండెనట.

తాపసకన్యెయర్నడసి దెళలతెగళొళెఱగి తుఱంగి సామవేద ధ్వనియొళ్ మెరెవతుంబిగళుమం పత్తెఱగిద తదాశ్రమద తరుగళ మేగిర్దు పుగిల్ పుగివెందిత్త బన్నమరి మెరెవ పొంబణ్ణద కోగిలె గళుమం మునికుమార రోదువ వేదవేదాంగగళం తప్పు విడుదు జడిదు బగ్గిసువ పదుమరాగద బణ్ణదర గిళిగళుమం సురభిగళ తూరెడమొలె గళ మబ్బువ మఱిగళం పూగెమాం కి కూంకి మొలెగళమణ్బ కిశోర కేసరి గళుమం తమ్మొయ్యనెనవి.

కిశోర కేసరి గళుం తడిదు తెగెవ కరికలతంగళు మనాగళా గళిందె పాయ్వపుళిగళ మఱిగళొళ్ పరిదాడువ తరుణ వారిణ గళుగుం మత్తం ముత్తకురుడ తపసింగళ్కె యంపిడిదు యవర గుహెగళం పుగిప పొరమ వచపళ కపిగళుం చోద్యంబట్టు".

పద్యముల యెత్తుగడలు కూడ చాలచోటుల నిలువుఱు సమము నెత్తికోలు గావింతురు. చూడుడు అడవికిబోయిన పాండురాజునకు శాపము రాగా

క॥ ఎత్తివన మెత్త మృగయా
వృత్తకమీ తపపి యెత్తమిగ మిందెంతా
నెత్తెచ్చనాత్మ కర్మాయత్తం పెఱత ల్తిరల్లి
మఘటిత ఘటితం.

అని చింతించెనట ఇట్లే నన్నయయు

కం॥ "ఏనెట నీవెట సుతుడెట
యేనెన్నడు దొల్లిజూచి యెఱుగను నిన్నున్
మానిను లసత్యవచనులు
నా నిట్టులసత్య భాషణంబుచితంబే" అని యగును.

కాశ్యపులు, మాగధులు, సాల్వారు, అను సమూహార్థము లును నన్నయవలెనె పంపనిలోను మాటి మాటికి గనుపించును.

'భట్టారక' శబ్దము నన్నయకు వలెనే పంపనికిని ప్రియము. ఇక నన్నయ 'ప్రసన్న కథాకలితార్థ యుక్తియు' పంపని యందున్నది. కావలసినవారు వారి కర్ణజనన, కుంతీ కర్ణసంభాషణ, శతశృంగమున పాండురాజుకథ, మొదలైనవి పోల్చి చూచుకొనవచ్చును.

పంప మహాకవిని గుఱించి కర్ణాటసాహిత్య కారులీ క్రింది అభిప్రాయ మొసగిరి.

నవీన కల్పన, రసానుగుణమైన కథా శరీరరచన, వస్త్వనురూప రసనిర్మాణము, రసమునకు తగినట్లు ఛందస్సును వాడుట, కావ్య సౌందర్యమును చెడనీయక అంగోపాంగముల వర్ణించుట ఇవి పంపని గుణములు.

అతడు పాత్రలకు జీవమిచ్చి యెదుటనిల్చి మాట్లాడునట్లు చేయును. అనౌచిత్యమును బరిహరించి సహజముగ నభివర్ణించును అభిప్రాయము వెంటనే మనసునకు దోచినట్లు స్పష్టముగ వెల్లడించును. సన్నివేశమునకు దగినట్లు, మితిమీరనట్లు కథను నడపును. అతని రచన మందు సంకుచితి యెక్కువ. బహువిధ ప్రయోగదక్షతను చూపును. బంధపు బిగియు శైలీ సారళ్యమును, వర్ణనారమ్యతయు పంపని స్వభావములు. సముచ్చయములు విరివిగా వాడుటయు నాతని పోకడ.

పై చెప్పిన లక్షణములలో జాలవరకు నన్నయ యందున్నవనగా నా పల్కుగాదను వారుండరనుకొందును.

సోమయాజికవితలు చూచినపుడు వారి పలుకుబడులు గమనించినపుడు వారికిం గన్నడపరిచయ ముండునని యూహింప వీలున్నది.

వారి కాశ్రయదాత మనుమ సిద్ధి, నెల్లూరి యందున్నను, తిక్కన తండ్రి తాతలు జీవించినది రాజంపేట తాలూకాయందలి 'పాత్తపి' యని తమకు మనవి చేయుచున్నాను.

కిన్నెర. ఆగష్టు; 1953

# నన్నయ : కన్నడ భారతము

శ్రీ శిష్ట్లా రామకృష్ణశాస్త్రి

"పంపని భారతమును భట్టారకుని భారత రచనకు బోల్చిచూచి నపుడు రెండు గ్రంథములను రచించిన దొకరేనా? యన్నంత పోలిక గనుపించును," అని "సుజాత" ఆంధ్ర సారస్వత పరిషత్తు సప్తమ మహాసభా (అలంపురం) సంచికలో, పుట్టపర్తి నారాయణాచార్యులు గారు వ్రాసినారు. పంపడు వేఁగి నాటి వాఁడగుటను, నన్నయ వేఁగి నాటిలో తెలుఁగు భారతము రచించుటచేతను, వీరిరువురి పోషకులగు రాజులు చాళుక్యులే యగుటచేతను, వీరి కభిమానమున్నను, వీరిలో పంప జైన మతస్థుఁడైన నన్నయ వైదిక మతస్థుఁడగుటచేతను, పంప భారతము జైనమత పరముగను, నన్నయ భారతము వైదికమత పరముఁగను రచింపఁ బడుటచేతనే భిన్న సంప్రదాయములకుఁ జెంది పోయినవని వారే గుర్తించిరి. ఇఁక రచనా సామగ్రి విషయమున నన్నయకుఁ బూర్వమునఁగల శాసన పద్యములందు సంస్కృత వృత్తములు లేమిచే, సంస్కృత వృత్తములను దన భారతమున నన్నయ దెచ్చిపెట్టుట పంపాది కన్నడ కవుల ననుకరించి యేయని పండితులందరు నంగీకరించిన విషయమే. భావములు, తత్సమ సమాసములు తుల్యముగా నున్న వనుచోట్ల వీరిద్దరూ మూలమగు సంస్కృత భారతమును భాషాంతరీకరించునపు డిట్లుండుట సహజమే కదా! వీరి మూలముందలి భాషా భావములనే గ్రహించిరని యెంచవలెను. ఇఁక మూలమందు లేని భావములుగాని, దేశీయ పదబంధముగాని వీరిద్దరిలో తుల్యముగా నున్నచో నన్నయ కన్నడ కవుల ననుసరించెనని చెప్పిన నను తప్పులేదు. గాని యిట్టివి చూపక లాక్షణికులు, విమర్శకులు సామాన్యముగా చెప్పు కవితాశైలి లక్షణములను గూర్చి చెప్పిన వాక్యములనుబట్టి "భట్టారకుల 'ప్రసన్న కథాత్వ'మును, పంపని' ప్రసన్న కవితాగుణం', 'ఉదాత్త వస్తు విన్యాసం' అనేదు నవి రమ్మని

పిలుచుచున్నవి. అర్థయుక్తిని 'సకలార్థ సంయుత' అను శబ్దము పెన గూడుచున్నది 'అక్షర రమ్యత'కు పంపని మహామృదు పాదం 'లలిత పదం' వాక్శ్రీసుభగం అనబడునవి బంగారు నగలగుచున్నవి. 'కవీంద్రమలారసి మేలునాన్' అను భావమును స్పష్టముగా పంప చెప్పినాడు. "ఇంక తక్కిన పదములన్నియు నన్నపార్యునకు బుసరు స్ఫురింగ దోచి యుండుటచే వదలివేసిరి" అని తెలుపుట సాహసము. ఇందును సూక్ష్మముగా విచారించిన నన్నయ చెప్పిన "ప్రసన్న కథా కవితార్థయుక్తి'యు పంపడు తెల్పిన 'ప్రసన్న కవితాగుణ'ము నొకటి కాజాలవు. పంపడు చెప్పినవి యాలంకారికులు కవితను గూర్చి చెప్పిన దశ గుణములలో నొకటగు 'ప్రసన్నత్వము'; అనగా గూఢము గాక, తేలికగా తెలియు భావములు, పదబంధములుగాగల కవిత. కాని నన్నయ చెప్పిన 'ప్రసన్నత్వము' కవిత కంతకుగాక, కథకు మాత్రమే చెందునది. ప్రసన్నమైన (నిగూఢముగాని) కథతో గూడుకొనిన యర్థ చమత్కారము (యుక్తి) గల్గియుండుట యని యర్థము. అట్లే నన్నయ తెల్పిన 'అక్షరరమ్యత'కు, పంప సూచించిన 'లలితపదం'కు గూడ భేదమున్నది. భావములను బట్టి శైలి మారుచుండును. ప్రసాద గుణమునకు లలిత పదబంధము తగినది. గంభీర భావములకు లలిత పదబంధము చాలదు. ఓజోగుణము గూడ గావలసియుండును. ఆయా భావములకు గుణములకు తగిన శైలితో పదములను గూర్చుట యక్షర రమ్యత యగును. అందుచే అక్షరరమ్యత వివిధ పాకములబట్టి వివిధ ములుగా మారుచుండును. మరియు నన్నయ శైలి గంభీరముగ నుండి మదమాతంగమువలె నడుచునని ఎఱ్ఱనాదులు తెల్పిరిగద! కాన నన్నయ అక్షర రమ్యతకును, పంపని లలిత పదమునకును సంబంధము లేదు. లలిత పదబంధముగల రచన యక్షరరమ్యత గలది కావచ్చును గాని, యక్షరరమ్యత గల రచనలన్నియు లలిత పదబంధము గలవి గావు.

తర్వాత నాచార్యులవారు నన్నయ సంస్కృత సమాసగ్రథన లక్షణముల నుగ్గడించి, యవన్నియు పంపని సమాస గ్రథనమందు

న్నతని చెప్పి మధ్యనక్కొక్క వచనపు తునకను, రెండు కంద పద్యములను కన్నడ భారతమునుండి యిచ్చి "పై వచనము నందు-పద్యమునందు కన్నడ పదములను తెలుగుచేసి, ఆంధ్ర విభక్తులను చేర్చినచో - నన్నయ కవితకన్న వేఱుగా వానిని చూడలేము. వారిద్వరి వచన రచనముగూడ చాల పోలికలు గలది" అని వ్రాయుటలో నర్థములేదు. ఇంక "నన్నపార్యుని కవితలు విమర్శించునపుడు వారు 'వస్తుకవిత' ప్రధానముగ పలుకుదురని రసికులందురు ఆవస్తుకవిత పంప లోనిదే" అని వ్రాయుట మఱియు విచిత్రముగా ఉన్నది. నన్నెచోడుడు తన కవితను వస్తుకవిత అని చెప్పుకొనినాడు. కాని నన్నయ కవిత వస్తుకవిత యని యెవ్వరనిరో తెలియరాదు. ఇంతకు వస్తుకవిత యిట్టిదని యెవ్వరు నిర్వచింపలేదు. కాళిదాసాదుల యుత్తమ కవిత వస్తుకవిత యని నన్నెచోడుడు పొగడినాడు.

నన్నయయే కాక తిక్కన సోమయాజి గూడ కన్నడ కవితా ప్రభావముననే తన కవితలోఁ జూపినాఁడఁట. అంతకంటె విచిత్రము. "తిక్కన తండ్రి తాతలు జీవించినది రాజంపేట తాలూకాయందలి 'పొత్తపి' యని తమకు మనవి చేయుచున్నాను." అని వ్రాసినారు. ఇది వారి యతి వినయమును మాత్రమే తెల్పును కాని సత్యమాత్రము గాదు. వీరి విమర్శ దీనితో పరమకోటి కెక్కినది. తిక్కనయే తన తాత గుంటూరు విభుడని నిర్వచనోత్తర రామాయణమున చెప్పుకొనినది దీనితో పటాపంచలైనది. వీరికి ప్రమాణము సున్న. ఇట్టి విమర్శ కన్నడాభిమానమునే తెల్పును గాని యథార్థతను మాత్రము గాదు.

పంప నన్నయ కవితా రచనలందు, సంస్కృత సమాసములందు, స్పష్టత, రసానుగుణమైన కథాశరీర రచన మొదలగు గుణములు సమానముగ గలవని వారి వాదము. పురాణ రచయితలగు ప్రాచీనకవు లందరి యందు నీ గుణములు సామాన్యముగా నున్నవి. పురాణ కవితాగుణములు ప్రబంధ కవితాగుణములకంటె భిన్నములు.

ఇంత మాత్రమున నన్నయ పంపని యనుకరించెనని నిర్ధారింపఁదగదు. వీరు చూపిన కారక విశేషములను నన్నయ పంప నుండియే గ్రహింప నక్కఱలేదు. ఇవి నన్నయకు పూర్వము గల శాసనములందు గలవు. ఉదా :- 'నీ చేసిన యుపకారంబునకు"; కొణ్డుమయ్యను పరోప కారంబు పొందిగాని; అతని కొట్టించిన చెఱువులు; అతని చేయఁబడి' (చాళుక్య భీముని కొఱవి శాసనము. క్రీ. శ 892 - 929); "కొత్తంబు పొరకు కుండికాళ్ళుల ఇచ్చిన పన్నస" "బెజయత్త భటరల నిల్పిన దత్తి" "ఎరిగిల తుగరాజు ఇచ్చిన పన్నాస" "అశ్వమేథంబున ఫలంబు" (అద్దంకిశాసనము).

ఇక వ్యాసుని వర్ణించుచు పంప :

"నీలాంబుద శ్యామనుం, కనకపింగళజటా బంధ కాళాపనుం, దండకపాళ హస్తనుం. కృష్ణమృగ త్వక్పరిధానము మాగి వ్యాస భట్టారకం పుట్టువుదు' అని వర్ణింపగ, నన్నయభట్టు :

"కృష్ణాజిన పరిధాన కపిల జటా మండల దండకమండలు మండి తుండై" అని పంపని రచనను సంకోచ పరచినాడని యాచార్యుల వారు వ్రాసిరి. ఇందు 'కపాళ ధారణము' పనికిరాదని నన్నయ వదలి వేసినాఁడట. 'నీలాంబుద శ్యామనుం' అను దాని నేల వదలి వేయ వలయును? 'వ్యాసోనారాయణోహరిః' అను వాక్యమును నన్నయ విశ్వసింపలేదా? ఇదేనా నన్నయ సంకోచపరచవలసినది. పోనీ, మిగిలిన దానిలోనైనా నన్నయ పంపని యెంతవర కనుకరించినాడో చూద్దాము. పంపకవి 'కనకపింగళ జటాబంధ కళాపనుం' అని వ్రాయగ, నన్నయ "కపిల జటాశబ్దము మాత్రమే తుల్యముగాని, యితర పదములన్నియు భిన్నముగదా. పంపడు 'కృష్ణమృగ త్వక్పరిధానను' అని వ్రాయగ, నన్నయ 'కృష్ణాజిన పరిధాన' అని రచించి, కృష్ణ మృగత్వక్' కంటె 'కృష్ణాజిన' పదము ధారాళముగ వాడబడుదాని నుపయోగించెను. పంపని 'దండకపాలహస్తనం' అనుటకు

'దండకమండలు మండితోండై' అని నన్నయ వ్రాసెను. దీని కూడ 'దండ' శబ్దము మాత్రమే సమానము. ఇది సంస్కృత పదము. మిగిలినది నన్నయ స్వంతమే కదా: జటా, దండపదములు సంస్కృతములై భాషలో సర్వ సాధారణమైనవి. మరియు పంప యీ మూడు గుణములను ప్రత్యేకము వ్యస్తపదములుగ వాడగ నన్నయ వీని నన్నింటిని నేక సమాసమున గలిపి వేసినాడు ఇదేగాబోలు నన్నయ పంప ననుకరించినతీరు. ఇంతకు నేకవియైన నొక ఋషిని వర్ణించునపుడు "జటా దండ కమండల కృష్ణాజిన' ధారణమును గూర్చుట సర్వసామాన్యము. ఇవి లేకపోయినచో నతడు సన్యాసి కాక సంసారియే యగును. ఇందు విశేషమేమియు లేదు. ఇట్టి సామాన్య వర్ణనకు నన్నయ పంపని ననుకరింప వలయునా, వీరిద్దరి రచనలో గల శబ్ద సామ్యమును పైనం జూపితిని గదా. కాన దీనిలో పంప కవిని నన్నయ యనుకరించెనని చెప్పజూచుట నన్నయను గొంచపఱచఁ జూచుటయే. పంపని యనుసరించినచో 'నీలాంబుద శ్యామనుం' అను విశేష గుణమును పరిహరింప నేల? భారత భారతీ శుభగభస్తి' యను పద్యమును రచించి తన కల్పనా శక్తిని, భావనా శక్తి నేల ప్రదర్శింపగలడు? తర్వాత ఆచార్యుల గారు, నన్నయ "ప్రాచీన కర్ణాటక సాహిత్యమును గాలించి కళగల పదములపై కన్ను వేసి యుంచినాడు. అని వ్రాసినారు కాని యేయే కర్ణాటక పదములపై కన్ను వేసినాడో మాత్రమాయన తెల్పలేదు. దీనికి ప్రమాణము లేదు. కన్నడ పదములను విశేషముగా వాడినది నన్నెచోడుడు, పాల్కురికి సోమన మొదలైన శివకవులు. పద్యము నెత్తుగడ, యేక పదమును పునరుక్తిగా వాడుట, మొదలైనవి పంపకవి రచన లందలివి నన్నయలోనే కాక యితర సంస్కృతాంధ్ర కవు లనేకులలో గూడ వు. ఇంత మాత్రముచే నన్నయ పంప ననుకరించెనని వింపరాదు.

దున్నపోతీనినదనగానే దూడను గట్టివేయుమన్నట్లు, మరియొక మహానుభావుడు పంప నన్నయ పద్యములలోని తత్సమ సమాస

పదములను జూపి, నన్నయ పంపనుండి భావను దొంగిలిచినట్లు చూపెను. ఉదా :- పంప. భా. 1 :- 63; (2) అగ్గలం :- అది 6 217; పంప. 1. 10; (3) మాణిక్యాగాణిక్య. సభా. 1.18; అది. పు. 8. 16; (4) అనయన :- సభా. 1 16; పంప 9.35; (5) అరుణ :- అరణ్య 3-299; అది పు 7-8; (6) హిమకర :- అది 4-223; పంప. భా. 3, 82-83; (7) కురువృద్ధు - సభా. 2-233; పంప. భా. 6-44; (8) అష్టశోభ : అది. 7-281; పంప. భా. 5-22, 7-2; ఇంతేకాక సంస్కృత కవులనుండి గూడ పదసమాసములను దొంగిలించినట్లు రఘు వంశాది కావ్యములనుండి సామ్యములను జూపిరి ఉదా:- (1) గుర్వర్థ మర్థి :- అది. 1-94; రఘువం. 5-24; (2) సామ్రాజ్యదక్షితు:- సభా; రఘు వం. 4-5; (3) ఉదవాసః :- అది 2-25; కుమార సం. 5-26 ; (4) భేరి :- అది 7-174; (5) నిపాత :- అరణ్య 3-36; రఘువం. 2-60; + అభిజ్ఞాన శాకుంతల 1-10; సంస్కృత పదసమాసములు సంస్కృత కావ్యములందుండక యేలపోవును. దీనికై గ్రంథాన్వేష ణాయాస నటన యక్కరలేదు. ఆయా సంస్కృత పదములకై సంస్కృత నిఘంటువులను జూచినచో నాపద ప్రయోగములు గల కావ్యభాగములే ప్రమాణముగ నందీయబడును. ఇట్లు నన్నయవాడిన ప్రతి సంస్కృత పదమునకు సామ్యము జూపవచ్చును గదా. సంస్కృతములలోని సంస్కృత పదముల నెవరైన వాడగలరా ? పూర్వ సంస్కృత కవుల శబ్దజాలము సప్రమాణముగ కోశము లందుండగ, తర్వాత కవులాయా పదములను వాడకుండ నుండగలరా ? వాడినంత మాత్రమున పూర్వ కవుల రచనల నుండి దొంగిలించుటగాని, యనుస రించుటగాని యగుచో, నాయా భావములను వ్యక్తీకరించుట కాయా పదములుగాక, మరి యేపదము లుపయోగింపనగును. కావున సమపద ప్రయోగమున్నంత మాత్రముననే యనుసరణమనదగదు. సంస్కృత మూలమునుండి భాషాంతరీకరించు పంప నన్నయలు సందర్భాను సారముగ సంస్కృత సమాసముల నుపయోగించినంతనే పంపను

నన్నయ యనుసరించెనని యేల భావింపవలయును. ఇరువురకు మూలము వ్యాస భారతమే గదా. ఈ మాత్ర స్వల్ప విషయమును గుర్తింపక నన్నయ ప్రభావమును కొంచెపఱుపనేల ? ఒకవేళ సంస్కృత భారతమున నాయా పదములు వరుసగ లేకపోయినను, అనేక శ్లోకములందలి భావములను క్రోడీకరించి యిద్దరు క్లుప్తపఱచి వ్రాయుటలో ఛందోసమాస నియమముల ననుసరించిన పదముల కూర్పులో కాకతాళీయ న్యాయముగ కొన్నిచోట్ల కొన్ని పదములు సమానముగ దొర్లవచ్చును. వీరు చూపిన దానిలో నిది యొక్కటి మాత్రమే అట్టిది. చ. "సరళతమాల హరిచందన" ఆది. 8-78; పంప. ౫-3; ఇది చెట్ల పేర్లను దెల్పు ద్వంద్వ సమాసమందలి కొంత భాగము మాత్రమే. అనుసరింపదగిన విశేష మేమున్నదో పాఠకులకు విదితమే. ఇందు ఇతర సంస్కృత కావ్యమందలి పదములు దొర్లినట్లుగనే పంప నుండి గూడఁ గావచ్చును. కాని పని కట్టుకొని యాతని భారతమును నన్నయ అనుసరించెనని చెప్పరాదు. ఎందుకన "భారతముపై పంపడు వేసిన జినముద్ర భట్టారకుని మనస్సును శూలమై బాధించినది" అని నారాయణాచార్యులవారే వ్రాసిరి గదా. దీనిని బట్టి పంపపై నన్నయ కభిమానము లేదని విశదమే కదా. అభిమానము లేనివాడు ననుసరించుట ప్రకృతి విరుద్ధము. కాన నన్నయ పంప భారతము ననుసరించెననుటకు వీలులేదు. పారావారము వంటి సంస్కృత వాఙ్మయము లక్ష్యలక్షణములతో సిద్ధముగ నుండగ తన కొకటి రెండు శతాబ్దములు పూర్వమందున్న కన్నడ వాఙ్మయము మీద నెక్కువ యభిమానపడడు నన్నయ నన్నయ వాక్యరచన బహువ్రీహి సమాసముల తోడను, కారకాదులతోడను సంస్కృత భాష ననుసరించెనని గదా ప్రతీతి. సంస్కృత వాఙ్మయముతో బాటు నన్నయ పంప భారతము నొకమారు చదివి యుండవచ్చును. కాని పని కట్టుకొని దాని ననుసరించి యుండడు. ఒకవేళ నట్లే యనుసరించినచో వ్యాస వాల్మీకులను బూర్వకవులలో స్తుతించినట్లుగాని,

నారాయణభట్టు నందు కృతజ్ఞత చూపించినట్లుగాని, పంప విషయమై గూడ తెల్పెడివాడే నన్నయ. అట్టివి లేవు గదా. ఒకవేళ వ్యాస పంప భారతములను - జైన వైదిక భారతములను. సంస్కృత కన్నడ భారతములను, అనగా ఆర్య, ద్రావిడ, జైన, వైదిక సంప్రదాయముల నన్నయ యనుసరించినచో అయ్యవారిన చేయఁబోయిన కోతియయ్యె ననునట్లుండెడిది. కవి బ్రహ్మయగు తిక్కనయే నన్నయను 'విద్యాదయితు' డని పొగడెను గదా. ఇఁక మనమో యతని యెరవు సొమ్ముల నెత్తి చూపుచున్నాము.

పరిశోధన పూర్వక విమర్శకు ముఖ్యముగా (1) ప్రసిద్ధమైన ప్రమాణములను జూపవలయును. తరువాత (2) దానితో సమన్వయము చేసి వ్యాఖ్యానించునపుడు వాదము సహేతుకముగ, కార్యకారణ సంబంధము కల్గియుండవలెను. కాని, కేవల మూహా ప్రపంచమున గాలిమేడలు కట్టఁజూచినచో నవి నిర్మూలనము లగును. అద్యతన కాలమున సారస్వత విమర్శలనేక మీ విధముననే యున్నవి. అభిరుచి యున్నంత మాత్రమున విమర్శ నిర్దోషముగ సాగదు. ప్రతిభావ్యుత్పత్తులతోఁ బాటు అభిమాన రాహిత్యము (disinterestedness) విశేషముగా నుండినగాని విమర్శ నిర్దోషముగ నుండజాలదు. క్రొత్తదొకటి చెప్పవలెనను బులపాటు ముండిన చాలదు. దీని ఫలితమేమగునను నాత్మవిచారము గూడ నుండవలె. లేనిచో నాత్మవంచన పరవంచనలకు దారితీయును. నారాయణాచార్యులవారి వ్యాసము అలంపురు ఆంధ్ర సారస్వత పరిషత్తు సప్తమ మహాసభా సమావేశమున జదువబడనది. ఆ సభాసదుల సహనమునకు నా ధన్యవాదములు.

భారతి. డిసెంబరు; 1955

# నన్నయ తిక్కనల గద్య పద్యములు

శ్రీ మధునాపంతుల సత్యనారాయణశాస్త్రి

నేటికిని కొన్ని పల్లెటూళ్ళలో నిత్యము పురాణశ్రవణము జరుగుచుండును. భారతమో రామాయణమో ఒకరు చదువుట, ఒకరు అర్థము చెప్పుట సాధారణముగా నలవాటు. సహపాఠక నిరపేక్షముగా సాగెడి పురాణములు నుండును. అనఁగా పాఠకుఁడు వ్యాఖ్యాతయుఁ దాన. పట్టణమందలి పౌరాణికులు సాధారణముగా అసహాయులుగానే యుందురు.

నేను పెరిగిన పల్లెటూర తెలుఁగుభారతము పురాణముగా చెప్పఁబడుచున్నది. పాఠకుఁడు వేఱు. పౌరాణికుఁడు వేఱు. పాఠకుఁడు నాటరాగములో ప్రార్థనాదికము చేసి ఘట్టముతీసి పద్యము పాడెను. రాగరంజితముగా విసరి చదువుటలో, ఆ చదువునది వచనమైనను పద్యముగానే సామాన్య శ్రోతకు భాసించెను. రసానుగుణమైన రాగముతో పాఠకుని పద్యాంతస్వరమున శ్రుతికలిపి పౌరాణికుఁడు 'అర్థము' పాడును. మరలఁబాఠకుఁడు చదివి పాడును. పౌరాణికుఁడు అర్థము చెప్పును. రాత్రివేళ సద్దుమణఁగి యున్నది. పురాణశ్రోతలు తన్మయావస్థకు వచ్చుచున్నారు. ఘట్టము ఆదిపర్వములోనిది నన్నయగారిది. అచ్చటి గద్యమును బద్యమువలెనే రాగములోఁ గలిపి పాఠకుఁడు పాడఁగా-గుటికె బారెఁడు ఇంచుమించులో అది పద్యమేమో యన్న సవి నాచెవికిఁ దగిలినది. 'అదియేమి పద్యమయ్యా' అని పాఠకు నడిగితిని. అతఁడు కవిత్వపుఁ గర్మమునఁ జిర్లిఫ్రుఁడగుటచే "వ" అని పద్యముఖమున నన్నదని జవాబుచెప్పినాఁడు. ఓహో! వచనపద్యము కాఁబోలు! అని నవ్వుకొంటిని. పురాణరాగ సమ్మిళనముతో నన్నయగారి గద్య పద్యములకు అద్వైతము ఆపాఠకుఁడు నాఁటిరాత్రి బోధించి నటులయినది. తరువాత గ్రంథము నందుకొని ఒకఁడొకఁడు చదువుకొని పోవుదును గదా! అబ్బురపాటుతోపాటు ఆనందము! ఆ ఘట్టమిది:

“వ”నీవు బ్రాహ్మణుఁడవు నీ వెద్దిసేసిన నీకచను లోకహితుఁడ నయిన నాకు శాపంబిచ్చి లోకంబులకెల్లఁ జెట్టసేసితి వడెట్లనిన...”

(అది. ౧.౧౮౦]

ఇందు పూర్ణబిందువులు రెండు [అరసున్నలుగా మార్చి, మూఁడవపాదములో యతిభంగమునకోర్చి, రెండవచరణములో సూర్య గణముచేర్చి, నాల్గవపాదములో రెండక్షరములు తొలఁగించిచూచినచో 'ఆటవెలఁది' యైనది. ఇదిగో!

నీవు బ్రాహ్మణుఁడవు నీ వెద్దిచేసిన
నీక చనును (గాక !) లోకహితుఁడ
నయిన నాకు శాపమిచ్చి లోకంబుల
కెల్లఁ జెట్టచేసి తెట్టులనిన.

అది యెంది సర్వదా నన్నయగారి గద్యములు లీదృష్టితో పరిశీలించుకొనుట యగుచున్నది. ఆయన ఆంధ్రవాఙ్మయమునకు ఛందోవతారము. గురు పద్యవిద్యకు నాద్యుడు వాల్మీకి అక్కడనెట్లో, ఇక్కడ భట్టారకుఁ డటులు. తిక్కన విద్యోదయితుం డని భట్టారకు నుట్టంకించుటలో రహస్యము పద్యవిద్యకుఁ జెందినదే.

క్షేమేంద్రుఁడు తన 'కవి కంఠాభరణము' నఁ గవితాభ్యాసము కావించువారి కోసము కొన్నిదారులు ఏర్పఱచినాఁడు. ఛాయోపజీవి, పాదోపజీవి, పద్యోపజీవి, భువనోపజీవి — ఈ తీరులయిన తరగతులు కల్పించి మొదలించినాఁడు. అది తలఁపునకు రాఁగా; నన్నయ గద్యములు కొన్ని వేరుగా నేఱి యొసగి ఆపదములతో అఱఁతియలఁతి మార్పు చేర్పులు చేసికొనుచు గీతాదిపద్యములుగా వ్రాయఁజూడు డనికొందఱు పద్యవిద్యార్థులకు మచ్చులుచూపిచెప్పితిని. అభ్యాసికమైన నిపుణతతో ఈ పద్ధతి లెస్సగా నున్నదని వారి యనుభవము వారు చెప్పిరి. దీని సారార్థము : నన్నయభట్టారకుని ప్రతి గద్యము ఛందో నిర్బంధ మధురమైన పద్యముగా నుండుననియే, అన్నింట నొక శ్రుతివాహనమైన రాగచ్ఛాయ యున్నట్టులే తోఁచును.

(౧) అట్టియెడఁ గద్రువయు వినతయు వినోదార్థంబు విహరించు వారు కరిమకర నికరాఘాతజాత వాతోద్ధూత తుంగతరంగాగ్ర సముచ్ఛల జ్జల కణాసారచ్ఛటాచ్ఛాదిత గగనతలంబైన దాని నుద్యానంబునుం బోలె బహువిద్రుమ లతాలంకృతంబైన దాని..."

(౨)వానిం జూచి కాని కుడువనొల్లనని దేవయాని యేడ్చుచున్నఁ బెద్దయుం బ్రొద్దునకుఁ బ్రసన్నుండై శుక్రుండు తన యోగదృష్టిం జూచి లోకాలోకపర్యంత భువనాంతరంబునఁ గచునంగానక సురాసమ్మిశ్ర భస్మమయుండై తన యుదరంబుననున్న యక్కచుం గని..."

(3) "అదియును నూఱుయోజనంబుల వెడల్పును నూట యేఁబది యోజనంబుల నిలుపును నేను యోజనంబుల తనర్పునుం గలిగి వైహాయసంబయి కామగమనంబయి వ్యపేతశీతాతపంబును సకలకాల కుసుమ ఫలభరిత పాదపావన సంకీర్ణ సరోవర విరాజితంబయి తపః ప్రభావంబున నమరేంద్రుచేత నిర్మితంబయి కరంబొప్పుచుండు నట్టి సభయందు.

(४) వ. "అట్టి యవసరంబున ద్వారవతినుండి యాహుక ప్రేషితుండయి యొక్కరుం డతిత్వరితగతిం బఱతెంచి సాల్వుచేత నక్కడ వసుదేవుండు పట్టువడియె..." (అరణ్య - ౧౧౬౦)

ఈ వచనము గీతగమనము కలది. ప్రథమ చతుర్థ చరణముల యందు ఒక్కొక్క యక్షరము చేర్చవలసియుండును. యతిమైత్రి చూడరాదు.

గీ. అట్టి యవసరంబున (ను) ద్వారవతినుండి
యాహుకప్రేషితుండయి యొక్కరుండ
తిత్వరితగతిం బఱతెంచి సాల్వుచేత
నక్కడ (న్) వసుదేవుండు పట్టువడియె.

(౫) దానవభస్మసాత్కరణ దారుణము...(అరణ్య ౧ ఆ.౧౬౩)

ఏను సముద్రతీరంబున సాల్వుతోడం బదినెలలు యుద్ధంబుసేసి వాని వధియించుచుపొంటె నక్కడ మసలితి నది కారణంబుగా మీకు

దుర్వ్యసనావసరంబుననలబ్ధసన్నిధానుండనయితి నదియెట్లనియుధిష్ఠిరుం డడిగిన నాతనికి సౌంభ కాఖ్యానంబు సవిస్తరంబుగాఁ గృష్ణుం డిట్లని చెప్పె... (ఆది. 1.150 వ)

ఈ చివరి వచనము ఉత్పలమాలలో వ్రాయఁ గుదురును. ఏను సముద్రతీరమున నెంతయు సాల్వునితోడఁ బోరియున్ వాని వధించు పొంకె.........సౌఁభకాఖ్యానము......ఈ రీతిని ప్రాసస్థానములు కూడ ఈ వచనమే సూచనము చేయుట లేదా!

(౬) మఱియు సారథిఁ చూచి విహ్వలమానసుండయి యిట్లనియె. (అరణ్య. 1.169)

"మఱియు సారథిఁజూచి విహ్వలమానసుఁడయి యిట్లనెన్"— ఇది సరళవృత్త చరణగతిం సాగిన వచనము.

(S) అగ్ని భట్టారకు ననురూప శుభవచనంబులు (ఆది.2.250)

ఈ వచనము నన్నయభట్టారకు ననురూప శుభవచనంబులకుఁ బౌనరుక్త్యముగా నున్నది.

అగ్నిభట్టారకుఁడు, విష్ణుభట్టారకుఁడు, భర్గభట్టారకుఁడు, అని పెక్కుచోట్ల నన్నయభట్టారకుఁడు ఉపయోగించెను. పూజ్యార్థకమైన యీ భట్టారక శబ్దము వాడఁబడిన పట్టులనెల్ల నన్నయగారి ఆత్మ సమాశ్రయమైన కవిత్వమూర్తి సహృదయులకు చక్షురాతిథ్యము చేయుచునే యుండును.

భటతీతి భట్టః వాగ్మి భట పరిభాషణే తన్ ప్రత్యయః=పూజ్యః

దండి, భట్టబాణుఁడు, సుబంధుఁడు మున్నగు సంస్కృతకవులవియు, ప్రాచీనాంధ్ర ప్రబంధాంతర్గతము లైనవియునగు గద్యములలోఁ గొన్ని పద్య శైలీకములు లేవా! యనవచ్చును.ఉండవచ్చును. కేవల వచనకృతులు కాక చంపూఫణితిలో నున్న కృతులు చూచి నపుడు పద్యముప్రక్కనున్న గద్య మెట్లునడచినది? గద్య పద్యముల తూక మెట్లున్నది? మొగ్గ తగ్గులెట్లున్నవి! మనము పరామర్శింపఁ

గలుగుదుము. కేవల వచనకృతులలో, కేవల పద్య కావ్యములలో, ఈరీతి విచారమున కవకాశము లేదు.

ఇక్కడ విశేషము. నన్నయగారి గద్యపద్యములోకే ట్రుక్కులో దిరుగును. పద్యములోని నాద పేస్థాయిలో నుండునో దాని వెంట నున్న గద్యమున కదేస్థాయి నాదము. కవిత్వములో నిదియొక గాంధర్వ విద్య. ఎక్కడ నేవృత్తము వ్రాయవలెనో ఎత్తుగొన్న గద్యము ఎంత పరిమాణములో నుండవలెనో పద్యగద్యముల సంధులెట్టులు తీర్చ వలెనో ఏతాదృశ రచనా రహస్యవిద్యా సమున్మీలనమునకు నన్నయ మూలశిల్పి. "ఆంధ్రకవిత్వ విశారదుం" డన్న వెంట "విద్యాదయితుం" డని తిక్కన చెప్పుటలో నుద్దేశమేమి ? గద్యపద్య రచనావిద్యకు అయన దయితుం డనుటయేకదా !

ఇంక, తిక్కనగారి పద్యము లించించుక మార్చుకొనుచు వచనశైలిలో వ్రాసికొనిపోఁగా నదియొక మహాగద్య గ్రంథము. శ్రీ వీరేశలింగముగారికి "గద్యతిక్కన" యను బిరుదమున్నది. దానికి దాతయెవరోకాని మంచి పరిజ్ఞాత. తిక్కనగారు ప్రత్యేకమైన వచన గ్రంథము వ్రాసినవారుకాదు. పయిపెచ్చు నిర్వచనముగా నుత్తర రామాయణము వ్రాసెను. మఱి, భారతములో నడుమ నడుమ గద్యములనుబట్టి యతఁడందు లోకోత్తరుఁడనియు వీరేశలింగముగారు నేఁడు తిక్కనవంటి వాఁడనియు ఈబిరుదమునకు జెప్పవలసిన యన్వర్థత యగునా ? ఇట్లు తోఁచుచున్నది.

నన్నయ పద్యవిద్యకువలెనే తిక్కన గద్యవిద్యకు ఆద్యోపదేష్ట. నన్నయ గద్యమును సైతము పద్యముగాపాడి చూపించెను. తిక్కన పద్యములో వ్యక్తవాఙ్మధురమైన గద్యము నుపన్యసించెను. వారి గద్యపద్యములు రెండునుగలసి మహాకవిత్వము. ఆంధ్రకవితం విశారదత్వమున వారిరువురు సగర్భ్యులు. పద్యము ఫలభూమి. గద్యము కర్మభూమియైనచోఁ గర్మభూమినుండి ఫలభూమికిఁ జేర్చువాఁడు నన్నయ. దేవభూమిని తెలుఁగు పుడమిలోఁ దిలకింపఁజేసినవాఁడు

తిక్కన. నాకలోక వాసియైన తండ్రిని తనదగ్గఱకు రప్పించుకొనఁ గలిగినాఁడు.

తిక్కన గద్యశైలిరీతి యెట్టిది ! సమాపకక్రియా పదబాహుళ్యము ఆయనరచనలో నొకయొడుపు. గొలుసుకట్టుతనమునకు క్త్వార్థకము లుపయోగించుచు, తిక్కన యెక్కడికక్కడ తెగ టెంపులు చేయును. సుదీర్ఘవాక్యములు చేయఁడు. మహామంత్రిగా నుపన్యసించుచున్న ఠీవి ఆయన పద్యగద్యములలోఁ గనఁబడును. ఆధునిక కాలమున వచనరచనలో నెన్నో పోకడలు వచ్చినవి. ఆయన్నింటికి నాదిశిల్పము తిక్కనగారిది. ఈ పద్యము చూడుఁడు.

దప్పి జనించె; క్రేళుల పుటంబులు పొక్కఁ దొడంగె; గోళ్ళలోఁ
జిప్పిలఁ జొచ్చె నెత్తురులు; చిత్తమునాకుఁ గడు న్వశంబుగా ;
దప్పెర మిచ్చటచ్చటను నాసలవచ్చితి; నెంత దవ్వొకో!
యిప్పటిభంగి నొక్కఁడుగు నేఁగెడుదానికి నోర్వ నెమ్మెయిన్.

ఈ పద్యమున ఆఱు-ఏడు సంపూర్ణక్రియలున్నవి. ఒక్కొక్కటి ఒక్కొక్కవాక్యము ఇది ఛందస్సులోఁ జూపించిన యొక సుకుమారమైన గద్యపద్య. నేఁటి నిపుణుఁడైన వచనరచయిత ఈమాదిరి వామన వాక్యములు వ్రాయుటకు ముచ్చటపడును. వేఱొక కవి "దప్పిజనించి క్రేళులపుటంబులు పొక్కి...గోళ్ళలో నెత్తురుచిమ్మి..." అను రకముగా క్త్వార్థకములు వాడి అవిచ్ఛిన్నపద్య భావధారకు 'పాడి' రఘునర్చితినని సంతోషపడును. ఆ శైలి సొగసు, ఈ శైలి సొగసు అనుటకుఁగాదు. తిక్కనగారి పద్ధతి యిది.

ఇమ్మదిరాక్షి డస్సె ; మనకీ నడుమన్ విడియంగ నొండుచో
టిమ్మనుగాదు ; నిక్కమున కేమును డస్సితిః మట్లుగాన నీ
వెమ్మెయినైన దీని భరియించి పురంబు సమీప భూమికిన్
దెమ్మని చెప్ప నాతఁడును దెచ్చెఁ బ్రియంబునఁ బుష్పకోమలన్.

"ఈమె యలసినది, ఈనడుమవిడియుటకు మనకు వేఱొకచోటు అనుకూలముగాదు. నిజమునకు మేమును అలసితిమి. నీ వెట్లైన ఈమెను పురసమీపమునకుఁ గొనిరమ్ము..." ఇది క్రియాపద భూయిష్ఠమైన గద్య రచనతీరు.

పగ యడఁగించు టెంతయు శుభం; బది లెస్స యడంగునే పగన్
బగ వగఁగొన్న మార్కొనక పల్కకయుండఁగ వచ్చునే? కడున్
దెగ మొదలెత్తిపోవఁ బగదీర్పఁగ వచ్చినఁ గార్యమొందు; నే
మిగతిఁ దలంచినన్ బగకు మేలిమిలేమి ధ్రువంబు కేశవా!

ఇతి శతవృద్ధ మాజనని యిప్పుడు మృత్యువుఁ బొందె; నిట్లు సే
యుదుము కులప్రయుక్త మగుచున్న సనాతన ధర్మ మిత్తెఱం
గ దహనకర్మ మెల్ల; మదిగా నిదిగా మును నిశ్చయించి మా
మొదలిటివా రొనర్చువిధముం గొనియాడితి మేము నిర్వ్యథన్.

ఈ పద్యములు వ్యక్తవచోబంధ మాధురీ సగంధములైనవి. ఈ రచనతీరు క్రొత్తది. క్రియాపద బహుళమై శకల శకలములుగా నున్న లఘువాక్యములతో ఒక మహాభావమునందు తాత్పర్యము చెప్పెడి పద్ధతి గలది "గద్యశైలి" యనుకొన్నచో ఆ పోకడకు తిక్కనగారిదే యొరవడి.

నన్నయగారి ఇట్టి రచనాఫణితి భట్టారకులవారిలోను లేక పోలేదు. ప్రాచుర్యమును బట్టి చూచుకోవలెనుగదా!

వాఁడి మయూఖముల్ గలుగువాఁ డపరాంబుధిఁ గ్రుంకెఁ ధేనువుల్
నేఁడిట వచ్చె నేకతమ; నిష్ఠమెయిన్ భవదగ్నిహోత్రముల్
పోఁడిగ వేల్వఁగాఁ బడియెఁ బ్రొద్దును బోయెఁ గచుండు నేనియున్
రాఁడు; వనంబులోన మృగరాక్షస పన్నగబాధ నొందెనో!

ఈ పద్యములో అయిదారు పొట్టివాక్యము లున్నవి. ఇవి యన్నియు దేవయాని పరిదేవన భావమును ప్రకటించుటలో పర్యవసన్న

మగుచున్నవి. లఘువాక్యములు నాదఖండములు. అవి వ్యక్తములు, అవ్యక్తనాదమునందు వానికిఁ బర్యవసానము. అవ్యక్తము అఖండము. ఇపుడు గద్యము వ్యక్తవాక్కు. అది ఖండము. పద్యము అవ్యక్తవాక్కు. అది అఖండము. ("గద వ్యక్తాయాం వాచి"-గద్యతే (భ్వాది) పాదాః సన్త్యస్య అన్యేభ్యోఽపి-ఇతియప్, గద్యపద్యాక్కృతౌ కవేః) ఇది వేదాంతము కాదు. గద్య పద్య శబ్దముల పుట్టుపూర్వోత్తరములు ఈ యర్థమును చాటుకొనుచున్నవి.

పద్యము ప్రకాశస్వరూపము. గద్యము విమర్శస్వరూపము పద్యము మొగ్గ. గద్యము పువ్వు; పద్యము పరమశివుఁడు. గద్యము విరాట్పురుషుఁడు, గద్యపద్యములు ప్రకృతి పురుషులు; ప్రయోగోపసంహారములు —

ఇటుల లోలోనఁ జొచ్చుకొని చూచినచోఁ దెలుఁగు కావ్య సారస్వత భవిష్యదభ్యుదయమునకు నన్నయ తిక్కనలు కూడఁబల్కుకొని ఏకనాళావలంబి ఫలయుగళముఁ బోని తమ తమ ప్రత్యేక శైలులతో అమృతభిక్ష ననుగ్రహించిరే కదా !

భారతి, ఫిబ్రవరి; 1960

# నన్నయ తిక్కనలు - అవతారిక తెన్నులు

శ్రీ మధునాపంతుల సత్యనారాయణశాస్త్రి

ఇరువురును రెండు మహోన్నత శిఖరములు. మొదటవానిది ఋషిమార్గము. రెండవవానిది రసమార్గము. కాలపరిణామము కవితా పరిణతికిసూచకము. భట్టారకులవారికి సోమయాజులవారికి నడుమనున్న కాలము రెండు శతాబ్దులకు మించినది. నన్నయ భారతవిశేషము విరాటాదిగఁ దిక్కన యాంధ్రావళి మోదమునకుఁ దెనుఁగు చేసెను. నన్నయకుమున్ను చెప్పఁదగ్గ తెలుఁగు సాహిత్యము బయలుదేఱలేదన్నచో, కాళిదాసాది సంస్కృతమహాకవుల రచనలు నన్నయకు ఉపజీవ్యములయ్యెనని చెప్పక తప్పదు-నన్నయకుఁ గాళిదాస ప్రభృతులనుకావ్యాలనుటవలనను, తిక్కనసోమయాజికి నన్నయ ఉపజీవ్యుఁడనుటవలనను వారివారి స్థానగౌరవములను లాఘవపఱచుటకాదు.

సోమయాజి నన్నయభారతకృతి సారమును అవతారికను పురోడాశమువలె సేవించినపుణ్యపురుషుఁడు. నన్నయభారతావతారిక తీరు తిక్కననాఁటికి కొక్క గడుసు మెఱుఁగుదేఱినది. అట్లే లోపలి రచనయు. రాజరాజనరేంద్రుఁడు భారత శ్రవణాశక్తి సందర్భముసర్వము నన్నయ పరోక్షపరిభాషణ ఫణితిలోఁ జెప్పెను. సోమయాజి ప్రత్యక్ష సంభాషణ ఫక్కిలోఁ దన కృతిరచన హరిహరనాథ ప్రసక్తి చెప్పుకొనెను. ఈ ప్రత్యక్ష పరోక్ష కథనవిధానములలో నన్నయ తిక్కనల దెవరిమార్గము వారిది నన్నయ మంగళశ్లోకానంతరము ఆఱు గద్య పద్యములలో రాజరాజు గుణాకృతి విశేషములు వర్ణించెను. మంత్రి పురోహిత సేనాపతి దండనాయకాది పరీతమగు నిండుఁ గొలువులో సుఖోపవిష్టుఁడై చళుక్యాన్వయభరణుఁడు "...నిత్య సత్య వచను మత్యమరాధిపాచార్యు సుజను నన్నపార్యుఁజూచి" ఇట్లు పలికెనఁట. "నన్ను నన్నపార్యుఁ జూచి" అని చెప్పుకొనవలసి యుండియు, అస్మచ్ఛబ్ద ప్రయోగము అహంతాస్ఫోరక మగునని కాఁబోలు, పరోక్ష

పద్ధతిలో నన్నయ వ్రాసికొనిపోయెను. "నేను" శబ్దముతో అంటిముట్ట కుండుట పెద్దల భాషణాచారములో నున్నది. "మీ పేరేమి?" అని యడిగినపుడు "రామయ్య యందురు." "రామన్న యందురు" అనువృద్ధ వ్యవహారము క్రమముగా నిపుడిపుడు దూరమగుచున్నది. తురీయాశ్రమస్థులయినవారిలో కొందఱు "నేను" నకు బదులుగా "వీడు" "వాడు" కొనుట నేఁడును వినుచున్నాము.

ఆచారౌచిత్యమునకు జీవగఱ్ఱ యనఁదగు నన్నయ కృత్యాదిఁ తానై సంచరించుచున్నను చాటుననుండి పరోక్షభాషణము చేయించెను. "అని యానతిచ్చినవిని యక్కవివరుం డిట్లనియె "-నానారుచిరార్థ సూక్తినిధి నన్నయభట్టు తెనుంగునన్ మహాభారత సంహితారచన బంధురుఁడయ్యె "నన్న పార్యుఁజూచి యిట్టులనియె" - ఈతీరున అవతారిక నన్నయ ఆత్మ..క్షణమునకు దర్పణము. అట్టి పరోక్షపద్ధతి ఆధారము చేసికొని యొకరెవరో అవతారికలోఁ గొంతభాగము నారాయణభట్టు వ్రాసియుండునని చమత్కరించినారు. నేఁడు పానుగంటి వారి నాటకములు కొన్నిటికి కూఁచి నరసింహముగారి నాందీప్రస్తావన రచన లున్నవి! ఇది యట్టిది కాదు.

నన్నయనాఁటికిగల పరోక్షకథన విధానము తిక్కనాఁటికి ప్రత్యక్ష కథనముగాఁ బరిణతమైనది - సోమయాజి "పరతత్త్వము గోల్పడ నిష్ట సిద్ధికిన్." "ఒక్కనాఁడిట్లని వితర్కించితి" - "నన్నునాకర్షించి కొలిపించుకొని"-"ఏనును భక్తిమయంబగు" - నాపుట్టు కృతార్థతం బొరసెఁ బుణ్యచరిత్రుఁడ నైతి"-నేర్చిన భంగిఁజెప్పి వరసేయుఁడ నయ్యెద భక్తకోటికిన్"-మహాకవిత్వ దీక్షావిధినొంది పద్యగద్యములన్ రచియించెదం గృతుల్"-ఏవం విధముగా అస్మచ్ఛబ్దములతో, ఉత్తమ పురుషలతోఁ గృత్యాది గ్రుచ్చియెత్తెను. తెలుఁగు మీఁటిన యానాఁటి కీతీరు అహంకార ద్యోతకము కాదన్నమాట.

నన్నయకు మున్ను సంస్కృత సారస్వతమునకుఁ గల విలువ తెలుఁగునకు లేకుండెను. అమరభాషా మర్యాదలు గౌరవించు భట్టార

కుఁడు దైవప్రార్థన తద్సభలో నేరచించి సంతుష్టుఁడయ్యెను. "శ్రీవాణీ గిరిజాశ్చిరాయ..." ఇత్యాది.

తిక్కననాఁటికి దేశభాష దేశభాషాసహపీఠమున అసీనురాలయ్యెను. "శ్రీయన గౌరినాఁబరగు..." ఇత్యాదిగఁ దిక్కన పరతత్త్వ ప్రశంస తెనుఁగుననే జరిగెను. నిర్వచనోత్తర రామాయణమున "శ్రీరాస్తాం, – ఉండుఁగాక! భారతకృత్యాదిలోఁ దిక్కనయుఁ దన కిశోరదశలోని శ్లోకము "కిమస్థిమాలాం కిము కౌస్తుభం వా పరిష్క్రియాయాం బహుమన్యసే త్వం, కిం కాలకూటః కిమువా యశోదా స్తన్యం తవ స్వాదు వద ప్రభో మే" అన్నదానిని సందర్భింపఁజేసెను. "శ్రీవాణీ..." శ్లోకముతో నన్నయ త్రిమూర్తిస్తవము నే యుద్దేశమునఁ జేసెనో, తత్పరబ్రహ్మచారియగు నుద్దేశముతోనే తిక్కన "కిమస్థిమాలాం..." శ్లోకముతో హరిహర నాథస్తుతి చేసియుండును.

సోమయాజి కృత్యాదిలో నొక వైలక్షణ్యము! తాను కలగాంచును. కలలో, తనతండ్రి కొమ్మనకనఁబడి హరిహరనాథునిగూర్చి పరిచయము చేయును. హరిహరుఁడు "కృతిపతిత్వ మర్థించి వచ్చితిఁ దిక్కశర్మ!" అనును. తిక్కనగారి స్వప్నము సత్యార్థగంధి.

అక్కడ రాజరాజనరేంద్రుఁడు తానై నన్నయను తెనుఁగులో భారతము రచింపవేఁడెను. రాజరాజు అన్నది యింతె : ... "భారతబద్ధనిరూపితార్థ మేర్పడఁ దెనుఁగున రచియింపు మధికధీయుక్తిమెయిన్", భారతము తన కంకితముగా నిమ్మని యతఁడు తేలలేదు. హరిహరుఁడో! కృతినర్థించివచ్చితిననెను. వాస్తమునకు రాజరాజునకుఁ గృతిగ్రహణకాంక్షయు నుండదా? రచియింపుమనుటలో రచించినా కంకితము సేయుమను నర్థము ప్రతీయమాన మగుచున్నదా? నన్నయ లోకజ్ఞత అవతారికలో బహుముఖముగా గోచరించును.

తిక్కన అవతారికలోని విలక్షణతలలో స్వప్నప్రసంగ మొకటి. షష్ఠ్యంతములును క్రొత్తలు. సోమయాజి పిదప కొందఱు ప్రబంధకారులు కలలు గాంచిరి. షష్ఠ్యంతములుస రేసరి. షష్ఠ్యంతములు లేనిచోఁ

ప్రబంధమే కాదనునంతటి గాఢప్రచారము వానికి వచ్చినది. కృతిపతి వ్యవహారమునఁగాక సంస్కృతకావ్యమున ఈ పద్ధతి యొక మాదిరిది. "శైశవేఽభ్యస్త విద్యానాం యౌవనే విషయైషిణాం వార్ధకే మునివృత్తీనాం...రఘూణామన్వయం వక్ష్యే" — రఘువంశము తెలుఁగు వారి షష్ఠ్యంతములకు దిగ్దర్శని యైనదనవచ్చును. సోమయాజి యెత్తుగడలలో షష్ఠ్యంతముల కవిరళప్రచారము, స్వప్నసంగతికి విరళప్రచారము చేకూరినది.

నన్నయ భారతము రాజరాజునకు వినిపించెను. తిక్కన హరిహరనాథునకు భారత మంకితముచేసెను. "పుట్టుకృతార్థతం బొరసెఁబుణ్యచరిత్రుఁడనైతి"నని జన్మచరితార్థ్యమును తిక్కన లెక్కించుకొనెను. నన్నయ కటులుకాదు. "అమలిన తార కాసముదయంబుల నెన్నను సర్వవేదశాస్త్రముల యశేషసారము ముదంబునఁ బొందను.. భారత భారతీసముద్రము దరియంగ నీఁదను విధాతృనకైనను నేరఁబోలునే!" అను సంశయ మాయన యంతరంగమున నున్నది. రెండున్నర పర్వములకు మాత్రమే పర్యాప్తమైన తన భవిష్యము తొలుతనే తలపోసికొన్నాఁడు. "హృదయాహ్లాది విరాటపర్వమట నుద్యోగాదులుం గూడఁగా బదునేనింటిఁ దెనుంగుబాస జనసంప్రార్థంబులై యొప్పఁగాఁ దుదిముట్టన్ రచియింపుటొప్పు బుధసంతోషంబు నిండారఁగన్" ఇట్టిది తిక్కనగారి విశ్వాసము. సాధారణముగాఁ గృతికర్త కృత్యారంభమున మంగళపద్యములు కొన్ని వ్రాసి, కృతిసమాప్తిచేసి, పదపడి కృత్యాదికి మరలవచ్చి మఱికొన్ని చేర్పులు చేయుచుండునేమో! నేఁడు కృత్యాద్యవస్థలు లేవు. నన్నయ కృత్యాది మున్ముందరనే రచించియుండును. తిక్కన కొంతముందు, కొంత వెనుక వ్రాసియుండెనేమో!

నన్నయ తన పూర్వవంశీయులను గూర్చికాని, తలిదండ్రులను గూర్చికాని యేమియుఁ బ్రసంగింపలేదు. ఆపస్తంబసూత్రుఁడనని, ముద్గలగోత్రుఁడనని చెప్పుకొనెను. తిక్కన తనతండ్రి గుణవిశేషమును

సమగ్రముగాఁ జేర్కొనెను. "తన కులబ్రాహ్మణు" మున్నగు సీసములో నన్నయనిజవిశేషములు వెల్లడించెను. తిక్కన తన తండ్రిని గూర్చి యొక సీసము వ్రాసెను. ఇష్టదేవతాభ్యర్థనములో నన్నయది తనివితీరని శ్రద్ధ. "హరిహరాజ గజాననార్కషడాస్య మాతృసరస్వతీ గిరిసుతాదిక దేవతాతతికి" ఒక గ్రుక్కలోఁ బ్రణతిపాతము చెప్పినాఁడు. విద్వత్సంస్తవనీయ భవ్యకవితావేశుండు.. మున్నుగా భారత ప్రశంస నవీనముగాఁ జేసెనేకాని, ప్రత్యేకించి అజగజాననాదుల స్తుతికిఁ బద్యము వ్రాసినవాఁడు కాలేదు తిక్కన. "విద్యాదయితుం డొనర్చె మహితాత్ముఁడు నన్నయభట్టు దక్షతన్" అని చెప్పిన తిక్కనకు భట్టారకుఁడొక బ్రహ్మ.

నన్నయ భారతావతారికలోని భూయోధర్మము తిక్కన యవతారికలో నున్నది. రెండును పుష్పవంతులు. ఒకనికవిత ప్రసన్నకథాకలితము. వేఱొకనిది ఊర్జిత కథోపేతము; ఒకఁడు నానారుచిరార్థసూక్తినిధి; వేఱొకఁడు నానారసాభ్యుదయోల్లాసి, ఒకఁడు జగద్ధితముగ భారతము వ్రాసెను; వేఱొకఁడు బుధసంతోషమునకు భారతము వ్రాసెను.

ప్రథమునిది కర్మభావన. ద్వితీయునిది బ్రహ్మభావన. నాదృష్టికిటులు తోఁచును. "అమల సువర్ణ శృంగ ఖురనై ... భారత బద్ధస్పృహులగువారికి నెప్పుడు బహుయాగంబుల ఫలంబు పరమార్థముగన్" - నన్నయ విశ్వాసము తాదృశము.

"జనన మరణాదులైన సంసార దురితములకు నగపడకుండగఁ దొలఁగు తెరువుగను వెలుంగు నీకిచ్చితి" మున్నగునవి సోమయాజి బ్రహ్మ భావనకు సూచికలు. పరమార్థతః కర్మబ్రహ్మభావనైక్యము చెప్పఁబడునుగదా! తెలుగు సారస్వతమున నన్నయ తిక్కనల భారతావతారికలు పూర్వోత్తర మీమాంసలకుఁ బ్రతిచ్ఛందములు. భట్టారకులది జైమిన్యంశ. సోమయాజులవారిది ద్వైపాయనాంశ - తెలుఁగు కవులపాలిటికి వారు ధర్మబ్రహ్మ దర్శనకారులు.

ఆంధ్రపత్రిక ఉగాది సంచిక; 1960

# నన్నయ తిక్కనలు

## కద్రూవినతలశీలము

శ్రీ విశ్వనాథ వెంకటేశ్వర్లు

నన్నయ తిక్కన లిర్వురును ఆంధ్రసరస్వతి నోచుకొన్న ఫలము పంటలు. తెలుగులో కవు లెవ్వరున్నా రని చప్పరించు నాంధ్రేతరభాషా పండితులకుఁ గూడ వారిపేరులు వదనముద్రావతార మంత్రములు.

ఇంక నాంధ్రసారస్వతాభిమానులయందుఁ గొందరికి నన్నయ్య యేకవి. కొందరికిఁ దిక్కన్న యేకవి. సంస్కృత భాషయందు పక్షపాతము కలవారికి నన్నయ్య తిక్కన్నను దాటినవాడు. తెలుగునుడికారమునకుఁ బడిపోవువారికి తిక్కన్నకు బృహస్పతియే చాలడు. వారివీరికైనను తమయుద్దేశములను స్పష్టీకరించుటకు ధైర్యము చాలదు. నన్నయ్య తిక్కన్నలపోలిక గాంధిఠాగూరులను పోల్చుట వంటిది. గాంధి వడుకునూలుఁగోచి ధరించును. ఠాగూరు పట్టుచొక్కాలు సముద్రము కెరటాలు తాల్చును. గాంధి సర్వముండిత శిరస్సు బోడిగాఁ గనఁబడును. ఠాగూరు గడ్డపు దీర్ఘమనోహర వక్రకేశ నైగనిగ్యములు మన విమర్శనాబుద్ధికి చోటియ్యవు. లోకమునకు తొందరలో గాంధి బోసి నవ్వుకన్న ఠాగూరు ప్రయత్నతః పరికల్పిత నాగరక మృదుమందహాసమే హృదయమున కెక్కును. కాని గాఢమనస్కునకు హృదయ ముడికి పోవువానికి బహిస్సౌందర్యమునకుఁ దక్కువ వెలకట్టు వానికి గాంధిబోసినవ్వు స్వభావసిద్ధమైన ఛందోగమనము యత్నముచేసి కల్పించినది కానిది, గోచరించును. అదినిడివిగాఁ ద్రవ్వి రెండువైపుల ఛాయావృక్షములు నాటి నెమ్మదిగా ప్రవహింపచేసిన పంటకాలువవంటిది కాదు. అడివిలో స్వతః ప్రవాహిని యగు సెలయేటిలో గలస్వభావసంపద. దానిలో నున్న ఛందోగమనము స్వభావమైన హృదయమునకే గోచరించును.

తిక్కన్న రచన గాంధివంటిది. నన్నయ్య రచన తాకూరువంటిది. నన్నయ్య వచ్చి తేనియలకాలువ ప్రవహింపఁజేయును. తిక్కన భాగీరధి ప్రవాహము తరుముకొని పోవును. నన్నయ్య తేనెకాలువయడుగున దేమున్నదో కానిపించదు. ఆకాలువలో నున్న తొంబది పాళ్ళ సౌందర్యముపైన చిన్నారి తరగలతో ముగ్గులు పెట్టునా తేనెలోనే యున్నది. తిక్కన స్వచ్ఛభాగీరధీ పయఃప్రవాహమున నద్దనమువలెనడుగుననున్న సకలజంతు సంతానము రత్నసమూహముకనబడుచునే యుండును.

వారి రెండు ప్రత్యేక ఘట్టములు తీసికొని పోల్చిచూపుటకన్న నేకకథావస్తువు వారు రచించిన తావుగలదేని యచట వారిని పోల్చి చూచుటకు వీలుఁ కలదు.

ఆదిపర్వము ద్వితీయాశ్వాసమున నన్నయయు అనుశాసనికములో ప్రథమాశ్వాసమునఁ దిక్కన్నయు 'గరుత్మంతుని చరిత్రము కథాంగములుగా రచించిరి. ఆరచనలు పోల్చినచో వారియిర్వురిరచనా మార్గములు మనకు దెలియ గలవు.

అంగమైన కథ నన్నయ్యకుఁ ప్రధాన కథవంటిదికాదు. నన్నయ్య తానొక పురాణ మాంధ్రీకరించుచుండె ననుకొనెను. ఆయనకు కథ నడిపించుకొని పోవుట ప్రధానము. అందు మనకు కథ నడచుటతక్క నేమియు కనబడదు. తిక్కన తన కథాంగమునకుసైతము ప్రధాన కథ కెట్టి శక్తియిచ్చునో అట్టి శక్తి నిచ్చును. ఈయనకుఁ గథనడుపుకు పోవుట ప్రధానముకాదు. ఔచిత్య భంగము రాకూడదు. తాను వ్రాయునది పురాణము. ఇదిదానికి అంగము అని తలచదు. తాను వ్రాయుచున్నది కావ్యమన్న యూహయే ఆయనకు గలదు. ఆయన పాత్రములు సప్రాణములు. వారి హృదయ మాడుచునే యుఁడును

తిక్కన్న మాట తూచి వేయును. నన్నయ్య తేనె ప్రవహించుటయే చూచుకొనును. తిక్కన్న తనపాత్రల భావోద్వేగము మానసిక

స్థితి వాక్యములలోని సందర్భశుద్ధి యివన్నియు ప్రధానముగా పరిగణించును నన్నయ్య ఆ వంకకే పోడు. తిక్కన్న పాత్రములు గాఢశీలములు కలవారు. హృదయము పరిపక్వమై తాము చేయుకార్యముల యొక్క తాము చెప్పు మాటల యొక్క ఫలాఫలములు చక్కగా తెలిసికొని వాని ననుభవించువారు.

వినతకద్రువలు కశ్యపుని సేవించి యిరువుర వేవుర సుతులను బడసిరి. వినత యండంబు లెన్నాళ్ళకు నవియులేదు. కద్రువకు వేయిమంది బిడ్డలు పుట్టిరి. వినత, వగపు, మత్సరము, గదిరి తనయండములలో నొకదాని నవియించెను.

దాన నపరార్ధకాయవి
హీనుడు పూర్వార్ధ తను సహితు డరుణుడనం
గా నుదయించె సుతుండు మ
హానీతియుతుండు తల్లి కప్రియ మెసగన్ ?

— నన్నయ్య.

'అపరార్థకాయ విహీనుడు' అనినఁ జాలును. పూర్వార్ధతను సహితు డననక్కర లేదు కాని ఆయన కవిత్వ మా సమాసఘటనంబున నున్నది. 'మహానీతి యుతుండు' అని యీ సందర్భమున చెప్పనక్కర లేదు. దానివలన సమకూరు మహార్ధము లేదు. కాని ఆశబ్దముల వలన పద్యములకు ధారాశుద్ధి వచ్చుచున్నది.

పులు గొక్కడు పూర్వాంగము
గలిగి జనించుటయు వాని గని యాసతి గ
న్నుల నశ్రుజలంబులు పె
ల్లొలుకగ శోకమున మునుగు నుల్లముతోడన్.

ని వ్వెఱ పడియుండ.—'

—తిక్కన్న.

ఇందు నన్నయ్యను బోలిన యొకశైలి మొదల ప్రయత్నము లేదు. ఎంతవరకు నవసరమో అంతవరకే చెప్పబడినది. ఆ గ్రుడ్డు నవి

యించుకొన్న వినతమనోభావములు, తిక్కన్న చిత్రించినాడు. దానినే నన్నయ్య 'తల్లి కప్రియమెసగన్' అని ఒకమాటలో త్రోసివేసినాడు.

అట్లు పుట్టిన యరుణుడు తల్లికి శాపమిచ్చి తనదారిని దాఁజనినాడు. నన్నయ్యగారి యరుణుడు తల్లియెడలఁ గోపించి శాపమిచ్చి కోపముతోడనే నిష్క్రమించినాడు. అతనికి కోపము వచ్చిన కారణము కూడ తనకు సంపూర్ణ దేహత్వసిద్ధి లేకుండ చేసినందులకే. తిక్కన్నగారి యరుణున కందుకుఁ గాదు. 'మత్సరమున జాపలంబునను' అవియించిన దని. ఆదుర్గుణము లామెలో నున్నందులకు.

వెలవెల బారుచు వడుకుచు
నలుకుచు తనమోము చూచు నయ్యంగన న
ప్పులుగు కృపఁజూచి తల్లీ !
వలవ దడల నిది విధాతృవశమున వచ్చెన్'

ఇది తిక్కన్న రచన. వినత వెలవెల బారుచు నసూరుని మోము చూచుచున్నదట.

ఆ వినత యప్పటి మార్ధ్వము దుఃఖము సుతప్రేమ దిగ్భ్రాంతి యెంత రమ్యముగా నొక్కమాటలోఁ జెప్పఁబడినవి. దిగ్భ్రాంతయైన తల్లిని జూచి యరుణుడు తనయౌద్ధత్యము మానినాడు. కరగి పోయినాడు.

తల్లీ! వలవ దడల విది విధాతృవశమునవచ్చెన్' ఆ 'తల్లీ' అన్న సంబోధనలో నసూరుని హృదయ దుఃఖము తరుముకొని వచ్చుచున్నది. ఆ శాపము విధాతృవశమున వచ్చినదట. ఇదినీతి. నన్నయ్యగారు వ్రాసిన 'మహానీతియుతుండు' అన్న విశేషణము తిక్కన్నయనూరునకు బాగుగాఁ జెందును.

ఉచ్చైశ్శ్రవమును చూచిన సందర్భమున కద్రూవినత లిద్దరును సముద్రమును తీరస్థ ప్రమదవనమున విహరించుచుండిరి. అసమయమున నన్నయ్య సముద్రమును వర్ణించినాడు. తిక్కన్న ఉద్యాన

వనమును వర్ణించినాడు. నన్నయ్య సముద్రవర్ణనలో అప్రతిహతుడు. ఆ సముద్ర గాంభీర్యమునకును నన్నయ్య శైలీ గాంభీర్యమునకును సరిపోవును. ఇతని శైలీగాంభీర్యము ఆ గాంభీర్యమును ధ్వనించుచున్నది. అరణ్యపర్వము తృతీయాశ్వాసమున అగస్త్యుడు సముద్రము చుళుకించఁబోయినప్పుడు, నన్నయ్య చేసిన సముద్రవర్ణన ఆమహాకవి సముద్రమునుచూచి యెంత పొంగి పోయెడువాడో తెలుపగలదు. ఇంగ్లీషులో కొందరుకవులు కొండలనుచూచి సముద్రములను చూచి తన్మయత్వమునుపొంది వానినిగూర్చి కవిత్వము వ్రాసినవారు కలరు. మన యాధునికకవులు ప్రకృతి చిత్రములను చూచి హృదయము పొంగి వ్రాయ లేదనుకొనుచుందురు. నన్నయ్య సముద్రవర్ణనలు చూచినచో ఆయన ఆ సముద్రము వంకఁ జూచుచు నెన్నాళ్ళు గడపెనో యనిపించును.

తరువాత కథలో నన్నయ్య తిక్కన్నల పాత్రపోషణలో చాల భేదమున్నది. ఇద్దరికద్రువలు వినత నెట్లా మోసముచేయుట యని యూహించుచున్నవారలే. కాని కద్రువ యిట్లూహించుచున్న దని నన్నయ్య విషయమున చప్పున తెలిసికొనవచ్చును. తిక్కన్న కద్రువ భావము తెలిసికోరాదు, తిక్కన్న వినత ముద్దరాలు. సద్భావ.” ‘అయాగో’ ‘ఒథెల్లో’ను ఎట్లు మోసములోనికిదించెనో, కద్రువ వినతను అట్లుదించినది. తిక్కన యిట్టిచోట్ల మహాశిల్పియనదగును. గుర్రమును చూచుట తోడనే దానితోక నల్లగా నున్నది అన్నది నన్నయ కద్రువ. వినత కాదన్నది, వెంటనే కద్రువ పందెమునకు చరచినది.

ఇందు కథారమ్యత లేదు. అంత వెంటనే కద్రువ పందెము సఱమనిన వినతకు సంశయము కలుగకపోదు. కాని యిట్టియూహాలతో లాభములేదు. ఇంక తిక్కన్న గారు.

‘వినతహాయమింత మెప్పనె
అనూనధవళప్రభాఢ్య మై యని పలుకన్
విని కద్రువ యపరాంగం
బున నీలిమ దోచె ననియె’.

వినత హయ దేహధావళ్యము మెచ్చుకొనుచున్నది. 'చివరతోక నల్లగా నున్నదిలే,' అని కద్రువ యున్నది. వినతమాటలెమేగిట్టదు కద్రువకు. వినత అనినమాట కాదనుటయే కద్రువపని. వినతయన్నచో కద్రువ కంతయీర్ష్య. తనయెడల కద్రువ యింత యీర్ష్య గలదియని వినతకు తెలియదు. వినత యన్నదిగదా?

'యిటులాడితి, నవ్వులకాడితో, నిజంబునకునో నీదుచూపునకు పోలిన భంగియె చెప్వుము' అన్నది.

కద్రువ మోసముచేయుటలో అందివేసిన చెయ్యి. 'అయ్యాగో' కు అప్పగారు. నవ్వు తెచ్చుకుని తాను సద్భావవలెనే ఆ! అదేమి మాట! నల్లగా కనబడుచునే యున్నదిగదా!' అన్నది. పాపము వినత మరల చూచి కాదన్నది. అప్పుడు కద్రువ 'వృథామాటలెందుకు? పన్నిదమేమిచెప్పు, మన్నది. నన్నయ్య కద్రువవలె యిదిహఠాత్తుగా చెప్పినమాటగాదు. మాటమీదమాట బెంచి తనదురుద్దేశ్యము వినతకు తెలియకుండ జేసినపని.

"అనిన విని కద్రువ వినతవదనంబున చూడ్కి నిలిపి
నీవు గెల్చిన దాస్యంబు నీకు నేను
చేయగలదాన నేను గెల్చినను నీవు
నాకు చేయంగగలదాన వీకడింది
పన్నిదము సర మని తెగబాతి బలికె"

ఇందు 'వినతవదనంబున చూడ్కి నిలిపి తెగబాతిపలికె' అనుటలో చిత్రమున్నది. ఆ చూపు ఆ తెగబాతిబలుకుట పీనివలన వినతబెసికి పోలేదు. అచూపు తైక్ష్ణ్యము ఆమాట వేగము కద్రువ చేయుచున్న మోసమునుగూర్చి ఆలోచించనీయవు. వినత రక్తమును గూడ వేడి యెక్కించి కద్రువ పందెమునకు సరియే యనిపించెను. అప్పుడు.

"ఆపొలతి యట్లు వలికిన
శాపము ప్రేరేపనరుణజననికి నుతా

హా ఖ్యాపేత మయ్యో చిత్తం
బాపన్నిదమునకు నేమి యనగల దధిపా"

కవికి సామాన్యబుద్ధికి గోచరించని భావములు గోచరించును. మనమొక చెడ్డపని చేసినచో, ఇట్లెందుకు చేసితివని యితరులధిక్షేపింతురు. మనము నితరులనట్లే యధిక్షేపింతుము. కాని దైవముతోనుక వచ్చుచున్నప్పుడు అదిచేయుట చేయకపోవుటలకు మనమెవ్వరము ? ఈజిజ్ఞాస కర్మసిద్ధాంతికి తెలియును. అట్లే కవికిగూడ తెలియును. కనుక వినతపడినయీ తొందరకు వినతయేకాదు కారణము. అరుణుడిచ్చినశాపము కూడను. తరువాత 'నరుణాజననికి' యన్న ప్రయోగము ఎంతయర్థవత్తుగా నున్నదో చూడుడు.

"ఆపన్నిదమునకు నేమి యనగల దధిపా" భారతము వ్రాయుచున్న మహానుభావునకు ఈమాత్రపు రోషమెక్కించుపన్నిదములోనున్న చురుకుదనము తెలియదా? అందుకనియే యాపన్నిదమునకేమి యనగలదన్నాడు. అప్పుడు కద్రువ "పతిపరిచర్యకుం గాలంబయ్యె. మఱివచ్చి యశ్వంబు నాలోకింత మని నెపంబిడి యప్పటికిం బాపు దప్పించె"

అప్పుడేపోయి గుఱ్ఱపుతోక చూచిరో కద్రువయోడిపోవును. అంతరోషముతో అంతయుత్సాహముతో చరచినపన్నిదపుమాట వినతయంత తేలికగా వదలదు. అందుచేత కద్రువ పతిపరిచర్యమీద సాకు కల్పించినది. మహాప్రతిభాయైనవినత తప్పుకోలేకపోయినది. నన్నయ్యగారి కద్రువ "యిప్పుడు ప్రొద్దులేదు. రేపకడ చూతమన్నది" ఆమాటలోని సామర్థ్యరహితత ఇందలిసామర్థ్య సహితత్వము చూడనగును.

తరువాత గుఱ్ఱపుతోక నల్లగాచేయవలసినదని కొడుకులను అడుగుటలో ఇద్దరు కద్రువలకు భేదమున్నది. నన్నయ కద్రువ పిచ్చిదానివలె బేలవలె "మిమ్మందఱ వేడెద నన్నలారనాపంపు సేయుండు నన్నురక్షింపుడు కామచారులకు దుష్కరము కలదె" అని వేడుకొన్నది. తిక్కన కద్రువ 'కుటిలంపుతలపున కొడుకుల రావించినది.' నన్నయ

కద్రువ కొడుకులకడ కేగినది. రావించి కద్రువ కన్నీరుపెట్టుచు వారికి ప్రేమపుట్టునట్లుగా తన యధికారమును చూపుచు మాట్లాడినది.

ఇద్దరుతల్లులు కొడుకులకు శాపమిచ్చిరి. నన్నయకద్రువకొడుకు శాపానుభవభీతి చిత్తుడు కర్కోటకుడు తల్లిపంచినరూపంబున 'గుఱ్ఱము వాలమ్ము నీలమ్ముగా పట్టి వ్రేలుచుండె'. తిక్కనకద్రువకొడుకులు కొందరు 'శాపపాతనవృత్తికి నెరచి, ఆయ్యశ్వవాలధిరోమములొ్వదివి నీలరోమసంచయ మైరి.' పలుకునుడికారమున కిది యుదాహరణము. కద్రువ కొడుకులు నీలరోమసంచయ మైనారట ఒకవేళ వినత దగ్గరకు పోయి చూచినను తెలిసికొనలేదు. నన్నయవినత దగ్గరకుపోయిచూచె నా వ్రేలాడుచున్న కర్కోటకుడు కనంబడడా ? తిక్కన్నగారు ప్రతి మాటయు నంత తూచివేయును. అప్పుడు తిక్కన్నకద్రువ సంతోషముతో పోయి' వినతను పిలచి తోకనల్లచూపించెను. వినత దైన్యము నొందెను.

'నగుచు న్గద్రువ వరవృష వగుము విచారంబువిడచి' అన్నది. తనమోసము నెగ్గిన దని కద్రువచూపిన దురుసుదనము వినతను పెట్టిన తొందర తానేమె లెక్కలేనట్టునటించుట ఇందు గోచరించుచున్నది. ఇట్టివేవియు నన్నయయందు గనరావు.

తిక్కన్న తాను పోయినతోవ అంతట రత్నములు గూఢ నిక్షిప్తములు చల్లుచుపోవును. నన్నయ్య ఊరక తేనె కాల్వకట్టించుచు పోవును. నాకు మాత్రము తిక్కన్నగారి రచన సర్వోత్కృష్ట మని. నన్నయ్యగారికన్న తిక్కన్న చాలా గొప్పకవి. మహాశిల్పి.

నన్నయ్యయే భారతమంతా వ్రాయకుండుట తెలుగుభాష నోచుకొన్న నోముపంట. నన్నయ్యగారు అసలే వ్రాయక యుండుట నేను కోరను. భాషకు నామహాత్ముని మధుస్రవంతియు కావలయును. ఈమహాభాగుని రత్నాన్వేషణమును కావలయును.

జయంతి. జనవరి; 1959

---

# నన్నయ - నన్నెచోడ కవులు

శ్రీ నిడుదవోలు వేంకటరావు

మన ప్రాచీన సాహిత్య స్వరూపము నేడభివ్యక్తము కావలె నన్నచో మొదట మూల గ్రంథముల నామూలాగ్రముగ పరిశీలించుట మనకు ప్రధాన కర్తవ్యము. ప్రస్తుత సాహిత్య విమర్శలలో నన్నయ నన్నెచోడ కవులిద్దఱును ప్రముఖస్థానము వహించి యున్నారు. అందును నన్నయ తొమ్మిది వందల యేండ్లనుండి యందఱి కవులచేత కీర్తితుడైనాడు. అతని భారత భాగ మాంధ్రవాఙ్మయ చరిత్రకు శ్రీకారము చుట్టినది. కవిత్రయము నందలి కవులేగాక తక్కినవారును నాతని కవితాగుణములను పేర్కొనిరి. ఈ నాడు మనము వానినైనను సరిగా గ్రహించుట లేదు. చూడుడు ఒక యుదాహరణము. శ్రీనాథ మహాకవి నన్నయ కవితాగుణములలో "ఉభయ వాక్ప్రౌఢి"ని నుటంకించెను గదా! (భాషింతు నన్నయభట్టు మార్గంబున నుభయ వాక్ప్రౌఢి నొక్కొక్క మాటు. (కాశీ. 1. ఆ.)

మనము నేడు శ్రీనాథుని కృతులలో "నన్నయ యుభయ వాక్ప్రౌఢి"కి నుదాహరణములు చూపలేదు. సరికదా, నన్నయ కవితలోనైన మనమా గుణమును విశదీకరించితిమా, యోజింపుడు.

శ్రీనాథ మహాకవి నన్నయను పేర్కొనెను. కాన నిట్టివి చూపుటకు మన కవకాశమున్నది. దానికైన మనము నన్నయ శ్రీనాథుని కృతుల నన్నింటిని కూలంకషముగా పరిశీలింప వలెనన్నట్లు నిర్వివాదాంశము. ఆంధ్ర వాఙ్మయమున వాదోపవాదములకు రంగస్థలమైన నన్నెచోడకవి కుమార సంభవమున నన్నయ ప్రశంస లేదు.- నన్నయ ప్రశంస లేనంత మాత్రమున నన్నెచోడుని కవితారచన మూలమట్టుగా భిన్నమనుట న్యాయమా! నన్నెచోడ కవితో బాటు పాల్కురికి సోమనాథకవియు నన్నయను స్మరింపలేదు.- కావున వీరి రువురను వాఙ్మయ చరిత్రకారులు ప్రత్యేకముగ శివకవులు[1] అను

వర్గముగా పరిగణించిరి. మఱికొందరు వారి ననుసరించిరి. ఈ ప్రత్యే కతను నిరూపించుటకైన మూలగ్రంథ సమాలోచన మత్యంతా వశ్యకము.

అదేమి చిత్రమోగాని నన్నయ నన్నెచోడ కవుల నామము లందే సాదృశ్యము కానవచ్చుచున్నది. వాని సంబంధము మాట తరువాత చర్చింతము. ముందుగ నన్నయ శబ్దవ్యుత్పత్తిని నెరుంగ వలయును.

నన్నయ నారాయణ శబ్ద భవమా ?

"ప్రసన్న కథా కలితార్థయుక్తి" యను గ్రంథమున గ్రంథ కర్తలు[2] - 2వ పుటలో నిట్లు వ్రాసియున్నారు.

"పురుషోత్తమాంబుజ భవ శ్రీకంఠరులన్న సమాసములోని వరుస ఛందః పాతితమందము. ఋష్యాత్మకు ఛందోవతారమున కవినా భావము. అందుకనియే యచ్చటనే ఋష్యాత్మ యున్నదనుట నారాయణ శబ్ద భవము నన్నియ. అంబుజభవుడు బ్రహ్మ. తిక్కన గారి కవిబ్రహ్మ యను బిరుదము వచ్చెను. శ్రీ కంఠరుడు పరమేశ్వ రుడు - ఎఱ్ఱన ప్రబంధ పరమేశ్వరుడు."

పై వాక్యములలో తక్కినవాని మాట యటుండనిండు. నారా యణ శబ్ద భవము నన్నియ యనుట యుంపాతరమణీయము. నారాయణ శబ్ద భవము నన్నియ అగుచో నన్నయ, నారాయణభట్టును గూర్చి వ్రాసిన శాసనములో "నన్ని నారాయణాయః" అని వ్రాసి యున్నాడే. అప్పుడు నన్ని యన్న యర్థ మేమి ?

నారాయణ శబ్ద భవము నన్నియ యైనచో నేడు విశ్వనాథ సత్యనారాయణగారిని "సత్య నన్నియ" అని పేర్కొన వచ్చునా ? ఇది శబ్ద తత్త్వము తెలియమి. నారాయణ శబ్దము తద్భవమున రెండు రూపములుగా నేర్పడినది. నారయ - నారన - దూబగుంట నారయ (పంచ తంత్రకర్త) తెలిగందల నారయ (భాగవత ఏకాదశ ద్వాదశ స్కంధకర్త) కవులున్నారు - నారన రూపము గలదు. నారన సూరన

అను కవి గలఁడు. అంతవఱకెందుకు - పదునాల్గవ శతాబ్దిలోనే సత్య నారాయణ శబ్దమునకు పూర్వరూపమగు 'సత్తైనారన'[3] అను కవి యున్నాఁడు. విశేషమేమనగా నతఁడు రామాయణము వ్రాసినవాఁడు.

క. రామాయణ కృత కృతియై...సత్తైనారన వెలసెన్.

కొరవి గోపరాజు సింహాసన ద్వాత్రింశిక. (1-23)

నన్నియ శబ్దముతో నన్నెచోడుఁడు కూడ నారాయణ శబ్ద భవుఁడగునా? ముమ్మాటికిని గాదు. అతఁడు తద్భవ పద వాచ్యుఁడు గాఁడు. దేశిపద వాచ్యుఁడు. నన్నయయు నట్లే. ఇక నీవ్యుత్పత్తి విషయమును కట్టిపెట్టి నన్నయ నన్నెచోడుల గ్రంథములు చదువ గానే స్ఫురించిన విషయముల నిందు తెలుపుచున్నాను. ప్రాజ్ఞులు పరిశీలింతురు గాక.

## పద్యముల యెత్తుగడలు

| నన్నయ | | నన్నెచోడకవి | |
|---|---|---|---|
| అనుపమ దివ్యశస్త్రధరులై | అర. 3.9 | అనుపమ దివ్యమూర్తి | 1.6 |
| | | ,, | 8.124 |
| గత మద మత్సరుండు | ఆది. 3.36 | గత మద మత్సరేంద్రియ | 1.152 |
| | | గత మద మత్సరుండు. | 6.170 |
| తగునిది తగదని యెదలో వగవక | ఆది. 1.85 | తగుఁ దగదని మనమున మును వగవక | 10.187 |
| హరుఁడాదిగా గల్గు నమర గణంబులు | అర. 4.51 | హాకుఁడాదిగ... | 1.9 |
| బలముఁ గలవాని బలువురు బలవిహీనులు లోకులై కూడి నిర్జింతు రుత్సహించి | అర. 1.251 | క. బలహీనులైన నేమగు బలువురు తమలోనఁ గూడి బనియు నినైనన్ గెలుతురు. | 10.192 |

| | | | |
|---|---|---|---|
| ఆదిజుఁడైన బ్రహ్మ. | సభా. 2.16 | ఆఁజుఁడాది కర్త | 8.75 |
| అవిరళ భస్మ. | ఆది. 8.144 | అవిరళ నిత్యకర్మ- | 7.118 |
| అట్టి మహాత్మాతంబులు. ఆయత బాహుఁడాతనికి | ఆది. 8.47 | అట్టి మహోగ్ర కోప | 5.97 |
| | | ఆయత బాహు వీర్య | 12.145 |
| ఆవహ భూమిఁలోన | ఆది. 8.46 | ఆవహ భూమి- | 12.36 |
| ఆ లలితాంగిఁ జూచి. | ఆది 8.152 | ఆ లలితాంగి భూషిత- | 5.24 |
| ఉ. మంచిగ భూరి భూసుర | సభా. 11.7 | ఉ. మంచిగఁ బ్రీతి- | 10.197 |
| చ. చిరముగ బ్రహ్మకుం | ఆది. 2.129 | చ. చిరముగ నొల్వ | 4.77 |
| చ. వలయు సమాత్యులన్ | ఆది. 4.25 | చ. వలయు జనాళి- | 4.44 |
| చ. అరుదుగ దివ్య- | ఆది. 8.283 | చ అరుదుగఁ జంద్ర- | 3.18 |
| ఉ. దారుణ వజ్ర- | సభా. 2.177 | ఉ. దారుణ కార్య- | 10.189 |
| చ. ప్రకటిత కోప- | సభా. 2.51 | చ ప్రకటిత మేఘ- | 8.24 |
| చ. పరమ పతివ్రతన్ | సభా. 2.255 | చ. పరమ పతివ్రతత్వ. | 4.42 |
| చ. వినుఁడు ప్రసిద్ధులైన. | ఆది. 4.186 | ఉ. నిండు ఖలుండు. (వ్రాతప్రతి) "పిండ్లై పీండు" అని ముద్రిత పాఠము. | 2.82 |
| మ. అతులోర్వీసుర- | ఆది. 2.234 | మ. అతులోత్సాహ- | 12.130 |
| చ. అసదృశ యౌవనంబు | ఆది. 8.170 | చ. అసదృశులైన. | 12.60 |
| ఉ. అంగజరాజ్యలక్ష్మి- | ఆది. 8.146 | ఉ. అంగజరాగసం- | 8.125 |

క. త్ర్యంబక నాకు- అర. 2 121 క. త్ర్యంబక నగసుత- 8.14
చ. కొలఁది మెఱుంగక- ఆది. 5.238 చ. కొఁదికి మీఱు- 7.108
ఉ. చారు సువర్ణ- ఆది. 5.141 ఉ. చారు నిశీథి నీ- 6.116

నాల్గవ పాదమున సమాన పదములు

| నన్నయ | నన్నిచోడకవి | |
|---|---|---|
| చ. తరుణీయ లొప్ప నాడిరి ఆది. 8.175 | తరుణియ యొక్క_ర్తు | 8 68 |
| మ. బోరనఁగీర్తించిరి సంతతస్తుతి పదారావంబు- ఆది. 2.235 | బోరన చనుదెంచె నారద మహాముని- | 3.82 |
| క. చిఱు దొడవడిఁబట్టె- ఆది. 5-256 | చిఱుదొడ లమరు- | 3.47 |

ఈ క్రింది పదములు వ్రాసిన స్థానములు చూడుడు.

| | | |
|---|---|---|
| చ. అత్యలఘు తపస్వినేని ఆది. 1.143 | అత్యలఘు పరాక్రముండు | 11.95 |
| చ. అయ్యొరనొకడుండుభంబును వహింగని- ఆది. 1.152 | అయ్యొరఁగనిడాయనోడుమరు | 6 44 |
| క. మానుగ వచ్చితి నీకును- భాను నిభా- ఆది. 3.108 | మానుగఁ గూ_ర్తు- | 4.29 |
| సీ. పనియేమి పంచిన-ఆది. 3.200 | పనియే మేనియు- | 10 136 |
| చ. సంభ్రమ వివశాత్మ ఆది. 8 217 | చ. సంభ్రమ గతి వచ్చి- | 8.61 |
| క. పాయక చీకటి- ఆది. 5 220 | క పాయక గిరి- | 3.13 |
| మ. కో. మాని తంబగు ఆది. 7.143 | క. మానితమగు_ | 3.62 |

ఉ. పూని పరాక్రమం బెసఁగ ఆది. 8.5 — ఉ. పూని మహాగ్రహోర- 146

క. సురగరుడోరగ- ఆది. 8.100 — క. సురగరుడోరగ- 4.18

చ. పొలుపుగఁ జూసి- ఆది. 8.174 — చ. పొలుపుగఁ నేచి- 6.182

సమాన పదభావముల పద్యములు

**నన్నయ**

క. దక్ష మఖక్షయ కరు నిట
లాక్షజహుత భక్షు భక్షితా
నంగు విరూ
పాక్షు మహాత్మ ధ్వజుఁ బ్ర
త్యక్షము గావించెను తప
మునఁ బేర్మిన్. అర. 3.49

**నన్నెచోడుడు**

క. అక్షయ నిఖిల కళాగమ
దక్షు మహోదారు ధీరుఁ
దత్త్వజ్ఞు లలా
టాక్ష జనితోగ్ర శిఖిముఖ
భక్షిత పంచేషు దేహుఁ బర
మోత్సాహిన్. 1.188

**నన్నయ**

సీ. చపలాక్షి చూపుల చాడ్పున కెదమెచ్చఁ
జిక్కని చనువగఁ జీరఁగోరు
నన్నువ కౌఁదీగ యందంబు మదనిల్పు
జఘన చక్రంబుపై జలుపు దృష్టి
అభిలాష మేర్పడు నట్లుండఁగా బల్క
వేడ్కతో మఱుమాట వినఁగ దివురు
నతిఘన లజ్జావనత యగు నక్కన్య
పైబడి లజ్జయుఁ బాపఁ గడంగు

ఆ.వె. వెంతకాంతులయ్యు నెంత విజితేంద్రియు
లయ్యు గడు వివిక్తమైన చోట
సతులగోష్ఠి చిత్తచలన మొందరు రెండఁ
గాము శక్తి నోర్వఁగలరె జనులు.
ఆది. 3.38

**నన్నెచోడుడు**

సీ. పులకాంకురంబులు దలకెత్తియేనుగం
పింపఁ గోమలిఁ గౌగలింపఁ దలఁచు
రాగోత్కటంబు సైరణలేక మానిని
గాయ్యనపైఁ బడి గవయఁ జూచు
లలితాంగియవయవములు సూచి మదిదని
వోవక చూడ్కులఁ ద్రావఁగ జూచు
నధరోష్ఠము దరంగ నంతస్మితాంశులు
దళుకొత్త నేమేని బలుకఁ దలఁచు

గీ. తన మహత్త్వంబుఁ దలపక తరుణి పొందు
వడయ గిద్వడి తేకువ వాపఁ దలచు
బావజాస్త్రాభిహతి మహాదేవుఁ డొక్క
వేళ్లిమిడి చెంపుసెసి కడు విరలిఁ
గొనియె. కుమా. సం. 5.45

| | |
|---|---|
| మ. అమలాచార పవిత్ర భూసుర<br>వరేణ్యాగార పుణ్యప్రదే<br>శములం దధ్యయ నారవంబువిద్వ<br>త్స్వాహాస్వధా స్వస్తి<br>బములున్ మంగళతూర్యఘోషములు<br>నుద్యత్కౌతు కాశీర్ని నా<br>దములున్ రమ్య తరంబులయ్యె<br>ధరణిం దద్రాజ్యసంపత్తితోన్.<br>ఆది. 5.4 | మ. సముదానేకప బృంహితంబుహయహేషా<br>ఘోషమున్, గీత వా<br>ద్య మృదు ధ్వానము, వేదరావము<br>భటోద్దండోక్తులన్ భూరి పం<br>చ మహా శబ్ద రవంబుఁగూడి సుమ హ<br>త్సంక్షోభితాంబోధి వా<br>రమొ నాదిగ్బధిరీ కృతంబగుచు నిత్యంబుం<br>జెలంగుం బురిన్.<br>కుమా సం 7.126 |

అర్థాంతరన్యాసములు, జాతీయములు

| | |
|---|---|
| కాముకశక్తి నోర్వఁగలరె జనులు<br>ఆది 8.38 | కాము మాయల నెవ్వారు నేవి<br>గారు 1.104 |
| ఔమ్మనఁ జేయిడి నిద్రవోయె<br>ఆది. 6.63 | ఔమ్మనం జేయిడి నిద్రవోయిరి<br>11.53 |
| వంటయిల్ కుందెలు సొచ్చె<br>చక్కనై నిలువుము గిట్టి<br>రణంబున ఆది. 6.294 | వేటకానియిల్లు వెటవక కుందెల<br>సొచ్చినట్లు 12.27<br>చక్కనై నిలువు మనుచు-12.87 |

పదజాలము - తత్సమములు

| | |
|---|---|
| అచిరాంశువు=మెఱుపు అచిరాంశు<br>లతా. అర. 1.259 | దంతయుగం బచిరాంశులు 1.7 |
| అభిమతములు=కోర్కులు అభిమత<br>ములు. ఆది. 3.84 | అభిమతములు 1.1 |
| అరుణము రక్తము<br>అరుణమున - అర. 2.260 | అరుణధారలు. 11.155<br>12.92 |
| ఆకాశవాణి దివ్యవాణి<br>ఆకాశవాణి - ఆది. 4.107 | ఆకాశవాణి 5.118 |

| | |
|---|---|
| కర్మేంద్రియములు=కర్మేంద్రియం బులయందు అర. 2.240 | కర్మేంద్రియంబులం గర్వము. 12.220 |
| కౌశికుడు = ఇంద్రుడు<br>కౌశికుఁ గౌశిక భీతచిత్తజు ఆది. 4.41 | వినుకౌశిక! ఇంద్రునికి సంబోధన 4.44 |
| క్రియా దక్షుఁడు=సామర్థ్యముగల వాడు.<br>క్రియాదక్షుఁడు ధౌమ్యుఁడు- ఆది. 1.85 | క్రియాతి దక్షుఁడగు దక్షుఁడు. 2.92 |
| కుల బ్రాహ్మణుఁడు– ఆది. 1.9. | కు॥ విప్రోత్తముఁడు 10.128 |
| ధారుణి<br>ధారుణి ప్రజ గూర్పగా విగత రోషుఁడవై. ఆది. 7.128 | ధారుణియుం గప్పాచుఁద్రోచిరోలి తొలికారుంబోలె 11.138 |
| నందనము = సామాన్యోద్యానము<br>నవ నందనావళులు. - ఆది. 8.78 | (పురి) నందనావళుల్ 7.100 |
| నర భోజనులు = రాక్షసులు<br>అన్వర్థ భోజనాన్వయము- అర. 3.0 | నరభోజనుఁడ నేను 12.86 |
| ప్రస్తవము - కార్యము.<br>ప్రస్తవమున సభా- 1.65 | (సతుల) ప్రస్తవంబు 11.185 |
| భైరవపూజ - భైరవపూజ యొనర్చి- సభా. 1.118 1.191 | భైరవ యోగీంద్రుల గూర్చి 8.128 |
| బుద్ధీంద్రియములు<br>బుద్ధీంద్రియములు- అర. 2.240 | బుద్ధీంద్రియములు. 12.220 |
| శిలోచ్చయము = పర్వతము<br>అబ్ధి శిలోచ్చయ సంచయంబు అర. 1.333 | శిలోచయోత్తముఁడు. 7.186 |

శరణు

శరణన్న గాచుచు- ఆది. 1.8 శరణు నీవ శరణు 4

విశేషుఁడు = విశేషము గలవాడు

పురుషోత్తము డట్లు విశేషుడు త్రినయనునికంటె విశేషుఁడు

అర. 2.248 10.58

తెలుగు పదములు

అఱ పాఱడు. అఱ పాఱడులును వంటురూపులు

అఱ పాఱడు కుఱుచ చేతులు 6.37

అర. 2.135

శలు వడగలు

శలు వడగలు గడు విలసిల్లె శలు వడగలు 8.5

ఆది 6.143

కీడ్పొరసగు= వేఱు చేయుటకువీలు కెడ్పొరస్సై పీన్గులు పడుగు

లేనంతగా కలిసిపోవు వేకయు బోలెన్

శరనిధి నినాదము పురఘోషము 11.127, 11.194

కెడ్పొరసయి-పొలుపగు-వ్రాతప్రతి

కీడ్పొరించు, ముద్రితపాఠము

తఱు సంటి

తఱుసంటి తనము తఱుసంటి తన్ను నెఱుగఁడు

సభా. 2.228 7.49

నడు నడ నడఁంగి- ఆది. 2.155 నడు నడ నడంగుడు 2.174

పొరయుదు = పొందదు

ఉరగ భయము పొరయుదు పొరయునె 12.219

ఆది. 2.237

పొందదు - ముద్రిత పాఠము

పొర యుదు - వ్రాఁత ప్రతి

సడ్డ, స్సిను = ప్రసిద్ధికెక్కు-

యయాతి యనఁగ నడిసను వాఁడన | జనకుండు నా నడి నన్నవాడు
ఆది. 3.213 | 7.134

జనియెడు వాఁడన్ - ముద్రిత పాఠము.
నడిసను వాఁడన్ - వ్రాత ప్రతి

తెలుగు పదముల పరిశీలన మింకనూ నెంతయో గలదు. భారతమున ముద్రిత ప్రతికన్న వ్రాత ప్రతులలో నన్నెచోడుఁడు వాడిన పదములు కాన్పించుచున్నవి. వానిలో కొన్నింటిని మాత్రమే దిక్ప్రదర్శనముగా చూపితిని. అట్టి పరిశీలన జరుగదగినదని సూచించుటకు మాత్రమే యవి చూపబడినవి.

## వ్యాకరణము

ఏకదేశాన్వయములు

ఆ నారాయణ పాండవేయగుణా మాహాత్మ్యమల జ్యోత్స్న | అ తుంగ శృంగ శిలాపూర్ణ సరసి 1.2
ఆది. 3.21

ఇ వార్థముపై య వార్థము

శబ్దంబు నట్ల పోవె- ఆది. 3.128 | ఉదయించు నట్ల పోలె 3 29

సప్తమి మీఁద 'ఉండి' శబ్దలోపము

నూతిలో వెలువడ కోమలిం డిగిచె ఆది. 6.316 | పూర్వాబ్ధిలో వెల్వడి 10.111

ద్రుత ద్విత్వము

ధైర్య వృత్తికి న్నరుదుగ అర. 1 321 | బూరువులు న్నాఁగి బూన కుండఁగా

తెంచు ధాతువను ప్రయుక్తము

నీటిలోన నుండి నెగయు డెంచె ఆది. 5.173 | పేర్చిందు లెగ యుకెంచె 2.133

భావార్థక 'డు' ప్రత్యయము

| | | | |
|---|---|---|---|
| పడరత్ని ధనుర్ధరుఁడు...... చేయుఁడు | ఆది. 7.16 | వడి... వానిరి బీరముగాగ రజ్జు చెప్పుడునది | 10.151 |

డు ప్రాస స్థానము

| | | | |
|---|---|---|---|
| ఎవ్వని యేని ముఖామృతాంశు బింబంబు. | ఆది. 1.36 | యెక్కడ యేని వానిగా | 8.142 |

సమాసములు

కఱకంఠుఁడు

| | | | |
|---|---|---|---|
| కఱకంఠా క్షమియింపుము | అర. 1.327 | కఱ కంఠుడు | 6 28 |
| | | 12.103, 12 103 లో ప్రాస | |

అద్రుచు- 'అ' లఘువు

| | | | |
|---|---|---|---|
| సకల భువన వలయ 'మద్రువ' | ఆది. 6.124 | బ్రహ్మాండ ఖండ 'మద్రువ' | 11.8 |
| | | వియత్తలం 'బద్రువ | 12.13 |
| దిక్కులద్రువఁగ- | ఆది. 2.73 | దిక్కులద్రువఁగ | 5.68 |

ఛందస్సు

నన్నయ నన్నెచోడుల ఛందస్సును పరిశీలించి నందును పెక్కు సామ్యము లగుపడుచున్నవి. దీనికి ముందు వారుపయోగించిన వృత్త జాతి ఛందస్సులను మనము తెలిసికొనవలసియున్నది.

| నన్నయ | నన్నెచోడకవి |
|---|---|
| భారత భాగమున 13 ఆశ్వాసములపై 1 12పద్యములున్నవి. అందలి గద్య పద్య సంఖ్య 4000 | కుమారసంభవమున 12 ఆశ్వాసములు గద్య పద్య సంఖ్య 2005 |

కావున నన్నయ రచనలో నన్నెచోడకవి రచన సగపాలు.

| | |
|---|---|
| పద్యములలో సంస్కృత వృత్తములు 5 89 | సంస్కృత వృత్తములు. 515 |

ఈ వృత్తములలో చంపకములను, నన్నెచోడకవి చంపకములను ఉత్పలములను నన్నయ హెచ్చు మత్తేభములను 110 ని వాడి వాడియున్నాడు. 424 (241-184) యున్నాడు మొత్తము, 348.

ఇచట విశేష మేమనగా నన్నయ రచనలో మత్తేభగమనమును నెరన ప్రశంసించియున్నాడు. కాని మత్తేభ వృత్తములను మక్కువగా వాడిన కవి నన్నెచోడ కవి. ఎట్లయిన నన్నెచోడుడు కవిరాజు కాదు. కవిరాజ శిఖామణి. ఈ సంస్కృత ఛందస్సులలో కొన్ని వృత్తములకు నన్నయ- నన్నెచోడకవు లొక్క రీతిగానే యతి స్థానములను పాటించియున్నారు.

1. మానిని.

| నన్నయ | నన్నెచోడుడు |
|---|---|
| ఏచి తనర్చి తలిర్చిన క్రోవుల నిమ్మగుతావుల- (ఆది. 4.20) | మానిని రూప చరిత్రలుదార సమం బగుచున్నవి. (6 9) |
| 13 వ అక్షరము యతి | 13 వ అక్షరము యతి. |

తక్కిన కవులు మూడుచోట్ల యతిని పాటించిరి.

2. కవిరాజ విరాజితము.

| నన్నయ | నన్నెచోడుడు |
|---|---|
| చని చని ముందట నాజ్యహవిర్ధృత సౌరభ- ఆది. 4 21 | మనునిభచారు చరిత్రుఁ బవిత్రు సమానుష పౌరుషవర్తి జగ— (11-211) |
| పాదమున కొక్క యతి | పాదమున కొక్కయతి |

ఇరువురు వాడిన ఛందములు.

| నన్నయ | నన్నెచోడుడు |
|---|---|
| శార్దూలము | శార్దూలము |
| మత్తేభము | మత్తేభము |
| ఉత్పలము | ఉత్పలము |
| చంపకము | చంపకము |
| మత్తకోకిల | మత్తకోకిల |
| కవిరాజ విరాజితము | కవిరాజ విరాజితము |

| | |
|---|---|
| స్రగ్ధర | స్రగ్ధర |
| మాలిని | మాలిని |
| మానిని | మానిని |
| వసంత తిలకము | వసంత తిలకము |
| వనమయూరము | వనమయూరము |
| లయగ్రాహి | లయగ్రాహి |
| స్వాగతము | స్వాగతము |
| తోటకము | తోటకము |

జాత్యుపజాతులు, కందములు, సీసములు వీని హెచ్చుగా నన్నయ నన్నెచోడులు వాడియున్నారు.

కందములు

నన్నయ - 1219 నన్నెచోడుడు - 534

అనగా నన్నయ రచించిన పద్య సంఖ్యలో సరిగా సగముభాగము కందములు. అనగా నాతని పద్యరచన 1410 లో కందములు మూడవ వంతు.

సీసములు.

నన్నయ నన్నెచోడుల సామ్యపరిశీలనకు ఛందస్సున నిది ప్రధానము. నన్నయ యెన్ని విధముల సీస రచనము గావించి యున్నాడో నన్నెచోడుడును, అన్ని నియమములతో సీసములను రచించి యున్నాడు.

| నన్నయ రచించిన సీసములు | నన్నెచోడుడు |
|---|---|
| 251 | 186 |

నన్నయ సీసపద్యముల నొక నియమముతో రచించెనని తెలుగువారి వంతెఱుగుదురు. కాని నన్నెచోడకవి కూడా యట్లనే సీసపద్యములను నియమముతో రచించెనని చాలమంది యెఱుగక పోవచ్చును. మనకు లభ్యమైన ప్రాచీన పద్యశాసనములలో ధర్మ

వరశాసనమున సీసపద్య మొకపాదము పోయినను సర్వప్రాస నియమముతో నున్నది. అటుగాటుగా నున్నను, కందుకూరి శాసనసీసము-ప్రాసనియమముతో నున్నదని గ్రహింపనగును దీనిని బట్టి నన్నయకు ముందు సీసపద్య రచనమున నియమమున్నట్లు స్పష్టము. నన్నయయు నీ నియమములను తన సీసపద్యము లన్నిటి యందును పాటించియే యున్నాడు. నన్నయ వెనుక సోలమదేవి శాసనమున ప్రాసనియమము సీసమున పాటింపబడినది. ప్రస్తుతము నన్నయ నన్నెచోడ కవుల సీస పద్య రచన వివరింతును.

నన్నయవలెనే నన్నెచోడుడు పదునారు విధములైన సీసపద్యములను రచించి యున్నాడు. కొన్ని యెడల నన్నెచోడుని గ్రంథమున నా నియమము తప్పినట్లు కాన వచ్చుచున్నది. కాని యిందు విచిత్ర మేదియులేదు. వందలకొలదిగా ప్రతులు పాఠములు లభించుచున్న నన్నయ భారత భాగమునందే సీసపద్యములలో నిట్టి విపర్యాసములు కానవచ్చుచున్నప్పుడు, ఏకైక ప్రతినుండి ప్రత్యంతరము లేక, గత్యంతరము కానక ముద్రించిన ప్రతియందు స్ఖాలిత్యము లుండుట సంభావ్యమే.

| | | | |
|---|---|---|---|
| 1. | సర్వయతి సీసము | సీ. యతి<br>గీ. యతి | 4-45 జలశాయి |
| 2. | సర్వప్రాస సీసము | సీ. ప్రాస<br>గీ. ప్రాస | 4-109 అరగ్వధార్క— |

పై రెండుగాక వీనిలో నీ క్రింది భేదములు గలవు.

| | | | |
|---|---|---|---|
| 1. | గీతి యొకటవ | పాదమున | ప్రాసయతి |
| 2. | ,, రెండవ | ,, | ,, |
| 3. | ,, మూడవ | ,, | ,, |
| 4. | ,, నాల్గవ | ,, | ,, |
| 5. | ,, యొకటిరెండు పాదములు | | ,, |
| 6. | ,, యొకటి మూడవ | ,, | ,, |

7. ,, యొకటి నాల్గవ పాదములు ప్రాసయతి
8. ,, రెండవ మూడవ ,, ,,
9. ,, రెండవ నాల్గవ ,, ,,
10. ,, మూడవ నాల్గవ ,, ,,
11. ,, ఒకటి రెండు మూడు,, ,,
12. ,, ఒకటి రెండు నాల్గవ ,, ,,
13. ,, ఒకటి మూడు నాల్గవ,, ,,
14. ,, రెండు మూడు నాల్గవ,, ,,

ఈ భేదములు- భారతి, వృష- అశ్వయుజము (అక్టోబరు 1941) లో నీయబడినది. వానినన్నిటిని మూలప్రతితో సరిచూడవలసి యున్నది. నన్నయవలె నన్నెచోడుడు సీసపద్య రచనమున నియమము పాటించినవాడు.

యతులు

తెలుగున భాషాశాస్త్రమునకు మూలభూతములగు యతులు విషయమై, నన్నయ, నన్నెచోడుల గ్రంథములలో చేయవలసిన పని చాల యున్నది. అందలి యతి స్థానములు ప్రతి యక్షరము పరిశీలింప దగినది. ఒక్క యుదాహరణము చూపుచున్నాను.

కుమారసంభవమున - మొదటి పద్యమున

"శ్రీవాణీంద్రా మరేంద్రార్పిత మకుట మణి శ్రేణి"

అని ముద్రితమైనపుడు నేను యతులనుగూర్చి పరిశోధించి నన్నెచోడుడు- వలపల గిలక యతి సంప్రదాయము- ననుసరించి. అనగా- రేఫ సంయుక్తాక్షరములో క్రింది హల్లుతో యతివేయుట (ర్వ - వ - ర్చ - చ) నన్నెచోడుడు. శ్రీవాణీంద్రామరేంద్రార్చిత" అనియే యుపయోగించెనని 77 స్థలములలో నట్టి యతిస్థానములను చూపితిని.

నన్నయ యతులను నారీతిగానే పరిశీలించితిని. వలపలగిలక యతినే నన్నయ వాడినట్లు నిర్ధారించితిని ఈ విషయమున నన్నెచోడ నన్నయలకు పూర్ణముగ సామ్యమే గలదు.

నన్నయ యతులనుగూర్చి యింకను చెప్పవలసినది భారత మంత—

ఇట్టి పనులకు పద పద్యానుక్రమణిక లావశ్యకములు–నన్నెచోడ కవి కృతి కీ వఱకే యట్టిదానిని ప్రకటించితిని– నేడు నన్నయకు నట్టి యనుక్రమణిక సిద్ధము చేయుచున్నాను. స్ఫురించిన విషయములు నిందు వ్యాసరూపముగ నందించితిని. కొన్నిచోట్ల చెప్పవలసినవి యింకను చాల యున్నవని పాఠకలోకమునకు తెలుపుటకే పై విష యము వ్రాసితిని.

---

1. 'శివకవులు' అనుపదము మొదట సూచించినది, భారతి ప్రథమ సంపుటము, ప్రథమ సంచిక (జనవరి 1924).
2. కవి సామ్రాట్ విశ్వనాథ సత్యనారాయణగారు.
3. మన పేళ్ళు, యింటి పేళ్ళు, ఊళ్ళ పేళ్ళు– వీనిని గురించి పరి శోధన చేయదగినది బ్రహ్మాండమైనంతపని గలదు. వీని వలననే వాస్తవముగా తెనుగుజాతి, చరిత్ర, సంస్కృతి, విజ్ఞానము తేట పడగలదు. ఈనాడు విశ్వవిద్యాలయములుగాని సాహిత్య అకాడమీలుగాని, భాషాసమితులుగాని యట్టి పని తలపెట్టనే లేదు. మౌలికమైన యిట్టి పరిశ్రమ జరిగినగాని మన ప్రత్యేక వ్యక్తిత్వము ప్రపంచమునకు వెల్లడికాదు. ఇది ముఖ్యాతి ముఖ్యమైనది. భారతి (1943-1944) లో వీనిని గూర్చి కొంత కదలిక గలిగినది.
4. ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీవారు ప్రకటించిన నన్నయ– నన్నెచోడ పదకోశములందు తత్సమపదములు లేకుండుటచే నీ సందర్భమున నది యెంతమాత్ర ముపయోగకారి కాలేదు. అవి అకారాది క్రమము నంతగా ననుసరింపలేదు. ఈ తత్స మములు నిఘంటువున కెక్కవలెను.

భారతి. మే; 1963.

.........

# నన్నయ – పంప భారతావతారిక

డా॥ నాయని కృష్ణకుమారి
డా॥ రామచంద్రరావు

నన్నయ భారతాంధ్రీకరణకు పూనుకోవడానికి గల కారణాలను గురించి ఆయనే తన భారతావతారికలో స్పష్టంగా చెప్పుకున్నాడు. ఆ కారణాల కంటే అధికంగా నన్నయ భట్టారకుని వ్యక్తిగతమైన ఇష్టానికి సంబంధించినవి కొన్ని తెలుగు కన్నడ భారతావతారికల్ని* పోల్చిచూచినప్పుడు స్పష్టంగా కన్పిస్తున్నాయి. నన్నయ కన్నడ భారతాన్ని చూడడం చేతను, ఆయన దాన్ని గాఢంగా అభిమానించడం చేతను, ఆయన వలన తెలుగు భారతాంధ్రీకరణ క్రియ జరిగిందని చెప్పవచ్చు. పంప భారతం ఉనికి, నన్నయ్యకు ముందు ఉండి ఉండక పోయినట్లయితే తెలుగు భారతం రూపు దిద్దుకుని ఉండకపోయేదేమో!

ముఖ్యంగా నన్నయ, భారతాంధ్రీకరణ సమయంలో పంప భారతాన్ని దృష్టిలో ఉంచుకుని, అందులో తనకు నచ్చని విషయాలపై ఆసక్తి చూపించడానికి తెలుగు భారతావతారికలో అంతర్గత సాక్ష్యాలు కనిపిస్తాయి.

ఆ పరిశీలన ననుసరించే తెలుగులో ఆదికవి అయిన నన్నయ కన్నడదేశం నుండి తెలుగు దేశానికి తరలి వచ్చిన వాడని స్ఫురిస్తూ ఉన్నది.–

భారత కథలు అన్ని భారతీయ భాషల్లోనూ కథలుగా, నాటకాలుగా, లఘు కావ్యాలుగా రూపాంతరం చెంది ప్రచారం చేయబడడం అందరూ ఎరిగిన విషయమే. కాని వ్యాస ప్రోక్తమైన సంస్కృత భారతం, తెలుగులో మూల విధేయంగా ఉంటూనే స్వేచ్ఛానువాదం అనిపించుకుంటూ, రూపు దిద్దుకున్నట్లుగా మరే భారతీయ భాషలోనూ అవతరించలేదు.

స్తున్నాను." అని ఆయన వివరించాడు. అంతటితో ఆగలేదు. "నేను విస్తృతమైన వ్యాస మునీంద్రుని వచనామృత వారధిలో ఈదులాడాను. అయినా కవివ్యాసుడననే గర్వం నాకు లేదు. గుణార్ణవుని మంచితనం నా హృదయంలో ప్రవేశించడం చేత ఈ భారతాన్ని చెప్తున్నాను. ఇందులో దోషమేమున్నది ? అంటూ, సకలార్థ సంయుత, అలంకృత, ఉదాత్త వృత్తి విన్యాస అనేక లక్షణ గుణ కారణభూత, మృదు పాద, వాక్సౌందర్య శోభిత, కళాలలిత, సుప్రసిద్ధ అయిన నా కవితా కన్యను అరికేసరికి కాక వేరొక్కరికి ఇవ్వ వచ్చునా ?" అని తన కృతిపతిని సత్కారించుకున్నాడు.

పంప భారతంలో మంగళాచరణ శ్లోకం ప్రారంభంలో లేదు. ఇష్టదేవతా స్తుతి ఉన్నా తన నమ్మకానికి విరుద్ధంగా హైందవ దేవతల్ని ప్రత్యక్షంగా పంపడు స్తుతించలేదు. అన్ని సైవాలకంటే తన ప్రభువును అతి శాయిగా వర్ణించాడు. మూర్ధాభిషిక్తుడైన ప్రభువు పట్ల సైన్యాధిపతికుండ వలసిన వినయం, గౌరవభావం, సేవా తత్పరత, ఈయన తన కావ్యంలో చేసిన దేవతా స్తుతిలో వ్యక్తీకరింపబడ్డాయి. తాను దేవతా స్తుతి చేస్తున్నట్లుగా కాక ఆ దేవతలతో తన రాజుకు అభేదాన్ని పాటిస్తూ రాజును స్తుతిస్తున్నట్లే ఆ ఘట్టాన్ని ఆవిష్కరించాడు. ఇది "పంప డనుసరించిన లౌక్యమైన ధర్మం. ఆగమిక ధర్మానికి వ్యతిరేకమైన ధర్మం.

పంపని తరువాత వంద సంవత్సరాలకు వచ్చిన నన్నయ కొన్ని చోట్ల పంపని కంటే, స్వభావంలో పూర్తిగా భిన్నుడు.

పంపడు జైనుడయితే నన్నయ వైదికుడు. పంపని వలె ఆయన వాహినీ కులపతి కాడు గాని రాజరాజుకు చెందిన కుల బ్రాహ్మణుడు. జైనుడయిన పంపని కావ్యరచనోద్దేశ్యం కంటే వైదికుడయిన నన్నయ కావ్యరచనోద్దేశ్యం భిన్నమైనది. భారతాంధ్రీకరణానికి, తన మనోగతమై తన్ను ప్రేరేపించిన, ఆత్మీయమైన కారణాన్ని నన్నయ తానై పంపకవి చెప్పినట్లుగా చెప్పలేదు. భారతాంధ్రీకరణం తన

యిష్టం వల్ల జరుగుతున్న క్రియగా కాక, రాజరాజు ఆదేశం వల్ల జరుగుతున్న దానినిగా చిత్రించాడు. కాని, రాజరాజు పక్షాన, ఆ భారతాంధ్రీకరణ కాంక్షను, ఆయన నోటివెంట అలా చెప్పించింది నన్నయభట్టే ననిపిస్తుంది-అందుకు సరియైన మనఃస్థితి గల రాజరాజు వ్యక్తిత్వ చిత్రణాన్ని చేసింనీ నన్నయభట్టారకుడే.

భారతావతారికలోని రాజరాజు గుణాల్ని ఎన్నడంలో అవలంబించిన పద్ధతి పంపడు తన ప్రభువు నెన్నిన పద్ధతి కంటే పూర్తిగా భిన్నం. రాజరాజు పరాక్రమాన్ని నన్నయ తడివినా, ఆయనకు గల ఆర్ష ధర్మైక నిష్ఠమైన శీలం మీదనే నన్నయ దృష్టి.

రాజరాజు (1) విమల విచారుడు (2) వివిధాగమ విహిత శ్రముడు (3) ఉత్తమ చాళుక్యుడు (4) తన ఉదయ ప్రభావం వల్ల ఘన దురితానుబంధ కలికాలజదోషతుపార సంహతిని దవ్వుగ జోపిన వాడు. (5) రాజ్య సంతత వసంత నితాంత భూతిచే ఎంతయు తనరిన వాడు (6) ధర్మ నిబద్ధ దయార్ద్ర బుద్ధి. (7) మనీషి విద్యాశ్రమ తత్త్వ విత్త్వమున తనరిన వాడు (8) సమస్త వర్ణాశ్రమ ధర్మ రక్షణ మహా మహిముడు. (9) ఆది రాజ నిభుడు. (10) అకలంక చరిత్రుడు. ఇటువంటి ధార్మిక సంబంధులయిన విశేషణాలింక ఎన్నో రాజరాజుకు వాడాడు నన్నయ. అయితే ఈ విశేషణాలన్నీ సాభిప్రాయాలే.

రాజరాజుకు పూర్వం వేంగీ దేశంలో, వైదిక ధర్మాన్ని వ్యఘటితం చేస్తూ జిన ధర్మం పెచ్చరిల్లుతూ ఉండేది. రాజరాజు తండ్రి విమలాదిత్యుడు మొదట శైవుడైనా, అపర వయస్సులో జిన ధర్మం స్వీకరించినవాడు. దేశిగణాచార్యుడైన త్రికాల యోగి సిద్ధాంతదేవుడీయనకు దీక్షా గురువు. రాజరాజు తండ్రిమార్గం పట్టక, వైదిక మతానుయాయి కావడం ఇక్కడ విశేషం. ఆయన పార్వతీపతి పదాబ్జ ధ్యానరతుడైన శైవుడు. ఈశ్వరాగమాల యందు బుద్ధి నిలిపిన వాడు. జైనమత నిరాకరణం చేసి వైదిక ధర్మాన్ని చేపట్టడంవల్ల ఆయన తత్త్వం (1) విమల విచార తత్త్వం (2) అందువల్లనే ఆయన

విబిధాగమ విహిత క్రమముడు. (3) ముందు తరం వారికంటే ఉత్తమ చాళుక్యుడు (4) కలికాల ధర్మంగా కనిపించే జినధర్మ తుషార సంహారికి, తాను రాజ్యాధికారాన్ని చేపట్టడం చేత, సూర్యుడుగా పరిణమించిన వాడు (5) ఈ పని చేయడం వలన రాజ్య మంతటా సంతత వసంత నిశాంత భూతిని పంచ కలిగిన వాడు. (6) జైన మత నిరాసం చేసి వైదిక ధర్మ నిబద్ధ బుద్ధి అయినవాడు. (8) జైనమతం ఆమోదించని వర్ణాశ్రమ ధర్మ రక్షణానికి కడగినవాడు. (9) ఈ లక్షణాల వల్లనే తన వంశకర్తలైన ఆదిరాజులతో సరిపోల్చదగినవాడు— ఈ విధంగా తన ప్రభువు పరంగా నన్నయ వాడిన విశేషణాలన్నీ ఒక్క లక్షణాన్ని పెద్ద చేసి చూపించేవిగా ఉన్నాయి. ఆ లక్షణమే వైదిక ధర్మ నిష్ఠ.

వైదిక ధర్మ ప్రచారానికి పట్టు గొమ్మలు విప్రులు. విప్రులు వర్థిల్లందే వైదిక ధర్మ ప్రచారం సాధ్యం కాదు. 'అందువల్లనే భూదేవ కులాభితర్పణ మహీయః ప్రీతి ఆయన కిష్టమైన విషయంగా మారింది. అంతేకాదు. ఆయన (1) విప్రకులమునెల్ల ప్రోచెను. (2) అగ్రజన్ములకు అనుగ్రహంచేత చారుతర మహాగ్రహారము లిచ్చెను. (3) వారిని భయరహితులుగా కాచెను. (4) దేవభోగాలను మహా విభూతితో తనర జేసెను. అటువంటి లక్షణాలు కల రాజరాజు మను ప్రచోదిత మార్గాన్ని ఎన్నుకున్న వంశవర్ధనుడైన విష్ణు వర్ధనుడు. నన్నయ ఇన్ని లక్షణాలచే తన రాజును తీర్చిదిద్ది, మహాభారత బద్ధ నిరూపితార్థం ఏర్పడేట్లుగా తెలుగులో భారతాన్ని నిర్మించమని, తనను ఆయన కోరుతున్నట్లుగా సన్నివేశ కల్పన చేసుకున్నాడు నన్నయ. నిజానికి, ఈ వైదికమార్గ నిష్ఠమైన ఈ ప్రీతీ, కోరికా ఇవన్నీ నన్నయకు చెందినవే. భారతానువాదం విషయంలో అరికేసరి కంటే రాజరాజుకు గల భిన్నత్వం ఇప్పుడు స్పష్టం.

ఇక పంపకీ, నన్నయకూ ఉన్న భిన్నత్వం కూడా తరిచి చూడదగ్గదే రాజు భారతం వ్రాయమనగానే కుల బ్రాహ్మణుడైన

నన్నయ అందుకు నేనే సమర్థుడనని పంపనివలె ఆత్మ ప్రత్యయంతో చాటుకోలేదు. నిజానికి భారతాంధ్రీకరణ కార్యాన్ని చేపట్టదలచుకున్న నన్నయ్యకు. మదిలో అనుక్షణమూ పంపడే మెదులుతున్నట్లుగా మనకు అనిపిస్తుంది. అడుగడుగునా, తెలుగు ఆదికవి, కన్నడ ఆదికవితో, తన్ను తాను పోల్చుకుంటూ, పై పారు వేసుకుంటూ ముందుకు సాగినట్లుగా నన్నయ భారతావతారిక స్పష్టం చేస్తుంది.

"ఈ కథను అష్టాదశ వర్ణనా సంకలితంగా చెప్పగలిగిన వాడు పంప డొక్కడే అని పండితులు నొక్కి వక్కాణించడం చేత నేనీ ప్రబంధాన్ని వ్రాయడానికి ప్రారంభిస్తున్నాను." అన్న పంపని వచనం మనసులో మెదలడం చేతనే నన్నయ ఆ అతిశయాన్ని హర్షించక, రాజరాజు నుద్దేశించి, "దేవా! నీ యనుమతంబున విద్వజ్జనుల అనుగ్రహంబున చేసినా నేర్చువిధంబున నిక్కావ్యంబు రచియించెద"- అన్నాడు. అంతేకాక పంపడు. "వ్యాస మునీంద్రుని విస్తృతమైన వచనామృత వార్ధిని ఈదుతున్నాను. కాని నాకు కవి వ్యాసుడననే గర్వంలేదు" అని చెప్పడం కూడా నన్నయకు రుచించినట్లు లేదు. అందుకే "దుర్గమార్గ జల గౌరవ భారత భారతీ సముద్రము దరియంగ నీదను విధాతృన కైనను నేరబోలునే" అని పంపనికి ఒక విధంగా సమాధానం చెప్తున్నట్లే ప్రారంభించాడు

ఈ భారతం ముని వృషభాభిహిత మహాభారత బద్ధనిరూపితార్థాన్ని తెలుగులో ఏర్పడేటట్లు చేసేదే కాని, తదితరబద్ధమైన ధర్మాన్ని చేపట్టిన ఒక జైన కవిచేత, ఒక రాజుకూ, భారత గత పాత్రకూ, ముడి పెట్టి తీర్చిన లఘు కావ్యం వంటిది కాదు. ఆ దృష్టే నన్నయకు ఉండడం వల్లనే, బహు భాషల, బహు విధముల, బహు జనములవలన వింటూ భారత బద్ధ స్పృహులయ్యే వారికి ఇది ఉపయోగపడేటట్లుగా ఉండాలని, తన రాజు చేతనే అనిపించాడు నన్నయ. ఇక తనను గురించి తాను చెప్పుకునేటప్పుడు, తన ధ్యేయానికి అనుగుణ

మైన వర్ణనే చేసుకున్నాడు. తనదైన అవిరళ జపహోమ తత్పరతనూ సంహితా భ్యాసతనూ, నానా పురాణ విజ్ఞాన నిరతినీ వివరించాడు. అంతేకాక తాను రాజుకు కుల బ్రాహ్మణ్ణనీ, అనురక్తుణ్ణనీ స్పష్టం చేశాడు- పంపడు వ్యక్తం చేసినట్లుగా, రూప రేఖా విలాసాన్నిగానీ, లౌకిక గుణ సంపదను కానీ వెదజల్లలేదు.

ఈ రకంగా పద పదనా పంపని భారతం వేపు చూస్తూ భారతాంధ్రీకరణాన్ని నన్నయ చేపట్టాడనడంలో సందేహం లేదు. అంతే కాదు. పంపడు వెలిబుచ్చిన కొన్ని అభిప్రాయాలూ, కావ్య గతంగా సమకూర్చిన కొన్ని అంశాలూ నన్నయకు అతి ప్రీతి పాత్ర మైనవిగా కనిపిస్తున్నాయి.

1) పంపడు తన అవతారికలో కవిత్వం లలిత పదాలతో గూడి, ప్రసన్న కవితా గుణాన్ని కలిగి ఉండాలన్నాడు. నన్నయ బహుశ ఆ అభిప్రాయాన్ని మనస్సున హత్తించుకోవడం వలన కాబోలు, లలిత పదాల కూడికను అక్షర రమత్యతగానూ, ప్రసన్న కవితా గుణాన్ని ప్రసన్న కథా కవితార్థయుక్తిగానూ రూపాంతరం చెందించి, వాటిని తన కవిత్వ లక్షణాలుగా నిర్ధారణ చేసుకున్నాడు.

(2) పంపడు అరికేసరికి కృతి యిచ్చినట్లే నన్నయ రాజరాజుకు కృతి యిచ్చాడు.

3) పంపడు తన ప్రభువైన ఇమ్మడి అరికేసరిని అర్జునునితో అభేదం చెప్తే, నన్నయ తన రాజు వంశానికి పాండవులే వంశకర్తలని చెప్పి, రాజరాజుకు వినయ సౌగంధ్య చర్చ చేశాడు.

4) పంపని అరికేసరి పిలిచి కావ్యరచనకు పూనుకోవలసిందిగా అడిగినట్లుగానే, నన్నయను రాజరాజూ అడిగాడు.

5) మంగళాచరణం చేసిన తర్వాత కూడా, నన్నయ భారతావతారికలో ఇష్టదేవతా స్తుతిని, పంపభారతంలోని హరి, హర, అజ, గజానన అర్కమాతృ సరస్వతీ గిరిసుతాదులనే ఎన్నుకుని చేశాడు.

కాని ఆయన చేపట్టిన మన్మథ స్తుతిని, వైదికుడయిన ఈయన విసర్జించవలసి వచ్చింది.

ఈ విధంగా పంపభారతాన్ని ప్రత్యక్షరమూ తన దృష్టిలో ఉంచుకోవడానికి, నన్నయకు, తన సహాధ్యాయి అయిన నారాయణ భట్టు సహాయం కావలసి వచ్చింది.

అష్టభాషా ప్రవీణుడూ, సంస్కృతాంధ్ర కర్నాటక భాషలలో సుకవి రాజశేఖరుడూ అయిన ఈ నారాయణభట్టు కన్నడిగుడే. నారాయణభట్టు పశ్చిమ చాళుక్య చక్రవర్తి అయిన త్రైలోక్య మల్లదేవరకు ప్రధాని - రాజరాజు కర్నాటక చాళుక్యులతో సంధి చేసుకుని యుండుటచే, త్రైలోక్య మల్లిదేవర ఆస్థానానికీ రాజరాజు ఆస్థానానికీ మధ్య సంబంధబాంధవ్యాలు సవ్యంగా ఉంటుండేవి. అందుకే నారాయణభట్టుకు ఈ యిద్దరి మధ్యా సమాన సంబంధం, మైత్రి, ఆదరం ఉండేవని చెప్పవచ్చు. నన్నయ్యకు ఇష్టుడూ సహాధ్యాయీ కావడం వల్లనేమో నారాయణ భట్టు రాజరాజుచే దానశాసనం వేయించుకున్నాడు. మన్ననలందుకున్నాడు. చిన్ననాట ఒనగూడవలసిన ఈ యిరువురి సహాధ్యాయిత్వానికి ఇక్కడ కన్నడ దేశమే. ఆ కారణంగానే నన్నయ తన భారతాంధ్రీకరణ సమయంలో పంప భారతాన్ని ప్రతిక్షణమూ పరిశీలించడం జరిగింది. నారాయణభట్టుతోడ్పడడమూ జరిగింది.

కన్నడంలోనికి భారత కథను తెచ్చిన ఆదికవి పంపడు తెలుగువాడైతే తెలుగులోనికి భారతాన్ని తెచ్చిన ఆదికవి నన్నయ తొలుత కన్నడ దేశవాసి. కవిత్వానికి ఎల్లలు లేవనే విషయాన్ని ఈ ఆది కవులిద్దరూ తమ కావ్యాల ద్వారా నిరూపించడం ఎంతో సంతోష కరమైన విషయం.

పంపని పూర్వికులు కన్నడ దేశానికి పోవడానికి ఏ విధంగా మతం కారణం అయిందో, నన్నయ తెలుగు దేశానికి వచ్చి స్థిర

పడడానికి అదేవిధంగా మతం కారణం అయింది. అక్కడా ఇక్కడా ఏలికలు ఒకే కుదురు నుండి వర్ధిల్లిన చాళుక్య వంశస్థులు.

ఆదికవి నన్నయను తెలుగులో భారత రచన చేయడానికి, ప్రభావితం చేసిన అంశాలు 1 ఆయనకు గల వైదిక ధర్మనిష్ఠ 2. జైనుడైన పంపకవి భారత కథను లఘుకావ్యంగా మలచిన వైనం. ఇందులో మొదటి అంశం మీది సౌముఖ్యమూ, రెండవ అంశం మీది వైముఖ్యమూ, ఆయనను భారతాంధ్రీకరణ కార్యం వైపు తరిమి నట్లుగా నమ్మకంగా చెప్పవచ్చు.

---

* కన్నడంతో పోల్చి చూడడానికి అనువుగా కన్నడశాఖ అధిపతి డా॥ రామచంద్రరావుగారు పంప భారతాన్ని నాకు వినిపించారు. ఇద్దరమూ రెండు అవతారికల్ని గురించి చర్చించాము. అందువల్ల ఈ వ్యాసకర్తగా ఆయన పేరు చేర్చడం జరిగింది.

వివేచన (ఉస్మానియా విశ్వవిద్యాలయం, తెలుగుశాఖ పరిశోధన పత్రిక)

—o—

# నన్నయ-పంపమహాకవి యనుసరణములు

శ్రీ నిడుదవోలు వెంకటరావు

కన్నడ భాషలో రత్నత్రయమని ప్రసిద్ధిగాంచిన కవులలో ప్రథముడగు పంప మహాకవి నన్నయకన్న నూటేండ్లు ముందుగా విక్రమార్జున విజయమను నామాంతరముగల పంప భారతమును, ప్రథమ తీర్థంకరుని చరిత్రయగు నాది పురాణమును రచియించెను. ఆ రెండు గ్రంథములలో గల పద్యములకు నన్నయ పద్యములకు గల సామ్యతను కొలదిగా నిందు ప్రదర్శించుచున్నాను. ఇరువురి పద్యముల యెత్తుగడలు, పదబంధములు పరిశీలింపదగినవి.

ఆదిపురాణము : పంపకవి :- అరుణ సరోరుహాం మృదుతరదళ
విన్యాసమమర 7-8

భారతము ; నన్నయ:- అరుణ సరోరుహదళ మృదులంబు.
అరణ్య. 3-299

పంప :- ఏలాలవంగలవలీ వేలావన భూమియుళ్.
(ఆది. 13-2)

నన్నయ:- ఏలా లవంగలవలీ వేలావనములకు
ఆదిపర్వము (8-137)

పంప :- సకలక్ష్మాచర ఖేచరాంచిత మహా
మాణిక్యగాణిక్య. (8-16)

నన్నయ :- మదమాతంగ తరంగతురంగ కాంచనలస
న్మాణిక్యగాణిక్య. సభా. 1-1

పంప భారతము : పంప : హిమకరనాత్మ శీతరుచియందిన నాయక
నుష్ణదీధితిం. 3-82

నన్నయ : హిమకరుడు శైత్యమును నర్యముడు
మహాతేజమును ఆది. 4-

పంప : సాలప్రాంశు 1-68 (పద్యము మొదలు)
నన్నయ : సాలప్రాంశు ఆది. 6-30
పంప : సరళ తమాలతాళ హరిచందన నందన
భూజరాజియం. 5.52
నన్నయ : సరళ తమాలతాళ హరిచందన చంపక
వారికేళ. ఆది. 8-7
పంప : కురువృద్ధం గులవృద్ధ 6-44
నన్నయ : కురువృద్ధుల్ గురువృద్ధ బాంధవులు
సభా. 2-223
పంప : శ్రీమచ్చళుక్య
వ్యోమాత్మృత కిరణ వంశశిఖామణి. 1-15
నన్నయ : శ్రీమచ్చళుక్య వంశశిఖామణి. ఆది. 3-1
పంప : అయనయ పరాక్రమం 9-35
నన్నయ : అయనయ హీనుఁడౌ సభా. 1-1?1
పదములు

| నన్నయ | | పంపకవి | |
|---|---|---|---|
| అర్గలంబు. | ఆది. 6-217 | అగ్గళం. | 1-10 |
| అరుణవారిశేషము. | సభా. 2-296 | సరసీజరజారుణ వారియం | 11-55 |
| అష్టశోభ. | ఆది. 7-281 | అష్టశోభ అలంకార | 5-22, 7-2 |
| ఇట్టిరె ఉపాంశువధ. | ఆది. 5-108 | ఇట్టిరె మనోహర ఉపాంశువధ. | |
| నందనంబు. | ఉద్యానపరము | | 2-90 |
| | | నందన. అరణ్య. | 224 |

ఇట్లాయా యర్థములందు సమానముగా నుపయుక్తములైన పదములు పెక్కులు.

సంస్కృత మూలములేని యీక్రింది సంవాదములు పరిశీలనార్హములు

| నన్నయ | పంప |
|---|---|
| కుంతి గంగనీళ్ళు కాళ్ళు మొగంబు కడిగికొని కుంభకార గృహంబున విడిసి. ఆది 7-164 | గంగలో స్నానము చేసి 1-90 భార్గవ గృహంబున విడిసి 3-39 |
| శంతనుండును పరమానురాగంబున సత్యవతిని వివాహంబై ఆది.4-192 | చూ. 1-174 పుట. 17 |

పంప భారతమును నన్నయ భారతమును మనమెంత జాగరూకతతో పరిశీలింపవలెనో చూపుటకు పై యుదాహరణమును వివరించితిని. సంస్కృత మూలముననేగాక, కన్నడ భాషయందు వెలసిన భారతమును గూడ మన విమర్శకులు గ్రహించిన మన ప్రాచీనాంధ్ర భాషావాఙ్మయ చరిత్రమున కెంతయేని మేలు చేకూరగలదు. అట్టి ♦ పరిశ్రమమ ప్రోత్సహించుటకే యీ చిన్ని వ్యాసముద్దేశింపబడినది.

---

♦ ఇట్టి పరిశ్రమకు దారిచూపినవారు తొలుత కీ॥ శే॥ బుర్రా శేషగిరిరావుగారు. వారు మదరాసు విశ్వవిద్యాలయమున నున్నప్పుడీపని తలపెట్టిరి. కాని కొనసాగలేదు. దీనిని గూర్చి వారు Studies in South Indian Jainism Andhra Karnataka Jainism అను గ్రంథము చూడనగును. కీ॥ శే॥ శ్రీపాద లక్ష్మీపతిశాస్త్రి గారును తమ కుమార సంభవ విమర్శనమున దీని నుట్టంకించిరి. దీనిని గూర్చి విపులముగా నా "తెలుగుకవుల చరిత్ర" ప్రథమ భాగమున చూడనగును.

సంస్కృతి. జూన్; 1953.

......

# నన్నయభట్టు రాచదారి - నానా కవుల పయనము

శ్రీ పుయ్యూరు లక్ష్మీనరసింహారావు

వాచా మాంధ్రమయీనాం యః ప్రవక్తా ప్రథమోఽభవత్।
ఆచార్యం తం కవీన్ద్రాణాం వన్దే వాగనుశాసనమ్॥

నన్నయభట్టారకుఁడు 'విపులశబ్దశాసను' డయినట్లు ఆంధ్ర మహాభారతాదిని (ఆది. 1-4) వక్కాణించి యున్నాఁడు. ఇచటి విపుల శబ్దము శబ్దశాసన శబ్దములోని శబ్దశబ్దమునకు విశేషణము. విస్తృతములగు రసవచ్ఛబ్దములను ఆజ్ఞలో నిలిపినాఁడని యర్థము. అనఁగా వశ్యవాక్కని భావము. శబ్దశబ్దము అధిష్ఠాన దేవతాపరమై సరస్వతి యర్థమగునపుడు సర్వవ్యాపిని యగు సరస్వతిని తనయాజ్ఞ యందుంచినవాఁడు బ్రహ్మ. ఈ బ్రహ్మ. కవిబ్రహ్మ మఱియుఁ దాను ఉభయ భాషా కావ్యరచనా శోభితుఁ డనియు నదే పద్యమునందు ప్రకటించియున్నాడు. ఉభయభాషలనఁగా సంస్కృతాంధ్రములు. ఈ రెండింటిలోను కావ్య నిర్మాణదక్షుఁడఁట ! అనఁగా నన్నయ ఉభయకవి యన్నమాట !

బ్రహ్మ సకల జీవరాసులకు కావలసిన పదార్థములన్నియు ముందుగానే సృజించియుంచినట్లు, కవిబ్రహ్మ నన్నయభట్టారకుఁడు కూడ అనంతర కవి కుమారులకు కావలసిన కావ్యపదార్థము లన్నియు తన భారత భాగమున భద్రపఱచియున్నాడు. కనుకనే తెనుఁగుకవు లెల్లరు నన్నయభట్టునకు మ్రొక్కి, శక్తికొద్ది ఆయన కవితామర్మముల నాకళించుకొని, స్వకీయ ప్రతిభానుగుణముగ మలచుకొని తమ తమ కృతులు నిర్మించి సుకృతు లయినారు. ఆయన వేసిన రాచ త్రోవలో పయనించిన కవివరేణ్యుల పయనమునుగూర్చి కొంచె పాటిగా ముచ్చటించుటయే నా వ్యాసరచన యుద్దేశము.

౧. శ్రీకారముతో కృతి ప్రారంభము :

సంస్కృతమున శ్రీకారముతో కావ్యారంభము సేయవలయు నన్న నియమము లేదు. 'శ్రియఃపతి శ్రీమతి శాసితుం జగత్' వంటి ప్రారంభశ్లోకము లొండు రెండుతప్ప, శ్రీకారముతో ఆరంభింపఁ బడినవి మెండుగా కవరావు. కాని, యేముహూర్తమున వాగనుశాసనుఁడు 'శ్రీవాణీగిరిజాశ్చిరాయ' యనుచు శ్రీకారముతో ప్రారంభించెనో కాని, ఆంధ్రకృతి కర్త లందఱు శ్రీకారముతోనే కృత్యారంభములు గావించినారు.

౨. కృత్యారంభమున సంస్కృత శ్లోకము :

ఆంధ్రకృతి నారంభించు చున్నను గీర్వాణవాణీ భక్తిని వదలినవాఁడుకాఁడు నన్నయ అందులకే తన భారతారంభమున 'శ్రీవాణీగిరిజా శ్చిరాయ' యని సంస్కృత శ్లోకమునే రచించినాఁడు. ఈపద్ధతి నాంధ్రకవు లంతగా పాటింపలేదు గాని పాటించినవారు కొందఱు గలరు. తిక్కన నిర్వచనోత్తర రామాయణమును 'శ్రీరాస్తాం మనుమక్షితీశ్వర భుజాస్తమ్భే' యను శ్లోకముతోడనే యారంభించెను. ఇంకను ఒకరిద్దఱు ప్రబంధకవులు, కొందఱు శతకవులు ఈ సంప్రదాయమును పాటించినవారుగలరు ప్రథమకృతి యయిన నిర్వచనోత్తర రామాయణమును శ్లోకముతో నన్నయవలెనే ప్రారంభించిన తిక్కన, భారతమును స్వతంత్రించి తెనుఁగు పద్యముతో ప్రారంభించినాఁడు. ఈతనినే యనుసరించి తక్కుంగల కవులును తెనుఁగు పద్దియములతో కృతులు ప్రారంభించినారు.

3. శ్రీకారముతో ఆశ్వాస ప్రారంభము :

నన్నయ ప్రత్యాశ్వాసమును శ్రీకారముతోడనే యారంభించినాఁడు. అంతే ఒక్క తిక్కనయేమి, ఎఱ్ఱనయేమి, సర్వకవులును ఈ నియమమును పాటించినవారే. ఇట మఱియొక విశేషముకూడఁ గలదు. అది ప్రత్యాశ్వాసమును కందపద్యముతోనే ప్రారంభించుట. ఈ నియ

(38)

మమునుకూడ నున కవులు శ్రద్ధగా పాటించినారు. అనఁగా కంద పద్యము మహత్త్వమును కనిపెట్టిన యాదికవి నన్నయయే !

౮. ఆశ్వాసాంత నిర్మాణము :

సర్గాంతమున భిన్నచ్ఛందస్సును పాటించుట సంస్కృత కావ్యములందుఁ గలదు. ఆనియమమునే నన్నయ తెనుఁగునకు దెచ్చినాఁడు. సంస్కృతకవు లీవిషయమున ఛందోవైవిధ్యమునకే ప్రాధాన్యమిచ్చిరి కాని, వృత్తసంఖ్యకు ప్రాధాన్యమీ లేదు. నన్నయ ఆదిపర్వ ప్రథమాశ్వాసాంతమున, సభాపర్వ ద్వితీయాశ్వాసాంతమున మాత్రము మూఁడు పద్యములు రచించి, తక్కిన యాశ్వాసాంతము లందు రెండేసి పద్యములు రచించినాఁడు. ఇందు తిక్కన మొదటిపద్ధతినే స్వీకరించి మూఁడు పద్యములను వ్రాయు నియమమును పాటించెను. అయితే ఆశ్వాసాంతమునందు కందపద్యము మాత్రము విధిగా నుండునట్లు నన్నయ రచియింపఁగా, ఈ నియమమును మాత్రము తిక్కనయే కాక తక్కిన కవులును పాటించిరి. కందపద్య స్థానమునుకూడ నన్నయ శాసించినాఁ డన్న మాట ! తిక్కన కందముతో పాటు మాలినీ వృత్తమును గూడ విడువకుండ ఆశ్వాసాంతములందు నిబంధించినాఁడు. ఈతని నియమమును గూడ ఎఱ్ఱన శ్రీనాథ రామకృష్ణాదులు పలువురు పాటించియున్నారు. ఏమయినను ఆశ్వాసాంత నిర్మాణమునకు ప్రణాళిక చూపినది నన్నయ భట్టారకుఁడే! తాలాంకనందినీ పరిణయకర్త యీ సంఖ్యా నియమమునుగాని, కందపద్య నియమమునుగాని పాటింపలేదు. ఇట్టివా రింకను నుండవచ్చును.

౯. కృతిమహత్త్వ కథనము :

వాగనుశాసనుఁడు భారత సంహితా మహత్త్వము నీ క్రింది విధముగా వివరించినాఁడు.

'ధర్మతత్త్వజ్ఞులు ధర్మశాస్త్రం బని
యధ్యాత్మవిదులు వేదాంత మనియు
నీతివిచక్షణుల్ నీతిశాస్త్రం బని
కవివృషభులు మహాకావ్య మనియు

లాక్షణికులు సర్వలక్ష్యసంగ్రహ మని
 యైతిహాసికు లితిహాస మనియుఁ
బరమపౌరాణికుల్ బహుపురాణ సముచ్చ
 యం బని మహిఁ గొనియాడుచుండ
వివిధ వేదతత్త్వ వేది వేదవ్యాసుఁ
డాదిముని పరాశరాత్మజుండు
విష్ణు సన్నిభుండు-విశ్వజనీనమై
పరఁగుచుండఁ జేసె భారతంబు.' (ఆది. 1 31)

దీనిని స్మృతిపథమునఁ బెట్టుకొనియే కాలాంకనందినీ పరిణయ కర్త యీ క్రింది పద్యమును నిర్మించినాఁడు.

'అందు భవన్మనోదితమునై కనుపట్టు మహాపురాణమున్
గొందఱు ధర్మశాస్త్రమని కొందఱు తాత్త్వికసంగ్రహంబు నాఁ
గొందఱు నీతి హాస మని కొంద అనాది పురాణమంచనిన్
గొందఱు వేదగూఢ మను కొందురు భారత మానుపూర్విగన్.
(1-70)

యథాతథముగ నన్నయగారి వలెనే చెప్పకపోయినప్పటికిని స్వేష్టానుసారముగ కృతిమహత్త్వమును కావ్యారంభమున చెప్పిన కవులు పలువురు కలరు.

౩. శ్లేషలాలిత్యము :

మృదుమధుర శ్లేషలకు బాణభట్టుని కాదంబరి పుట్టిల్లు. తదీయ కమనీయరచనమును తెనుఁగు కవులకు నేర్ప నెంచి నన్నయభట్టు కద్రూవినతలు కాంచిన సముద్రమును శ్లేషరచనలో చూపినాడు.

వ. కద్రువయు వినతయు వినోదార్థంబు విహరించువారు కరి మకర నికరాఘాత జాతవాతోద్ధాత తుంగతరంగాగ్ర సముచ్ఛలజ్జలకణాసార చ్ఛటాచ్ఛాదిత గగనతలంబైనదాని, నుద్యానంబునుం బోలె బహువిద్రుమ లతాలంకృతంబైనదాని, నాటక ప్రయోగంబుం బోలె ఘనరసపాత్ర శోభితరంగ రమ్యంబైనదాని, దివంబునుం బోలె నహిమకరభరితంబైన దానిఁ గాంచినారఁట. (ఆది. 2-27)

దీని నాదర్శముగా స్వీకరించియే తిక్కన విరాటపర్వమున నర్తనాగార వర్ణనమును (2-325) పోతన యష్టమస్కంధము నందలి వామనచరిత్రములోని యమరావతీనగర వర్ణనమును (8-420) చేసినారు. ఈ రాచదారిలో పయనించిన ప్రబంధకవికుంజరులు కొంద ఱీ శ్లేషవర్ణనములు నిరంకుశముగాఁ జేసినారు.

8. కథా సందర్భానుగుణ వర్ణనము :

ప్రకృత కథా సందర్భమున కతుకునట్లు వర్ణనలుచేసి అనంతర కవులకు రాచబాట వేసినవాఁడు భట్టారకుఁడే. లాక్షాగృహ దహన సందర్భమున రచించిన యీ పద్యమెంత సొగసుగా నున్నదో గమనింపుఁడు-

'అనుపమ నిత్య సత్యరతులై వినయాన్వితులైన పాండునం
దనులకు ధర్మమూర్తులకు ధర్మ మెఱుంగక యిట్లు లెగ్గుసే
సిన ధృతరాష్ట్రి జాధమున శేష సుహృత్సుతబంధుదాహ సూ
చనమయి లక్కయి ల్లతికృశాను శిఖాహతిఁ గ్రాఁగెఁ గ్రక్కునన్'
(ఆది. 6-162)

ఇట్లే సూర్యాస్తమయ వర్ణనయు నొకటి కలదు. ఈ బాటలో పయనించినవాఁడు గావుననే యుభయకవిమిత్త్రుఁడు తన నిర్వచనోత్తర రామాయణమున రావణ దండయాత్ర సందర్భములోని సూర్యాస్తమయ వర్ణన మిట్లు చేసెను,

'అంత సహస్రపాదుఁ డపరాచల శృంగతటంబు సేరె, దు
ర్దాంతుఁడు దానవేంద్రుఁ డమరప్రకరంబు జయింపఁబోవుచో
నెంతలు వుట్టునో యనుచు, నేపడఁగంగఁ దొలంగి కాలుకొ
న్నంతయు దవ్వుగాఁ జని భయంబడరన్ గిరిదుర్గ మెక్కెనాన్.
(6-36)

ఈ కోవకుఁ జెందినదే అల్లసాని పెద్దనగారి 'తరుణి వనన్య కాంత' యను సూర్యాస్తమయ వర్ణనము (3-10).

8. దండకరచన :

సంస్కృతమున జేపి దండకాదులను పరిశీలించిన నన్నయ తద్రచనా సంప్రదాయమును తెనుఁగున ప్రవేశపెట్టదలచి పార్థుని చేత పార్వతీపతిని దండకమున స్తుతింపఁ జేసినాఁడు. ఇది 'శ్రీకంఠ లోకేశ' అని ప్రారంభమై ఆరోహణావరోహణ విన్యాసములు నెఱపి 'త్రిలోకైక నాథా! నమస్తే నమస్తే నమః' అని ముగియుచున్నది. (చూ. అరణ్య 1-326) విశేష మేమనఁగా నీ దండక మంతయు తెనుఁగు కారకములతో నిండి 'నమస్తే నమస్తే నమః' అని సంస్కృత మర్యాదతో ముగియుచున్నది. అనుకరణ సూచకమయిన 'అని' అను శబ్దము తదుపరి వచనమునఁ గలదు. ఈ నన్నయగారి దారిలో పయనించిన ప్రబంధకవు లనేకులు దండకము లిట్లే వ్రాసియున్నారు. ఉదాహరణమునకు కళాపూర్ణోదయమునందలి మణికంధర రచిత కృష్ణస్తుతినిఁ గాంచుఁడు (1-80). కనుపర్తి అబ్బయామాత్యుఁడు 'పాహిమాం పాహిమాం పాహిమామ్' అని దండకమును ముగించినాఁ డనిరుద్ధచరిత్రమున (4-97). ఈ చిఱుమార్పుకూడ సంస్కృత మర్యాదకే చెందినది. మఱియు సందర్భమున కత్యంత సముచిత మయినది. తిక్కనగారేలకో దండకమును వ్రాయలేదు. కాని తత్సదృశవచనమును వ్రాసిరి. దానిని శ్రీనాథుఁడు వృద్ధిపఱచెను. సరే. ఆ విషయ మటుంచుదము.

౯. త్రిరుక్తి :-

అభయశబ్ద ప్రయోగముచేత భయానకమును పోషించుగుణము కవితామర్మజ్ఞుఁడయిన నన్నయ నేర్చినది. మందపాలోపాఖ్యానమున నొక పద్యమున వరుసగా ముమ్మాఱు అభయశబ్దమును ప్రయోగించి రచనాశిల్ప విశేషమును, రసపరిపోషణమును ఏకత్ర చూపియున్నాఁడాదికవి. చూడుఁడు—

నలుగురు నాలుగు వేద
మ్ములమంత్రంబులను బ్రహ్మముఖములు వో లెన్.

వెలయంగ సంస్తుతించుచు
నలఘులు మాకభయ మభయ మభయమని రయ్యనలున్.♦
(ఆది. 8-311)

ఆఖరిపాదమున ఆఱు అకారములుండుట గమనింపఁదగినది. ఈ త్రోవలోనేఁగిన శ్రీనాథుని విన్యాసములు చూడఁదగినవి. పాలకడలి నుండి ప్రభవించిన హాలాహలమును గాంచి దేవతలు భయవిహ్వలులై పరమశివుని శరణు వేఁడు సందర్భములోనిదీ క్రింది పద్యము.

'అభయము పార్వతీశ! యభయంబు మహేశ! శశాంకశేఖరా!
యభయము శూలపాణి! యభయంబు మదాంధకకృతాంతమర్దనా!
యభయము ఫాలనేత్ర! యభయంబు కృపామయ దివ్యమానసా!
యభయము భీమనాథ! యభయం బభయం బభయంబు శంకరా!
(భీమ. 4-63)

౧౨. సంస్కృత ప్రభావము :

అనఁగా వ్యాసభారతేతర సంస్కృత కృతులలోని కొన్ని మధుర శ్లోకముల భావములను స్ఫురింపఁజేయుచు తెనుఁగునపద్యములు నిర్మించుట. ఈ పద్ధతి నన్నయ ప్రవేశపెట్టి శ్రీనాథాది కవిరాజులకు రాజమార్గము నిర్మించియున్నాడు. మచ్చునకొక యుదాహరణము-

'అసంశయం క్షత్రపరిగ్రహ క్షమా
యదార్య మస్యా మభిలాషి మే మనః।
సతాం హి సన్దేహపదేషు వస్తుషు
ప్రమాణ మన్తఃకరణ ప్రవృత్తయః॥ (శాకుం.1-19)

అని కవికులతిలకుఁడు కాళిదాసుఁడు. ఉభయభాషా కావ్య రచనాశోభితుఁడు నన్నయ యేమనుచున్నాఁడో చూడుడు.

'ఇది మునికన్యయేని యేలొకొ యీలలితాంగియందు నా
హృదయము సద్దయుం దవిలె నిప్పలు కింకను నమ్మనేర న
య్యెద విజితేంద్రియుం డనఁగ నిమ్మనిఁ బాయక యిందు, నంచుదా
నిది కలరూపెఱుంగ నవనీపతి యుత్సుకుఁడయ్యె నాత్మలోన్.
(ఆది. 4_30(

పై శ్లోకమునకు యథాతథానువాదము సేయకున్నను అభావము వ్యక్తపడునట్లు వ్రాసినాఁడని పద్యము నెత్తుగడయే చెప్పుచున్నది. ఈ రీతిగా అనువదింపఁ బడుచున్న గ్రంథమునందే కాక, తదితర కృతులనుండియు భావసౌకుమార్యమును గ్రహించి స్వకీయ కావ్యమున కూర్చుపద్ధతిని ప్రవేశపెట్టినవాఁడు సంహితాభ్యాసుఁడయిన నన్నయయే ! ఇంకను మాఘ కవీంద్రాదులనుండి భావములు గ్రహించి భారతమున చేర్చిని ఘట్టము లున్నవి. ఈమర్మము నెఱింగియే శ్రీనాథ రామరాజ భూషణాదులు సంస్కృత కావ్యసింధువుల నుండి మధుర భావనామణులను సహృదయ హృదయాహ్లాదకరముగా నలంకరించి యున్నారు.

౧౧. హాకారముతో పద్యారంభము :-

కరుణారస పరమావధిని సూచించుటకై 'హా' యని విలపించుచున్నట్లు పద్యనిర్మాణమును గావించినాఁడు లోకజ్ఞుఁడయిన నన్నయభట్టు. 'హా మహారాజ! మహామహీరక్షణ దక్ష దక్షిణ బాహుదండ!' ఇత్యాదిగ విలపించుచున్నది, మహాసాధ్వి దమయంతి. (చూ. అరణ్యా. 2-81). ఈ బాటను పయనించిన సోమయాజిగారు అభిమన్యు వదనమునకు తాళఁజాలని గాండీవి శోకము నిట్లు విన్పించుచున్నారు-

'హా! యను ధర్మరాజ తనయా యను నన్నడుఁబాయ నీకుఁ జ
న్నే యనుఁ దల్లి నేఁపఁ జనునే యనుఁ గృష్ణుఁడు వీఁడెవచ్చె రా
వే యను నొంటిపోవఁ దగవే యను నేగతిఁ బోవువాఁడనే
నో యభిమన్యుఁడా! యనుఁ బ్రియోక్తుల నుత్తరఁ దేర్పవే యనున్.
(ద్రోణ. 2-242)

ఇట్లే రావణ మరణము గూర్చి మండోదరి 'హా దనుజేంద్ర ! హా సుగుణాంతక! హా హృదయేశ!' ఇత్యాదిగా విలపించుటను పోతనగారు వ్రాసినారు [భాగ. 9-308]. మార్కండేయ పురాణాదుల యందు మారనాదులు ఈ పక్కిక ననుసరించిరి. ప్రబంధకవులీ బాణిని చాలమేరకు సాగఁదీసినారు. కరుణరస పరిపోషణలో మఱికొన్ని రస

వత్తర విన్యాసములు నన్నయగారు సృజించినారు. వానిని గూడ తిక్కనాదులు శిరసావహించినారు. విస్తరభయమున వివరింపకున్నాను.

౧౨. భగవన్నామస్మరణము :

సంతాపార్థమునందు 'హరిహరి, శివశివ' ఇత్యాదిగా భగవన్నామస్మరణ మొనర్చుట మన కలవాటు. ఈ లోక సాంప్రదాయమును కావ్యగతమును చేసిన గడుసరి మన నన్నయ.

ఓహో! యిమ్మెయి ధర్మ
ద్రోహోక్తులు వలుకఁదగునె దోసంబదిగా
దే! హరిహరి! మనమునఁ దగ
వూహింపక నన్నుఁబలుకు టుచితమె నీకున్? (అరణ్య. 1-364)

అని పలికినాఁ డర్జునుఁ డూర్వశీ కామోక్తులఁ నొల్లనివాఁడయి. ఈ రచనా సంప్రదాయము నవకాశము దొరికిన స్థలాలలో చాల మంది కవులు పాటించినారు. మచ్చునకొక ప్రయోగము - 'హరిహరి! సిరి యురమునఁగల హరిహరి హాయి కొలకు దనుజు నడుగం జనియెన్' అని పోతన వామనావతారమున నన్నయ ప్రయోగ స్వరూపమును చూపి విశిష్ట ప్రయోజనమును సాధించినాఁడు. (చూ. భాగ. 8-5౩౦). అసలు ఎత్తుగడలోనే 'హరిహరి' యనుట పోతన కవితాశిల్పపు నైపుణ్యమునకు చిహ్నము. సరే, అది వేఱే విషయము. 'ప్రకృత మనుసరామః'.

౧౩. మూలాతిశయ వస్తుస్వీకరణము :

శకుంతలోపాఖ్యానమున దుష్యంతుని సభలో శకుంతలనోట పుత్రగాత్ర పరిష్వంగ సౌఖ్యమును సత్ప్రతిభాభియోగ్యుఁడయిన నన్నయ హృద్యముగా విప్పిచెప్పుట జరగినది. ఈ సందర్భమునందు వ్యాసభారతము 'పుత్రస్పర్శాత్సుఖతర స్స్పర్శో లోకేన విద్యతే' అని మాత్రమే నుడివినది. [భార. ఆది. 74 అధ్యా.] [చూ. మధురా విజయము, 2 స. ౩8 శ్లోక వ్యాఖ్య]. కాని భట్టారకులవారు మూలమున లేని ముక్తాహార కర్పూరాది శీతల వస్తువులను స్వీకరించి, వ్యా

స్పర్శ సౌఖ్యమునకన్న పుత్త్రిగాత్ర పరిష్వంగ సౌఖ్యము మిన్నయని యపూర్వముగ భావించినారు. ఆ మనోజ్ఞ పద్యరాజ మిది-
'విపరీత ప్రతిభాష లేమిటికి సుర్వీనాథ' యీ పుత్త్రిగా
త్ర పరిష్వంగ సుఖంబు సేకొనుము ముక్తాహార కర్పూర సాం
ద్ర పరాగ ప్రసరంబుఁ జందనముఁ జంద్ర జ్యోత్స్నయుం బుత్త్రిగా
త్ర పరిష్వంగము నట్లు జీవులకు హృద్యంబే? కడున్ శీతమే ?
[ఆది. 4-90]

నన్నయ చూపిన యీ రమణీయ మార్గమున ననువాదకవు లందఱు పయనించినవారే! ఈ పుత్త్రిగాత్ర పరిష్వంగానందాను భూతిని గంగాదేవి యను కవయిత్రి తన మధురావిజయ కావ్యమున నిట్లు సంస్కృతీకరించినది -

'తథా న కర్పూర భరై ర్నహారై
ర్న చన్దనై ర్నాఽప్య మృతాంశుపాదైః।
యథాఽభవ న్నిర్వృత మస్యగాత్రం
సుతాఙ్గ సంస్పర్శభువా సుఖేన॥ [2 సం. 38 శ్లో.]

(ఆకుమారు నవయవస్పర్శమున నతఁ డనుభవించిన యానందము గర్పూరపరాగముల చేతఁ గాని, ముత్యాలహారముల చేతఁగాని, చంద్రకిరణముల చేతఁగాని మంచిగంధపు మైపూఁతలచేఁగాని యే నాఁడును దా ననుభవింపఁ డాయెను.)

౧౪. మకుట నిర్వాహణము :

అవిరళ జపహోమతత్పరుఁ డయిన నన్నయ కవీంద్రుఁడు 'ప్రసన్నుఁ డయ్యెడున్, ప్రసన్నులయ్యెడున్, ప్రసన్నుఁ డయ్యెడున్' అను రీతిని మకుటము నిర్మించిన పద్యములతో ఉదంకుని నాగస్తుతిని రచించినాఁడు. [చూ. ఆది. 1-104, 105, 106, 107]. ఈ రాజమార్గమున పయనించిన కవిరాజ శిఖామణి నన్నెచోఁడుడు సురగురునిచేత చేయించిన శంకరస్తుతిని 'దారిద్ర్య విద్రావణా!' అను మకుటముతో

పది పద్యములందు రచించినాఁడు. [చూ. కుమార. 10-90 నుండి 99 వఱకు.] తిక్కనకూడ మకుటముతో మూఁడు సీసపద్యములు నిర్మించి నాఁడు. కాని యవి స్తుతిపరమయినవి కావు. 'తన శరీరంబు దయ్యు టకు వెలుకం బాఱుటకుం గారణంబేమి?' యని ధర్మరా జడిగిన ప్రశ్న మునకు భీష్ముఁడొసఁగిన సమాధానమునకుఁ జెందినవి. 'వీనిలో నొక్కటఁ గార్శ్యపాండురతలు కలుగు ననఘ, వీని నొకట, గార్శ్య పాండురత్వంబులు కలుగు ననఘ' అని యీ మకుటము (చూ. అను. 4-383, 384, 386) కాని, యీ మూఁడు పద్దెములకు నడుమ రెండు చిన్న సంధివచనములు గలవు. అవి లేకున్న నే బాగుగా నుండెడిది. గట్టుప్రభువు తన యాజ్ఞవల్క్య చరిత్ర మను కృతి యందు మకుటా త్మకముగ సూర్యస్తుతి రచించెను. గాని, యది శ్లోకాత్మకము.

౧౫. యచ్ఛబ్దము నెత్తుగడ :

సంస్కృతమునందువలెనే యచ్ఛబ్దముల పద్యము నెత్తుగడ చేసి, తచ్ఛబ్దముతో పద్యము ముగింపునకు దిగుటను నేర్పిన కవిశిల్పి నన్నయ. ఉదాహరణ మీ క్రింది పద్దియము—

'ఏయది హృద్య మపూర్వం
బేయది యెద్దాని వినిన నెఱుక సమగ్రం
బై యుండు నఘనిబర్హ ణ
మేయది యక్కథయ వినఁగ నిష్టము మాకున్. (ఆది. 1-59)

ఇట్లే 'ఎందేని సర్వభూతేశుండు సృజియించె. సచరాచరము లైన జగములెల్ల' ఇత్యాది పద్యము నుదాహరణార్హము. [సభా. 1-9]. ఈ హృద్యపద్ధతి ననుకరించియే తిక్కన యీ క్రిందిపద్యమును నిర్మించినాఁడు—

'ఎవ్వఁడు సచరాచరగురుఁ
డెవ్వని నాభీసరోజ మీనె విధాతన్
నివ్వటిలు జగము లన్నియు
నెవ్వనిచే నమ్మకందు నెప్పుడుఁ గొలుతున్'. [శాంతి.4-218]

ఇట్లే 'ఎవ్వానివాకిట నిభమదపంకంబు, రాజభూషణ రజోరాజి నడఁగు' (విరాట. 2-191), 'ఎవ్వనిచే జనించు జగ మెవ్వని లోపల నుండు లీనమై' (భాగ. 8-73) మున్నగు పద్యము లనేకము లీకోవ లోనికి రాఁగలవు.

౧౬. అచ్చ తెనుఁగు సొబగులు :

ప్రప్రథముగ నన్నపార్యుఁడే సంపూర్ణాచ్ఛాంధ్ర పద్యమును నిర్మించి యనంతర కవులకు దారిచూపినాఁడు. జరాసంధ వృత్తాంత మందలి యొక పద్య ముదాహరింతును.

'యెత్తికొని చనంగ నిమ్మగునట్లుగా
మెదలుచున్న వ్రయ్య లదిమి రెంటిఁ
గూడఁబట్టె నవియుఁ గూడి యొండొంటితోఁ
జక్కనంటి రెండు నొక్కఁడయ్యె. [సభా. 1-147]

ఇట్టి వింకను గలవు. వీనిని గాంచియే తిక్కన యచ్చ తెనుఁగు పద్యములు చాల రచించినాఁడు. మచ్చున కొక్కటి కర్ణార్జున సమరములోనిది.

'మాటలు పెక్కాడితివి వీ
పోటుమగలు వినఁగ నింకఁబోవుటతగ దె
ప్పాట నదిగాక తమ్ముని
పాటును గన్నారఁ గంటి పాఱకు మింకన్. [విరాట. 5-89]

ఎఱ్ఱనగారి భారతమునుండి యొక చిన్ని పద్య ముదాహరింతును. ఇది సైంధవ పరాభవ ఘట్టములోనిది.

'వానిఁ జూచి నగుచు వార లోరోరి! యిం
కెందుఁ బోవవచ్చుఁ బంద! నిలువు
మిట్టికడిమి నమ్మియే ప్రల్లదంబులు
సేయఁ దొడఁగి తనుచు డాయుటయును. [అరణ్య. 6-245]

అలికంబున నక్షిని డాఁచినట్టి సర్వజ్ఞుఁడు సోమనాథుఁడు తన యుత్తర హరివంశమున రెండవ యాశ్వాసమున రెండు వృత్తములు,

ఒక సీసము అచ్చతెనుఁగున నిర్మించినాఁడు [చూ. 126, 171, 172.] పోతన శ్రీనాథాదులు కూడ నిట్టి పద్యములు రచించియున్నారు. వీని నన్నింటిని పరిశీలించి, తననాఁటికి పెరిఁగిన దేశ్యశబ్దజాలమును గ్రహించి పొన్నికంటి తెలగనార్యుఁడు తన యచ్చతెనుఁగు కబ్బమయిన యయాతి చరిత్రమును నిర్మించి యుండవచ్చు.

౧౭. యుక్తివైచిత్రి :

సద్వినుతావదావదాతచరితుఁ డయిన నన్నయ యీగుణమును పలు సంభాషణములయందు ప్రదర్శించినాఁడు. ఉదాహరణకు — కచ వియోగ దుఃఖిత యయిన దేవయాని కచునితో నిట్లనుచున్నది-

'నీవును బ్రహ్మచారివి వినీతుఁడ వేనును గన్యకన్ మహీ
దేవ కులావతంస! రవితేజ! వివాహము నీకు నాకు మున్
భావజశక్తినైన యది పన్నుగ నన్నుఁ బరిగ్రహింపు సం
జీవనితోడ శుక్రుదయఁ జేయుము నాకుఁ బ్రియంబు నావుడున్.

[ఆది. 3-129]

ఈవైచిత్రి ననుకరించియే శ్రీనాథుఁడు సుమనోహర హర విలాసమున నొక పద్యము నిర్మించినాఁడు. మాయా వటురూపమున నున్న శంకరుఁడు గౌరీదేవితో నిట్లనుచున్నాఁడు.

ఏనును బ్రహ్మచారిఁ దరళేక్షణ! నీవును గన్య వింతకా
లానకు నీకుఁ బెండ్లియ ఫలం బగునేని విచారమేల ? స
న్మానముతోడ నన్ను మునిమాన్య వివాహము గమ్ము లెమ్ముకా
దేనిఁ దపంబులోని సగమిచ్చెద మాను తపోఽభిమానమునన్.

[2-29]

నన్నయపాత్రము స్త్రీ. శ్రీనాథుని పాత్ర పురుషుఁడు. ఆమె దుఃఖితస్వాంతయై వచించినది. ఇతఁడు హాస్యధోరణిలో మాటాడి నాఁడు. దేవయాని ప్రయత్నము ఫలింపలేదు. గాని, కపట వటు నాటకము రక్తికెక్కినది. ఈ సందర్భమున మనము గమనింపవలసిన యంశమొకటి కలదు. నన్నయ కరుణరసోచితముగ సృజించిన రచనా

శిల్పపురూపు రేకలను శ్రీనాథుఁడు హాస్యధోరణికి మళ్ళించినాఁడు, మెప్పించినాఁడు కూడ. కవిసార్వభౌముని ప్రతిభాసాహసములకు ప్రతి సహృదయుడు జోహారులు పలుకక తప్పదు.

౧౮. మృదురీతిప్రశ్నము :

బ్రహ్మాండాది నానాపురాణ విజ్ఞాన నిరతుఁ డయిన నన్నయ సకలజీవిమనోవృత్తుల నర్థము చేసికొని యాయాపాత్రములను పలికించును. దీర్ఘతముని వృత్తాంతమున బలి యను రాజు దీర్ఘతమునితో ననుచున్న సరణిని గమనింపుఁడు-

ఎందుండి వచ్చి తిందుల
కెందుల కేఁగెదు మహామునీశ్వర! విద్వ
ద్వందిత! నాపుణ్యంబునఁ
జెందితి నిన్నిష్టఫలముఁ జెందినపాటన్. [ఆది. 4-231]

ఈ ప్రశ్న పద్ధతిలోని మృదురీతికిముగ్ధుఁడయిన తిక్కన నాడీజంఘుని చరిత్రమున రచించిన పద్యమును పరికింపుఁడు-

ఎందుండి యేమిపనికై
యెందుల కరిగెదవు భూసురేశ్వర! ప్రీతిం
బొందితి నినుఁగని తగియెడు
విందవయితి నాకు, నీదువిధముం జెపుమా! [శాంతి.3-479]

ఇంతేకాదు. విప్రప్రవరుఁడు ప్రవరుఁడు సిద్ధుని ప్రశ్నించుపద్ధతి నాంధ్ర కవితా పితామహుఁడెట్లు పొందుపఱచినాఁడో కనుఁడు-

ఎందుండి యెందుఁబోవుచు
నిందుల కేతెంచినార లిప్పుడు? విద్వ
ద్వందిత! నేఁడు గదా మ
న్మందిరము పవిత్రమయ్యె మాన్యుఁడనైతిన్. మను. (1-61)

గృహస్థు తన యతిథ్యభ్యాగతాదుల నేరీతి మృదురీతి ప్రశ్నింప వలయునో, పరీతినార్షధర్మము నవలంబింపవలయునో కాంతా

ఉదాహృత గ్రంథమాలిక :

1. ఆంధ్రమహాభారతము - కవిత్రయము.
2. ఆంధ్రమహాభాగవతము - పోతన.
3. అనిరుద్ధ చరిత్రము - అబ్బయామాత్యుఁడు.
4. కలాపూర్ణోదయము - సూరన.
5. కుమారసంభవము - నన్నెచోడుఁడు.
6. ఉత్తరహరివంశము - నాచనసోమన.
7. మధురావిజయము - గంగాదేవి.
[వ్యాఖ్యాత - పోతుకుచ్చి సుబ్రహ్మణ్యశాస్త్రి]
8. తాలాంకనందినీపరిణయము - వేంకట నరసింహాచార్యులు.
9. హరవిలాసము - శ్రీనాథుఁడు.
10. భీమఖండము - శ్రీనాథుఁడు.
11. నిర్వచనోత్తర రామాయణము - తిక్కన.
12. 'కుచేలోపాఖ్యానము - ఒక పరిశీలన'
పుయ్యూరు లక్ష్మీనరసింహారావు.
13. మనుచరిత్రము - పెద్దన.
14. అభిజ్ఞాన శాకుంతలము - కాళిదాసు.

సమాలోచన. 1-6-1984

# నన్నికవిద్వాయము

శ్రీ దేవరపల్లి వేంకటకృష్ణారెడ్డి

భారతి - అక్టోబరు, 1963 - లేఖలో శ్రీ వై. సీతారామ స్వామిగారు శ్రీ మహాంధ్ర భారతము కృతిపతిత్వము చర్చను ప్రారంభించుటయు, మార్చి 1963 భారతిలో శ్రీ పాటిబండ మాధవశర్మ గారు కొనసాగించుటయు జరిగినది.

నాకీ "రాజా, నారాయణాఖ్య, కరుణారససంపూర్ణ, - రాజ కులశేఖర, విష్ణుమూర్తీ!" అను వసంత తిలక పద్యమెట్లు చారిత్రక ముగా సమన్వయమగుచున్నదో తెలిసికోవలయునని జిజ్ఞాసకలిగి నాకు తోచిన యూహాను ప్రకటించడమైనది. చర్చ వివరము.

'రాజానారాయణ' పదమునందు నారాయణశబ్దము శ్రేష్ఠ వాచకమని సమాధానము చెప్పుకోవచ్చును. కాని, నారాయణాఖ్య అను సంబోధనములందు సమాసములేదు. రాజా సంబుద్ధి, నారాయణాఖ్యా సంబుద్ధి.

'రాజా' ఈ సంబోధనమువలన కృతి భర్త నారాయణాఖ్యుడని అర్థమగును మఱి రాజరాజు గతి ఏమి కావలెను? లేదా రాజరాజునకే నారాయణుడను పేరు కలదా? ఆయన విష్ణువర్ధనుడు కదా! అందలి విష్ణు పదమునకు నారాయణ శబ్దము పర్యాయ పదమా? ఇట్టి సంశయములు కలుగుచున్నవి.

'ఈ సంశయములకు పరిష్కారము దొరకుట సులభ సాధ్యము కాదు.'

'పండితులీ విషయమును చర్చింతురను నాశతో నీ లేఖ వ్రాయుచున్నాను.'

అని శ్రీ వై. సీతారామస్వామిగారి జిజ్ఞాస. ఇక సమాధానము.

'రాజరాజును 'రాజా' యని సంబోధించుటయు 'రాజ నారాయణ' బిరుదమును 'రాజనారాయణ' యని దీర్ఘ జకారముతో

ప్రయోగించుట నన్నయగారు చేసిన పనులు కావని చెప్పవలసి యున్నది.

'పాదాంతస్థ లఘువునకుఁ బాక్షిక గురుత్వము తెలుగు ఛంద స్సంప్రదాయ మంగీకరింపలేదు. కాని, సంస్కృతము నందు దానిని ['గంతే' యని] పింగళముని మొదలుకొని ఛాందసికు లందరు నంగీక రించిరి. కాని. క్రమముగ దాని ప్రయోగము సంకుచితము గావించిరి.

'ప్రసక్తమైన వసంత తిలకముయొక్క ద్వితీయ పాదాంత మందలి 'జా' వర్ణము ['రాజ నారాయణాఖ్య'] దీర్ఘము కాదనియు హ్రస్వమే యనియు నాకుఁ దోఁచుచున్నది.

"నన్నయగారికిఁ బూర్వము తెలుఁగున ఛందశ్శాస్త్రము లున్నట్లు కనఁబడదు. మల్లియ రేచనయు నన్నయకు సమకాలికుఁడో, అర్వాచీనుఁడో యగదగినవాఁడే."

'అనంతర కవులందు గానరాని విలక్షణ ప్రయోగములు-ఛందో వ్యాకరణ సంబంధులు - పెక్కు నన్నయగారి రచనయందు గలవు. అట్టివానిలో నిదియొకటి యనుకొన్నచో భారతకర్తృత్వము సంశయ గ్రస్తము కావలసినంతటి ప్రమాదము తటస్థింపదనుకొందును...... చిన్నయ సూరినిఁ బ్రమాణీకరించి యీమహాకవికి ద్రోహము తలపెట్ట వలదని యాంధ్ర మహాజనులకు విన్నవించుకొనుచున్నాడను.

అ. శ్రీ పాటిబండ మాధవశర్మగారు ఛందోభంగవిశిష్టతను ప్రతిపాదించినట్లు పూర్వచర్చ తెలుపుచున్నది.

నాకీ వసంత తిలక ఛందస్సులో ఛందోలోపమున్నట్లు తోచ లేదు. 'ప్రసన్న కథాకవితార్థయుక్తిలో నారసి మేలునా, నితరులక్షర రమ్యత నాదరింప నానా రుచిరార్థ సూక్తినిధి నన్నయ భట్టు తెనుం గునన్' కొన్నిచోట్ల కొత్తపోకడలో పోయినట్లు కనబడుచున్నది.

"......భారతఘోర రణంబునందు నారాయణునట్లు"-'నారా యణభట్టు'... తన కిష్టుఁడున్ సహాధ్యాయుఁడు నైనఁ వాఁ డభిమత

స్థితిఁ దోడయి నిర్వహింపగాన్......... నానారుచిరార్థ సూక్తినిధి నన్నయభట్టు తెనుంగునన్ మహాభారత సంహితా రచన బంధురుఁ డయ్యె జగద్ధితంబుగాన్'.

కొన్ని తాటియాకు ప్రతులలో పై రెండు పద్యములలో మొదటి 'భారత ఘోర రణ' పద్యములేదు. కాబట్టి, అది ప్రక్షిప్త మనువాదము కూడ కలదు. ఇది భ్రమ.

క్రీ.శ. 1053 తేదీ నన్నయభట్టు వ్రాసిన రాజరాజనరేంద్రుని నన్ని నారాయణభట్టు దానచరిత్రి-నందంపూడి దాన శాసనచరిత్రకీ 'నారాయణభట్టు తోడయి నిర్వహించి' నాడన్న [భారత పీఠిక] సహాధ్యాయచరిత్ర వ్యతిరేకమైనదికాదు. అట్లే, ఆశ్వాసాంత పద్యము కూడ వ్యతిరేక చరిత్రికలది కాదనిపించుచున్నది. పద్యసంబోధనల లోని అక్షర రమ్యతకిది యొక లక్ష్యము.

"రాజా, నారాయణాఖ్య - కరుణారసపూర్ణ!"

ఇట్లే అక్షరరమ్యతయుక్తిని గ్రహింపవీలున్నచో రుచిరార్థ శ్లేషచరిత్ర గోచరించును. కానిచో, అంతా రామమయం, అన్నట్లుగా సందేహమయంగా గోచరించును.

"నారాయణాఖ్య కలియందు పూర్ణకరుణారసదృష్టి కలవాడా, ఓ రాజా !"

అను తోడు కవి కర్తృత్వ చిహ్నము వసంతకోకిలలో మిగు రించును.

'తన కీస్తుడున్ సహాధ్యాయియునైన వాఁడభిమతస్థితి, దోడయి నిర్వహింపగన్, నన్నయభట్టు తెనుంగునన్ మహాభారత సంహితా రచన బంధురుఁడయ్యె' ననుట ముమ్మాటికి సత్యము.

తెనుగు కవులలో తోడు కవులను వాచ్యముగా పేర్కొన్న కవులు తొలి ఛందోకర్త రేచనయు, తొలి పురాణకర్త నన్నయ భట్టును మాత్రమే ధ్రువతారలై వెలుగొందుచున్నారు.

ఆశ్వాసాంత పద్యములో నారాయణభట్టు పద్యమున్నట్లే, ఆశ్వాసాంత పద్యములో భీమ తనూజుని (దానార్ణవ చాళుక్యరాజు-ఛందోరూపమున దేశికవిత బుట్టించిన - జిన చాళుక్యరాజు) పద్యము కూడ కలదు.

జననుత భీమ తనూజా,
సునయార్పిద విభవ తేజ,
సుభగ మనోజా
వినుత విశిష్ట సమాజా.
యన నంత్యప్రాస మగున
పార్వతి తేజా. - సంజ్ఞాధికారము.

భారతపీఠికలో త్రోడు కవి చరిత్ర చెప్పినట్లే కవిజనాశ్రయము పీఠికలో కూడ తోడు కవి చరిత్ర చెప్పబడినది.

'...దావ వాచకాభరణుఁడు ['భీమనాగసుతుఁడు] ప్రాణ సమానమిత్రుఁడీ కృతికి సహాయుఁడుగా [ప్రీతిన్] మల్లియ రేచన ఛందము తెనుగుబాస నరుదుగఁ జెప్పెన్.

ఇట్టి జంటకవులు తెలుగు భాషలో క్రీ.శ. 10 వ శతాబ్దాంతము నుండి కలరనుటకీ చర్చ తార్కాణమగునో, కాదో విజ్ఞులాలోచింతురు గాక.

జైన కావ్యము తెనుగులో మొదట పుట్టినదనుట వైదిక యనుకరణ సాదృశ్యము తార్కాణమన వీలున్నది.

నన్ని నారాయణా-నన్నియభట్టులను నన్ని కవిద్వయ మన్నట్లే-నన్నిచోడుని చేర్చి నన్ని కవిత్రియ మనుట క్రీ.శ. 11 వ శతాబ్ది కావ్యచరిత్ర కాకపోదు కద !

భారతి. ఏప్రిల్; 1964

# నలదౌత్యము-నన్నయ శ్రీనాథుల శిల్పము

శ్రీ కాజ లక్ష్మీనరసింహారావు

ఒక కవి తీసుకొన్న యితివృత్తాన్నే మరొకకవి తీసుకోవచ్చును. ఆ కవి వాడిన పదజాలాన్నే యీతడూ వాడవచ్చు. ఆతడుపయోగించిన వృత్తమే యితడు ఉపయోగించవచ్చు. శబ్దము అదే అయినా, వృత్తాలు అవే అయినా నిర్వాహణలో ఆ యిరువురికి ఒకానొక అంతరువు కన్పిస్తుంది. ఆ శబ్దాల కూర్పు, ఆ సమాసాల బిగింపు తత్సన్నివేశౌచిత్యమైన ఏ కవి కాకవికే విలక్షణ నిస్తుంది. ఆ విలక్షణత ఆకవికి చర్మమెలాంటిదో అలాంటిది ఈ వ్యాసములో నన్నయ, శ్రీనాథుల నలదౌత్య కథా శిల్ప వైలక్ష్యణ్యాన్ని వివరిస్తాను.

నల దమయంతుల కథను నన్నయ ఉపాఖ్యానంగా రచించాడు. శ్రీనాథుడు ప్రధానేతివృత్తముగా రచించినాడు. పూర్వకథకు, అనంతరకథకు నలునిదౌత్యము సేతువు లాటిది. నలుని జీవితము విలక్షణమైనది. అతడు షట్చక్రవర్తులందు ఒకడు. దేవతల కొరకు దమయంతి దగ్గరకు రాయబారిగా పోయినాడు. ఇక్కడ నన్నయ్యలాగే శ్రీనాథుడు ఒక ప్రణాళిక ఏర్పరచుకొన్నాడు. కావ్యములోగాని, నాటకములోగాని ఒక పాత్ర వైశిష్ట్యాన్ని గుర్తించటానికి ఆ పాత్ర స్వయముగా ఏ సందర్భములో ఏమి పలికినదీ, ఆ పాత్రచేసే చేష్టలూ, ఆ పాత్ర గురించి యేసందర్భములో ఏ యితరపాత్ర లేమన్నది కూడ తెలియాలి. నాటకములోవలె కాకుండా కావ్యాలలో ఈ విషయాలు శబ్దప్రయోగము ద్వారా తెలియును. ఒక శబ్దము సాధారణకవి ప్రయోగములోకన్న మహాకవి ప్రయోగములో లోతైన అర్థాన్నిస్తుంది. నిరంతర కావ్యానుశీలనమే ఈలాటికవి గ్రంథగత విశేషాలను మనస్సులో పట్టియిస్తుంది.

నలుడు దమయంతి అంతఃపురములోనికి ప్రవేశించినాడు. శాంబరీ విద్యామహిమచేత ప్రవేశించినాడు. అతనికి దమయంతి దృగ్గోచర

అయినది. ఇది నలదమయంతుల ప్రథమ సమావేశము. నలుని దౌత్యము చిత్రమయిన దన్నాను. తనను దమయంతి, దమయంతిని తాను గాఢముగా ప్రేమించుట జరిగినది. ఆ దమయంతిని దేవతలు కోరగా అంగీకరించి నలుడు రాయబారిగా పోయెను.

"జవనిక వాయుందట్టిన" నలునకు దమయంతి కన్పించింది. ఇక్కడ నన్నయ్యగారొక పద్యము వ్రాసిరి. శ్రీనాథుడొక వచనము వ్రాశాడు. నన్నయ్య, శ్రీనాథుల పద్య గద్యాలలో భావము దాదాపు ఒకటే. అయితే ఒకానొక విశిష్టమయిన అర్థాంతరము నన్నయ్య రచనలో ఉన్నది. దమయంతి నలునిచూచి "చంద్రుండో, ఉపేంద్రుండో, కందర్పుడో, జయంతుడో" అని సందేహించినది. అని నైషధకారుడు వ్రాశాడు. ఇంకా దమయంతి నలునితో అన్నమాటలు "విలుడవో! విలువిలు కూర్మి గాంత్మజుడవో, పంచబాణుండవో, దేవపతి సుతుడవో" ఇవి గుర్తింపదగ్గవి. దమయంతి చూచిన సంవర్ణనను నన్నయ ఇలాచేశాడు.

"దమయంతి మనోభవ నిభు,
సమరేంద్ర ప్రతిమ దినకరాభు సుధారుక్
సము, వరుణ సదృశు, ధనదో
పము నశ్వి సమాను నిషధ పతిఁజూచి నలున్"

శ్రీనాథుడు చెప్పిన మాటలలో ఇంద్రాదుల ప్రశస్తిలేదు. దమయంతి నలుని మన్మథునిగా, జయంతునిగా ఇలా మాత్రమే తలచినది. అనగా తనకోరకు ఇంద్రాదులు దిగివత్తురని ఆమె ఆశ్చర్యముగానైన తలపోయదన్న భావము ఇట్లు చెప్పుట యయినది. నన్నయ ఇట్లు చేయలేదు. దమయంతి ఇంద్రాదులను వరించకపోవచ్చు. ఆమె వరించే నలుడు చక్రవర్తి. అంటే అష్టదిక్పాలకుల అంశకలవాడు. నలుడు ఇంద్రాదులకన్న గొప్పవాడని దమయంతి భావన. ఇంద్రునిలో ఒక్క యింద్రత్వమే ఉన్నది. వరుణుడూ అంతే. ఇట్లే మిగిలిన దేవతలలోకూడ దేవాంతర లక్షణములేదు. మరి నలుడో "మనోభవ

అందుకు ప్రవృత్తి అంటే జ్ఞానము. అంతఃకరణమందు జ్ఞాపకశక్తి, ఇది మనస్సులో ఉంటుంది. దమయంతి యింతకుముందు నలుని భౌతిక మయినది భౌమమయినది అగు ఆకారము ప్రత్యక్షముగా చూడలేదు. నలుడూ అంతే. ఈ యిరువురి ఆకృతులు హంసవలన వారివారి అంతః కరణాలలో ఉన్నవి. ఒకసారి వ్యక్తిగతముగా నలదమయంతులు చూచి నట్లయితే మనస్సు ఇప్పుడు తెలియబర్చగలిగేది. కాని అలా జరగ లేదు. హంసగూడ నలునిగూర్చి దమయంతి అంతఃకరణాలో ఒకానొక ప్రవృత్తిని కలిగించి అక్కడ దమయంతిని గూర్చి నలుని అంతఃకరణాలో ఇలాగే జేసింది. దమయంతి మనస్సులో ఇతడు నలుడా! కాడా! అన్న వికల్ప ఏర్పడినది. కాని అంతఃకరణాలో అతడు నలుడేనన్న ప్రవృత్తి ఏర్పడినది అందుకే దమయంతి నలునిపై ఆగ్రహింపలేదు, బంధింపలేదు. అతడు ఎవరో తెలియకపోయినా సంభావించి నలుని రూపు నీయందు గానవచ్చుచున్నదన్నది. ఇది అంతఃకరణము నుండి వచ్చిన జ్ఞానము. ఈ జ్ఞానముయొక్క పరిపూర్ణత మరల హంస వచ్చి నపుడు జరిగింది. ఈ హంస పరమయినది పరమహంసస్థితిలో అంతః కరణ ప్రవృత్తి పరిపూర్ణత నందుతుందని ఇందులో తాత్పర్యము. ఇది ప్రతిభాపూర్వకమైన వ్యాఖ్య.

తన యెదుట నిలచినవానిని "నిషధరాజని యెఱింగియు, మిగుల విశ్వసింపక ... (శృంగార నైషధము) నిషధరాజని యెఱుంగుట అంతః కరణప్రవృత్తి, మిగుల విశ్వసింపకుండుట మనస్సు సంబంధి. నిషధరాజు కాడని యేల అనుకొన్నది? మఱొకడేల కాడనుకోలేదు. అతడెవరో తెలియనప్పుడు- ఇతడు నిషధరాజు అని యెఱుంగుట మనోఽంతర మయిన ఒక విలక్షణాంతఃకరణ శక్తి.

దేవతలు పంపిన రాయభారము కావున నలుడు అంగీకరింప వచ్చును. పరిస్థితి యిది కాదు. నలుడు తానాస్త్రీని, ఆస్త్రీ తనను ప్రేమించుట జరిగినది.

గీ॥ ధరణి నొప్పుచున్న దమయంతి

యున్నవార, మీ వృమమ్మ వారిజాక్షికి
నెఱిఁగింపు నామధేయ కీర్తనముల. [భరత. అరణ్య.]

అట్లయిన నకోౕమలి మాయందు దన వలచినవానిని వరియించు నటన... మాయందు ఒక్కరుని దమయంతి వరించును. అది యింద్రుని మాట. ఒక్కరుని వరించినచో ఇతరులును ప్రియపడుదురట. ఇది యెట్లా? దమయంతి తననే వరించును అను ఆశతో ఇంద్రాదులు ప్రతియొక్కరు వచ్చిరి. మనస్సులో ఎవనికివాడే తాను దమయంతికి తగిన వరుడనని తలంచెను. దమయంతి అందఱను ప్రియపడునట్లు చేయవలెనన్నచో వారెవ్వరిని పెండ్లియాడకుండుట. ఇది దమయంతి నిశ్చయము. దేవతల ప్రార్థనాధీనమయిన ఆదేశమున నలుడంగీకరించి నాడు. నలుడీ రాయబారము నెట్లంగీకరింపగలిగెను? దేవతలు-ఏస్త్రీని నలుడు ప్రేమించెనో, ఆస్త్రీని తమకై ఒప్పింపుమనిరి. నలుడు సరే నన్నాడు. దమయంతిపై నలునకు అంతప్రేమ లేదా? లేదా దమ యంతి ఎట్లును దేవతల నంగీకరింపదు. గావున తానుదూతయై చనినను నష్టము లేదని పోయెనా? "నిత్య సత్య వ్రత నిషధేశ! నీవు మాకమరంగ దూతవై యభిమతంబు సేయు"మని దేవతలనిరి. [భారతము] ఇప్పుడు నలుడు దూతయై దమయంతిని దేవతలను పెండ్లియాడుటకు ఒప్పింప లేనిచో మిథ్యాప్రతిజ్ఞుడగును. తన ప్రియుని వాక్కునకాలాటి అప్రతిష్ఠ సహింపక దమయంతి నలుని దూత్యము నంగీకరించినచో ఆమెది నల్లునిపై మిథ్యా ప్రేమయని తేలును. మఱి నలుడు దూత్యము నేల అంగీకరించెను? దమయంతిని ఒప్పించి మీకు పెండ్లి గావింతుననినాడు. తానామెను ప్రేమించెను కదా?

దేవతలు తెలివిగలవారు. వారి యథార్థస్తుతులకు నలుడు మందస్మితము చేసినాడు. "నీ యందు నైషధుడను బుద్ధి మాకు బొడమినది, మీ తండ్రి వీరసేనుడు మాకు చెలికాడు.. ఏల పెక్కు మాటలర్థులైవచ్చితిమి మము-నాదరింపు"మని వారన్నారు. [శ్రీం.

నైషధము] "భూమిలో దమయంతీ స్వయంవరము జరుగుచున్నది. నీవు పోయి మాయందొక్కరుని వరించునట్లు జేయుము." [భారతము] అతని నుండి ప్రతిసమాధానము తెలియకరసే దేవతలు "ఆ యుధీయ సంరక్షితంబైన రాజగృహము..." చొరనుపాయము చెప్పిరి. నన్నయ్యగారి వాక్కులోని సూటిదన మిట్లుండును. నలుడు ప్రతి సమాధానము చెప్పమియే అతని అంగీకార సూచి యని దేవతలు గ్రహించినారు. శ్రీనాథుని రచనలోని గడుసుదనము, చమత్కృతియు నలు దేవతల సంభాషణలో ఉన్నది. త్రిదశులు దుర్లభమయిన వాంఛ తీర్చుటకు తనను కోరగా నలుఁడానందపడినాడు. ఇక్కడే చిక్కిపోయి నాడును. "అడిగినప్పుడు ఇత్తునే ప్రాణమైన, అట్టియే నింద్రునంత వాఁడాసపడిన నకట యేమిచ్చి పరితోషమందువాఁడ" అనుకొన్నాడు. [శృం. నై] పర్వత నారదులవలన నలుడు దమయంతిని ఎంతగా ప్రేమించినాడో దేవత లెఱుగుదురు. నలు డెఱిగియుండికూడా "ప్రాణంబుకంటె భీమ, క్షోణీశతనూజ మీఁదఁ గూర్మి కలదు. గీ ర్వాణాధీశ్వరుఁ డయ్యలి వేణిన్ మదిఁ గోరెనేని వేగమయిత్తున్" అని దేవతలతో అన్నాడు. దీనిని బట్టి నలుడు దమయంతిని దేవతలకిచ్చు టకు సిద్ధపడినాడు అని తెలుస్తుంది. ఇంకనూ దేవతలు దమయంతీ గతవాంఛను నలునితో చెప్పలేదు. నలుడే ముందుగా అన్నట్లున్నది. నలుఁడే ముందుగా మాట అనటము ఇంద్రునికి పని సులువయింది. "ఓ మిహికాంశువంశ కలశోదధి కౌస్తుభరత్న! భూపతిగ్రామణి! యస్మదీయమగు కాంక్షితమున్ విను, భీమపుత్రిపై గామనసేసి వచ్చితిమి [శృం. నై]. ఈ సంబుద్ధిలోని వైచిత్రి అదొక విలక్షణ మైనది. ఈ పద్యానికి ముందొక వచనమున్నది. "నాయందు మీరపే క్షించిన ప్రయోజనం బానతిండు. ప్రాణంబైనను, ప్రాణాధికంబైనను అది యెట్టి పదార్థంబైనను నిచ్చెద" అన్నాడు. [శృం. నై.] ఇట రెండు మాటలున్నవి. "ప్రాణము ప్రాణాధికము" ప్రాణమనగా తన [నలుని] ప్రాణము. ప్రాణాధికమనగా నేది? "ప్రాణంబుకంటె భీమ

క్షోణీశతనూజ,... అని పై చెప్పిన పద్యములో ఉన్నది. భీమక్షోణీశ తనూజయే యీ ప్రాణాధికము.

ఇలా రెండుసార్లు తన ప్రాణాధికమయినదానిని దేవతలకు ఇస్తానని నలుడన్నాడు. ఇట్లు ఎందుకన్నాడు? దమయంతీ గతమయిన తన ప్రేమ గాఢముకాదా? నలుడు దమయంతిని ప్రేమించినంత గాఢముఁగా ఇతరులను ప్రేమించలేదనే విషయం తనకు "ప్రాణంబుకంటె భీమక్షోణీశ తనూజ" ప్రాణాధికము అనటములో స్పష్టమవుతుంది. అట్టి దానిని తానుగా త్యాగముచేయుదునని నలుడేల అనెను? ఇట దేవతలు విలక్షణాకృతులు. వారి కోరిక విలక్షణమయినది. "నీవు మమ్ము వారిజాక్షికి నెఱిగింపు. మాయందుఁ దన వలచినవాని వరియించు [భారతము], అన్నారు. ఇది విని నలుడు ఆఘాతపడెను. పడి యీలా దేవతలతో అన్నాడు. మీ రివ్విధంబున యీనతిచ్చిన నేమి యనంగలను? ఏ నయ్యంగనం గోరి వరియింపం బోవుచున్నాడ అమ్మచ్చకంటికిం గుఁటెనంతనం బెట్లు సేయనేర్తు?" [శృం. నై.] ఇక్కడ ఒక విషయము పర్యాలోచింపవలెను. ఒక భాషలోని భాగవతమైన శక్తి తద్భాషా నిత్యవ్యవహారగతమైన సామాన్య పదాలలోనూ ఉంటుంది. "నాకది వద్దులే, నాకసలే వద్దు" ఈ రెండు వాక్యాలలో అర్థభేదముంది. ఇద్దరు మిత్రులు ఒకసారి మాటలాడుచున్నారు. ఒకడన్నాడు, నేనీ పని చేసితిని, నేనీపని కోరి చేసితిని". ఈ రెండవ వాక్యంలో క్రియా వాచకము "కోరి" అనే స్వార్థకముచే అత్యంతస్వార్థము, మమతలను ధ్వన్యమానం చేస్తుంది. ఏనయ్యంగనను కోరి వరియింప బోవుచున్నాడనని నలుడనుచున్నాడనగా "ఏ నయ్యంగనను వరియింపబోవుచున్నా" నన్నదానికన్న ఒకానొక మమకారము, స్వార్థము, ధ్వనిస్తాయి. ఇది తెలుగుభాషా జీవలక్షణము.

నలుడు దమయంతిని ఎంతో గాఢముగా ప్రేమించినాడు. దేవతల కత్యంత ప్రీతిని చేకూరుస్తానని నలుడు అనదలచుకొన్నాడు. తన మనుయిపది దమయంతియే. అదియైనా ఇస్తాననడము ఎంతకష్టమయిన

కార్యమయినా చేస్తాననటానికి ఉపలక్షణము. ఇంతకూ దేవతలు దమయంతిని వాంఛించు తారని నలుడు తలపోయలేదు. తాను ఒక ఉద్దేశంతో ప్రాణాధికమైనా ఇస్తాననడము, దేవతల కాసరా అయినది. వారా దమయంతిని ఒప్పించమన్నారు. నలుడు పడిన మొగమాటపు ఫలితమది. తానన్నమాటకు కట్టుబడి రాయబార మంగీకరించినాడు. ఈ విధంగా మహాకవిని కావ్యగత శబ్దానుశీలన ద్వారా తెలియుట అతి ముఖ్యము. దేవతల ఆదేశానుసారముగా నలుడు దమయంతి అంతఃపుర ప్రవేశం చేశాడు. నన్నయ్యగారీ ఘట్టంలో రమణీయ శిల్పాన్ని ఎలా ప్రదర్శించారో వివరిస్తాను. తాను 'బృందారకమూర్తి' ఈ విశేషణ ప్రయోజనము పైన వివరించాను. ప్రవేశించిన నలుని జూచి దమయంతి అతనితో ఇలా అన్నది. "నాకు మనోజవేదనా వివర్ధనుండవైన నీ తెఱంగెఱిగింపుము." ఈ మాటలే దమయంతి నలుని చూచిన తొలిసారి అన్నమాటలు. ఇక్కడ దమయంతీ హృద్గతమైన ఒకానొక ప్రేమ, శృంగార భావప్రకటన ప్రసన్నమగును. అయితే అదేనని అనుకోకుండ ఒక తత్తరపాటు కూడ భాసిస్తుంది. అసలు ప్రేమకు దైన్యము జాలి ఉద్దీపన లక్షణాలవుతవి. "ఆ యుధీయ సంరక్షితమైన నా అంతఃపుర ప్రవేశము ఎట్లా చేయగలిగావు— అనే సందేహము దమయంతి వెలిబుచ్చుతూ "నా మనస్సులో పుట్టిన వేదనకు సమాధానము చెప్పుమన్నది. "నాకు మనోవేదనా వివర్ధనుండ వయితివి" అన్నను ఈ భావం స్ఫురిస్తుంది. నన్నయ్యగారు— "మనోజవేదనా వివర్ధనుండవయితివి" అన్నారు. పరపురుషుడెవరు వచ్చినా దమయంతికి మనోవేదన కలుగుతుంది. కాని యతడో తన ప్రియుడు. అందువలన దమయంతికి "మనోజ [మన్మథ] వేదన కూడా కలిగింది. ఇలా ఒక పాత్రకు జీవలక్షణ లక్షితమయిన పద ప్రయోగము చేయడము "నన్నయగారు పెట్టినాడు గదా భిక్ష".

ఈ సందర్భాన్ని శ్రీనాథుడు మఱొకలాగు చిత్రించాడు. ఇక్కడ నలదమయంతుల పరస్పర వాక్ప్రసంగములో దమయంతి "చిత్ర

వాక్యరచనాచణత్వమేమో' చూపాడు. కొందఱు విమర్శకులు దమయంతి ఏ సందర్భములో ఏమి మాట్లాడినా అది చిత్రవాక్యరచనాచణత్వమేనని తాను పరిశోధించినట్లు విద్యాలయములలో బోధించుచున్నారు. అది సరిగాదని మనవి. ఒక సందర్భములో ఒక పాత్ర కొన్నిమాటలు పలుకును. కొన్ని చేష్టలు చేయును. ఆ మాటలు ఆ చేష్టలు అన్వయించి పౌర్వాపర్య విచారణచేసి అందలి నిగ్గు తేల్చి ఔచితిమంతముగా విమర్శించినచో అది విమర్శ. నలుడు దమయంతికి అతిథిగా వచ్చెను. దమయంతి అతనిని "ఆతిథేయుల కభినవాయాతుండైన అతిథిగా స్వీకరించినది. ఇక్కడ ఎత్తుగడలోనే దమయంతి వాక్కులో గడుసుదనమునకు తగినట్లు నలుడు అన్నాడు. "ఏనుదిక్పతుల ఆస్థానంబు నందుండి యరుగుదెంచితి నీకు నతిథినగుచు." ఒకరి యాస్థానమునుండి మరొకరి యాస్థానమునకు పోవువాడెట్టివాడయి యుండును. దూతగాని రాయబారి గాని కావలెను. మరి నలుడు తాను దూత ననిగాని, రాయబారిననిగాని అనక అతిథిని అని ఏల అనినాడు? అతడు దమయంతి కడ చేయునది ఆతిథ్య స్వీకరణగాదు, రాయబారము. అట్లగుట శ్రీనాథు డిట్లేల ప్రయోగించెను. ఇక్కడ ఆయువు పట్టున్నది, రాయబారిచేయు దౌత్యము నిరాకృతము కావచ్చును. తప్పులేదు. అతిథియై వచ్చినవాని పని కాకపోయినచో ఆ అతిథిని అదరించువానికి పాపమగును. అందుచే నలుడు - దమయంతి- అతిథ్యము స్వీకరించి, తాను దేవతల రాయబారపు పనిని - ఆమెను చేయు - మని కోరును - ఆమెకు చేయక తప్పదు. దమయంతి కీవిషయము తెలియదు. తనకతిథిగా వచ్చితినని అతనిని ఆదరిరించినది. అదియే నలునకు ఆసరా అయినది. ఇది భావోపలక్షణమని యనవలెను.

దమయంతి ప్రసంగమునందు 'చిత్రవాక్యరచనా చణత్వమున్నదని శ్రీనాథుడన్నాడు' అది ఆమె నోరువిప్పి మొదలిడిన తొలి సీసము నందే యున్నది. ఆ రచనా చణత్వమేమో కొంత వివరింతును.

సీ॥ "ప్రణత మౌళిమణి ప్రభానికాయంబుతో
పానీయమున నర్ఘ్యపాద్య మొసఁగి
అత్యంత మధుర వాక్య ప్రపంచములతో,
శర్కరాదుల మధుపర్క మీఁగి
ప్రవిమలంబైన సద్భావ వైభవముతోఁ
బృథుల కాంచన రత్నపీఠమీఁగి,
పరమసేవా విధా విరచితాంజలి తోడఁ
బ్రముదితంబగు మనఃపద్మ మీఁగి."

ఈపయి నాల్గు పాదములందు 'ఈఁగి' అనేక్త్వార్థమున్నది. పాఠకుఁడే చరణాలు చదువుచు దమయంతి నలునకు అర్ఘ్యపాద్యము లిచ్చినట్లు, కాంచన రత్నపీఠ మిచ్చినట్లు భావించును. చివరిదాక యట్టి భావనే యుండును కాని యెత్తు చివర దమయంతి యట్లు అన్నది. "ఈ చెప్పినవన్నియు అతి లఘుచేయు సంత్కారము సుమా" అని. అంతేగాని అవి నలునకీయలేదు. ఇది చిత్రవాక్య రచనాచణత.

అంతఃపురములోనికి నలుఁడు తెలియకుండ ప్రవేశించినాడు. ఇట్లే దమయంతి అతనిని చమత్కరింపఁదలచి "అనఘ యిదే హేమ రత్న సింహాసనంబు ఇచ్చగలచేని కూర్చుండు మిందువచ్చి" అన్నది. నలుడు అట్లు చేయలేదు. అక్కడ సింహాసనము లేదు. ఏమియులేదు. దమయంతి గడుసుదనమున్నది. కొంతసేపు నలునితో భాషించి యనం తరము నిజముగా సింహాసనము తెప్పించినది. "అనంతరంబ దమయంతీ శాసనంబున సఖీజనంబు కనకాసనంబు వెట్టిన" అతడు కూర్చొనినాడు. ఇప్పుడు ఆశీనుడగుటకు కారణము సింహాసనము ప్రాత్యక్షికమగుటయే. ఇట్లు దమయంతి వాగ్నైపుణి తెలుస్తుంది. అంతయు ఎక్కడ వివరింతును.

నలుడు తావచ్చిన కార్యక్రమమును అతిరమణీయముగా ఎత్తు కొనినాడు. దూత్యారంభమున శ్రీనాథుడు ఒక కందము వ్రాసినాడు. అంటే దేవతల మనోభావాన్ని సూక్ష్మంగా చెప్పాడన్నమాట. ఇలా

వ్రాయటం ఒక మహాకవిత్వ రహస్యము దీనిని నన్నయ్యగారు లెస్సగా పాటింతురు.

కం॥ నాకౌకః ప్రవరులు ని
న్నాకాంక్షించిన ప్రయోజనాంశము తిరమై. (శృ. నై.)

ఆకర్ణింపుము చెప్పెద... అని నలుని మాట. నాకమనగా నేమి? స్వర్గము. అనగా దుఃఖరహితమయినది. ఇది స్వర్గవస్తు సంపన్నతతో కలుగు స్థితి. అనగా స్వర్గజీవులు నిర్వికారులు. వారి కే కాంక్షయు నుండదు. అట్టివారిలో ప్రవరులు అనగా నింద్రాదులు అనగా సౌఖ్య పతాక నిందినవారు, వారు "నిన్ను ఆకాంక్షించుచున్నారు" అన్నాడు నలుడు. అంటే దేవతలు దుఃఖభాజనులగుచున్నారు--వారికీ విషయము విపరీతమయినదని వ్యంజితమయినది.

ఇంద్రాది దేవతలందఱు దమయంతి స్వయం వరానికై వచ్చారు. ప్రతి ఒక్కరు దమయంతిని పరిణయమాడాలని వచ్చారు. అందరు కలసియే వచ్చిరి. వారిభావనలో ఏకవాక్యత ఉన్నది. ఈ విషయాన్ని ధ్వనింపజేయుటకు మహాకవి శబ్దాన్వర్థత కలకవి యనుస రించే పద్ధతి విలక్షణమయినది. "పాకశాసన పావక, పరేత రాజ, పాశ పాణులు పుత్తెరఁ బనిపూని వచ్చితి"నని నలుడు దమయంతితో అన్నాడు. ఇంద్రుల భావైక్యము ఇందు ధ్వనించును. పై వాక్యములో ప్రతిమాట "ప" అనే అక్షరావృతి జరిగినది. తద్వాక్యపఠనలో 'ప' కారోచ్చారణ పౌనఃపున్యము వారి భావైక్యాన్ని సూచింపచేస్తుంది.

ఉపమానోపమేయాన్ని తత్తదుచిత స్థానాల్లో వాడి భావస్ఫూ ర్తిని శ్రీనాథుడు కొన్నిచోట్ల కల్గించినవి కూడ ఉన్నది.

"నందనోద్యాన వీథి కాంతారములందుఁ
బూర్ణచంద్రాస్య విహరించఁ బోవ వలచు"

ఇది యింద్రదవిరహ వర్ణన. పూర్ణచంద్రాస్య అన్నది దమ యంతిని సంబోధించుచు నలుడన్నమాట. తరువాత ఒక వృత్తమిది.

"అరసిచూచి తాపమున యందును
రూపమునందుఁ బూర్ణిమా తారకరాజుగాఁ దలఁచి..."

ఉదయసూర్యుని చంద్రునిగా దలంచి యింద్రుడు విరహాపడు నట. ఇది మనః ప్రవృత్తికి సంబంధించినది. తాను దేనికై వాంఛించు చున్నాడో ఆ వస్తువు ప్రకృతిలో ఎల్లెడల బింబితమయి కన్పిస్తుంది. ఇక్కడ సూర్యుడు చంద్రునిలగు కన్పించెను.

"పూర్ణచంద్రాస్య" అనియే యని యే దమయంతి అనబడినదో అతడే యీ పూర్ణిమా తారకరాజు.

దమయంతికి దేవతలందఱు ఒక సందేశము పంపిరి. వారు అందఱు కలసివచ్చినట్లే వారి సందేశమునందలి భావము ఒకటే, ఇదియు వ్యంగ్యముగా చెప్పబడినది. శ్రీనాథునిచేత. ఇది ఇతఃది అని ప్రత్యేకించి వివరింప నవసరములేదు. యముడు దండాయుధుడు. అతని వ్యక్తిత్వము వేఱు. అతని ఆయుధగత దైర్ఘ్యమువలె అతని సందేశమును దీర్ఘమయినది. దానిని శ్రీనాథుడు వృత్తరచన ద్వారా ధ్వనింపజేసినాడు. "త్వదరాళ భ్రూలతాద్వంద్వమున మదనుడో తన్వి ధన్యత్వమందెన్..." ఇత్యాది మహాస్రగ్ధరావృత్తము. ఇది వృత్తౌచితి అనవచ్చునేమో! దిగీశుల సంత్తశమునందు ఏకత్వ ప్రతిపాదనకై "ఆదిత్యులమగు మాకును ఔదాసీన్యమునుజ్జగించి, మాదివ్యత్వము నీకు నిత్తుమని, త్వదరాళభ్రూలతా ద్వంద్వమున; పద్యాలలో మాలికవలె స్ఫురించుటకు 'ద' కారప్రాసము అన్నింట గైకొనబడినది.

తన పేరును మాత్రము నలుడు దమయంతికి తెల్పలేదు. నన్నయగారారంభమున- "ఏను నలుండనువాడ... అని నలుడు దమయంతితో అన్నట్లు వ్రాసిరి. తనవంశ నామాదికములు చెప్పాడు నలుడు అన్నమాటలలో "ఇంత మాత్రము సెప్పెద నెఱింగికొనుము" అని శ్రీనాథుడన్నాడు. ఇంతమాత్రము తాను ఎఱిగింపగా, మిగిలినది దమయంతి యూహాసేయవలయును. ఇది "పాకనాటింటి" వాని తెలుగుదనము.

అగ్నికూడ దమయంతిని పరిణయ మాడ దలచినాడు. అగ్ని యెంతయినా నిప్పే. అతడామెను ప్రేమించినట్లు చెప్పితే దమయంతి అసలే కాదనవచ్చును. అందువల్ల అగ్ని ప్రస్తావన సరాసరి రప్పించక అతని గొప్పదనముతో ఆరంభించుచూ "ఏ వేల్పు సోమవీథులు సేవింతురు, ముఖ్యతనువు శివునకు ఏవేల్పు - ఏవేల్పు వెలుఁగులకు, ఆ వేలుపు నిను వరింప నాకాంక్షించెన్". ఇందులో అగ్ని పేరు లేదు. అతడు వెలుగలగని అనిచమత్కరించి అతని ప్రేమభావాన్ని నలునిచే వ్యక్తం చేయించాడు శ్రీనాథుడు. అసలు యత్తదర్థక రచనలో ఉన్న అందమేయిది. కొందఱు తెలుగులో ఈపద్ధతి సహజమయినది కాదన్నవారున్నారు. వారికి తెలుగుభాషలో సొగసు తెలియదని మనవి.

అటులే యముని పేరు కూడ చెప్పక "దక్షిణం బేలెడిరాజు" దమయంతిని వరింపదలచినట్లు చెప్పబడినది.

నలుని మాటలువిని దమయంతి సమాధానమిచ్చినది. "తగవే కులకన్యలకును, మగవారలతోడ గూడ మహనీయులతో" ఇదీ శ్రీనాథుని పద్యము. 'తగవే' అన్న ఎత్తుగడ 'తగునయ్య' అని మార్చినచో అది నన్నయ్యగారి రచనయే యగును.

సందర్భరమణీయ పద్యరచన ఒక మహాశిల్పరహస్యము. నన్నయ్యగారు సాధారణముగా మత్తేభశార్దూలములు వాడిన వారుకారు.

దుశ్శాసనను చంపుదునని భీముడు సభలో ప్రతిన చేసినాడు. మత్తేభము వాడిరి. 'కురువృద్ధుల్ గురువృద్ధ' నన్నయ్యభట్టు మార్గంబు పాటించుచు శ్రీనాథుని దమయంతి నలుని వినా యితరుని వివాహమాడనని ప్రతిన చేసినది. "వినుమీ నాడు ప్రతిజ్ఞ తప్పరత"...యది మత్తేభము.

నలుని వాక్పటిమకు దమయంతి రోదన చేసినది. అద్భుతమైన శిల్ప విన్యాసము జీవలక్షణముతో ఇటనున్నది. దమయంతి దుఃఖమూ

నలుని ప్రసంగదీసినది. అతడు వివశుడైనాడు. అతడొకమాట అన్నాడు. అందులో స్వయంవర సంబంధ కథావిషయ మంతయు నున్నది.

"ఏమిటికి కేడ్చెద? వానన
తామరసం బెత్తిచూడు తరుణీ నన్నున్
గోమల కటాక్ష వీక్షా
దామకమున వీరసేను తనయుని నలునిన్".

దమయంతి యేడ్పు మాన్పింపవలెను. అందుకు తానెవరో తెలుపవలెను. "నేను నలుఁడను, నీ ప్రియుఁడను" అని చెప్పవలెను. ఈ సందర్భమున రెండుమాటలు అవసరము. నలుడట్లనలేదు. వీరసేనుని తనయుడగు నలుని దమయంతి చూడవలెనన్నాడు. వీరసేను తనయుడు కాని నలుడు లేడు కదా? ఇట్లేలనవలెను? ఇట్లనుటలో ఒక మహాగాఢమగు హెచ్చరిక యున్నది. వీరసేను తనయుడు కాని నలాకారులు స్వయంవర వేళ రాగలరు. వారును దమయంతి యందు నలునివలె ప్రేమ కలవారే. నలుడప్పుడు- కోమలకటాక్ష వీక్షదామకమున నలుని చూడుమన్నచో ఆమె ఏ నలుని చూచును ? అన్న విచికిత్స వచ్చును. ఆమె నలాకృతి గలవానిని గాక వీరసేను తనయుని వరింపవలెను. ఇది ఇందలి పద ప్రయోగౌచితి. ఇంత శ్రీనాథుడూహా చేసెనా! ఇది కవివాక్కు. ఇంత వివరణ దీనికి గలదు. ఇక్కడ ఋష్యాత్మ గోచరమగును.

నలుడు వివశావస్థలో పడినట్లు తెలియచేసేందుకు "ఏమిటికి కేడ్చెద వానన" యిత్యాది కందపద్యాన్ని వాడాడు. మరల అతడు యథాస్థితికి వచ్చినపుడు అదే ప్రాసతో అదే పద్యాన్ని "ఏమి యని తలఁతురొక సుత్రామ" అని వ్రాశాడు.

ఆ తరువాత నల దమయంతుల దగ్గరకు హంస అవతరించినది. ఇది ఒక మహాభావనచేసి మాట్లాడినది. ఆ ప్రసంగములో అంతఃకరణ, అంతరంగముల ప్రశస్తియే యుండును.

స్వయంవరాగత రాజవర్ణనలో వచన రచనచేసి ఒక ప్రత్యేక విలక్షణత చేసినాడు శ్రీనాథుడు. ఇంద్రాగ్ని యమ వరుణులు దేవతలు. వారు దిక్పతులు. అనగా వారినిమించినవారు లేరు. వారును దమయంతీ వివాహమునకు వచ్చిరి. నలుడును వచ్చెను. ఇంద్రాదులు నలుని ఆకృతితో వచ్చిరి. అక్కడ ప్రాధాన్యము వీరసేను తనయుడగు నలునకే యున్నది. అందుచే ఇంద్రాదుల రాక సాధారణ వచనములో శ్రీనాథుడు చేసినాడు. "ఇంద్రాగ్ని యమవరుణు లేతెంచిరి" ఇంతే. నలుని రాక ఒక నిండైన సీసములో చెప్పబడినది భువనములలోగల రాజులందఱు వచ్చిరి, అని చెప్పుచు ప్రత్యేకించి కర్కోటకునిరాక వర్ణించి భావి నలకథా విషాద వాతావరణమును శ్రీనాథుడు ఇట ధ్వనింపజేసినాడు. అనేక రాజులు అనేక ప్రాంతములనుండి వచ్చిరి. ప్రజలు గుర్తించిరి గాని పట్టించుకోలేదు. "వీటి జనంబు లెల్లఁ దను విస్మయమంది కనుగొనంగఁ గర్కోటకుఁడేగుదెంచె".— కర్కోటకుడు పాము. ఇతడు నలుని అడవి సంచారములో వా ఆకారము మార్చి మరింత కష్టములు కల్పించినాడు. అందుచే కర్కోటకుని వర్ణన విలక్షణముగా ఇందు శ్రీనాథుడు చేసెను.

నలునిలాగే దేవతలు నలుగురు స్వయంవరానికి వచ్చారు అలా చెప్పితే అందులో చమత్కారము లేదు. శబ్దశక్తి యెఱిగిన క కావడంవల్ల ఇక్కడ ఏ శబ్దము వేస్తే అంత అర్థము వస్తుందో తెలి వేశాడు శ్రీనాథుడు. "నలుడు మంచాగ్ర భూమియందు అధివసించి యుండగా" దేవతలు,

"కదిసి పరిపాటి మంచకంచముల మీఁద
రాకుమారకులై యున్న నాక విభులు...
నలుని యమకంబులై యున్కి..."

"యమకంబులై" అన్నచోట ఆయువుపట్టున్నది. యమ మన్నది ఒక అలంకారము. "ఆవృత్తిం వర్ణసంఘాత గోచరా యమకమ్ విదుః" పైకి ఉచ్చరితమయ్యే శబ్దాలు ఒకేమాదిరి

ఉండును. అయినా వాని అర్థము చాలా భిన్నంగా ఉంటుంది. అలాగే ఆ వచ్చిన దేవతలు నలుని లాగున్నారు. కాని యథార్థముగా నలుని కన్న భిన్నమయిన తత్వముగలవారు. అందువలన దేవతలు నలుని యమకంబులై వచ్చిరనుట. ఇంతతో కాదు. మరో అర్థాంతర మిందు న్నది. 'యమ్' ధాతువునకు బాధించు, నిగ్రహించు, బంధించు అర్థా లున్నవి. "నలుని యమకంబులై" దేవతలు వచ్చిరనుటలో దేవతల ఉద్దేశ్యము ఏదయినా అది నలునికి బాధాకరమే అవుతుంది. ఇది శ్రీనాథుని శిల్పవైలక్షణ్యము.

నన్నయ్యగారు, నలుని దమయంతి యెలా వరించినదీ ఎంత రమణీయంగా చెప్పిరో వివరిస్తాను. దమయంతి నలునకు ఈతు అని చెప్పవల్నె. వారిద్దరు ప్రక్క-ప్రక్కన నిలబడితే నలుని బుజాలదాక దమయంతి వస్తుంది. ఆమె యిప్పుడు సిగ్గుపడుచున్నది. అతని కంఠమున పుష్పమాల ఉంచ సాహసము చేయలేకపోయింది. సమీపించి ఆమాలి కను అతని కంఠమునకాదు— సిగ్గుతో తలవంచి అతని భుజాన ఉంచి నది. ఇక ఒక శృంగార సన్నివేశ రమణీయ శిల్పము నన్నయ్యగారిట్లు చేయుదురు. "నలు ధర్మవిధానంబున వరియించి దమయంతి తదీయ స్కంధమ్మున సుగంధి కుసుమదామకంబు వెట్టిన"ది. అది దేవతలు అంగీకరించిరి.

ఇక్కడ కొంతకొంతగా నన్నయ్యగారి శిల్పము వివరించాను. అలాగే శ్రీనాథునిదయిన శిల్పచమత్కృతి చూపితిని. పాత్ర చిత్రణలో శిల్పమున్నది. మరి మరొకసారి మనవి చేయుదును.

సాహితి. మార్చి; 1964.

# పంప : నన్నయ - భారత రచనా ప్రణాళిక

శ్రీ పరిమి సాంబయ్య

పంప మహాకవి అరికేసరి ఆస్థానమున నుండెను. అరికేసరి పశ్చిమ చాళుక్యుడు, రాష్ట్రకూట సామంతరాజు. ఈతడు క్రీ॥శ॥ 10వ శతాబ్దము వాడు. పంపకవి 'ఆదిపురాణ' మను జినగ్రంథమును, పంప భారతమను పేరుగల 'విక్రమార్జున విజయ'మును రచించెను. మొదటిది మతపరమగు గ్రంథము. రెండవది లౌకిక ప్రబంధము. విక్రమార్జున విజయమును పంపకవి అరికేసరికి అంకితము చేసెను. అంతే కాదు విక్రమార్జున విజయ నాయకుడగు అర్జునునకు, తన కాశ్రియము నిచ్చిన రాజగు అరికేసరికి అభేదమును పాటించి కావ్య రచన కావించెను. ఇది కావ్యము కాదు. ప్రబంధము. చతుర్ద శాశ్వాస పరిమితము. ఈ ప్రబంధమునకు వస్తువును పంపకవి వ్యాసభారతమునుండి గ్రహించెను. భారత కథను యథాతథముగా గైకొనలేదు. లౌకిక ప్రబంధముగ విక్రమార్జున విజయమును కావించుటకు సంస్కృత భారతమున గల సన్నివేశములలోని కథను తన కనుకూలముగ మార్చుకొనినాడు. విక్రమార్జున విజయము లౌకిక ప్రబంధమగుటచే, ఇందు వ్యాస భారతమున గల ఆఖ్యానోపాఖ్యానములు, భగవద్గీతాదులు పరిహృతములు. దీనిచే ప్రబంధమునకు వస్త్వైక్యము సిద్ధించినది.

రాజరాజు కోరికపై నన్నయ ఆంధ్ర మహాభారత రచన కుపక్రమించినాడు. నన్నయ ఆదిపర్వ ప్రథమాశ్వాసము నందు పర్వానుక్రమణికా పర్వ సంగ్రహముల సంస్కృత భారతాకథా ప్రణాళికను తెలిగించెను.

పంపకవి 'విక్రమార్జున విజయ చతుర్థాశ్వాసమున వివరించిన ప్రణాళికను, నన్నయ పర్వానుక్రమణికను, పరిశీలించుట ప్రస్తుత వ్యాసోద్దేశము.

[42A]

పంపమహాకవి విక్రమార్జున విజయములోని పదునాల్గవ ఆశ్వాసమున తన ప్రబంధ ప్రణాళికను అరువది తొమ్మిది ఘట్టములుగా తెలిపినాడు. ఇవి పర్వములు కావు. వ్యాసభారతమున నూరు పర్వములు కలవు. ఆ నూరు పర్వములలోనివి కొన్ని పై అరువది తొమ్మిదింటిలో కలవు. (అవి ఈ క్రింది వానిలో Under Line చేయబడినవి.)

'వ' అదెంతెనె – ఆది వంశావతార, సంభవం, ప్రవేశం, జతుగృహదాహం, హిడింబవధె, బకాసురవధె, ద్రౌపదీ స్వయంవరం, వైవాహం. యుధిష్ఠిర పట్టబంధనం, ఇంద్రప్రస్థ ప్రవేశం, అర్జున దిగ్విజయం, ద్వారావతీ ప్రవేశం, సుభద్రాహరణం, సుభద్రా వివాహం, ఖాండవ వనదహనం మయ దర్శనం, నారదాగమనం, జరాసంధ వధె, రాజసూయం, శిశుపాలవధె, ద్యూత వ్యతికరం, వన ప్రవేశం, కిమ్మీరవధె, కామ్యకవన దర్శనం, ద్వైతవన ప్రవేశం, సైంధవబంధనం, చిత్రాంగద యుద్ధం, కిరాత మార్తాగమనం, ద్రౌపదీ వాక్యం, పారాశర వీక్షణం, ఇంద్రకీలాభిగమనం, ఈశ్వరార్జున యుద్ధం' దివ్యాస్త్ర లాభం, ఇంద్రలోకాలోకనం, నివాతకవ చాసురవధె, కాళకేయ పౌలోమవధె, సౌగంధిక కమలాహరణం, జటాసురవధె, మాయామత్త హస్తివ్యాజం,........'

విక్రమార్జున విజయం–14 ఆశ్వా 58.

వీనితో వ్యాసభారతములోని ఆది, సభారణ్య పర్వములు పూర్తి అయినవి. పైని పేర్కొనిన ఘట్టములను, వ్యాసానుక్రమణిలోని పర్వనామములతో పోల్చవలసియున్నది. సంస్కృత భారత పర్వ సంగ్రహమున-

'పర్వానుక్రమణీ పూర్వం ద్వితీయం పర్వసంగ్రహః ॥
పౌష్యం పౌలోమ మాస్తీక మాదివంశావతారణం ॥

తతఃసంభవ పర్వోక్త మద్భుతం దేవనిర్మితం
దాహో జతుగృహ స్యాత్ర హైడింబం పర్వ చోచ్యతే ॥ 35
తతో బక వధః పర్వ పర్వ చైత్రరథం తతః ।
తతం స్వయం వరం దేవ్యాః పాంచాల్యాః పర్వ చోచ్యతే ॥ 36
క్షత్రధర్మేణ నిర్జిత్య తతో వైవాహికం స్మృతం ।
విదురాగమనం పర్వ రాజ్యలాభ స్తథైవ చ ॥ 37
అర్జునస్య వనే వాసః సుభద్రాహరణం తతః ।
సుభద్రాహరణా దూర్ధ్వం జ్ఞేయం హరిణహారికం ॥ 38
తతః ఖాండవదాహాఖ్యం తత్రైవ మయ దర్శనం ।
సభాపర్వ తతః ప్రోక్తం మంత్రపర్వ తతః పరం ॥ 39
జరాసంధ వధః పర్వా పర్వ దిగ్విజయ స్తథా ।
పర్వదిగ్విజయా దూర్ధ్వం రాజసూయక ముచ్యతే ॥ 40
తత శ్చార్ఘ్యాభి హరణం శిశుపాలవధ స్తతః
ద్యూతపర్వ తతః ప్రోక్త మనుద్యూత్య మతఃపరం ॥ 41
తత ఆరణ్యకం పర్వ కిమ్మీరవధ ఏవ చ ।
ఈశ్వరార్జునయో ర్యుద్ధం పర్వకైరాత సంజ్ఞితం ॥ 42
ఇంద్రలోకాభిగమనం పర్వజ్ఞేయ మతః పరం ।
తీర్థయాత్రా తతఃపర్వ కురురాజస్య ధీమతః ॥ 43
జటాసుర వధః పర్వ యక్ష యుద్ధమతః పరం ।
తథైవా జగరం పర్వ విజ్ఞేయం తదనంతరం ॥ 44
మార్కండేయ సమస్యా చ పర్వోక్తం తదనంతరం ।
సంవాద శ్చ తతఃపర్వ ద్రౌపదీ సత్యభామయోః ॥ 45
ఘోషయాత్ర తతఃపర్వ మృగస్వప్న భయం తతః ।
వ్రీహి ద్రౌణిక మాఖ్యానం తతోఽనన్తర ముచ్యతే ॥ 46
ద్రౌపదీ హరణం పర్వ సైంధవేన వనాత్తతః ।
కుండలాహరణం పర్వ తతఃపర మిహోచ్యతే ॥ 4

అరణ్యేయం తతఃపర్వ.........

మహాభారతం ౧-౭వ అధ్యాయము
B. O. R. I. ప్రతి,

పై పర్వములను పరిశీలించిన పంపకవియొక్క స్వాతంత్ర్యము తెలియుచున్నది. 'విక్రమార్జున విజయ'మునకు కావలసిన ఇతివృత్త మును తత్సంబంధ పర్వనామములను పంపకవి గ్రహించినాడు. వ్యాసుని పర్వసంగ్రహామునందు లేని ఘట్టములు కొన్ని పంపకవి ప్రణాళిక యందు కలవు. (Under Line చేయనివి) ఇవి పర్వములుగా సంస్కృత భారతమున లేవు. సంస్కృతమున గల అర్జునవనవాస పర్వము పంప ప్రణాళికయందు 'అర్జున దిగ్విజయ' ముగ మారి యుండవచ్చును. లేదా సంస్కృతమునగల సభాపర్వములోని 'దిగ్వి జయ పర్వమే మారి యుండవచ్చును. విక్రమార్జున విజయములోని కథానాయకుడు అర్జునుడు, ద్రౌపదిని వివాహమాడినపిమ్మట వన వాసము చేయడు. దీనికి కారణము ద్రౌపది అర్జునునకుమాత్రమే భార్య అట్టిచో సోదరులు సమయ మేర్పరచుకొనుటగాని, సమయ ప్రకారము వనవాసము చేయుటగాని, "విక్రమార్జున విజయము"న ప్రసక్తము గాదు. అందుచే సభాపర్వములోని "దిగ్విజయ పర్వమే" "అర్జున దిగ్విజయ"ముగా మారినదనుకొనవచ్చును కాని, అర్జునుడు వనవాసము చేయు సందర్భమున ఉలూచీ, సుభద్రలను పరిణయమాడినట్లు సంస్కృత భారతమున కలదు. అర్జునుని వనవాసము విక్రమార్జున విజయమున అసంగతమగుటచే, అర్జునుడు దిగ్విజయమునకు వెళ్ళి, మదనలతా, సుభద్రలను పరిణయమాడినట్లు కలదు. దీనిని బట్టి పంప కవి వస్త్వైక్యమునకై సంస్కృతమున గల అర్జున వనవాస పర్వ మును, దిగ్విజయ పర్వమును కలిపి అర్జున దిగ్విజయమన్నాడన వచ్చును.

ఇట్లు సన్నివేశ వస్త్వైక్యములకు ప్రాధాన్యమునిచ్చి మూల భారతమున పర్వములుగలేని కొన్ని ఘట్టములను పంపకవి తన ప్రణాళికయందు చేర్చుకొన్నాడు.

మహాభారతమును సంక్షేపించు విధానమున,నన్నయ పంపకవిని యనుసరించెనను ప్రథయొకటికలదు. అది ప్రథయో భ్రమయో తెలిసికొనవలెనన్న, నన్నయ పర్వానుక్రమణికను, వ్యాస పంప కవులతో పోల్చి చూడవలసి యున్నది. ఆంధ్రమహాభారతమున-

'అదియునుం, పౌష్యంబు, పౌలోమం,బా స్తీకం, బాది వంశావ తారంబు, సంభవ పర్వంబు, జతుగృహ దాహంబు, హైడింబంబు, బకవధ, చైత్రరథంబు, ద్రౌపదీ స్వయంవరంబు, వైవాహికంబు, విదురాగమనంబు, రాజ్యార్ధలాభంబు, అర్జున తీర్థయాత్ర, సుభద్రా కళ్యాణంబు, హరణ హారిక, ఖాండవ దహనంబు, మయ దర్శనంబు, సభాపర్వంబు, మంత్రపర్వంబు, జరాసంధవధ, దిగ్విజయంబు, రాజ సూయం, బర్ఘ్యాభిహరణంబు, శిశుపాలవధ, ద్యూతం, బనుద్యూతం, బారణ్యంబు, కిమ్మీరవధ, కైరాతం, బింద్రలోకాభిగమనము,ధర్మజ తీర్థయాత్ర, జటాసురవధ,యక్షయుద్ధం,బాజగరంబు, మార్కండేయో పాఖ్యానంబు, సత్యా ద్రౌపదీ సంవాదంబు, ఘోషయాత్ర, ప్రాయోపవేశంబు, వ్రీహిద్రోణకాఖ్యానంబు, ద్రౌపదీ హరణంబు, కుండలాహరణం, బారణేయంబు........." (ఆది. ప్ర. శిశివచనము సంశోధితప్రతి)

ఈ పర్వానుక్రమణికయందు అరణ్యపర్వము వరకు గల పర్వ ముల క్రమము వ్యాసభారతమునందున్నటుల అదేక్రమమునన్నది. పర్వనామములయందు మాత్రము ముఖ్యముగా మూడు మార్పులు గలవు.

1. 'సుభద్రా, హరణ'మని సంస్కృతముననుండగా నన్నయ, 'సుభద్రాకళ్యాణం' అనినాడు. దీనికి పాఠాంతరములు సంస్కృతమున గాని, తెనుగునగాని లేవు. పంపకవి, "సుభద్రాహరణం" సుభద్రా వివాహం" అను రెండు ఘట్టములను పేర్కొనినాడు. వివాహమునకు

కల్యాణమునకు భేదము కలదు. వివాహమునకు 'పెండ్లి' అను అర్థము కాక, వేరొక అర్థము లేదు. కల్యాణమనగ 'శుభము' 'చొక్కపు బంగారము' అనినైఘంటుకార్థము. కల్యాణమునకు వివాహమని వ్యవహారమున ప్రయుక్తము.

నన్నయ 'సుభద్రా కల్యాణ' మని అనుటకు కారణము తెలిసికొనవలెనన్న కథాంశములను పరిశీలించవలసియున్నది.

వ్యాసభారతమున 'సుభద్రాహరణ' పర్వమునందు వాసుదేవుడు అర్జునునితో నిట్లనెను—

'స్వయంవరం క్షత్రియాణాం వివాహః పురుషర్షభ ।
స చ సంశయితః పార్థ స్వభావ స్యా నిమిత్తతః ॥
ప్రసహ్య హరణం చాపి క్షత్రియాణాం ప్రశస్యతే ।
వివాహహేతోః శూరాణా మితి ధర్మవిదో విదుః ॥

1-211. శ్లో 21, 22
B. ORI ప్రతి.

పై శ్లోకములవలన క్షత్రియులకు వధూహరణముకూడ ప్రశస్యమైనదని తెలియుచున్నది.

నన్నయ ఆదిపర్వములోని అష్టమాశ్వాసమున అర్జునుడు సుభద్రతో నిట్లనును.

'బ్రాహ్మంబు మొదలుగాగల యెనిమిది వివాహంబులయందును గాంధర్వ రాక్షసంబులు క్షత్రియులకు నుత్తమ వివాహంబులు గావున నిది గాంధర్వ వివాహంబున కవసరం బనిన సుభద్ర లజ్జా వనత వదన యయి.........

ఆది-G-188వచ.

దీనివలన నన్నయ దృష్టియందు సుభద్రార్జునులది గాంధర్వ వివాహము. రాక్షసము కాదు. హరణ మనగ ఎదుటివారియొక్క ఇష్టానిష్ట ప్రమేయము లేక ఎత్తుకొనిపోవుట-నన్నయ దృష్టిలో అర్జునుడు సుభద్రను హరింపలేదు.

సంస్కృతమున శ్రీకృష్ణుడు బలరామునితో పల్కు సందర్భమున—

'ఏతాన్ దోషాంశ్చ కౌంతేయో దృష్ట్వా నితి మే మతిః।
అతః ప్రసహ్య హృతవాన్ కన్యాం ధర్మేణ పాండవః 5
ఉచితశ్చైవ సంబంధః సుభద్రా చ యశస్వినీ ॥
ఏష చాపీదృశః పార్థః ప్రసహ్య హృతవానితి ॥ 6

1.213 అధ్యా. B. B. R. I. ప్రతి

అని కలదు. ఈ శ్లోకములు పార్థునకు సుభద్రకు గల ఉచిత సంబంధమును తెల్పుచున్నవి.

నన్నయ ఆంధ్రభారతమున—

"తన మేన మఱదలి ధవళాక్షిఁదోడ్కొని చనియె నాతని కది చనదె చెపుడు ?"

ఆది. 3.208

అని శ్రీకృష్ణుడు బలరాముని అడిగిన దానిని పరిశీలించిన అర్జునుడు సుభద్రను 'తోడ్కొని చనియె'నని తెలియును. అంతేకాదు రథముపై పోవుచున్న సుభద్రార్జునుల గాంచి పృథుశ్రవసు డాదిగా గల వీరులు'.....సుభద్ర నంభోరుహనేత్ర 'దోడ్కొనుచు బోయెడి నీతని బోవనిచ్చినన్' (1-8-199 పద్య) అని ఎదుర్కొనిరి. శ్రీకృష్ణుడు సుభద్రార్జును ను ఇంద్రప్రస్థమునకు పంపు సందర్భమున–'హరిపంచిన మార్గంబున, గురువిభుడు సుభద్రఁ దోడ్కొని చను నెడ' (1-8-199 పద్య) అని కలదు. నన్నయ అర్జునుడు సుభద్రను'తోడ్కొని చనియె' ననెఁగాని హరించెననిఅనలేదు. ఇది హరణముకాదు. రాక్షసముకాదు.

మఱి నన్నయ కూడ 'సుభద్రా వివాహం' అని అనవచ్చును గదా ! 'సుభద్రా కల్యాణం'అని ఎందుకనినాడు? అను ఆంశక కలుగ వచ్చును. నిశ్చయముగ సుభద్రార్జునులకు జరిగినది వివాహమే, పైగా అది జగన్నాథరాయణుడు కావించినది' శుభమును గూర్చునది.

కల్యాణమనగ 'కల్యం సుఖం అణయతి ప్రాపయతి కల్యాణం, అణగతో, సుఖమును పొందించునది'. (అమరకోశ గురుబాల ప్రబోధికా, P. 106) కల్యం అనగ నేర్పరి, ఉపాయము కలది. శుభమైనది సంపాదింపబడినది అని అర్థము. ఈ అర్థములతో "కల్యాణ"మునకు సంపాదింపబడిన దానిచే సుఖమును పొందుట" అని అర్థమును చెప్ప వచ్చును. శ్రీకృష్ణుని నేర్పరితనముననే సుభద్రార్జునులకువివాహము జరిగినది. శ్రీకృష్ణుని ఉపాయము చేతనే సుభద్రార్జునులు ఇంద్రప్రస్థమునకు పోగలిగిరి.

"వివాహ" మనిన ఇన్ని అర్థములురావు. వివాహములు ఎనిమిది రకములు. అందు క్షత్రియుల కుచితమైనవి గాంధర్వ రాక్షస గాంధర్వములు. ఇట అర్జునుడు సుభద్రతో గాంధర్వ వివాహమునకిది సమయమనును. అంత సుభద్ర లజ్జావనతయై' నన్ను నీ నర్థింలిందున్నవారు వారెఱిగి చేయుదురు. "వివాహ మనుచు" (ఆది 8-180 పద్య) వెడలిపోయెను.

గాంధర్వ, వివాహ స్వరూపమును నన్నయ శకుంతలలోపాఖ్యానమున ఇట్లు వివరించెను-

తనకు మఱి తాన చుట్టంబు తాన తనకు గతియుఁదన్నిచ్చుచోఁ దాన కర్త యనగ వనజనేత్ర గాంధర్వ వివాహ మతిర హస్యమును సమంత్రకమును నగుచు నొప్పు.'

(ఆది. చతు. 58 పద్య)

సుభద్రార్జునుల వివాహము అతి రహస్యము కాదు. బలరామునకు తప్ప తక్కిన సాంబసాత్యకి సారణాదులకు తెలిసినదే. ఈ వివాహము అమంత్రకమును కాదు. 'అత్రిభృగు వసిష్ఠ వామదేవాది మహామునులు సదస్యులు కాగ' 'కశ్యప ప్రజాపతి హోమకర్త కాగ, 'అరుంధతియు, శచియు, సత్యభామయు, రుక్మిణియు, అప్సరోగణంబు తోడం బురంధ్రీకార్యంబులు నిర్వర్తింప' సుభద్రార్జునుల వివాహ

మతిరమ్యముగా జరిగినట్లు కలదు. కావున గాంధర్వ వివాహమునకు గల నియమములు (Rules of Regulations) ఈ వివాహమునకు వర్తింపవు. ఇది గాంధర్వ వివాహము కాదు. ఇక ఈ వివాహమును రాక్షస వివాహమనుటకు అవకాశము లేదు. సుభద్రార్జునులది సాధారణ వివాహము కాదు. కల్యాణప్రదమైన వివాహము.

పంపకవి 'అర్జున దిగ్విజయ' మను ఘట్టమునందు విక్రమార్జునుడు ద్వారావతికి వెళ్ళి, అచట సుభద్రను చూచి, మదన పరవశుడై యుండుటయు, అర్జునుని చూచిన సుభద్రకూడ మన్మథ తాపమును భరింపలేక నికుంజమున నుండగ అర్జును డచటకి వెళ్ళుటయు, ఆ సందర్భమున శ్రీకృష్ణు డచటికివచ్చి అర్జునునితో సుభద్రను తీసుకొని ఇంద్రప్రస్థమునకు వెళ్లుమనగ, అర్జును డావిధముగ చేసి ఇంద్రప్రస్థమున సుభద్రను వివాహము చేసికొనినట్లు వర్ణించినాడు.

ఇందు వివాహమునకు ముందే సుభద్రాహరణము జరిగినది. ఇది 'విక్రమార్జున విజయమున అర్జునుని పరాక్రమమును చాటు సన్నివేశము. సంస్కృతమున వివాహానంతరమే సుభద్రాహరణము కలదు. పంప భారతమున ఈ వివాహము రాక్షసవివాహముగనున్నది. ఈ ఘట్టములోని ఈ కార్యమును హరణము కాదని, వివాహము కాదని, పంపకవి కల్పించిన సన్నివేశమును పరిశీలించి, అందు శుభమును కలదని సుభద్రాకళ్యాణమను పర్వనామమును నన్నయ చెప్పియుండును.

2. వ్యాసభారతమున "మార్కండేయ సమస్యా"అని ఉండగా నన్నయ మార్కండేయోపాఖ్యానమని మార్చినాడు సంస్కృతమున $K_2$ $D_{38.14}$ $T_2$ $G_{2.7}$ ప్రతులలో మార్కండేయ సమాఖ్యా, T. $G_5$ ప్రతులలో మార్కండేయ సమాఖ్యం, $Dr_4$, $G_{4.6}$, $M_3$ ప్రతులలో మార్కండేయ సమస్యా అనియు కలదు. పంపకవి ఈ మార్కండేయ సమస్యను గ్రహింపలేదు. సంస్కృతమునందలి T.G. ప్రతులలోని మార్కండేయ సమాఖ్య, తెనుగున మార్కండేయోపాఖ్యానమై యుండవచ్చును.

3. భారత సంశోధిత ప్రతియందు

ఘోషయాత్రా తతః పర్వ మృగ స్వప్న భయం తతః।
వ్రీహిద్రౌణిక మాఖ్యానం తతోఽన్య స్తర ముచ్యతే॥46

అని కలదు. నన్నయ ఘోషయాత్ర, ప్రాయోపవేశంబు, వ్రీహిద్రోణికాఖ్యానంబు" అనినాడు. తెనుగునగల ప్రాయోపవేశపర్వము B. O. R. I. వారి ప్రతిలో ప్రధాన పాఠమున కానరాదు. పాఠాంతరములందు గలదు. $D_{9.11}$ ,T ప్రతులలో 'తతః ప్రాయోపవేశనం' $D_{14}$G.M. ప్రతులలో 'పర్వ ప్రాయోపవేశనం' అని కలదు. నన్నయ 'మార్కండేయోపాఖ్యాన'మను మార్పును ఏ T.G. ప్రతులను చూసిచేసెనో ? ఆ ప్రతులను చూసియే ప్రాయోపవేశమను పర్వమును గ్రహించినాడని నిర్వివాదముగ చెప్పవచ్చును.

ఈ పర్వాను క్రమణికను గూర్చి కన్నడమున శ్రీ వెంకట రామప్ప ఈ క్రింది విధముగా తెలిపిరి.

'పంపనూ నన్నయభట్టనూ ఆ హెసరు గళన్న ఒందే క్రమదల్లి హేళిద్దారె. ఉభయ కవిగళూ బళసిరువసమాస పదగళ సాదృశ్య గమనార్హవాగిదె.' (పంప-నన్నయ ఒందు సమీక్షె, పు.20) పంపడును, నన్నయభట్టును ఆ పేర్లను ఒకే క్రమమున చెప్పిరి. ఉభయకవులు వ్రాసిన సమాసపదముల సాదృశ్యము గమనార్హమైనది) ఇందలి సత్యా సత్యములను పరిశీలింతము.

పంప, నన్నయల ప్రణాళికను పరిశీలించిన, పంపకవియొక్క స్వాతంత్ర్యము, నన్నయయొక్క మూలాధేయత స్పష్టమగుచున్నవి. పంపని ప్రణాళికయందున్నవి పర్వములు కావు. అవి కేవలము సన్నివేశములు, లేదా ఘట్టములు. ఈ సన్నివేశములు కథానాయకుని ఔద్ధత్యమును చాటునవి. ఇక పంప నన్నయలయందు సమాసపదముల సాదృశ్యము యదార్థమే. ఈ సమాసపదములు వ్యాస నిర్మితములు. ఇద్దరు కవులు వానిని గ్రహించిరనుట అసంగతము కాదు.

వ్యాసభారత హృదయమును ఆంధ్రీకరించుటకు మూలమునఁగల పరీక్షిన్మహారాజ మరణ వృత్తాంతము, జరత్కారు వృత్తాంతాది పునరావృత్త సన్నివేశములను, ఉదంకోపాఖ్యానమున గల నాగస్తుతి, సౌపర్ణోపాఖ్యానమునగల అగ్నిసూక్తములాది దీర్ఘస్తోత్రములను, వేదుల వృత్తాంతము, విదుర వివాహము మొదలైన మూలకథకవసరములైన ఉపకథలను పరిహరించి, సంక్షిప్తీకరించి నన్నయ భారతరచన కావించినాడు.

పంపకవి విక్రమార్జున విజయరచనలో నాయక గుణౌద్ధత్యమునకై, వస్త్వైక్యమునకై, కథా స్వాతంత్ర్యముతో సంస్కృత భారతమునందలి ఆఖ్యానోపాఖ్యానాదులను కన్నడించినాడు.

ఇద్దరి రచనా విధానములలో ఎంతయో భేదము కలదని స్పష్టమగుచున్నది కాని శ్రీ వెంకటరామప్పగారి అభిప్రాయము దీనికి విపరీతముగనున్నది.

"ఈ గ్రంథ సంగ్రహ కార్యదల్లి పంపను అనుసరసిరువ తంత్రక్కూ, నన్నయభట్టను అనుసరసిరువ తంత్రక్కూ హెచ్చు భేదవిల్ల-" (పంప నన్నయ: ఒందు సమీక్షె పు. 20) (ఈ గ్రంథ సంగ్రహకార్యమునందు పంపడు అనుసరించిన తంత్రమునకు, నన్నయ అనుసరించిన తంత్రమునకు, హెచ్చు భేదములేదు.)

నన్నయ విక్రమార్జున విజయమును చూచి ఉండకపోడు. కవులిద్దరకు కావ్యవస్తువు సమానము, వీరిద్దరి రచనా సాదృశ్యమును, కావ్య వస్తు సాదృశ్యమును, మూల కావ్యవస్తువుతో పరిశీలింపవలసిన దేకాని, వ్యాసభారతమును మూలకునెట్టి 'అహో! వీరి సాదృశ్యవిధానమును చూడుడు' అనుట సరియగు విమర్శ కాదు.

పంపని రచనలో అవ్యాసీయ సన్నివేశములు కలవు. అట్టివి నన్నయ రచనలో లేవు. కొన్ని వర్ణనలు మాత్రమే కలవు. నన్నయ రచన పాత్రచిత్రణ విషయమున వ్యాసభారత హృదయమును మెఱుగు పెట్టునదికాని, మఱుగుపరుచునది కాదు.

సమ్యాలోచన, 1-3-80

# యయాతి కథాకథనములో నన్నయ - పోతన్నల తీరులు

శ్రీ న. ఉమామహేశ్వర శాస్త్రి

నాకు కారమన్న రుచి. మరియొకరికి తీపిలో వాపిరితనము. అంతమాత్రమున ఒకటి ఉత్తమము. రెండవది తక్కువయనుట ఒప్పదు. దేనియంతరము దానిది. అనుభవించువారి యభిరుచిని బట్టి వారి కదియన్న అభిమానముండుటసహజము. ఒకదానితో నొకటి వ్యత్యాసముచేసి తరతమములతో మాటలాడుట తగదు.

నన్నయగారి ప్రసన్నకథా కలితార్థయుక్తిని, పోతన్నగారి బాల రసాలసాల నవపల్లవ కోమల కావ్యకన్యకా విలాసములకు జత చేసి చూచి, పొందిన ఆనందానుభవమే యీ నా వ్యాసంగము.

పాండవుల పూర్వులను వ్రాయుటలో పూరునితండ్రియగు యయాతి కథవచ్చినది. భాగవతములో యదువంశ సంజాతుల గణించుటలో యదుని తండ్రిగా యయాతి వచ్చినాడు. మొత్తము మీద భారత భాగవతములు రెండింటిలోను యయాతి కావలసి వచ్చినాడు.

నన్నయగారు తమ యయాతికథకు తొలిగీత నిటు గీసి యున్నారు :- వైశంపాయనుడు జనమేజయునితో నహుషతనయుడు యయాతిరాజై అనేక యాగములుచేసె శుక్రపుత్రికయగు దేవయాని వలన నిర్వురను, శర్మిష్ఠయను రక్షోరాజతనయవలన మువ్వురను పొంది శుక్రశాపమున ముదుసలియై తనూజుల తరుణత ప్రార్థేయపడినాడు. ఒడబడనివారిని శపించి కడపటిపూరుని యంగీకృతికి మదినిచ్చి దీవించి నాడు. ఒక వచనముతోను, ఒక సీసముతోను కథ పూర్తియైనది. ఆ మాత్రమున భారతకథ పూర్తియైనది. ఆ మాత్రమువ భారత కథా శ్రవణ ప్రవణచిత్తుడగు జనమేజయుడు తనివినొందడు :-

"........యయాతి, భార్గవపుత్రియైన దేవయాని తానెట్లు
దేవిచేసె;"

అని ప్రశ్నించును. అందులకు సమాధానముగా, కచదేవయానుల ప్రణయగాథను ముప్పది మూడు పద్యములలో సుమనోజ్ఞముగ నడిపించి యనంతరము యయాతి కథలో కలిపికొన్నాడు నన్నయ. మఱి పోతన్న యెత్తుగడ వేఱు :- రాజవంశము లెక్కించుచున్నాడు. యయాతి, కడకువచ్చి

'యయాతిమహీపతియై చతుర్దశన్...శుక్రునికూతురున్
సుసంపన్న గుణాభిరాము వృష పర్వుని కూతుఁ నోలినాంద్రుఁగా...
ధరణిచక్రి దురంధరుడయ్యె..."

అను శుకుని పలుకులకు విభ్రమముతో—

'పార్థివుఁడు యయాతి, బ్రహ్మర్షి భార్గవుఁడు, అల్లుఁడగుట మాయ
యగుట ఎట్లు ?'

అని ప్రశ్నించును - శుకవచనములతో లలితోద్యానమునకు వృషపర్వుని కూతురగు శర్మిష్ఠ వేవురు చెలియలు, ఆటలాడవచ్చి కొలనిలో నీరాడబోదురు. వస్త్రములన్నియు ఒడ్డున నుండును.

వివస్త్రలు లోన పెల్లురేగుచున్నారు. జల్లులాడుచున్నారు. ఇంతలో

'నందినెక్కి మౌళినిందురోచులు పర్వ, శూలి వచ్చె కొండచూలి
తోడ' (భాగవతము)

సిగ్గుభయములతో త్వరగా బట్టల ధరింపబోదురు. పొరపాటుననో నిజముగ తలచి వలచియో వృషపర్వపుత్రిక-గురుపుత్రిక వలువ కట్టినది. దానిని సహింపని దేవయాని శర్మిష్ఠను తిట్టును. భూసుర మహిళల విత్తములు పెరమగువలకు గావు. పసిడిగొలుసు లున్నను కుక్కకు హవిర్భాగము విహితముకాదు. పైగా మీకు మా తండ్రి గురువు-గౌరవింపదగిన నన్ను, నా వలువ కులికి, అవమానింతువా అని దులుపుకొనును. ఆమె మాత్రము తక్కువయా ? నీ తండ్రి కింత

భిక్షు పెట్టినందుల కిట్లు ప్రేలెదవా యని దేవయానిని నూత ద్రోయించి శర్మిష్ఠ యింటికిపోయినది. యయాతివచ్చి నూత నున్న దేవయానిని పైకి తీయును. దేవయాని వలచును. తనకు కచునకు గల సంబంధము—దానిపై వారిర్వురు శాపప్రతిశాపములు స్వయముగా నివేదించును. యయాతి మనంబును వరించినది. 'ధీరబుద్ధులకు భావ మొక్కడే ప్రమాణ మభావ్య భావ్య పరీక్షకున్' అని యొప్పుకొన్నాడు యయాతి. ఇంతవరకు కచుడు రాలేదు. పోతన్నదారిలో ఇచటనైనను దేవయాని ముఖమునుండి ఆ ప్రశంస వచ్చినది. ఒక సీసముతో సరి వాని చరిత్ర. కాని నన్నయగారు తొలుత కథారంభమున తన కథా కథనయుక్తిని చాటుకొనదలంచెనో యేమో ఒక మహానాయకునిగ కచుని చిత్రించి వారి ప్రణయ వృత్తాంతమును తీయని కంఠాన వినిపించినాడు.

భారత కథలోపలను, శర్మిష్ఠ చెలియలతో వనమునకు వెడలును సరోవరతీరముననే పరిధానము లుంచి నీట ప్రవేశింతురు. కరువలి ప్రేరితములై కలసిపోయినవి పరిధానములు. స్నానాంతరము వస్త్రము గట్టుటలో "దేవయాని పుట్టంబు శర్మిష్ఠ గట్టిన" ఇంతవరకు నన్నయ పోతన లొకేమార్గములో పయనించియున్నారు. కాని వస్త్రముల మార్పిడిలో ఇర్వురు చెరియొక దారిని తీసిరి.

పోతన్నలో శివుడు వచ్చినాడు. ఆ సిగ్గు భయముల వలన దేవయాని వస్త్రము శర్మిష్ఠ కట్టినది. నన్నయగారిలో శివుడు రానే లేదు. ఏదో గాలికి కలిసిపోయినయి. శివుని తెచ్చుటతో పోతనగా రేదేని ప్రయోజనము నపేక్షించియుందురు. నన్నయగారు విడుచుట లోను కొంత ఔచితి యుండకపోదు. లేక వట్టిగ విడచివేయుటకు నన్నయ శైవాభిమాని కాదందురా? అవతారికలో జనమేజయునిచే యిట్లనిపించి తన హృదయము బయలుపెట్టినాడు.

'ఇవియేనున్ సతతంబు నాయెడ కరంబిష్టంబులై యుండు, పా
యవు భూదేవకులాభితర్పణమహీయః ప్రీతిన్ భారత

శ్రవణాసక్తియు, పార్వతీపతి పదాబ్జ ధ్యానపూజామహో
త్సవమున్........................ ........,'

(భారతావతారిక)

వేరొకచోట.

"ఈశ్వరాగమములయందు నిల్పితి ప్రకాశముగా హృదయంబు భక్తితో" అని ప్రమాణించుకొన్న నన్నయ నెట్లు శైవాభిమాని కాదందుము. ఇక,

"హరినామాంకిత సత్కథామృత రహస్యాలోలుడై నట్టి స
త్పురుష శ్రేష్ఠు డసత్కథా లవణవాఃపూరంబు తా ద్రావునే"
"అంబుజోదర దివ్యపాదారవింద, చింతనామృతపాన విశేష మత్త
చిత్త మేరీతి నితరంబు చేరనేర్చు........

అని కేవలము వైష్ణవుడుగా పాడుకొను పోతన్న ఏల శైవ ప్రసక్తి తెచ్చినాడో !

నన్నయ దృష్టిలో శివుడాకడకు రావలసియక్కఱ లేదు. వరము నీయ తపోనిష్ఠలో నున్నవారు లేరు. వివస్త్రలను చూచుటకు వారి బట్టలు కలగలుపు చేయుటకు అతడు రావచ్చునా? అంతకు తొందరగా బట్టల గట్టుటగదా అపేక్షించిన ప్రయోజనము. ఈ మాత్రమునకు విశ్వేశుని రప్పించుట యుచితము కాదనుకొన్నాడేమో ! నన్నయ కరువలిని ప్రేరేపింపజేసి బట్టలను తారుమారు చేయించినాడు. యథా తథముగా ననువదించు నాకాంక్షయో రేమో పోతన్న నేరుగా ఈశ్వరునే రప్పించుకొన్నాడు.

ఇట్టివి నన్నయలో బహుళములు. తన యనువాదమున నుచిత మని తోచినచోట పెంచి, అనుచితములనుకొనిన తావుల నుదించి ప్రసన్న రమణీయత సంతరించుకొనినాడు. ఉచితజ్ఞుడు.

ఇంకొకటి :- పోతన్నగారు దేవయానిచే భూసురమహిళా విత్త మును రక్షోజాతయగు శర్మిష్ఠ వహింప తగదనిపించినాడు. నన్నయ దేవయానిచే "నీ కట్టినమైల కట్టనేర్తునే ! అని శర్మిష్ఠ నడిగించినాడు. పోతన్నలో నాదికట్టుకొనుటకు నీకధికారమే లేదని యాధిక్యత చూపు కొన్నది.

"మహీమవత్తులై న భూసురమహిళల విశ్రమ్ములు పెర మగువలకగునే!
మహిం పసిడిగోలుసులిడినన్ విహితములే కుక్కలకు హావిర్భాగంబుల్!"

నన్నయగారు మితముగ గంభీరభావములో నిమిడ్చి చక్కగా నీకందము నెటులందుకున్నారో ?

దేవయాని శర్మిష్ఠతో—

"లోకోత్తరచరితుండగు నాకావ్యతనూజ, నీకు నారాధ్యను, నే
(ప్రాకటభూసురకన్యక నీకట్టినమైల గట్టనేర్తునె యనినన్......

ఎంతటి యర్థమైనను భూసురకన్యలోనున్నది. బ్రాహ్మణత ఎంతటిదో, తదాధిక్య మెంతటిదో లోకమున విదితమయియున్న దన్నమాట. అటులగాక ప్రాసకొరకై వచ్చిన 'ప్రాకట' కాదు మిత హితసత్యవాక్యుడగు నన్నయ కిట్టివి కరతలామలకములు. పోతన కంతగా ని దారు పద్యములతో చెప్పినగాని తృప్తి లేదు.

నూతిలోపడి కుములుచు జలామగ్నదగ్నయై పరులరాక నపేక్షించుచున్నది దేవయాని. ఇంతలో దానిపున్నెము పండినది. పోతన గారి తత్వములో దైవసంయోగమైనను నన్నయగారి యభిరుచిలో తృష్ణయైనను మొత్తము పైవచ్చినవాడు యయాతి. ప్రవేశములో నన్నయ యయాతికి రాజసము, ఠీవి, హుందానందించినాడు.

'ఆ నహుషాత్మజుండగు యయాతి. యధిజ్యధనుస్సహాయుడై
యానతశాత్రవుండు మృగయారసలోల నిబద్ధబుద్ధి త
త్కానన మెల్లనారసి నికామపథిశ్రమము డేగుడెంచె నం
దానలినాక్షియున్న విపినాంతర కూపతటంబు నొద్దకున్.' (నన్నయ)

పోతన,

'మహావిభూతికిన్ ప్రీతి, మహోగ్రజాతికి నభీతి సాధువినీతి
కిన్, సితఖ్యాతికి, భిన్నదుష్కృహకార్యాభియాతికి నయ్యయాతికి'
(భాగవతము)

ప్రవేశము కల్పించినారు. చూచి యిక సహింపలేదు పోతన దాని యవస్థ-తత్ క్షణమే :-

'సపాంభోనిధి మేఖలావృత మహీసర్వంసహాకన్యకా
ప్రాప్తోద్య ద్వరదక్షదక్షిణ కరప్రాలంబముంజేసి ప్రో
క్షిప్తంజేసె యయాతి, కట్టుకొన పై చేలంబు మున్నిచ్చి ప
ర్యాప్త స్వేదజలాంగి నాళిసముదాయ స్వర్గవిన్-భార్గవిన్.

(భాగవతము)

మూడు బారలలో పైకి లాగినాడు. దృఢవ్రతుడు.

నన్నయగా రట్లుగాదు. లోనిది వివస్త్ర-ఏలపడినదో ! చూచి, నీవెవ్వరిదాన వేకతంబు నిర్విపినాంతర కూపంబున నున్నదానవని ప్రశ్నించి, దాని ప్రార్థన మన్నించిగాని తీయలేదు.

జలధివిలోల వీచి విలసత్కల కాంచి సమంచితావనీ
తలవహనక్షమంబయిన దక్షిణ హస్తమునన్ తదున్నమ
ద్గళదురు ఘర్మ వారికణ క్రమ కరాబ్జము పట్టి నూతిలో
వెలువడ గోమలిం దిగిచె విశ్రుతకీర్తి-యయాతి-ప్రీతితో.

(భారతము)

అక్షరరమ్యతగల యుద్ధరణము ఎంతటి ధ్వని ప్రధానముగ నున్నదో ! ఉద్ధరించుటలో నిర్వురి భావములు నొకటియె. పైకి తీసినాడు. మారుమాటలేక నిజపురమునకు యయాతిని పంపించినాడు నన్నయ.

కాని పోతన దేవయానిచే నపుడే యడిగించుచున్నాడు. "నన్ను పాణిగ్రహణ మొనర్చితివి - నీవే నాథుడవు - నాకును కచుని శావమున్నది-నా భారము నీవే భరింపవలయునన్నది-చక్కని సన్నివేశము. పట్టు దాటిన నేమో ! సమయములో సమయమని పోతన దృష్టి. ఎంతటి పరిజ్ఞానము !

తర్కించి తర్కించి గాని ఊ అనడు నన్నయ. యయాతి రాజు, దేవయాని బ్రాహ్మణ కన్యక-అంతలో ఒప్పుకొనుటకు నన్నయ కుల బ్రాహ్మణుడు-పరమధర్మవిదుడును-ఎన్ని రుచిరార్థ సూక్తులు ఎన్ని తర్క వితర్కములు-ఎన్నెన్ని పూర్వాపర పక్షములు చూచి జరిపి

నిరూపింపవలయునో నన్నయ సమ్మతికి. అందువనే కాబోలు నన్నయ గారి దేవయాని అపుడేమియు మాటాడక మరొకతూరి శర్మిష్ఠతోను, చెలికత్తెలతోను ఆడుచున్నపుడు వచ్చిన యయాతిని వలచి వలపించి వెలయగ ధర్మాధర్మంబులు నడపుచు నిఖిలలోకపూజ్యుండై నిర్మలుడగు శుక్రునిచే చెప్పించి ధర్మబద్ధమనిపించిగాని పెండ్లి చేయలేదు. నన్నయ. అంతటి చాదస్తము. నన్నయ కొన్ని తావులలో పైగా వారి దేవయాని యయాతిని కచదేవయానుల ప్రణయవృత్తాంత మేమియు చెప్పలేదు. అసలు నన్నయగారి యయాతి కావియషమే తెలియదు.

పోతన్న, యదార్థమునంతయు దేవయానిచేతనే యయాతికి చెప్పించి, ఆమె యెడ యయాతి మనమభిలాషపడుటయు, ఈశ్వరాజ్ఞయని అప్పుడే పెండ్లి గావించినాడు.

నూతిలోనుండి బైటికివచ్చి, తండ్రితో చెప్పి దుఃఖించినది దేవయాని. దానితో శుక్రున కాగ్రహము కల్గినది. "క్రూరాత్ముల మందిరములలో పౌరోహిత్యముకంటె కపోతవృత్తి యుత్తమ" మనుకొన్నాడు. పుత్రికతో కూడ అడవికి దారితీసినాడు.

కాని నన్నయగారిలో దేవయాని పురప్రవేశమే చేయదు. చెలియలిచే తండ్రికి తెలియజేసినది. తండ్రి వచ్చినాడు. కారాల మిరియాల నూరలేదు.

'అనుపమనియమాన్వితులై అనూనదక్షిణల గ్రతుసహస్రంబులు చేసిన వారికంటె నక్రోధనుడు కరం బధికుడండ్రు తత్వవిద్జ్ఞుల్.'

'అలిగిన అలుగక ఎగ్గులు పలికిన విననియట్లు ప్రతివచనంబుల్ పలుకక నున్నతడ సూవె ధర్మజ్ఞుండిలన్'

'బుద్ధిగలవారికి క్రోధంబు తగదు.'

ఏమి రుచిరార్థసూక్తులు! తీయగమందలించినాడు. భీష్మించిన దేవయానితో గతిలేక ప్రయాణమైనాడు.

పిల్ల పట్టుపట్టిన మాత్రాన జ్ఞాని, వివేకియగు శుక్రుడాలోచింప

వలదా ? అందుకని యేమో ఏకముగ శుక్రునిచేత యలుక తీర్పించి నాడు పోతన్న. దీనికిక తిరుగు లేదు.

శుక్రునివలన మహోన్నత భవితవ్య మాసించుకొన్నాడు. వృషపర్వుడు ఎదురేగి బ్రతిమాలుకొన్నాడు. వలసినట్లు జరిపెద నన్నాడు. శుక్రుడే తన కూతునకు వేయిమంది చెలియలతో రాజ పుత్రికను దాసిగ నిమ్మనినాడు.

నన్నయగారు శుక్రునకు సంక్రమింపజేయలేదు. దేవయనియే కోరుకొన్నది. శుక్రుడు కోరిన వరముతో దేవయాని కోపము తీర దేమో ? కోపించిన యీమెయే కోరుకొనుట యొప్పునుకదా ! వేయిమంది చెలికత్తెలతో దాసియైనది శర్మిష్ఠ. శుక్రుడు దేవయానిని యయాతికిచ్చి పెండ్లి కావించినాడు. అత్తవారింటికి పంపుచున్నాడు పుత్రికను. అల్లునకు శర్మిష్ఠా సంగమము నిషేధించినాడు. దేవయా నితో సుఖముల తేలుచున్నాడు యయాతి. ఇద్దరు పుత్రులు.

శర్మిష్ఠ ఋతుమతియైనది. అశోకవనికాసమీపగృహములో వసతి. ఇప్పుడు పోతన్నగారు దేవయాని సెరగుమూసి వెలుపలనున్న యెడ, యయాతి శయనమందిరమునకు శర్మిష్ఠను పంపినాడు. మన మాపగలేని యయాతి, శుక్రుని సమయ మెరింగియు రమించినాడు. ఇక్కడ పోతన్న గడుసుతనముగా తప్పుకొన్నాడు. 'రాజట-నద్రహాస్య మట-రాజకుమారిని మాననేర్చునే !' లోకమున కెంత దగ్గరగా నున్నాడో పోతన.

నన్నయ యయాతినే అశోకవనికాలోకన తత్పరుని చేసి తెచ్చినాడు శర్మిష్ఠ చెంతకు. ఆమెయు, 'ఆలునుదాసియున్ సుతుడు నన్నవి పాయనియర్థములని 'నీచే భరింపబడు నేను నీకు సంగ్రహా యోగ్యంబ'నని వేడుకొన్నది శర్మిష్ఠ.

'చనుబొంకగ ప్రాణాత్యయమున సర్వధనాపహరణమున వధగా వచ్చిన విప్రార్థమున, వధూజన సంగమమున వివాహ సమయ ములందున్' అన్నది.

ఎంతటి నయశాలిని. శర్మిష్ఠకూడ నీతిపారంగతయే ! ఔను నన్నయగారి గాలితగిలినంత వరకు నది తప్పదు. ఒడంబడినాడు...... ముప్పురు తనయులు. పూరుడీమెకు కడగొట్టు-యదుడు దేవయానికి తొలిపుట్టువు.

పతివిహితానురాగమున వంచితయైన దేవయాని యలిగి తండ్రితో చెప్పినది. పుత్రిక కవమానము సహింపని శుక్రుడు యయాతిని, కాంతాహేయమగు జరాభారముతో పీడింపబడుదువని శపించినాడు. నీ పుత్రికయందు నా వాంఛ తీరలేదన్నాడు యయాతి-సమయజ్ఞుడు. నీ ముసలితనము నీ పుత్రులలో నొకరికిచ్చి వారి యౌవనము తీసికొన నాజ్ఞాపించినాడు. వలసినన్నాళ్ళు అనుభవించి తిరిగి ముదిమి తీసుకొన్నాడు. ముదిమి తీసికొని తరుణత నిచ్చుకొన్న కట్టివాడే రాజ్యపాలనార్హుడగునట !

కొడుకు లైదుగురఎదుట - తండ్రి ప్రాధేయపడుచున్నాడు. యౌవనమిచ్చి ముదిమిగొను తండ్రికి యద్వాదులిచ్చు సమాధానము. నన్నయగారి పోకడ—

"తగిలి జరయు,రుజయు దైవవశంబున నయ్యెనేని వాని ననుభవింత్రు
గాని ఎరిగిఎరిగి కడగి యీరెంటి జేకొందురయ్య యెట్టి కుమతులైన ?
ఎంతటి రూపసియైనను, ధనవంతుడైనను, జుట్టు నెఱిసిన మాత్రమున
కాంతలు రోయుదురే! అట్టిచో జరాపరిభూతి భోగశూన్యము కాదా!"

అన్నారు. ఒక్కండు నొడబడలేదు. పెట్టిన తినుటకా యని కోపించి నోటికి వచ్చినట్లు శపించినాడు. కాని శర్మిష్ఠానందనుడు పూరుడంగీకరించినాడు. బాలుడయ్యును భూరిగణజ్యేష్ఠుడు వంశకరుడు పూరుడు.

ఆ యద్వాదుల సమాధానమే పోతనగారి సుమధురశయ్యా సౌభాగ్యములో నొక రేఖ :—

'కాంతాహేయము, బంధునింద్యము, దురాకంపాతిమిశ్రంబు, హృ
చ్చింతామూలము, పీనసాన్వితము, ప్రస్వేదద్రవణాకంపన,

క్రాంతిస్ఫోటకయుక్తమిీ ముదిమివాంఛన్ తాల్చి నానాసుఖో
పాంతంబైన వయోనిధానమిది యయ్యా తేర యీవచ్చునే.

మరియు పోతనగారి పూరుని బాలభాషితములు.

'మునివృత్తిఁదయ్యా నేటికి, జనపాళిక సుగతిఁగోరు సత్పురుషులకుం,
దనకన్నతండ్రి చెప్పిన పనిచేసిన సుగతి కొంగుపసిఁడియకాదే !

పోతనకు చిన్నపిల్లలచే మాటాడించుటయన్న చాలా సరదా!

అక్కడ భారతములో యయాతియే ప్రజలతో చెప్పుచున్నాడు-

'తనయుండు తల్లిదండ్రులు పనిచిన పనిసేయఁడేని పలుకెడలో జే
కొనఁడేని వాఁడు తనయుండనబడునే! పితృధనమునమున కర్హుండగునే?'

(భారతము)

యయాతి నేఁడు యౌవనుఁడు. కామోపభోగము లనుభవించి అంత్యమున పూరుని యౌవనము పూరున కొసగి పరమాత్మను జేరుకొన్నాఁడు.

ఇంతటి మహాకథాకథనప్రవాహము నన్నయ పోతన్నల నడిలోయనుండి, మహానిర్ఝరముగా పొంగి పొరలి భావుల హృదయ కేదారముల భావబీజముల బ్రిదిలించి మొలిపించి పండించినది. ఆస్వాదించి యానందించు భాగ్య మొకటి యుండవలెగదా !

సంస్కృతి. జనవరి; 1954

---

# రెండు అవతారికలు

శ్రీ కాకరపర్తి ముఖలింగశర్మ.

అవతారిక లాంధ్రవాఙ్మయములో నెనలేని ప్రాముఖ్యమును సంతరించుకొని యున్నవనుట సారస్వత విమర్శకులకు క్రొత్తకాదు. కవి అవతారికలలో గ్రంథ రచనా కారణములను తెల్పును తత్కాలీన పరిస్థితులు కొన్నిటిని ముచ్చటించును. వ్యక్తిత్వమును వెల్లడించును. స్వీయ చరితమును వివరించును. తన యిష్ట దైవములను స్తుతించును. సుకవులను పొగడును. కుకవులను తెగడును. పెక్కేల గ్రంథరచనా సాధనమున అవతారికలు ముఖద్వారములు. ఈ వ్యాసమున నన్నయ-నన్నిచోడుల భారత కుమార సంభవ కావ్యావతారికలను పరిశీలించుటయే నా ముఖ్య లక్ష్యము.

నన్నయ భారతావతారికలో గద్యపద్యము లిరువదియైదు మాత్రమే కలవు. సంస్కృతమున శార్దూల వృత్తముతో ప్రారంభమయినది; దేవతాస్తుతి ఇందు కలదు. సంస్కృతములో తెలుగు కావ్యము నేల ప్రారభించెను ? శ్రీ వాణీ గిరిజలను దేవీత్రయము, తత్పతి త్రయము దేనిని వ్యక్తీకరించును ? మొదలగు ప్రశ్నలకు వాఙ్మయ పారావార పరిశోధకులు తమ తమ యభిప్రాయముల నింతకుమున్నె వెల్లడించి యుండుటచే వానిని గూర్చి ఇట ప్రసంగించుట యనవసరము.

కృతిపతియగు రాజ రాజ నరేంద్రుని వర్ణించుచు నన్నయ ముఖ్యముగా మూడు విశేషణము లుపయోగించెను. 1. తత్ప్రసాద సమాసాదిత ప్రవర్ధమాన మహామహీ విభవుడు 2. నిజ భుజ విక్రమ విజితారాతి రాజ నివహుడు. 3. అఖిల జగజ్జేగీయమాన నానా గుణ రత్నాకరుడు. ఇవి యా మూడు విశేషణములు. 'తత్ప్రసాద సమాసాదిత' అనగా హరిహర హిరణ్యగర్భుల ప్రసాదముచే సమాసాదితమని యర్థము, పై విశేషముల వలన రాజరాజు త్రిమూర్తులను, ప్రధాన

దైవములుగ నారాధించువాడని తెల్లమగుచున్నది. వీరిలో బ్రహ్మకు అర్హత లేదుకదా! అయినచో మిగిలినవారెవ్వరు? హరిహరులు. తిక్కన హరిహరదేవ రూపకల్పనకు నన్నయ తరచుగ నుపయోగించు హరిహరద్వంద్వమే ముఖ్య కారణము. హరిహర పదము లతికినంతగా శివకేశవులను ద్వంద్వమున్నను, తిక్కన ఈ పదమునే గ్రహించుట నన్నయ యందలి గౌరవాతిరేకమును సూచించును.

బ్రహ్మ, సరస్వతి, వరుసగా వేదములకు భాషకు ప్రతినిధులని మాత్రమే మనము గుర్తింపవలెను. వారి ప్రసాదముచే నిత్య ప్రవర్ధమానమగుచున్న మహా మహీ రాజ్య విభవము గలవాడని మొదటి విశేషణమున కర్థము. రెండవ విశేషణము నిజభుజ విక్రమముచే నిర్జితులైన అరాతిరాజ నివహము కలవాడని తెలుపుచున్నది. నిత్య ప్రవర్ధమానమైన రాజ్యవైభవము కలవాడని వర్ణించినప్పుడు మరల నీ విశేషణమేల? అని కొందరి సంశయము. దైవ పౌరుష శక్తులు రెండింటికి సక్రమమైన ప్రాధాన్యము చూపుటయే, ఈ విశేషణముల లోని విశేషము. దైవశక్తినే కేవలము నమ్ముకొని, పురుషకార విహీనుడైనచో వైభవము చేకూరదు. ఎంత పురుషకారము చూపినను దైవశక్తి యనుకూలింపనిదే ప్రయోజనము లేదనుటను ఎల్లరెరిగినదే ఈ శక్తిద్వయ సమ్మేళనమే మానవుని విభవమునకు నిదానము. అవి సంపూర్ణముగ అనుకూలించినవాడు రాజరాజనరేంద్రుడు. అంతియే కాదు. అరాతి రాజులతో నిరంతర ఘోరయుద్ధములు తటస్థించుట-ధర్మపక్షపాతియగు నతడు జయమందుట సంభవించెననుటయు సూచింపబడినది. ఇట్లనకూలించినను, రాజ్యవైభవ గర్వమున తొంటి సుగుణములన్నియు చెదిరిపోయి దుర్గుణములు గూడుకట్టుకొన వచ్చును. ఆ రీతిగ జరుగలేదని 'అఖిల జగజ్జేగీయమాన నానా గుణ రత్న రత్నాకరు'డను విశేషణము స్పష్టపరచుచున్నది.

నన్నయ దృష్టిలో రాజరాజు ఉరుకాంతిని తుహినకరుడు. మరియు చాళుక్య మన్మథుడు "విమల విచార, కుమార విద్యాధర,

వివిధాగమ, విహితశ్రమ" పదములు రాజరాజు బుద్ధిని స్ఫురింపజేయు పదములు. ఆశ్రిత పోషణము, మనీషి విద్యాశ్రమతత్త్వ విత్త్వము, దానగుణాభిరతి, వర్ణాశ్రమ ధర్మరక్షణ మహిమము రాజరాజు లక్షణములు. భూదేవ కులాభి తర్పణ మహీయః ప్రీతి, భారతశ్రవణా సక్తి, పార్వతీపదాబ్జధ్యాన పూజా మహోత్సవము, సంతతదానశీలత శశ్వత్సాధు సాంగత్యము రాజరాజు నెడదవీడని గుణములు. అతడు తన పరిపాలనా కాలములో నిజమహీ మండల ప్రజను ప్రీతితో పెంచెను. ఇతర మండలాధీశుల నదిమి వారి వలన కప్పములు ముదముతో గొనెను. కప్పమీయని మండలాధిపతుల యుక్కడగించి, దిక్కులందున ఆజ్ఞ వెలిగించెను. విప్రకులమును గాచెను. శరణాగత భూతులను బ్రోచెను. అగ్రజన్ముల కనుగ్రహముతో చారుతరాగ్రహారములను నిర్మించెను. దేవభోగములను మహా విభూతితో దసర జేయుచుండెను. రాజరాజు సనాతనాచారములను, ధర్మములనూ-చక్కగా విస్తరింపగలిగెనని నన్నయ సంతృప్తి చెందుట చేతనే భారతాంధ్రీకరణమునకు, కృతిపతిగ నతని నెన్నుకొనుటకు సమ్మతించెను. రాజరాజును కుమార విద్యాధరుడని వాకొనుచు వివిధాగమ విహితశ్రముడని పేర్కొనెను. ఈ "ఆగమ, పదము ముఖ్యముగ శైవాగమములనే సూచించును. నన్నయ నాటికి వేదవిరుద్ధ మతము లున్నట్లే శైవమును ప్రబలముగ నున్నది. మాదిరిన శైవముకంటె హరిహరాద్వైతమే నన్నయ కిష్టము. కాని రాజరాజు విషయమున షద్భేదము కలదు. రాజరాజు పాండితీ సంపదను తెల్పు నీ పద్యము చూడుడు :—

"విమల మతిం బురాణములు వింటి, ననేకము లర్థధర్మశా
స్త్రములఁ దెలింగెతింగితి, సుధాత్తరసాన్విత కావ్యనాటక
క్రమములు పెక్కు సూచితి, జగత్పరి పూజ్యములైన యీశ్వరా
గమముల యందు నిల్పితిఁ బ్రకాశముగా హృదయంబు భక్తితోన్

స్వయముగా రాజరాజు నన్నయతో పల్కిన నీ మాటలు

పురాణార్థ ధర్మములకు, ఉదాత్తతర సాన్విత కావ్య నాటక క్రమములు పెక్కు సూచుటకు రెండు పాదములు చెల్లినవి. తక్కిన రెండు పాద పాదములలో జగత్పరిపూజ్యములైన యీశ్వరాగమములందు హృదయము భక్తితో నిల్పుట తెల్పబడినది. ఈ ఈశ్వరాగమములనగా శైవాగమములని యర్థము. అదియే నన్నయ ముందు చెప్పిన వివిధాగమ విహిత క్రమతత్త్వము పంద్రెండవ పద్యములో "పార్వతీ పదాబ్జ ధ్యాన పూజా మహోత్సవము" రాజరాజు హృదయమున సుస్థిరమని నిశ్శంశయముగ నుదాహరింపబడినది. నన్నయ పలుకులలో రాజరాజు త్రిమూర్త్యారాధకుడును, వివిధాగ విహితక్రముడు కాగా, రాజరాజు తనను ఈశ్వరాగమములయందు భక్తి నిల్పిన వానిగఁ పార్వతీపతి పదాబ్జధ్యాన పూజామహోత్సవునిగ పరిచయము గావించెను. క్రోడీకరించి చూడ నన్నయ త్రిమూర్త్యారాధకుడు. హరిహర భేదము నంగీకరించుడు. రాజరాజు శైవుడు. శైవాగమ పండితుడు. ఇదియే కృతికర్తకు కృతి పతికి గల యీ పద్యావభేదము. రాజరాజు కాలము నాటికి వర్ణాశ్రయ ధర్మములు నిల్పుటకు బౌద్ధాది మతము లంగీకరింపనట్లే వీరశైవము నంగీకరింపదు. అవి రాజరాజు కెంతమాత్రము నిష్టము కాకపోవుటచేతనే వర్ణాశ్రమ ధర్మరక్షణ గావించెను. అగ్రహారముల పెక్కింటిని అందున చారుతరములనగా ప్రకృతి సుందర గ్రామములను బ్రాహ్మణులకు దానము చేసి భృతి కల్పించెను. అంతవరకు నితర మతముల తాకిడికి తట్టుకొనలేక పూజా పురస్కారములు లేక శూన్యమయిన దేవాలయములలో రాజరాజు నిత్య భోగరాగములకు తగిన కట్టుదిట్టములు గావించెను. అనగా మతస్వాతంత్ర్యము, మతానురక్తి యితని పాలనలోని విశేషములు. కావుననే దేవ భోగముల మహా విభూతి తనరఁజేయువాఁడని నన్నయ ప్రత్యేకముగ వర్ణించెను.

రాజాస్థానములలో కూర్చున్న పెద్దల క్రమమిట్లున్నది మొట్టమొదట పేర్కొనబడినవారు 'అపార శబ్దశాస్త్ర పారగులైన వైయా

కరణులు.' తరువాత భారత రామాయణాద్యనేక పురాణ ప్రవీణులైన పౌరాణికులు. ఆపై మృదు మధుర రసభావ భాసుర నవార్థ వచన రచనా విశారదులయిన మహాకవులు. వారి తరువాత వివిధ తర్క విగాహిత సమస్త శాస్త్ర సాగర గరీయః ప్రతిభులైన తార్కికులు విద్వజ్జనములు. విద్యా విలాస గోష్ఠియందు రాజరాజునకు మక్కువ ఎక్కువ. నన్నయకు పై చెప్పినవారిలో వైయాకరణులందమిత గౌరవము కలదనుటకు వర్ణనా క్రమమే నిరూపించుచున్నది. తనను పరిచయము గావించుకొనునపుడు విపుల శబ్ద శాసనునిగా తొలుదొల్త ప్రకటించుకొనుట యాతని వైయాకరణాభిమానమునకు గురుతుగా మనము గ్రహింపవచ్చును. ఇది నన్నయ వ్యాకరణ శాస్త్ర పారీణ తను వ్యాకరణ శాస్త్ర రచనను చెప్పకయే చెప్పుచున్నది. "శబ్దశాస్త్ర పారగులైన' 'విపుల శబ్దశాసను, ఆంధ్ర శబ్ద చింతామణి' యను పదములలోని శబ్ద పదైకత్వమును గుర్తించిన నన్నయయే చింతామణి రచించెననుటలో నభ్యంతరము లేదనుకొందును. అదియు చాలని వారికి చింతామణిలోని మొదటి సూత్రము కొంత సమాధాన పరుపగలదు. ఈ సూత్రము 'విశ్వశ్రేయః కావ్యమ్' 'శ్రేయసే' శ్రేయః శబ్దమును వ్యాకరణాదిని, కావ్యాదిని నన్నయ ఎంత నేర్పుమెయి నుపయోగించెనో పరిశీలింపవచ్చును. పై చెప్పినవి కాకతాళీయములని తలపోయువారికి వందన సహస్రమర్పించుటయే యుక్తమపద్ధతి.

నిన్న మొన్నటి వరకు పురాణ పఠనము. పురాణార్థప్రవచనము ఒక విద్యగా భారతదేశమున విలసిల్లినవి. ఒక వైయాకరణి లేదా, మహాకవి - ఒక తార్కికుడయినంత మాత్రమున పౌరాణికుడు లేడు. ఈ విద్యలో,-శ్రోతృ,-పురాణ పౌరాణికుల సంపుటీకరణమున్నది. అందువల్లనే యది యొక ప్రత్యేకవిద్య. ఆవిద్యలో నన్నయ నిష్ణాతుడు. బ్రహ్మాండాది నానాపురాణ విజ్ఞాన నిరతుడనని నన్నయ చెప్పుట కిదియే కారణము.

మహాభారతాంధ్రీకరణమునకు మున్నె నన్నయ, సంస్కృత భాషలో, తెనుగు భాషలో కావ్యములు రచించి శోభించెను.

తెనుగున తాను రచించిన కొన్ని కావ్యనామములైనను వినుచు న్నాము గాని, సంస్కృత కావ్యముల నామములైనను తెలియక పోవుట మన దురదృష్టము. ఏ విషయముపై నెట్టి కావ్యమును సంస్కృతమున రచించెనో కూడా మనకు తెలియదు. కాని యవి మద్యమధుర రసభావ భాసుర రచనా శోభితములని మాత్ర మూహింపవచ్చును. "ఉభయ భాషా కావ్య రచనాభి శోభితు" అని నన్నయయే చెప్పినందున నిది యూహాగా త్రోసివేయరాదని మనవి.

రాజరాజు దృష్టిలో నన్నయ కులబ్రాహ్మణుడు. అనురక్తుడు అవిరళ జపహోమ తత్పరుడు, సంహితాభ్యాసుడు. సద్వినుతావదాత చరితుడు. సత్ప్రతిభాభియోగ్యుడు. నిత్య సత్య వచనుడు. మత్యమరాధిపాచార్యుడు. సుజనుడు. నన్నయ- స్వరూప చిత్రణకివి తోడ్పడును. కులబ్రాహ్మణుడనుటవలన పురోహితత్త్వమును, అవిరళజపహోమ తత్పరుడనుటవలన, అతనికర్మానుష్ఠాన తత్పరతయు సద్వినుతావదాత చరితుడనుటవలన సమయోచిత బుద్ధి నైశిత్యమును, నిత్య సత్య వచను డనుటవలన సూనృత తత్వమును, (సత్య వచనుడగుటచేతనే శకుంతలచే సభలో సత్యమహిమనంత విపులముగా వర్ణింపజేసెననియు, దుష్యంతు నంతటి వాడనృతమేల యాడినాడని మానసిక సంఘర్షణకు లోనయినాడనియు కొందరందురు) మత్యమరాధిపాచార్యుడనుటవలన క్లిష్టపరిస్థితులలో నీతనిబుద్ధి రాజరాజునకు సర్వ విధముల నుపయోగించినదనియు, సుజనుడనుటవలన జన సామాన్యములో మంచి గౌరవము కలదనియు తెలియును.

నన్నయ ఎంతటి లోకజ్ఞుడో, ఈ క్రింది విషయము నిరూపించును. భారత రచన నాకిష్టమనియు, నాపూర్వులు పాండవులు కావున వారి చరిత్ర విందుననియు, భారత బద్ధ స్పృహులగువారికి బహు యాగములఫలము పరమార్థమగుననియు రాజరాజానతిచ్చి నన్నయను ప్రేరేపింప 'దేవా ! నీ యనుమతంబున, విద్వజ్జనంబుల యనుగ్రహంబునం జేసి నా నేర్చు విధంబున నిక్కావ్యంబు రచింతు' ననెను.

ఎదురులేని రాజు తన కానతీయ, సంతోషముతో సమ్మతించి — తది తరులకంటె గొప్పవాడనని గర్వించుటకు బదులు విద్వజ్జనంబుల యనుగ్రహంబునంజేసి కావ్యమును నా నేర్చు విధంబున రచింతు నన్నాడు నన్నయ. ఏల ? నాటి విద్వజ్జనులు తెనుగులో నీ సంహితను పరివర్తనము చేయుటకు సుముఖులుగ లేరు. వారి నంగీకరింపజేయ వలెను. ఈనాడు రాజు నానతి మెయి రచించినను, విద్వజ్జనముల యనుగ్రహము లేనిదే ప్రచారములోకి రాలేదు. ఆ కారణమువలననే రాజరాజు సంభాషణలోలేని విద్వజ్జనముల యనుగ్రహము నితడర్థించెను. విశ్వవిద్యాలయములవలె స్వతంత్రము లయిన నాటి 'పరమ వివేక సౌరభ విభాసిత సద్గుణ పుంజ వారిజోత్కర సుచిరంబులై సకల గమ్య సుతీర్థములై, మహా మనోహర సుచరిత్ర పావన పయః పరిపూర్ణములైన సత్సభాంతర సరసీ వనంబులను' కొనియాడి వారి మన్ననందెను. ఇదియు నాతని లోకజ్ఞతకు నిదర్శనమే.

నారాయణభట్టు రాజరాజుచే నంతకుమున్న సంభావితుడై యుండవచ్చును. కాని తన యానతితో నారాయణభట్టు తోడుగా భారతాంధ్రీకరణము నెరవేర్పుమని రాజరాజు తెల్పలేదు. నన్నయకు నారాయణభట్టు సహాయము మిక్కిలి యవసరము. అతడష్ట భాషా విశారదుడు. బహు భాషల, బహు విధముల భారతమెట్లున్నదో, అందలి పాత్ర పోషణ ఎట్లు సాగిదో అనువాదపద్ధతి ఏరీతిగనున్నదో చెప్పగల సామర్థ్యము నారాయణభట్టునకు పుష్కలముగా నున్నది. అదియుగాక నారాయణభట్టు తనకిష్టుడు సహాధ్యాయుడు కవిత్వము లో నిపుణుడు వాదనాపటిమలో కుశలుడు. అట్టివాని తోడ్పాటు 'భారత భారతీ సముద్రము దరియంగ నీద' నెంతేని యవసరమున్నదని చక్కగా గమనించుట చేతనే సభ్యుల ముందతని సహాయ మపేక్షించి సాధించెను. భారత భారతీ సముద్రము దరియంగ నీదను విఖ్యాతున కైనను[1] పోలునే యనుటలో భావ్యర్థ సూచన మున్నది.[2] "దేవా ! నీ యనుమతంబున" అను వచనము తన చేతిమీదుగా భారతము

పూర్తి కాదను విషయము స్పష్టము చేయుచునే యున్నది. తదనంతరము నారాయణభట్టు భారత సముద్రము నీదఁబ్రయత్నించునని నన్నయ నమ్మియుండవచ్చును.

నన్నయ కవితలోని ప్రత్యేకతలు ప్రసన్న కథా కలితార్థ యుక్తిత్వము, అక్షరరమ్యతలు. అక్షర రమ్యతగూర్చి యుద్దండ పండితులు తమ తమ యభిప్రాయములను వెల్లడించియున్నారు. అక్షర రమ్యత యన పదరమ్యతయనియే కొందరి తలఁపు. ఆంధ్రీకరణ నిర్వహణ కంతగ నుపయోగింపక పోయినను, నానారుచిరార్థ సూక్తులచే నెదుటివారిని తనకు సుముఖులుగా జేసికొను శక్తిని మాత్రము వెల్లడింపక పోదు.

భారతాంధ్రీకృతికి స్వార్థము ప్రేరేకముగాదు. జగద్ధితమే ప్రయోజనము. నన్నయకు, రాజరాజునకు భారతము ప్రీతిపాత్రమగుటకు కొన్ని ప్రత్యేక కారణములున్నను సమిష్టి కారణములుగా - భారత విశ్వజనీనత, శాస్త్రార్థములు వెల్లడించుట, నీతులను వాకొనుట, మహాకావ్యలక్షణములుండుట, లక్ష్యసంగ్రహమగుట-ఇతిహాసమగుట, పురాణ సముచ్చయ మగుటలు చెప్పవచ్చును. విశ్వశ్రేయస్సు సాధించుట కింతకంటె నేమి కావయును ?

నన్నెచోడ మహాకవి కుమార సంభవ పీఠికలో దేవతాస్తుతిని విపులముగ నొనర్చెను. ఇష్టదేవతా నమస్కారమ్మును సమస్త దేవతా స్వరూపంబును తదీయ గురు చరణారవిందంబు నభినందించుటయు పదునారు గద్యపద్యములలో నున్నది. మొత్తమీతని యవతారిక అరువది ఎనిమిది గద్య పద్యములు.

నన్నయ వేదత్రయమూర్తులను సంస్కృతమున శార్దూల వృత్తములో నుతింపగా నన్నెచోడుడు మహాస్రగ్ధరావృత్తముతో మహాదేవుని తెనుగున నుతించినాడు. అయ్యా 'శ్రీ వాణీ' అని నన్నయ ప్రారంభించినట్లుగనే 'శ్రీ వాణీంద్రామరేంద్ర' యని

శ్రీవాణీ శబ్దముల నుపయోగించుట నన్నయ భారతము నీతడు చదివి నాడనుటకు, అతనియందు భక్తిగౌరవములు కలవాడనుటకు, గురుతుగ చెప్పవచ్చును. మొదటి స్రగ్ధరలో 'ఎప్పుడు' మాకు 'ఇచ్చుగాతన్' ఐ, అను తెనుగు పదములు తప్ప తక్కిన వన్నియు సంస్కృత సమములే, దుజ్వర్ణకములు తీసివేసినచో సంస్కృత శ్లోకమే యగును. నన్నెచోడుడు చిన్న మార్పు గావించి, తెలుగు పద్యముతోనే ప్రారంభము కావించితి ననిపించుకొన్నాడు. తెలుగునకు సంస్కృత మున వ్యాకరణమును వ్రాసిన నన్నయ కావ్యాది నొక్క శ్లోక మయిన వ్రాయనిదే యూరకుండలేడుగదా! నన్నెచోడుడు రెండవ పద్యములో అంబికాధవుడైన శంకరుని, మూడవ పద్యములో స్మిత వక్త్రుడైన పరమేశ్వరుని నుతించెను. మూడు పద్యములు త్రికరణ శుద్ధి నీరీతిగా దెల్పుచున్నవి.

వెంటనే సత్వగుణ స్ఫురణ పరమేశ్వరు వామాంగమున జనించిన కమలాధిపుడగు విష్ణుని, రజోగుణ స్ఫురణ నావహమై పరమేశు దక్షిణాంగమున జనించి, సద్విధి గొల్చి విశ్వము సృజించు వాగ్విభుని సన్మతి స్తుతించెను. ఈ విధముగ నన్నయ యొక్క పద్య ములలో గావించిన త్రిమూర్త్యారాధనను నన్నెచోడుడు విపులము చేసెను. తరువాత భవాష్టమూర్తులలో వరమూర్తియైనట్టి రవిని చారు నిజ ప్రభ యిచ్చుకొరకై నమస్కరించెను. భారతావతారిక తరల ములో నీ రవి ప్రశంస కలదుగదా! నన్నెచోడుడు క్రొత్తగా రవిని స్మరింపలేదు. అయ్యూ, ఇతడు సూర్యవంశపు రాజు, కావున తన వంశకర్తను త్రిమూర్తుల తర్వాత నుతియించుటలో నెంతేని ఔచిత్య మున్నది. ఆపై గణనాథుని స్మరణమును, అభిమత ఫలంబుల జనులకు దయనొసగు షణ్ముఖుని గొలిచెను. మరుని కూడా స్మరించి తనకృతి కఖిల వశ్యమతి యీయవలసినదని ప్రార్థించెను. మదనుడు, లేనిదే కుమార సంభవము లేదు. శంకరునకు ప్రతిపక్షియైన మరుడోడినట్లు కన్పట్టినను తుదకు గెల్చినవాడు అతడే. వశీకరణశక్తి కధినాథుడు

కనుక నతని బ్రార్థించెను. ఈ క్రొత్త సంప్రదాయమునకు తెనుగున ప్రారంభోత్సవము గావించినవాడు నన్నెచోడుడే. ఈ మదన సంస్మరణ తప్ప తక్కిన వారిని నన్నయ సంక్షిప్తముగ నుతించినట్లు మనము భారతావతారికలో చూడవచ్చును.

వేదాగమ రూపమున మహాదేవునపార గుణమహా సంస్తుతి సేయు భారతిని గొల్చిన తరువాత "అమలజ్ఞాన సుదీపవర్తిగొని వృద్ధాచారుడై వేదశాస్త్రములందున్న సదర్థమెల్లగాని విద్వత్ప్రీతి గావించువాని, మహాత్ముండన బొల్చు బుణ్యావిధి వాణీముఖ్య సర్వజ్ఞ జంగమలింగంబగు మల్లికార్జును సదా గల్యాణు గీర్తించెదన్" అని గురువున కెరగెను. ఈ పద్య రచనా రీతికి, భారతములోని 'విమల మతిం బురాణములు' అను పద్య రచనా రీతికిని గల సామీప్యమును గమనింపవచ్చును.

వేద ప్రామాణికత్వమును నన్నయవలె నన్నెచోడుడును అంగీకరించినాడు. వీరశైవులు విష్ణునామమును నిందకేతప్ప స్తోత్రమునకు స్మరింపరు. హరుని వామదక్షిణభాగ సంజనితులగుటచే హరి హిరణ్యగర్భులు నితనికి సేవ్యులే యగుచున్నారు. రాజరాజు శైవాగమములయందు చిత్తము నిల్పినట్లే పార్వతీ పదాబ్జ ధ్యాన పూజా మహోత్సవుడైనట్లే నన్నెచోడుడు నంబికాధవుడగు శంకరు నభీష్ట సిద్ధికై ప్రార్థించెను నన్నయ కృతిపతి రాజరాజు. నన్నెచోడుని కృతిపతియగు జంగమ మల్లికార్జునుడు. తీర్థము స్వార్థము కలిసినట్లు గురుస్తోత్రము నన్నెచోడునకు కలిసివచ్చినది. నన్నయ గురుస్తోత్రము చేయలేదు. కవులిరువురు మతసమానము కలవారే. అయ్యు, నన్నయ భారతాంధ్రీకరణమునకు పూనుకొనుటయు హరిహరులలో హరిని ముందిడుటయు, నతని యద్వైత సిద్ధికిని-నన్నెచోడుడు కుమార సంభవమును రచించుటయు, తొలుదొల్త హరుని నుతియించుటయు, నతనిశైవ మతాభిమానమునకు తార్కాణములు.

నన్నయ తన అవతారికలో దేవతాస్తవము, తరువాత దుర్భర తపోవిభవాధికుడును గురుపద్య విద్యకు నాద్యుడును, అంబురుహ గర్భ నిభుడునగు ప్రచేతన పుత్రుని నుతించెను. అనంతరము భారత భారతీ శుభగభస్తిచయంబుల జేసి ఘోర సంసార విశార సంతమ సజాల విజృంభము వాపి, సూరిచేతో రుచిరాబ్జ బోధన రతుండగు దివ్య బరాశరాత్మ జాంభోరుహ మిత్రు ముని పూజితు యశోవిరాజి తుని గొల్చెను. నన్నెచోడుడు-

"కవితామృతో దయాంబుధి
కవి సజ్జన జనకు వస్తు కావ్యాబ్జ రవిన్
కవితారంభంబుల స
త్కవు లభినందింతు రాదికవి వాల్మీకున్" నుతించెను.

సత్కవులనగా నన్నెచోడుని యుద్దేశములో నన్నయ. 'కవితారంభంబుల' అను మాటలోని స్వారస్యమును గమనింప – వాల్మీకి సంస్కృత కవితకు మూల పురుషుడనియు, తెనుగు కవితారంభ మొనర్చిన నన్నయ ఆదికవి వాల్మీకిని నుతించెననియు తోచుచున్నది. నన్నయ గురుపద్య విద్యకు నాద్యుడని వాల్మీకిని ప్రస్తుతింప – నీత డాదికవియని వాకొనెను. కవితామృతోదయాంబుధి-కవిసజ్జన జనకున్ వస్తు కావ్యాబ్జ రవిన్ అను విశేషణములు నన్నయ కవితకు మెరుగు దిద్దుట వంటిది. రెండవ పద్యములో వేదవ్యాసుని ప్రశంస నన్నయ వలెనే నన్నెచోడుడు నొనరించెను. అతడు, భారతాది పురాణ రచన పెద్ద పొగడదగినది కాదనియు, అజుడు కూడా సేయనోపని వేద విభాగ మొనరించుట కతన వేదవ్యాసుని నమస్కరింతుననియు దెల్పెను. ఇదియు నన్నయ వర్ణనకు మెరుగులు దిద్దుటవంటిది. ఎట్లన నన్నయ యుత్పలమాలలో వేదవ్యాసుని పొగడియు వేదవ్యాసత్వము గూర్చి నుడువనేలేదు. నన్నెచోడుడా పురాణాది కర్తృత్వము ఘనము కాదనుచునే పొగడి, అతని వేద విభాగ నైపుణిని కొనియా డెను. తన యుద్దేశమది కాని నాడు-రచింపని వేదములను విభజించిన

వ్యాసుని కవిస్తుతిలో నన్నెచోడుడు చేర్చియేయుండడు. అనగా అతని యుద్దేశంలో భారతకవియగు వ్యాసునిపొగడినప్పుడు వేదవ్యాసత్వము పేర్కొనుట సముచితమని వాల్మీకి వ్యాసుల సంస్మరణానంతరము నన్నయ సత్సభాంతర సరసీవనమున్ గొనియాడి యూరకుండెను. కాని, నన్నెచోడుడు మరికొంచెము పురోగమించి కాళిదాస-భారవి-ఉద్భట బాణులను పొగడినాడు. ఇచ్చట నన్నెచోడుని మతప్రీతి గమనింప దగినది. వాల్మీకి శైవకవి కాకపోయిన నతని పొగడెను. వేద వ్యాసుడు నమస్కారార్హుడే. సంస్కృత కవులలో కాళిదాసు, భవ భూతి, దండి, మురారి, మాఘుడు మొదలగు గొప్ప కవులున్నారు. వారిలో కుమారసంభవ రచయిత కనుక కాళిదాసునకు నమస్కరించి తరువాతి స్థానము భారవికిచ్చెను. ఇతడు కిరాతార్జునీయమును రచించు టయే యందుకు హేతువు. భారవి తరువాత కుమార సంభవమును గూఢవస్తుమయ కావ్యముగ చెప్పిన యుద్భటుడును, కరముల దును మగా పరమేశ్వరు ప్రీతికరముగా కవిత్వము చెప్పి మగుడు కరములు వడసిన బాణుడును ప్రసంసింపబడిరి. మీద చెప్పిన కవులు స్తుతి పాత్రులే సందియములేదు. కవిత్వ భక్తిభావములు రెండును ప్రధాన ముగ భావించి నన్నెచోడుడీ మార్గమును ద్రొక్కెను. హారవిలాస ముల నుగ్గడించిన కవులనే నన్నెచోడుడు పేర్కొనినాడని తరువాతి శైవకవులు భ్రమించుటకిది యాధారమైనది.

నన్నయ కవిస్తుతిలో దేశికవులను నుతింపనేలేదు. నన్నె చోడుడును పేరుపెట్టి నుతింపలేదు కాని—

"మును మార్గ కవిత లోకం
బున వెలయఁగ, దేశికవిత బుట్టించి తెనుం
గున నిలిపి రంధ్ర విషయం
బునఁ జనఁ జళుక్యరాజు మొదలుగ పలువుర్"

అని చాళుక్య రాజులను సంస్మరించెను. చాళుక్య రాజులనగా రాజ రాజ నరేంద్రాదులు. నన్నయ యుత్తమ చాళుక్యునిగ రాజ రాజ

నరేంద్రుని పొగడెను. నన్నయనాడు గ్రంథ రచన సంస్కృతమున జరుగవలసినదే. కాని తెలుగున కారాదు. అందుచేతనే చింతామణిని సంస్కృతములోనే రచించెను. నిక్షేపముగా తెనుగు వ్యాకరణమును తెనుగున రచించుకొనక సంస్కృతములో నేల రచింపవలసి వచ్చెను? దాని కారణము నాటి యాంక్షయే. అంతవరకు సంస్కృత భాషా కావ్యములే రచించిన నన్నయను-ఆ మార్గము వదలి, దేశి కవిత్వ మును చెప్పమని ప్రోత్సహించిన వాడును రాజరాజే. మన కంటే నన్నయ కాలమునకు సన్నిహితుడు కనుక నన్నెచోడున కీ విషయ ములు తెలిసియుండవచ్చును. అందుచేతనే దేశికవిత్వమున కాధార భూతులయిన చాళుక్యరాజులు-అనగా రాజరాజాదులు-నుతింపబడిరి. మార్గదేశి కవిత్వ లక్షణములగూర్చి పెక్కు వాదోపవాదములయినవి

అందులో తలదూర్చుట నా యభిమతముకాదు. అయినను నా యుద్దేశములో మార్గ కవిత్వమనగా సంస్కృత కవిత్వము. దేశి కవిత్వమనగా తెనుగు కవిత్వము. ఈ క్రింది పద్యమును గమనింపుడు-

"సురవరులం గ్రమంబున వచోమణి సంహతిఁ బూజచేసి మ
ద్గురు చరణార విందములకుం దగ సమ్మతిఁజేసి కొల్చి వి
స్తర మతులం బురాణ కవి సంఘము, నుత్తమ మార్గ సత్కవీ
శ్వరులను, దేశి సత్కవుల, సంస్తుతిఁజేసి మనో ముదంబునన్"

ఇందు పురాణ కవి సంఘ మనగా వాల్మీకి వ్యాసులు. ఉత్తమ మార్గ సత్కవీశ్వరులనగా, కాళిదాస, భారవి, ఉద్భట, బాణులు. దేశి సత్కవులనగా చాళుక్య రాజాస్థాన కవులు నన్నయాదులు. ఈ సరళ మగు నర్థమును మనము గ్రహింపనినాడు—'ఉత్తమ మార్గ' మునకు శ్రేష్ఠమైన మార్గమను కేవల పదార్థముతోనే తృప్తి పడవలసివచ్చును దేశికవులను నన్నయ నుతింపలేదు. నన్నెచోడుడును పేరుపెట్టి నుతింపలేదు. ఆ యాచారమున కెందుచేతనో యీతడు ఒరవడి దిద్దలేదు నన్నయ కవినింద చేయలేదు. నన్నెచోడుడు కుకవినింద

(నాలుగు పద్యములలో) నొనర్చెను. ఈ సంప్రదాయము నన్నయ నన్నిచోడుల నడివి కాలములో నేర్పడియుండునని నా తలంపు. కుకవి నింద చేయుటను ఘనత మనకు తెలిసినంతవరకు నన్నెచోడునకే చెందవలెను.

నన్నయ తన కవిత్వమును గూర్చి చెప్పిన ఈ క్రింది పద్యము సారస్వత విమర్శకులకు సుపరిచితమే. అది :- (సవర్ణముతో ప్రారంభింపబడినది )

"సారమతిం గవీంద్రులు ప్రసన్న కథా కలితార్థయుక్తిలో
నారసి మేలునా, నితరు లక్షర రమ్యత నాదరింప, నా
నా రుచిరార్థ సూక్తినిధి నన్నయభట్టు దెనుంగునన్ మహా
భారత సంహితా రచన బంధురుఁడయ్యె జగద్ధితంబుగన్"

ఇక నన్నెచోడుని పద్యము :- (ఇదియు "స"వర్ణముతో ప్రారంభింపబడెను.)

"సరళముగాఁగ భావములు జాను దెనుంగున నింపు బెంపుతో
బిరిగొన వర్ణనల్ ఫణితి పేర్కొన, నర్థము లొత్తగిల్ల, బం
ధురముగఁ బ్రాణముల్ మధు మృదుత్వ రసంబునఁగందళింప న
క్షరములు సూక్తులార్యులకుఁ గర్ణ రసాయన లీలఁ గ్రాలగాన్"

ఈ రెండు పద్యములు రేఫ ప్రాసగా గలవి. ఉత్పల మొకటి చంపకము వేరొకటి. ఇది యసాలోచితముగనే నన్నెచోడుడు చెప్పెనందురా ? ఎన్నటికిని కాదు. నన్నయ తన కవిత్వమున అక్షర రమ్యత ప్రధాన గుణమన నన్నెచోడుడు తన యక్షరమున లార్యులకు కర్ణరసాయనలీల గ్రాలుననెను. 'అర్థయుక్తిలోనారసి, యని నన్నయ చెప్పగా అర్థములొత్తగిల్ల అని నన్నెచోడుని వాక్కు. 'నానారుచిరార్థసూక్తి నిధి" నని చెప్పికొనగా, నన్నెచోడుడు తన సూక్తులు కర్ణరసాయనములనెను. నన్నయభట్టు 'తెనుంగునన్, అని పల్కగా, నన్నెచోడు' జాను తెనుంగునన్' అని చెప్పెను. చిట్టచివరకు 'బంధురుడయ్యె' అను నన్నయ పదమును తలపించునట్లు నన్నెచో

డుడు, 'బంధురముగ' అను పదమునే యుపయోగించెను. ఈ రెండు పద్యములు సోదర న్యాయముతో నొప్పారుచున్న వనుటలో నాశ్చర్యమేమున్నది. ఇది నన్నయ రచనకు మెరుగులు దిద్దుట వంటిదే. ప్రసన్న కథా కలితార్థయుక్తియు, అక్షర రమ్యతయు నన్నయ కవిత్వ ప్రధాన గుణములు కాగా, 'ఇంపు జెంపుతోఁ బిగి గొన వర్ణనల్ ఫణితి పేర్కొన నర్థము లొత్తగిల్ల ప్రాణములు మధు మృదుత్వరసంబున గందళించి కర్ణరసాయన సూక్తి గ్రాలుట' నన్నెచోడుని కవిత్వ ధ్యేయమైనది. సామ్యములుముందే యుగ్గడించితిని కావ్యమెట్లుండవలెనో యప్పట్టున నన్నెచోడుడు ఎనిమిది పద్యములలో చక్కగా వివరించెను. నన్నయకు సంక్షిప్త పద్ధతి యిష్టము కాగా నన్నెచోడునకు వివరణాత్మక పద్ధతి యిష్టము. కథా ప్రధాన కావ్యపద్ధతికి చెందినవాడు నన్నయ కాగా, వస్తుమయ కావ్య పద్ధతికి చెందినవాడు నన్నెచోడుడు. ఇచ్చట వస్తువనగా వస్తువర్ణనయని గ్రహింపనగును. కావ్యమెట్లుండవలెనో చెప్పనొక పద్యములో కావ్యరత్న పీఠిని వర్ణించి, వేరొక పద్యములో 'రత్నపుత్రికయు సత్కవి కావ్యము నొక్కరూపమై యుండవలదా?'యని ప్రశ్నించును మరియొక పద్యమున 'చీకులావుకం ద్రొక్కిన యట్లు నోర గొలదుల్ పురి గొల్పగా నందులోన నొక్కక్కడు సక్కనైన గృతిఝంచురె? యని హేళన చేయును. ఇంకొక పద్యమున కృతిని వరసతితో పోల్చును. వేరొక పద్యములో 'మదనాగంబును బోలె గ్రాలవలదా? మారెందు లేకున్నతిన్' అని కృతికి మదనాగ లక్షణములు పట్టించును సత్కవి కార్యము, విలుకాని పట్టినమ్మును సమానములు. పట్టినంత మాత్రమున జాలదు. పరహృద్భిదమై తలయూపింపవలయునట! అరువది నాలుగు విద్యలు నేర్చినవే తప్ప కవిత్వము చెప్ప సమర్థుడు కాడనియు, నొకవేళ చెప్పినను, అది నిలువదనియు నన్నెచోడుని నమ్మకము.

కవిత్వ ప్రసంశయు, కావ్య లక్షణ నిర్ణయమును గావించి 'జంగమల్లయ వరమునందు గనిన వస్తు తతి తగిలి వాఙయ్యందె నెగడింతు, నని తలపోసి, గురుడే యిష్టదైవము గాన నతకి కృతియిచ్చి పెక్కు లాభములున్నవని, తన వంశావళిని దెల్పెను. ఇతడు సూర్య వంశపు రాజు. చోడబల్లికి, శ్రీసతికి, తనూజుడు. వీరశైవుడు కాడనుటకు,

"పాత్రుడ న సద్రుశ కాశ్యప
గోత్రుండ సచ్చరిత నుభయ కుల శుద్ధండన్
మిత్రాన్వయ శేఖరుండఁ బ
విత్రీకృత దేహుఁడను వివిధ యజ్ఞములన్"

అను పద్యముపకరించును. నన్నయ తన కులగోత్రాదుల నొక పద్యములో చెప్పికొనగా, నీతడు నాల్గు పద్యములలో వర్ణించుకొనెను. నన్నెచోడుడు వీరశైవ మతస్థుడు కానంత మాత్రమున శైవమత విజ్ఞానము, పక్షపాతము లేవని తలంపరాదు. ఇతడు తన గురువునకు, పరమ శివునకు అభేదాధ్యవసాయము చేసి షష్ఠ్యంతాదులు రచించెను. షష్ఠ్యంతములు నన్నయ కవితావతారికలో లేవు. ఈ సంప్రదాయమునకు నన్నెచోడుడే ప్రారంభకుడు.

నన్నయ భారత పర్వానుక్రమణిక బేర్కొనగా, నన్నెచోడుడు నా చెప్పంబూనిన కథామాత్ర మిట్టిదని

"సతి జన్మంబున్ గణాధీశ్వరు జననము దక్షక్రతు ధ్వంసముంబా
ర్వతి జన్మంబున్ భావోగ్రవ్రత చరితయు దేవ ద్విషత్ క్షోభమున్
సుత సంహారంబు భూ భృత్సుత తపము సుమా సుందరో (?)
ద్వాహమున్ ద
ద్రతి భోగంబున్ గుమారోదయము నతడనిం దారకుం బోరగెల్వున్"

తెల్పెను.

నన్నయ యవతారికలో నెలకొల్పిన సాంప్రదాయమును వీడక, తన కాలమునాటి సాంప్రదాయములను చొప్పించి కొన్ని మెరుగులు దిద్ది, నన్నెచోడుడు తన కావ్యావతారికను సర్వాంగ సంపూర్ణముగ నొనరించి, తరువాతి తిక్కనాది కవుల కవతారికా రచనా మార్గ దర్శకుడయ్యెను.

భారతి. ఏప్రిల్; 1964

---

1, "విధాతృనకై నను" బ్రహ్మకు అనిఅర్థము. ఇది కవిబ్రహ్మను సూచించునని పెద్దలు చెప్పిరి.

2. నన్నయ "ఆదిత్య మంబికాం విష్ణుం గణనాథం మహేశ్వరమ్"అను పంచాయతన స్తోత్రము గావించి'' మాతృ పూజ గావించెను. షట్ కృత్తికలని కొందరందురు. నన్నెచోడుడు వేరొక చోమాతృస్తుతి యొనరించుటచే దేవతాస్తుతిలో వీరిని చేర్పలేదందురు. లేక సరస్వతీ మొదలగు వారికి విశేషముగనైన భావించియుండును.

# రెండవతారికలు : ఒక ఫలశ్రుతి

డా॥ నాయని కృష్ణకుమారి

ఒకపని చేసితిమా, దానినుండి ఒక యానందమును బొందితిమా, ఆ యనుభూతికి కారకులైన ఆర్యులు మన మనస్సులకు తగిలివత్తురు. వెనువెంటనే మనలో నురకలెత్తు తెలుగుదనపు పవిత్రరక్తము కృతజ్ఞతా సాంద్రమగును. ఒకసారి ఒక నిముసములో సగముసేపైన ఒక్క తటిల్లత మెరసి మాయమైనంత అల్పవ్యవధిలోనైనా వారిని గూర్చిన యాలోచనలు మనలో నేతాములెత్తును. అట్లగుట అనుసరింపవలసిన మర్యాద అనిగాదు. ఆచరింపవలసిన విధాయక కృత్యమనిగాదు. తెలుగుతల్లులు తమ పాపల కుగ్గుపాలతో రంగరించిపోసిన మహాగుణమని. తరతరములనుండి యనూచానముగ తరలివచ్చు మహాద్భాగ్యమని తెలుగుభాష యున్నది. దానికో నాటికొక వ్యవస్థ నొందిన సాహిత్యమున్నది అందు పురాణ వాఙ్మయము గలదు. ఉదాత్త గంభీరములైన నీతిబోధలున్నవి. మధుర సారళ్యములు మేళగించిన భక్తి పారవశ్యములున్నవి. శృంగార రసానంద పోషకములైన ప్రాబంధిక గాథలున్నవి. ఇవన్నియు స్వతంత్రములు గావని యొక వెక్కిరింపు. అనుకరణయో అనుసరణయో అనువాదొక యాసఢింపు. అయిననేమాయె! ఆ స్వాతంత్రములని పిలువబడునవి కూడ ఏదో దివ్యశక్తి ప్రేరితములై సృష్టిలో పాదుకొనిపోయిన నగ్న సత్యములకు నాందులు గావేమి? అప్పుడవి మాత్ర మనుకరణములు గాకపోవునా? అనుసరణములు గాదన్న మానునా? ఇది యొక చిక్కువిడని సమస్య అవునన్నవారవునందురు; కాదన్నవారు కాదందురు. అట్టి మన తెలుగు సాహిత్యమునకొక మహాత్ముడు పెట్టినది భిక్ష. ఈనాడది యింతస్థితికి వచ్చినదన్న, మనవారు కవులైరి కవియుల కలవాసనైరి వర్ధిల్లుచుండిరన్న, అది యంతయు నాతని చేతి చలువ. అది కాదనలేదు. కృతజ్ఞతగల యాంధ్ర ప్రాణి.

ఆ పుణ్యమూర్తి అపస్తంబ సూత్రుడు. ముద్గల గోత్ర జాతుడు. పేరు నన్నయ. బ్రాహ్మణ కులమున భట్టారకుడీయన. యజ్ఞము చేసిన సోమయాజి. ఈతడే చాళుక్యరాజచంద్రుడు రాజరాజనరేంద్రుని కుల బ్రాహ్మణుడుగ వర్ధిల్లి గౌరవము పెంచుకొన్నది. ఈతడే నిరంతర సంహితాభ్యసనతత్పరతచే తద్ధర్మములను జీవితమున రంగరించు కొన్నది. ఈతడే వేదబుక్కల గానపవిత్రతను తన వాక్కున నిల్పు కొన్నది. బ్రహ్మాండాది నానా పురాణముల జీర్ణించుకొన్న యిట్టి విజ్ఞాన ఖని వాక్కున కవితాదేవి పీఠము పెట్టుకున్నది. సుప్రసన్న వదనయై యాశిషముల వెదజల్లినది. "బంగారము ఘుమఘుమలాడు" నన్న ఇదియేకాదేమి ?

ఆయన ఆంధ్ర భారతము తెలుగు భాషాదేవికి తొలి పూజా కుసుమము. తెలుగు ప్రాణికే అక్షరభిక్ష పెట్టిన అన్నపూర్ణ. అది అమృతమై యుద్భవించినది. ఆంధ్రుల కమరత చేకూర్చినది. నిజము నకు తదుద్భవమున కెన్ని పాట్లు. తత్సంపాదన కెంత ప్రయత్నము! ఆ కష్టముల కన్నిటికి ఒరిపిడి నన్నయ. ఆ ఉపద్రవముల పొగమంచు నకు బాల సూర్యుడు నన్నయ. ఆయన మంథరమై పండిత మండలిని తరచినాడు. జగన్మోహినియై తెలుగువారికి ధర్మామృతమును పంచి పెట్టినాడు. 'ఓయి అన్ని కష్టములబడెనా. రెండున్నర పర్వములు తెనిగించుటకు?' ఒక్క పేళన తళుక్కున మెరయును మనోవీధులలో

ఇక అవతారికను పరికించితిమా, అందు కొన్నికొన్ని మన కతి విచిత్రముగ కన్పట్టును. వీనినిశ్లోల రచించినాడన్న సందియమునకు చోటిచ్చును. ఆ సందియములు తీర్చుకొనుట మాత్రమే మనపని.

శ్రీ వాణీ గిరిజాశ్చిరాయ దధతో వక్షోముఖాఙ్గేషుయే
లోకానాం స్థితి మావహన్త్య విహతాం స్త్రీపుంసయోగోద్భవామ్
తేవేదత్రయమూర్తయ స్త్రిపురుషా స్సమ్పూజితావస్సురై
ర్భూయాసుః పురుషోత్తమామ్బుజభవ శ్రీకన్ధరా శ్శ్రేయసే

భారతావతారికలోని మంగళాచరణ శ్లోకమిది

వ్రాయునదా తెలుగు భారతము! ఆంధ్రీకరించువాడా తెలుగువాడు నన్నయ. ఆయనకు సంస్కృతమున నెంత యభిమాన మున్నదో తెలుగున నంతకిబ్బడిగ నున్నది. అట్టివాడు నాందిగ సంస్కృతమున శ్లోకము రచించుటేమి? మార్గ యనిపించుకొను సంస్కృతమునుండి కవితా సరస్వతిని దేశీవీథులలో నడిపించుచుంటినే యేమైన బెడిసికొట్టునేమోయని ప్రారంభించెనా? లేక దేవభాష సంస్కృతము, అది గ్రంథమునకు మకుటముగ నుండియే తీరవలయు నని మొదలిడెనా?

తరువాత :-

"అమలిన తారకాసముదయంబుల నెన్నను సర్వవేద శా
స్త్రముల యశేషపారము ముదంబున బొందను బుద్ధిబాహు వి
క్రమమున దుర్గమార్థజల గౌరవ భారత భారతీ సము
ద్రము దరియంగ నీదను విధాతృనకైనను నేరబోలునే?

అని చెప్పుట మరియొక విచిత్రము. ఇట్లు చెప్పుట తన శక్తిని మసుగు పరచుకొనుటకై చెప్పుటయా లేక ఏదేని ప్రయోజనము కొరకు చెప్పుటయా? అట్లు చెప్పిన వెనువెంటనే, "దేవా నీయను మతంబున విద్వజ్జనంబుల యనుగ్రహంబున జేసి నా నేర్చు విధంబున నిక్కావ్యంబు రచించెద' అని వెల్లడించుట మరొక విశేషము ఇవ్విధ ముగ రాజును, పండితమండలిని, తన కావ్య ప్రారంభమునకు సూత్ర ప్రాయముగ నిలబెట్టుటేల? వారి కెట్టి విశిష్టత యున్నది కావ్య నిర్వాహణమున.

తరువాత పండిత సభలను నుతించినాడు.

"పరమ వివేక సౌరభ విభాసిత సద్గుణ పుంజవారిజో
తర్క రుచిరంబులై సకల గమ్యసుతీర్థములై మహామనో
హర సుచరిత్ర పావన పయః పరిపూర్ణములై సత్సభాం
తర సరసీ వనంబుల ముదంబొనరంగొనియాడి వేడుకన్."

అని వానిని 'సరసీవనంబుల'తోడ బోల్చియు నంతతో వద

పర్వానుక్రమణికను జెప్పుచు నందు గూడ జొప్పినాడు. సభాపర్వము 'పండిత చేతో నిర్వృతి జేసినది. "సకల సభారమ్య"మైనది యారణ్య పర్వము. 'సభారంజనమై సర్వ మనోజ్ఞము నాదగి వెలసిన నాల్గవ పర్వము విరాట పర్వము. ఏనవపర్వంబిది నానుద్యోగ పర్వమిమ్మైత్రి నది సభల. అత్యనుపమమై 'సభల' నమరినది ద్రోణపర్వము. ఇట్టులే ఏ పర్వమునకా పర్వము సభల యామోదము జడిసినదని చెప్పుచు వచ్చినాడు నన్నపార్యుడు. ఈ సభలకెందుల కంతటి స్థానము నీయ వలసివచ్చినది ? ప్రతిసారి వానిని నుతింపవలసిన యవసరమేమి కలిగి నది నన్నయకు ?

ఆపైన నారాయణభట్టు నెడల నన్నయభట్టు కృతజ్ఞత

"పాయక పాకశాసనికి భారత ఘోరరణంబునందు నా
రాయణునట్లు దానును ధరామరవంశ విభూషణుండు నా
రాయణభట్టు వాఙ్మయ ధురంధరుడుం దనకిష్టుడున్ సహా
ధ్యాయుడునైన వాడభిమతంబుగ దోడయి నిర్వహింపగన్"

తన పూనిక భారత ఘోరరణము వంటిదట. కాననే తరువాతి శ్రీనాథుడన్నాడాయనను 'భారత ఘట్టోల్లంఘన పటిష్ఠ గాథప్రతిభు' డని తాను పాకశాసనితన నారాయణభట్టు నారాయణుడే. అనిన శ్రీకృష్ణుడర్జునునకు జేసినంత సహాకృతి యాయన నన్నయకు చేసి నాడన్నమాట. ఆ పద్యమున వేసిన చిగురు తోడై నిర్వహించుటలో ఏ అర్థమున్నదో ? ఏ విధముగ నారాయణభట్టు నన్నయకు తోడై నాడు ? ఆయన కలముతో నీయనగూడ కలము కలిపినాడా ? ఆయన భావములతో నీయనగూడ తన భావముల పెనవైచినాడా ? అటులే యయ్యేనేని ఆశ్వాసాంతగద్యములో నారాయణభట్టు పేరు జోడింప నంతటి కృతఘ్నుడు కాడే నన్నయభట్టు. మరి యా సహాయమెట్టిది. ఈ నిర్వహించుటయే విధని ?

ఈ ప్రశ్న పరంపరకంతటికి జవాబులే కావలయునా, వెనుకటి చరిత్ర యంతయు త్రవ్విచూడవలయును. నాడే నన్నయగారి కష్ట ములు, ఆయన భారత రచనా నిర్వహణ కెదురైన్న సమస్యలు, అన్నియు బయటపడునది.

మహారాష్ట్రమున ఆభీరుల కోడి శకులంతరించిపోయిరి. డెబ్బది సంవత్సరములైన పరిపాలనపు ముచ్చట దీర్చికొనిరో లేదో గాని యాభీరుల వంతు కూడ వచ్చినది. అప్పుడప్పుడే కన్నులు దెరచి నేల నాలుగు చెరగుల కలయగొన్న చాళుక్య వీరులు వారిని శాసించినారు. పదభ్రష్టులను జేసి తత్సింహాసన మాక్రమించినారు. వారి బాహుబలవిజృంభణ పరరాజ్య మహావృక్షముల పెకలించి వైచినది. వానిని కలిపి కొన్న చాళుక్య రాజ్యలక్ష్మికి సర్వవాహినుల లయ మొనరించుకొన్న మహాసాగరపు పోలిక. పరాక్రమమునకు తోడు దూరదృష్టి గూడ మహారాజైన కుబ్జవిష్ణువర్ధనుని సొత్తు. విపులమైన ఆ రాజ్యభవనమునకు తన భుజాస్తంభములే చాలును. అయినను భ్రాతృవత్సలుడా రాజచంద్రుడు. ఒక్క తల్లి కడుపున రక్తము రెండుగా చీల్చుకొని పుట్టిన తన తమ్మునకు రాజ్యభార నిర్వాహణమున పాలుండకపోవుటేమి ? కాననే తన రాజ్యమున తూర్పుసీమ యందు తమ్ముని శాసనము. పశ్చిమమున తనపాలనము.

ఆ కుబ్జవిష్ణువర్ధనుని వంశమువాడు వేంగినాటిని పాలించిన, ధన్య జీవి, విమలాదిత్యుడు. ఈయన సింహాసనారూఢుడగుటకు ముందెన్ని కలహారుఝుంఝూ మారుతములు ? ఎన్ని విప్లవ విస్ఫులింగములు. కొంతకాలము పాటాతడు చోళుల చెరసాలయందు బంది. కాని చివరకా బందిఖానాయే అత్తయిల్లయి అలరించినది. దా అదృష్టవంతుని మామగారి ప్రాపు నరునకు నారాయణునివలె నిలువగా తన సింహాసనమును సుస్థిరము చేసికొన్నాడాయన. తండ్రి సంపాదించిపెట్టి పోయిన సువ్యవస్థలో దుడుపులోని చల్ల గదలకుండ కాలూపి కూరుచుండవచ్చును రాజరాజు. కాని ఆయన సోమరిగాడు. ఒక ప్రక్క పారంపర్యముగ తనకు సంక్రమించిన రాజ్యరక్షణ, మరియొక ప్రక్క తనలో నురకలెత్తు తెలుగు రక్తము ప్రేరేపించు వాఙ్మయ పోషణ. ఇవి రెండును రెండు కన్నులాయనకు. వానికి కుడి యెడమ భేదములు లేవు. కాననే అతనిని నిజభుజ విక్రమ విజితారాతి క్షత్రాజనివహుండని

నుతింతురా, వివిధాగమ విహితశ్రముడని నుడువవలయును. అపరాజిత భూరి భుజాకృపాణ ధారాజల శాంత శాత్రవ పరాగుడని పొగిడిరా. మనీషి విద్యా శ్రమతత్త్వ విత్తమున మహినొప్పిన వాడని ప్రస్తుతింప వలయును. మంత్రి పురోహిత సేనాపతి దండనాయక దౌవారిక మహా ప్రధానానంత సామంత పరివృతుడగునా, అపార శబ్దశాస్త్ర వైయాకరణులును, భారత రామాయణాద్యనేక పురాణ ప్రవీణులైన పౌరాణికులును మృదుమధుర రసభావభాసుర నవార్థ వచన రచనా విశారదులైన మహాకవులును వివిధ తర్క విగాహిత సమస్త శాస్త్ర సాగరగరీయః ప్రతిభులైన తార్కికులును నాదిగాగల విద్వజ్జనంబులు పరివేష్టించి కొలువబడిన వాడగును. ఇంతటిరాజు ఆ కవికి అండ.

ప్రాణికి ప్రాణమువలె, ప్రాణమునకు ప్రాణివలె నన్నయ రాజరాజు లొకరినొక రాశ్రయించుకొన్నారు. ఆఏకతా ఫలితముగనె భారత రూపమేర్పడ గలిగినది. ఘృతమునకు పాత్ర యాధారమా పాత్రకు ఘృత మాధారమా యనునది గాదిచట ప్రశ్న. భారత జననమున వీరిరువురికి గల బాధ్యత ఎట్టిది ? ఒకరికొక రెంతవర కుపయోగకులైరి ? అను సంశయములు చర్చనీయము.

వీరిర్వురికృషియు సాహిత్యవిషయకమే కదా! కాన నన్నయకు పూర్వము తెలుగు భాష యవస్థను పరికింతము. అప్పటికి దానికి లిపి యున్నది. పాల్కురికి సోమనచే తుమ్మెద పదములు గొబ్బిపదములు, వెన్నెల పదములు అని పేర్కొనబడిన దేశీయ పదములున్నవి. సోమనాథుడు వీనికి ఛందోనియమముల చెప్పుచు 'అనియతగణైః యతిర్వా ప్రాసోవా' యని నిర్ణయించినాడు. ఇదంతయు గమనించిన కొందరి మతమున నన్నయ ఆదికవిగాడు. అతడు నాగమ శాసనుడను కొన్నది ముచ్చటకు దగిలించుకొన్న బిరుదు. వారి యుద్దేశ్యమున వాగనుశాసనుడన్న, ఆదికవియన్న ఇదివరకులేని చందమును సృష్టించి నాడని కాబోలును. అంతవరకు తెలుగుప్రాణి కని విని యెరుగని లిపిని నిర్మించినాడని కావును.

నన్నయ చేసిన పని యదిగాదు. అతడు లిపిని సృష్టింపలేదు. దేశీయ ఛందముల గ్రహింపకపోలేదు. కాని వానికితోడుగ సంస్కృత ఛందోవాహిని నుండి పాయలు తీసి కలిపినాడు. తెలుగుభాష కొక వ్యవస్థ నిచ్చుటకై సంస్కృతపు టానకట్టలు పోసినాడు. ఇది యాయన జేసినపని. ఈ విధముగ ఆరూఢముగ, అప్రశస్తముగ నున్న తెలుగు వాఙ్మయమును సవరించినాడేగాని సృష్టింపలేదు. ఆ పని చేయుటకై, తన భారతాంధ్రీకరణ మనాహతముగ సాగుటకై యాతడు రచించుకొన్న ప్రణాళిక మాత్రమే ఆంధ్రశబ్ద చింతామణి.

చాళుక్యుల వియ్యంకులు, చోళుల కెంతో వెలలేని సాహిత్య మున్నది. దాని సర్వతోముఖ విజృంభణ కిజ్ఞకు కన్నులపండువు. ప్రతి పండితుడును ప్రతి కవియు, ప్రతి విజ్ఞాన ఖనియు గూడిన ఒక కూడిక వారి సంఘము, ఎవ్వరేని యొక గ్రంథము రచించిరా, ఒక కావ్యగానము చేసిరా అది ముందు వినపడవలయు నీ సంఘమునకు, దానిని విన్నవారు దాని ప్రాశస్త్యము నేర్పరింతురు. దానికి సాహిత్య విపణిలో వెలకట్టుదురు. అట్లెంచుకొనబడిన గ్రంథమే వారి పరిభాషలో "సెందర్" అదియే పండిత పామరులు చదువుటకు యోగ్యతను సంపాదించుకొన్నది. ప్రపంచమున ప్రయాణించుట కనుజ్ఞను తెచ్చుకొన్నది. ఈ పద్ధతి రాజరాజు కనుల కాకట్టయిన దేమి! కాననే, వారిని తానుగూడ అనుకరింపవలయునన్న యూహయే తన రాజ్యమున పండిత సభలను కూర్చిపెట్టినది.

కాని ఆ సభలలో తెలుగునకు స్థానములేదు. ఈసడింపు మాత్ర మున్నది. అందు కవనము చెప్పినవారికి ఆవంతయైన ప్రోత్సాహము లేదు సరిగదా అగౌరవమున్నది. కారణమా భాషదే? అనాగరకులు మోటువారు నిత్యవ్యవహారమున కుపయోగించు భాషయది. "ఒక రూపన్నది లేక పలు పోకల బట్టిన ఆ పదజాల మేమి, కట్టుబ కావ్యరూపమున నుండుటేమి? అసలందున్నదే కొద్ది సామా యామె. దీనితో నెన్ని భావముల స్ఫురింపజేయగలరు? ఎ

రసమును చిప్పిలింపగలరు. ఎవరయ్యా తెలుగున కవిత్వము చెప్పెద నను తెలివిమాలినవాడు ? పండువంటి సంస్కృతమున్నది. లెక్కకు మిగిలిన విషయములున్నవి. మోజుదీర చేతికి వచ్చిన గ్రంథములు వ్రాసిన కాదందురెవ్వరు ? మీదు మిక్కిలి ఆదరమును గౌరవమును గలుగునే ? ఇదియే ధోరణి ఆనాటి పండితులందరికిని. ఇదియే హేళన తెలుగు విషయమున వారి హృదుల నిండినది.

అట్టి కాలపు రాజును, కవియు వారు. కాని మనస్సులలో తెలుగుదుస్థితి యున్నది. దానిని వాఙ్మయ స్థితికి దేవలయునన్న దుగ్ధ యున్నది. అట్లనీ అందరు పండితులను కాదని వీరేమి చేయవలయును?

తాను రాజే ! మూర్ధాభిషిక్తుడే అయిననేమి ప్రజలను తాను శాసించునా ? వారిలో అసంతృప్తి రేపునా ? రేపి తనహృదయమున తీరని చిచ్చు రగుల్చుకొనునా ?

తాను పండితుడే. పండిత మండలికి అధ్యక్షప్రాయుడే. కాని ఏమి ఫలము. వారిని కాదని ముందంజ వేయునా ? ప్రజల దృష్టిలో పేలవమైపోవునా ? పోయి "సుజను"డన్న తన ఖ్యాతికే మచ్చదెచ్చు కొనునా ?

అట్లని ఎంతకాలమని తమ కోర్కెను తమలోనే యణచుకొని గ్రుక్కిళ్ళు మ్రింగుట? ఎంతకాలము, ఇప్పుడు పోయిన దేమిలే మంచి కాలము వచ్చునని వేచియుండుట, అన్నికాలములు మనవా ? ప్రతి నిమేషమును గడచిపోవుచున్నదే.

అన్నియు ననుకూలించిన :-

'ధర్మతత్త్వజ్ఞులు ధర్మశాస్త్రంబని
యధ్యాత్మవిదులు వేదాంత మనియు
నీతివిచక్షణుల్ నీతిశాస్త్రం బని
కవివృషభులు మహాకావ్యమనియు
లాక్షణికులు సర్వలక్ష్యసంగ్రహమని
యైతిహాసికు లితిహాసమనియు

పరమ పౌరాణికుల్ బహుపురాణసముచ్చ
యం బని మహిఁగొనియాడుచుండు'

భారతమును తెలుగు సేయవలయునని యున్నది నన్నయకు. అవునుమరి, ఆ కృతి సర్వధర్మ సంపుటీకరణమాయె. "ఇదం భారత మనాశ్రిత్య కదా భువి నవర్తతే" యనియు, 'ధర్మేచార్థేచ కామేచ మోక్షేచ పురుషర్షభ, యదిహాస్తి తదన్యత్ర యన్నేహాస్తి నతత్క్వచిత్' అనియు దీనిని జెప్పికొనిరాయె. అట్లే, హిమకరుదొట్టి పూరు భరతేశ కురుప్రభు పాండుభూపతుల్ క్రమమున వంశకర్తలనగా మహినొప్పిన* తన వంశమున 'ప్రసిద్ధులై విమల సద్గుణ శోభితులైన పాండవోత్తముల చరిత్ర'యని. భారతమును తెలుగు సేయించవలయునని రాజరాజుకున్నది. ఇట్లిరివురి దృక్కులకును భారత మాశ్రితము పై పెచ్చు ఆ నాటికే భారతమును కన్నడించినారు కన్నడకవులు. ఆ చర్య వీరిరువురి హృదుల యందున్న వాంఛకు పాతుగట్టె. కాని మొదలు లేదు. మొత్తుకోడు కొడుకుపేరు సోమలింగమన్నాడట యెవరో ! అటుల, అసలు తెలుగునే కావ్యోపయోగమున కంగీకరింపని పండితమండలి భారతాంధ్రీకరణ కొప్పుకొనునా? ఈ కోర్కెను వెలిబుచ్చుటయు, ముల్లుదీసి కొఱ్ఱుచుటయు నొక్కటిగాదేమి ?

ఇట్లు కింకర్తవ్యమని మొగమొగములు జూచుకొను సమయమున నవతరించినాడా బహుభాషా విజ్ఞానమూర్తి నారాయణభట్టు. నరునకు నారాయణునివలె బలారికి బృహస్పతివలె ఆ నన్నయభట్టుకీ నారాయణభట్టు చేదోడును, వాదోడును. అతడు సంస్కృత ప్రాకృత పైశాచి కాంధ్రభాషలయందు కవి రాజశేఖరుడు. అదృష్టముకొలది యిటుల లభించిన యీ విజ్ఞానపు తెప్ప నాదరువుగ గొని రేపటి కెదురీదు ప్రయత్నము లారాజునవి, ఆ కవివిని.

రాజరాజు పండిత సభలలో సభ్యులను భారతాంధ్రీకరణ విషయమై కదిపి వదిలి పెట్టెను. ఆయన వివిధాగమ విహితశ్రముడాయె, మనీషి విద్యాశ్రమ తత్త్వ విత్తమున మహినొప్పు వాడాయెను. అర్థధర్మ

శాస్త్రముల తెరంగెఱింగి, ఉదాత్తరసాన్వితకావ్య నాటక క్రమములు పెక్కులు సూచినవాడు గూడను. అంతటివాడు వెలికి దెచ్చిన విషయమే యని అందరును ఆస్థతో విందురు, చర్చోపచర్చలు గావింతురు. కొందరామోదించువారు, మఱికొందరు నిరసించువారును ఈ విధముగ సభయంతయు రెండు తెన్నుల బోవును. ఆమోదించు పక్షమీ మూర్తిత్రయపు కన్నుల చందమామ, నిరసించువారి ప్రాణములకు నారాయణభట్టు పెనుభూతము. అతడు బహుభాషల పాండిత్యము గడించెనా ! యుక్తియుక్తముగ వాదింపను గూడ గలడా ?- ఇక నేమి ! ఆనాటికే కన్నడమున భారతము వెలసినది. ఇతర భాషలన్నియు పది ముఖముల విస్తరిల్లుచున్నవి. "మాతృభాష కిదేమిగతి యయ్యా, మీ నిరాదరణ కిదేమి పెరవారి విషయమా, ఈ యవమానమెవ్వరి కేమి !" - ఇట్లే నల్లేరుపై బండినడక నారాయణభట్టు వాదనాప్రౌఢిమ. దీని నామోదించి తలయూపు పని ఆ'విమలవిచారు'నిది, ఈ "లోకజ్ఞు'నిది, 'ఇదేమిచిత్రమో, అంతటివారికే నచ్చినదీయూహ. దాని కెంతటి ప్రాముఖ్యమో," యని మెత్తబడువారు కొందరైన, 'పోనిమ్ము, జరిగినది జరుగనీ, అవునన్న పోయినదేమి !' యని యొప్పుకొనువారు మఱికొందరు, అటునిటు జేరక పట్టిన కుందేలికి కాళ్ళు మూడే యన్న రకపు కొరకరాని కొయ్యలు నుండకపోరు,- ఈ విధముగ వారు మువ్వురును జేరి పండిత బాహుళ్యపు టంగీకృతిని సంపాదింతురు. కాని యీ యంగీకృతి నాభికడనుండి వచ్చినదా, నాలుక చిగురుమాటయా !

ఏది యేమైనను, దానిని సరిదిద్దుకొను బాధ్యత యిక నన్నపార్యునిదే. కారణ మాతడు గ్రంథకర్త. ఆ కృతి బాగోగులపై వారి యభిప్రాయముల మార్పున కాస్కారమున్నది.

క్రీడించి మేలెంచుమని, వారు పై మాటగ నీ పని కొప్పుకొని చాటునకు బోయి నాలుకాడించు రకమే యనుకొందము. అప్పుడు నన్నపార్యుని యుద్దేశ్యము పూర్ణమైనదనుట యెట్లు ! తొట్టతొల్లి

కృతియే యీసడింపుల పాలైన తరువాత నా భాషలో మరి యే గ్రంథములైన బుట్టునా ? పుట్టి మన్ననల చూరగొనునా ! అయ్యవారిని జేయబోయిన కోతియైనటుల తాను నాడు పూనుకొని విఫలుడైనాడో, మరి కల్పకల్పములకు తెలుగున సాహిత్యము పుట్టునో లేదో ? ఎట్టి క్లిష్టపరిస్థితులను దాటుట యన్న, పండిత పామరుల మనస్సును తన యెడల స్నేహ ప్రేమార్థములు జేసికొనుటే ! మత విషయకముగ గాని, రచనా ధోరణిలోగాని, ఆనాటి సాంఘికాచారాదిక చిత్రణమున గాని విప్రతిపత్తి చూపట్టగూడదు. భారత పాఠకునకు. ఆ విధముగ నే దృష్టితో, నేమనస్తత్త్వము గలవాడు జదివినను తన కృతి ఆ విధముగ వాని మనస్సు నలంకరించినదా, ఇక తాను సఫలుడైనటులే.

కాననే మంగళాచరణశ్లోకము సంస్కృతమున నున్నది. అందు త్రిమూర్త్యాత్మకమైన తరతత్త్వమే ప్రస్తుతింపబడినది. అది సంస్కృతమున నుండుటకు హేతువు పరితల దేశికవితాపఠన దోషము నివారణమగుటకు, పండితుల సంస్కృత ప్రియతకు కొంత గౌరవమిచ్చి యాదరించునటుల గాన్పించుటకు ఇక త్రిమూర్తులక భేదము చెప్పి స్తుతించుట మత వైవిధ్యమున్న పాఠకుల నిరసనకు పాలుగాకుండుటకు అవును మరి. పాఠకులు కొందరు శివభక్తులుందురు. మరి కొందరు విష్ణు పాదపూజా నిరతులుందురు. ఇక కొందరు బ్రహ్మోపాసకులుందురు. వీరి కందరికి భారత మాదరణీయ మగుట కింతకన్న సులువేది, బృహత్కల్పసాధన కీ కిటుకు !

తానాంధ్రీకరించినంత మేర సంస్కృత భారతమును నన్నయ అనుకరించినాడే గాని అనుసరింప లేదు. ఆయనది యథోచితానుసరణమే. దానికి కారణ మడుగుదుమా, ఆయన మనస్సులోని దొక్కటే యూహ. తన కృతి జన బాహుళ్యపు ప్రేమాదరముల చూరగొనవలయును. వ్యాసుని కాలపునాటి పరిస్థితులు నన్నయ కాలపువారికి వెగటుగ దోచవచ్చును. నన్నయనాటి యాచారముల

వ్యాసుని నాటి కందకపోవచ్చును. అట్టియెడ ప్రజాశ్రేయస్సే మనమున బెట్టికొన్న నన్నయ వానిని తన శక్తికొలది మార్చివైచినాడు అందుల కుదాహరింపుచు సంస్కృత భారతమున కచదేవయానీ ఘట్టము దేవయాని ప్రేమ నుదాత్తముగ చిత్రించుటకు యత్నించినాడు వేదవ్యాసుడు. అటులే కర్ణ జననమును గూడ. నన్నయనాటి కవి సంఘ దూష్యములు, కాననే వానిని పట్టించుకొనక ముక్తసరిగ త్రోచివైచినాడాయన. ఈ విధముగ భారతమంతయు నుదాహరింపవచ్చును. ఈ పనిచేత గూడ భారతము జనుల యాదరమునకు పాత్రమైనదని చెప్ప సాహసింప వచ్చును.

ఇక నన్నయ "భారతాంధ్రీకరణ మెంత కష్టతరకార్యమో చూడు"డని చెప్పిన పలుకుల నాలకింతము.

తా జెప్పబోవునదా పంచమవేదమగు భారతము. ఆ చెప్పుటయు పదశాల పరిపుష్టముగాని తాను ప్రతిభావంతుడే. కాని ఎంతటి ప్రతిభకలవాడైనను "తారకాసముదయ మెన్న" గలడా? సర్వ వేదముల సార మశేష మెఱుంగగలడా? అటులే యీ కృష్ణాద్వైపాయన మహాగ్రతో నర్థబలగురుత్వము వహించిన భారత భారతీ సముద్రము నీద దొరకొనువాడను నేను, అందే లోపము వాటిల్లిన నదియెన్నుట మీకు న్యాయము గాదుసుమీ! యని హెచ్చరించుటకు జెప్పినవా పలుకులు. ఇంత హెచ్చరింపును హెచ్చరించి, యావెంటనే 'దేవా, నీ యనుమతంబున విద్వజ్జనుల యనుగ్రహంబున జేసి" యని రాజును విద్వజ్జనులను నిలబెట్టుటచే తన చుట్టును రక్ష వైచికొన్నాడు నన్నయ. ఏదేని లోపము వాటిల్లి 'ఇంత చేతకానివాడ వూరకుండక పోతివా? ఏల చెప్పితివయ్యా' అని యెవ్వరేని ప్రశ్నించరా, 'నాడే మున్నది వారు బలవంతపెట్టిరి. చిన్నవాడను. మరి కాదందునా?' అనుటకీ యెత్తు. నిజమే మరి ఇంత గురుతర కార్యభారము నెత్తిన వైచికొన్న వాడెన్ని కట్టుదిట్టములు లేనిది బరిమీదకు వచ్చును? ఇన్ని కాపులు పెట్టుకొన్నను ఇంకొక శ్రీరామరక్ష, "నా నేర్చు

విధంబున నిక్కావ్యము రచించెద" ననుట. ఉభయ భాషా కావ్య రచనాభిశోభితునకు, విపులశబ్ద శాసనునకు, సంహితాభ్యాసునకు నీ వినయ మేలనయ్యా తీవిగ జెప్పకొనక" యనిపించును మనకు. కాని యీ విధమగు నాయనపోకడయే పండిత మానసములలో సుముఖతనింపి, వారిని తన వైపునకు ద్రిప్పినది. తాను కావించిన ప్రయోజనమును సఫలము జేసినది.

ఇక పూర్వ కవిస్తుతులు. తెలుగున కవులు లేరుగాన నన్న పార్యుని స్తుతికి పాత్రులెవ్వరును గాకపోయిరి. ఇక మిగిలినది సంస్కృతము. అందరి కవులలో నన్నయ పరాశరాత్మజుని బొగడు వైఖరి చింతనీయము. ఆయన 'భారత భారతీ శుభ గభస్తిచయంబుల జేసి ఘోర సంసార వికార సంతమసజాల విజృంభము' బాపినవాడట' అంతపని ఆయన సాధించుట భారత రచన వలన. మరి యాంధ్రీ కర్తను నేనుగూడ దాని నుద్దేశించియే ఈ పనిని మొదలు బెట్టినా నయ్యా. దేశీ మార్గమున జెప్పిననేమి మార్గ కవితారీతుల నుడి విననేమి దాని ఫలమెట్టులైన మనకు దక్కునుగదా మాణిక్యమును మసిపాత గట్టితిమని మీరనుకొన్నను, అది కాంతిహీనముగాదే" అని హెచ్చరించెను. ప్రజలను అంత నిగూఢ ప్రయోజనమున్న దావ్యాస స్తుతి వెనుక ఇట్టి జాగ్రత్తల కన్నిటికిని మకుట ప్రాయము పండిత సభల ప్రశంస. పండిత మానసములను తన వైపునకు ద్రిప్పుకొనుట కిది యొక ప్రయత్నము. కాననే ఆ సభలకు తన యవతారికయందంత ప్రాముఖ్య మిచ్చినాడు. అవి వివేక సౌరభము వెదజల్లు ప్రసవసం బులు, సద్గుణ పుంజవారి జోత్కర రుచిరములు మనోహర సుచరిత్ర పావన పయఃపరిపూర్ణములు, సకల గమ్య సుతీర్థములు. ఇటులే, ప్రతి పర్వమును సభల ప్రశంసల గనినదని పలికినాడు. "సభలే ఆమోదిం చిన ఇక మన కేమి అభ్యంతరమయ్యా"అని ప్రతి పాఠకుడు జదువున యూయనయూహ నిజమున కానాటి పండిత సభల కంత పలుకు యుండెడిది. ప్రజలలో అదియే నన్నయచేత నన్నిసారులు పం సభా ప్రశంసలను జయించినది.

ఈ తతంగమంతయు ముగిసినవెనుక తన యాప్తులవైపునకు దిరిగినాడా సుజనుడు. తన మిత్రుడు నారాయణభట్టెంత శ్రమపడెను తన కొరకు. అటు పండితుల వాగ్వాదముల యుక్తియుక్తముగ ఖండించుటకేనా, ఇటు కన్నడించిన భారతపు తెన్నులు తెలియజెప్పుటకేనా ఒకటేమిటి. అన్ని విధముల నాతడు చేయూతనిచ్చి మిత్రుడనిపించుకొన్నాడు. అట్టివానికి తానేమిచ్చును. కృతజ్ఞతా పూరితమగు హృదయము దక్క ? అయినను కవిగాన ఆ సంయమిపద్య మొక్కటి జెప్పినాడు. ఆ నారాయణుని పేరాకల్పాంతము నిలుచు నేర్పాటులు జూపినాడు ఈ సహాయ మీ విధమై యుండదు. బహుశ నారాయణభట్టు నన్నయతో బాటు భారత రచన సాగించెనేమో ! యని కొందరి మతము. మనస్పూర్తిగ తన మిత్రుని నారాయణుని జేయ గలిగిన నిర్లిప్తుడు తనతో పాటు నారాయణభట్టు రచనయే సాగించిన నాతని పేరు గలుపక ఆశ్వాసాంత గద్యను రచించెననుట నమ్మకమునకు దూరము. అయిన నిందలి సత్యాసత్యములతో మనకు ప: యేమి? ఝంఝూమారుతము లిన్నిటి నెదురునిలిచి, ఏటికిన్ని యెదురీతి లీది, అందరిచేత చివర కౌననిపించుకొని, యప్పుడు.

“సారమతిం గవీంద్రులు ప్రసన్న కథాకవితార్థయుక్తిలో
నారసి మేలునా నితరు లక్షరరమ్యత నాదరింప నా
నా రుచిరార్థ సూక్తినిధి నన్నయభట్టు తెలుంగునన్ మహా
భారత సంహితారచన బంధురుడయ్యె జగద్ధితంబుగన్”

ఇప్పటికొక్కదాని కథ ముగిసినది. ఇక రెండవదాని బరిశీలింతము దీనికిని విశిష్టత యేమైన నున్నదా, లేక అన్ని గ్రంథముల యవతారికవంటిదేనా యిది ? ఒకవేళ ఏమైన విశేషమున్నదది నన్నయ యవతారికబోయిన త్రోవల బోవునా, లేక దీని తెన్ను దీనిదియు, దాని త్రోవ దానిదియునా ?

అక్కరము నేర్చిన ఆంధ్రప్రాణి కన్నుల కలువపూత తిక్కన. అష్టకష్టముల పాలై పండిత జలదములు అనుగ్రహమునకు వేచి

తెలుగు సాహిత్య క్షేత్రమును భారత సస్యయుక్తము గావించినాడు నన్నయ. శివకవుల చేతిలో క్షతి నందనున్న ఆ నన్నయచే స్థాపింపబడిన వ్యవస్థను తన శక్తికొలది యుద్ధరించి పూర్వపు రూపునకు దెచ్చినాడు. తిక్కన.

"శ్రీయన గౌరినా బరగు చెల్వకు చిత్తము పల్లవింప భ
ద్రాయిత మూర్తియై హరిహరంబగు రూపముదాల్చి విష్ణురూ
పాయ నమశ్శివాయ యని పల్కెడు భక్తజనంబు వైదిక
ధ్యాయిత కిచ్చమెచ్చు పర తత్త్వము గొల్చెద నిష్టసిద్ధికిన్"

ఇది తిక్కన్నగారు తన కృతికి జేసిన మంగళాచరణపు వైఖరి. ఇది తన పూర్వుడు నన్నయ ననుకరించుటకు జేసెనా? లేక ఆయన వలె ప్రయోజనాకాంక్షియై రచించెనా? ఒకవేళ కాంక్షితమున్న అదియేది.

తిక్కనార్యుడు కనుదెరచు నాటికే తెలుగుదేశ మల్లకల్లోలముగ నున్నది. రాజకీయ పరిస్థితులను జూచిన పాండ్యాదుల యుద్ధతము తెలుగు జిల్లలపై యుప్పెనపొంగు దాని నాకట్టు కాకతీయాంధ్రుల సంరంభము చిల్లర రాజ్యముల కంఠములపై కత్తి పెట్టినట్లు అట్టి ఇరకాటములో బడిన యొక భూఖండము మనుమసిద్ధి పరిపాలిత క్షితి. దానిని గాచుకొను శక్తిలేని యారాజు అటులటులే నెట్టుకొని వచ్చుచున్నాడు కాలమును. విద్యావిషయమున జూతునా నన్నయచేత వ్యవస్థితమైన యాంధ్రభాషోద్యానము శివకవి ఝుంఝూ ప్రభంజనముపాలై యూరకున్నది. ఆయన యనువాద పద్ధతికి వీరి మణిప్రవాళశైలి యెదురుచుక్క. ఆయన చంపువులను వీరి ద్విపదలు నొసలు విరిచి వెక్కిరించును. ఇక సాంఘికముగా పరిశీలించిన, మతవే ప్రధానముగా రేగిన కలతలుపండి సంభవించిన పల్నాటి యుద్ధము పదునొకండువేల వీరుల నాహుతిగొన్న దుర్లిప్తలు వారి కన్నుముందు గడచినవే. కానసే శైవులన్న వైష్ణవులకు గన్నెఱ్ఱ. వైష్ణ

లన్న శైవులకు చేదు మాత్ర. వైష్ణవుల పేరు వినవగునేమో యని సంకూడి గంట వాయింతురు శైవులు. శైవులమోము జూడవలయునేమో యని విసనకఱ్ఱలచాటున ముఖము చేర వేయుదురు వైష్ణవులు. తప్పిదారి యొకరితో నొకరు మాటలాడ వలసెనా ఆ విధి యంతయు తేనెపూత నాలుక. విసపుపూత మనస్సు. 'నీచేత పూలు నాచేతరాళ్లు నీవు నన్నురువ్వు నేను నిన్నురువ్వెద' నను వైఖరి.

ఈ విధపు టల్లకల్లోలము లేవియు మొదట మొదట తిక్కనకు కాబట్టలేదు. పిల్లతనపు టుత్సాహము మాత్రము నింపుకొన్న అత డొక్క కవీశ్వరుడు మాత్రమే. అతని కప్పుడున్నది. గ్రథనాకౌశలమే కాని, గ్రంథకర్త బాధ్యతాస్ఫురణగాదు. కావనే అందరు పోవు పోకలనే తానును బోయినాడు. కుకవినింద యన్నాడు. సుకవి స్తుతి యన్నాడు. "అమలోదాత్తమనీషి నేనుభయ కావ్యప్రౌఢి బాటించు శిల్పమునం బారగుడ" నన్నాడు. నిర్వచనోత్తర రామాయణమును జెప్పినాడు. వానియందు సామాన్య జీవితపు సరళ వైఖరియే చిత్రితముగాని ఆనాటి ప్రజల దుర్విధి ప్రస్ఫుటముగా లేదు. రామాయణము చెప్పినటుల నదియు రామకథనే చెప్పినదిగాని నాడున్న క్లిష్ట సమస్యల నెదుర్కొను మెలకువలు జెప్పనే లేదు.

తరువాత కాలము గడచినది వయస్సు మళ్ళినది. అనుభవముచే గడించుకొన్న విజ్ఞతకు యజ్ఞము చేసి సోమయాజియైన పవిత్రత తోడైనది. సకల శాస్త్రపారముల జూచిన యాతని పరిపక్వ హృదయమున కప్పటికి ఆనాటి పరిస్థితులు కొట్టిరాగా భయవిస్మయోద్రేకముల విస్ఫారితనేత్రుడై సర్వము నవగాహన మొనరించుకొన్నాడు ఇంతలో శక్తియుడిగిన మనుమసిద్ధి రాచరికపుముచ్చటకు నీళ్లు వచ్చుచున్నట్లున్నది. అయిననేమాయె, ప్రజ్ఞామూర్తి తిక్కనార్యుని ప్రతిభానేత్రమున కవి యూహలుతి.

ఇక సర్వవిధముల భ్రష్టులై యల్లాడు తనతోటి వారి నుద్ధరించు టెట్లు? వీనినన్నిటిని చక్కదిద్దవలయునన్న తాజేయవలసిన దేమి!

అహోరాత్రము లాలోచించిన యాతని మేధస్సున నొక తటిత్తు భారతాంధ్రీకరణ స్ఫురణ. నిజమే ! ఐతిహాసికములలో రత్నములు భారత రామాయణములు. అవి రెండును నాటి కసంపూర్ణములే. కాగా, బుద్ధిపూర్వకముగనో, కాకనో, రామాయణమును తానే పూరించినాడు. ఇక మిగిలినది భారతమే. తన యూహాలు కొనసాగుటకొక పెరటి కల్పకమును భారతమే.

కాని యేమనస్తత్వము గలవారి కావిధి స్ఫురించునటుల తాను రచింపగలడా భారతమును ! ఆనాటి కాత డుభయభాషాప్రౌఢి బాటించు శిల్పమున బారగుడ' ననునది మరచినాడేమో ? "బాల స్వభావు"డట ! "నేర్చినభంగి" దాని జెప్పి భక్తికోటికి వరణీయుడగుటయే తన యభిలాషయట. - 'కి మస్థిమాలాం కిము కౌస్తుభమ్' అను తత్త్వముతో పూర్తిగ నిండిపోయినాడామూర్తి. అంత నిర్లిప్తత కాలవశత నేర్పడినదే యనవలయును. అట్లని తన బాధ్యతను మరువ లేదాయన తామరపాకుపై నీటిబిందువులవలె అంటియు నంటవటులున్న తన హృదిలో వేరులపాతిన కార్యనిర్వహణాశక్తిని తాను మరువలేదు. ఎటులైనసరే తనచుట్టు నున్న వారిని బాగుచేసియే తీరవలయును. అది తన విధి. తనకు ఏ దేవ మానవులును శాసింపని యాజ్ఞ విద్యావిషయకముగ నన్నయ యేర్పరచిన వ్యవస్థను పునః స్థాపించునే పో, సాంఘికముగ నెటుల మార్పులు దెచ్చునో అన్న మన యనుమానమునకు నిర్వృతి యీయన మంగళాచరణమును, ఆయన కృతి కన్యకా భర్తృవిషయమును.

హరిహరాత్మకమగు నా పరతత్త్వము తిక్కనార్యుని యూహాలలో నిలచిన మత విషయకమగు సువ్యవస్థకువునాది. అది యిట్టిదట్టిది గాదు. నీవు శ్రీపతియనుము, గౌరీపతి యనుము, మురారియనుము త్రిపురారి యనుము; దానికి కాలుష్యముండదు. అమర్షముండదు. మీదు మిక్కిలి యట్టి వైదికధ్యాయిత కిచ్చమెచ్చును. తిక్కన యుంకిమిచ్చిన సూక్ష్మమేమి ? మత వైషమ్యములు కూడదయ్యా

యనుట శివకేశవుల కభేదమయ్యా యనుట, నిష్కారణముగ నీవు నొచ్చి యితరుల నొప్పింతువేల యని మందలించుట. ఇట్టి తన యూహను, ఆదర్శమును, భారత పండితులందరాదరించి యాచరింతు రని యా పుణ్యమూర్తి నమ్మకము. అయిన ఇతడూహించిన ప్రయోజ నము పాఠకులకు చప్పున స్ఫురించునా? కృతిపతిని దెలిసికొనునంత యుత్సుకత ప్రతి పాఠకున కుండునా? మరి వాని హృదయము నాకర్షించునటుల యా కృతిపతి నచట నిలువబెట్టవలయును. అట్లు జేసిననే యందలి నిగూఢత, ప్రయోజకత వానికి దెలిసివచ్చునది. ఇదంతయు యోజించియే క్రొత్తపుంత ద్రొక్కినాడు తిక్కనార్యుడు.

తాను 'ప్రబంధమండలి కధినాథునిగా నే పురుషుని జేర్కొను వాడనో' యను తలంపుగూడిన మదితో' ఇంచుక "నిద్రించు సమయ మున" తన తండ్రి గుంటూరి విభుడు, కొమ్మనదండనాథుడు, స్వప్న మున గాన్పించినటుల, హరిహరనాథుని యాదేశము తనకు వినిపింప వచ్చినటుల జెప్పినాడు తరువాత నా పరతత్త్వము సాక్షాత్కరించు టయు నాయన-

పారాశర్యుని కృతి యయి
భారతమనుపేర బరగు పంచమవేదం
బారాధ్యము జనులకు త
ద్గౌరవ మూహించి నీ వఖండితభక్తిన్.
తెలుగుబాస వినిర్మింప దివురుటరయ
భవ్యపురుషార్థ తరుపక్వ ఫలముగాదె
దీని కెడ నియ్యకొని వేడ్కనూని కృతిప
తిత్వ మర్థించి వచ్చితి దిక్కశర్మ.

అని యర్థించుటయు దెల్పినాడు. ఈ యుదంతమునందు సత్య ముండుననుకొనవచ్చును. లేదా, కవి చాతుర్య ఘటిత మనుకొన వచ్చును. ఏదైనగాని, నూతనమైన యీ పోకడ తిక్కనార్యుడు బుద్ధి పూర్వకముగనే ప్రయోజనాకాంక్షియైయే పోయెనేమోయనిపించును.

ఇక ప్రజలలో ధర్మేప్రతిష్ఠ గల్పించుటకై నెన్నుకొన్న భారతము.

"వేదములకు నఖిల స్మృతి
వాదములకు బహుపురాణవర్గంబులకున్."

మరియు "ధర్మార్థ కామమోక్షస్థితి"కిని 'మూదల యైనది. అట్టి భారతమును దెనిగించు తాను.

"వైదికమార్గ నిష్ఠమగు వర్తనముం దగ నిర్వహించుచు
న్వేదములేని భక్తి మతి నిర్మలవృత్తిగ జేయుచుండ

హరిహరాత్మకమగు పరతత్త్వపు, 'పాదనిరంతర స్మరణ తత్పరభావము కల్మి నాత్మ సమ్మోదము' బొందువాడు. ఇట్లు సంస్కృతమున "కృష్ణ ద్వైపాయను డర్థిలోక హితనిష్ఠంబూని' భారతమును జెప్పగా తాను తన కామ్యసిద్ధికై దానిని తెలుగు సేసినాడు ఆ కార్య మవిఘ్నముగ కొనసాగినది. విరాట పర్వాదిని కలము మోపిన తిక్కన్న స్వర్గారోహణ పర్వాంతము సాగిపోయినాడు. ఇక పాడవలసినది మంగళము. అదియే ఫలశ్రుతి.

ఇక దీని ప్రాముఖ్యమెట్టిది ?

సర్వధర్మముల నొక కథలో నిమిడ్చి విసువనకుండ జెప్పినారు. అవి కొందరికి రుచింపవచ్చును. మరికొందరికి రుచింపక పోవచ్చును. కొందరు వాని నాదరింపవచ్చును. మరికొందరు చిన్నచూపు చూడవచ్చును. ఇట్లు వైముఖ్యము గలవారికి లంచములు పెట్టుటవంటివి ఫలశ్రుతులు. వీనివలన పలువురా గ్రంథమును జదువునటుల మభ్యపెట్టవచ్చును. వాని ఫలములు పఠితల కందనీ, అందకపోనీ, పెద్దలు చెప్పిరి కాదా అట్లగునని ! ఆ నమ్మకము వేళ్ళు పారినది గాదా హైందవ హృదయములలో ! కాననే వారు చదువుదురు మనస్సులలో అవ్యక్తమైన తృప్తిని నింపుకొందురు.

అదియే భారత ఫలశ్రుతి యుద్దేశ్యము గూడను. ఏ విధముగ నైననేమి ప్రజలు భారత ప్రతిపాదిత ధర్మములను నిత్యజీవితమున జీర్ణించుకొనుటగదా కావలసినది. కాననే ఏరకపు మనుజుల కనుకూ ములగున్నట్లు ఆ ఫలములు గలుగు నిర్ణయములును గలవి ఫ

శ్రుతిలో. జనులందరికిని జెప్పిన సామాన్య ఫలము అఘములు ప్రాయుట. ముక్తి సిద్ధించుట. నాకలోకము గలుగుట. పాతకులు వినిరా బ్రహ్మహత్యాది పాతకములైన బాయును. పండుగ పబ్బములనే ఫలము కాంక్షించి నిర్వహింతుమో, పితృకార్యములనే యాశివముల నర్థించి నిర్వర్తింతుమో, అవియన్నియు నాయారోజుల భారత పఠన మాత్రమున గలిగి తీరును. బ్రహ్మ క్షత్రియులు దీని వినుటచే శత్రుల జయింపగల్గుదురు కన్య పఠించిన సద్వరుగాంచును. గర్భిణి చదివి సుపుత్రవతి యగును. కోర్కెలు గలవారి కోరిన కోర్కెలు దీరును. అర్థితో విన్నను, భక్తితో పఠించినను శ్రీయు, ఆయువు, భూరియశంబు, ప్రమదమును, దృఢ విద్యయు గల్గును. ఇది పంచమ వేదమగు భారత సహింతకు ఫలశ్రుతి.

ఈ విధముగ నన్నయ తిక్కనల భారతావతారికలు రెండును రెండు తెన్నుల బోవును. నన్నపార్యుని విషయమున, నాయవతారిక యందాయన పడ్డ పాట్లు, ఆ కష్టములను గట్టెక్కుట కామోదించిన పండితసభల పొగడికలు, తనకు చేయూతనిచ్చి కంటికి రెప్పవోలె గాచికొనుచు వచ్చిన తన మిత్రుని ప్రశంసలు ఇవి గాన్పించును.

ఇక తిక్కనగారి యవతారికలో నాయన యంటీ యంటని తనము, తనకున్న బాధ్యతను నిర్వర్తించుకొనుటలో, తన నెత్తిపై గల బరు వితరులకు దెలియకుండ దించుకొనుటలో గల యొడుపరి తనము ఇవి యెదురగును.

వీనినన్నిటిని సమాలోచించి యేర్పరించుకొన్న వారిరువురి మూర్తులను రెండు విధములు. నన్నయ యొకఋషి. అయినను నాత డతిస్నిగ్ధుడు. తిక్కన యొక కర్మవీరుడు. ప్రపంచమును కాచి వడ బోసిన శతవృద్ధునకు వలె నాతడతి గంభీరుడు. మానవుని అద్యంతదశల నీవిధిని రూపొందించుకున్న వీరిరువురును ధ్రువప్రాయులు. పూర్వపు ఔన్నత్యమును మరచి యైకమత్యము లేక కొట్లాడుకొను నేటి యాంధ్రులకు గర్వకారణములు.

భారతి. మార్చి, 1949

---

# నన్నయ భారతి (ప్రథమ సంపుటము)

## వ్యాసముల ఆకరములు

### వ్యాసము, రచయిత, పత్రిక వివరములు

### ఆంధ్రమహాభారతము - అవతరణ


ఆంధ్రభారతము-అవతారిక. శ్రీ ఆలమూరి రాజగోపాలరావు. సాహితీ వాల్లభ్యము. నరేంద్రనాథ సాహిత్య మండలి, తణుకు, 1968.

ఆంధ్ర మహాభారతావతారిక. శ్రీ మల్లాది సూర్యనారాయణ శాస్త్రి. రాజరాజనరేంద్ర పట్టాభిషేక సంచిక, 1922.

ఆంధ్ర మహాభారతావతారికా మీమాంస. శ్రీ చింతలపూడి వెంకటేశ్వర్లు. భారతి, అక్టోబరు, 1933.

ఆంధ్ర వాఙ్మయ వికాస తత్త్వము-ఆంధ్రభారత కావ్యోత్పత్తి. శ్రీ కుందూరి ఈశ్వరదత్తు. ఆంధ్ర పత్రిక 'ఉగాది సంచిక', 1931.

నన్నయ అవతారిక. శ్రీ నండూరి బంగారయ్య. సంస్కృతి. మార్చి, 1953.

నన్నయ అవతారిక. శ్రీ దివాకర్ల వేంకటావధాని. ఆంధ్ర పత్రిక 'ఉగాది సంచిక' 1956 57.

నన్నయకు పూర్వము పద్యములు కలవా ?. శ్రీ [illegible] బ్రహ్మయ్యశాస్త్రి. శారద, జనవరి-ఫిబ్రవరి, 1924.

నన్నయకు పూర్వము పద్యములు కలవా ?. శ్రీ చిలుకూరి నారాయణరావు. శారద, ఫిబ్రవరి, 1924.

నన్నయ చిత్రించిన రాజరాజు. శ్రీ నండూరి బంగారయ్య. భారతి, జనవరి, 1954

నన్నయ చిత్రించిన రాజరాజు. శ్రీ దివాకర్ల వేంకటావధాని. ఆంధ్ర పత్రిక 'ఉగాది సంచిక' 1957-58.

నన్నయ దృష్టిలో రాజరాజ నరేంద్రుడు. శ్రీ గురజాల హనుమంతరావు. సమాలోచన, 1-12-1982.

నన్నయ నాటి సాంఘిక రాజకీయ పరిస్థితులు. శ్రీ ఖండవల్లి లక్ష్మీరంజనం. లక్ష్మీరంజన వ్యాసావళి, 1970.

నన్నయభట్టు-ఆంధ్ర భారత రచన, రాజరాజు ఆనతికి నన్నయ రంగమును సిద్ధముచేసిన వైనము. శ్రీ కె. యస్. కోదండరామయ్య. భారతి, ఏప్రియల్-మే, 1989.

నన్నయభట్టు యుగము. శ్రీ శిష్ట్లా రామకృష్ణశాస్త్రి. కృష్ణా పత్రిక, మే. 1936.

నన్నయభట్టు రాజరాజనరేంద్ర స్థాపనాచార్యుడు. శ్రీ వేదము వేంకటరాయశాస్త్రి. భారతి, సెప్టెంబరు, 1946.

నారాయణభట్టు. శ్రీ కొల్లూరు సూర్యనారాయణ. భారతి, డిసెంబరు, 1980.

పంపయుగం మీద నన్నయ తిరుగుబాటు. ఆచార్య జి. వి. సుబ్రహ్మణ్యం. ఆంధ్రప్రభ (డైలీ - ఆదివారం), 22-5-1988; సాహిత్యంలో చర్చనీయాంశాలు, 1991.

రాజరాజ నరేంద్రుడు. శ్రీ మల్లంపల్లి సోమశేఖరశర్మ. రాజరాజనరేంద్ర పట్టాభిషేక సంచిక, 1922.

రాజరాజు ప్రశస్తి వివరణము. శ్రీ బుర్రా శేషగిరిరావు. రాజరాజనరేంద్ర పట్టాభిషేక సంచిక, 1922.

రాజరాజే భారతాంధ్రీకరణము ప్రోత్సహించెను. శ్రీ పి. వి. పరబ్రహ్మశాస్త్రి. భారతి, ఆగస్టు, 1986

## కవితారీతులు

ఆంధ్ర మహాభారతము వచనోపక్రమము. శ్రీ మధునాపంతుల సత్యనారాయణశాస్త్రి. ఆంధ్రపత్రిక ఉగాది సంచిక, 1958.

కవివృషభులు మహాకావ్యమనియు. శ్రీ కేతవరపు రామకోటి శాస్త్రి. అభినందన. ఆచార్య తూమాటి దోణప్ప షష్టిపూర్త్యుత్సవ సంచిక, 1987.

తెలుగున గద్యకవితను ప్రవేశపెట్టుటలో నన్నయ నిర్వహించిన భూమిక. శ్రీ భమిడిపాటి విశ్వనాథ్. తెలుగు విద్యార్థి, సెప్టెంబరు, 1985.

నన్నయ అక్షర రమ్యత. శ్రీ వి. వి. ఎల్. నరసింహారావు. అఖిల భారత తెలుగు రచయితల ద్వితీయ సంచిక, 1963.

నన్నయ అపూర్వ సభా రచనలు. శ్రీ ముదిగొండ వీరభద్ర శాస్త్రి వాఙ్మయి. తెలుగు విశ్వవిద్యాలయ పరిశోధన పత్రిక, జనవరి-జూన్, 1991.

నన్నయ ఋతువర్ణనము. డా॥ కొక్కొండ సత్యవతి. వ్యాస ప్రభాస. (వ్యాస సంపుటి) 1970.

నన్నయ కవితారీతి. శ్రీ బిరుదు వేంకట శేషయ్య. స్రవంతి, డిసెంబరు, 1959.

నన్నయ కవితారీతులు వేదాలవారి వ్యాఖ్యానము. శ్రీ దీపాల పిచ్చయ్యశాస్త్రి. కృష్ణాపత్రిక, జూలై, 29; ఆగస్టు, 5; 1961.

నన్నయ కవితాశిల్పము. శ్రీ నండూరి రామకృష్ణమాచార్యులు భారతి, మార్చి, 1946.

నన్నయ కవిత్వము. శ్రీ భూపతి లక్ష్మీనారాయణరావు. సాహిత్యోపన్యాసములు. వాల్యూం. 1, 1970.

నన్నయగారి కావ్యదృష్టి-ప్రకృతి వర్ణనలు. శ్రీ గంగిశెట్టి లక్ష్మీనారాయణ. నవభారతి, మే, 1980.

నన్నయగారి శ్లేష సరణి. శ్రీ వాసా సుబ్రహ్మణ్యశాస్త్రి. స్రవంతి, ఆగస్టు, 1962.

నన్నయగారి సాహిత్య సూ వృత్తి. శ్రీ కోవెల సంపత్కుమారాచార్య. విమర్శిని. (కాకతీయ విశ్వవిద్యాలయ పరిశోధన పత్రిక) 1980.

నన్నయ నాటకీయత. శ్రీ ఎస్వీ. భుజంగరాయశర్మ, దీపమాలిక (ప్రసంగ వ్యాస సంపుటి) 1989.

నన్నయ నాదసౌష్ఠవము. శ్రీ నండూరి బంగారయ్య. భారతి జూలై, 1953.

నన్నయ నానారుచిరార్థసూక్తినిధిత్వం. ఆచార్య ఎస్. గంగప్ప భారతి, ఫిబ్రవరి-మార్చి, 1985.

నన్నయ నానారుచిరార్థ సూక్తి నిధిత్వము. శ్రీ ఖండవల్లి లక్ష్మీరంజనం. లక్ష్మీరంజన వ్యాసావళి, 1970.

నన్నయ-ప్రసన్నకథా వివిధార్థయుక్తి. శ్రీ పామి సాంబయ్య సమాలోచన, 1-1-1980; 16-1-1980.

నన్నయ భారతంలోని శైశవలీలలు. శ్రీ రామడుగు వెంకటేశ్వరశర్మ. సమాలోచన, 1-7-1980.

నన్నయ భారతము-వేదప్రతిపత్తి. డా॥ జొన్నలగడ్డ మృత్యుంజయరావు. వేదశాస్త్ర పరిషత్ సావనీర్, రాజమండ్రి, 1991.

నన్నయ మహాభారతము నాటక లక్ష్యలక్షణ సమన్వయము. శ్రీ బుర్రా శేషగిరిరావు పంతులు. ఆంధ్ర పత్రిక ఉగాది సంచిక, 1922-23.

నన్నయ రచనలో నాటకీయత. ఆచార్య జి.వి. సుబ్రహ్మణ్యం నవ్యాలోకము, (వ్యాస సంపుటి) 1973.

నన్నయ వచనము. శ్రీ కొర్లపాటి శ్రీరామమూర్తి. జయంతి, నవంబరు, 1959.

నన్నయ వచన రచన. శ్రీ క్రొవ్విడి రామం. సమాలోచన, 16-11-1989, 1-12-1989.

నన్నయ-సూక్తినిధి పోలేపెద్ది రాధాకృష్ణమూర్తి. సమాలోచన 1-9-1983.

నన్నయ్య ఉభయ వాక్ప్రౌఢి. శ్రీ యడవల్లి ఆదినారాయణ. సాహితీ వాల్లభ్యము, 1968.

నన్నయ్య గద్యగతులు. శ్రీ వి. సత్యనారాయణ. భారతి, జూలై, 1983.

నానారుచిరార్థ సూక్తినిధి నన్నయ. శ్రీ పరిమి సాంబయ్య. సమాలోచన, 1-4-1980.

పద్యవిద్య-నన్నయ భావతావతారిక. ఆచార్య తుమ్మపూడి కోటేశ్వరరావు. భారతి, మార్చి, 1979.

ప్రసన్న కవిత. శ్రీ వై. మల్లికార్జునరావు. సంస్కృతి, అక్టోబరు, 1958.

భట్టారక హృదయము (ప్రసన్నకథ - అర్థయుక్తి). ఆచార్య సాళ్వ కృష్ణమూర్తి. అభినందన, (ఆచార్య తూమాటి దోణప్ప షష్టి పూర్త్యుత్సవ సంచిక) 1987.

భారత భారతి - నన్నపార్యుని నాటకీయత. ప్యాస్తిశ్రీ (శ్రీ టి. భాస్కరరావు). ఆంధ్ర సాహిత్య పరిషత్పత్రిక (వార్షిక సంచిక) 1957-58.

శ్రీ వాణీ గిరిజాశ్చిరాయ. శ్రీ విశ్వనాథ సత్యనారాయణ. ప్రతిభ, జూలై, 1938.

సూక్తినిధి నన్నయ. ఆచార్య బేతవోలు రామబ్రహ్మం. అభినందన. (ఆచార్య తూమాటి దోణప్ప షష్టిపూర్త్యుత్సవ సంచిక) 1987.

## అనువాద విధానము

నన్నయ యాంధ్రీకరణపద్ధతి. శ్రీ జటావల్లభుల పురుషోత్తము. ఆంధ్ర సాహిత్య పరిషత్పత్రిక, 1937.

నన్నయ్యగారి భారతాంధ్రీకరణము. శ్రీ విశ్వనాథ సత్యనారాయణ. ఆంధ్ర భారతోపన్యాసములు, 1981.

నన్నయ్య : తెలుగు భారతం ! అనువాదం కాదు! పునస్సృష్టి. దాశరథి. తెలుగువాణి, బ్రవరి, 1983.

భట్టారకుని భారతానువాదము. శ్రీ చిలుకూరి పాపయ్యశాస్త్రి. వావిళ్ళ వేంకటేశ్వరశాస్త్రి షష్టిపూర్త్యుత్సవ సమ్మానసంపుటం, 1940.

భారతాంధ్రీకరణము-నన్నయ. ఆచార్య శలాక రఘునాథశర్మ అమృతవల్లి (ఉపన్యాసలహరి) 1986.